క్టోబరు 2005

333వ సంచిక

# చతుర

వెల: రూ. 7/-

'కథ వెనుక కథ'లో





యద్దనపూడి సులోచనారాణి

జీవనతరంగాలు

జొనాథన్ స్విఫ్ట్

గలివర్స్ ట్రావెల్స్

పరిచయం



# శిథిల వైభవం

పెర్సెపోలిస్ వైభవానికి ఇదొక శిథిల నమూనా. క్రీస్తుపూర్వం నాలుగు దశాబ్దాల క్రితమే నిర్మితమై ఒక వెలుగు వెలిగిన ఈ పెర్సెపోలిస్ అకేమినిట్ వంశపు రాజుల సౌభాగ్యానికి, వైభవానికి సాక్షీభూతంగా నేటికీ నిలిచి ఉంది. దారియస్ ది గ్రేట్ ఈ నగరాన్ని క్రీస్తుపూర్వం 522లో నిర్మించారు. ప్రతి యేటా కొద్ది నెలలు మాత్రమే గడిపే విడిదిగా ఈ ప్రాంతాన్ని కేటాయించుకున్నా, ఆయన వారసులు ఈ నగరాన్ని మరింత సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. 975 అడుగులు పొడవు 1470 అడుగుల వెడల్పు విస్తీర్ణంలో రాజప్రాసాదం ఉండేది. అందులో డ్రైనేజ్, కెనాల్స్, భూగర్భ జల వ్యవస్థ కూడా ఉండేవి. ఈ నగరంపై దండయాత్ర చేసిన అలెగ్జాండర్‌కు ఇక్కడి సంపదను తరలించుకుపోవటానికి 10వేల గుర్రాలు, 5వేల ఒంటెలు అవసరమయ్యాయట!.



నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 సంచిక : 9

అక్టోబరు: 2005 333వ సంచిక

ఈ సంచికలో...

ఈ నెల నవల

మనోవిశ్లేషణ అంతర్లీనంగా సాగిన

**జీవన మథనం - వక్కలంక లక్ష్మీ పద్మ సుందరి** 14

ఇతర శీర్షికలు



బొమ్మలు పినిశెట్టి

కవర్ డిజైన్: మహేశ్ మళేకర్




# రచనే నా జీవితం : వూల్ఫ్

థామస్ వూల్ఫ్ (1900-1938) ప్రముఖ అమెరికన్ రచయిత. అతడి నవలలు 'బక్ హోంవర్డ్', 'ఏంజెల్'; 'ఆఫ్ టైం అండ్ రివర్'; 'ఫ్రం డెత్ టు మార్నింగ్'; 'ది వెబ్ అండ్ ది రాక్' లాంటి వాటిని విలక్షణమైన సాహిత్యంగా విమర్శకులు ప్రశంసించారు.

వూల్ఫ్ రచనా పద్ధతి అందరికన్నా భిన్నమైంది. "ఇంకా స్పష్టత రాలేదు. వచ్చిన తర్వాత ప్రారంభిస్తాను" అంటూ వాయిదా వెయ్యక, ఎలా వస్తే అలా, భావోద్వేగ శకలాల పరస్పర సంబంధం ప్రత్యక్షంగా కనిపించినప్పటికీ, రచన చేశాడు. ఒక ప్రదేశ వర్ణన కావచ్చు, పాత్ర వర్ణన కావచ్చు, సంఘటన కావచ్చు లేదా మనస్తత్వ చిత్రణ కావచ్చు. అది ఏదైనా అతడి రచనా తరహా అదే.



థామస్ వూల్ఫ్

రచయితలకు లోకదృష్టి ఎలా అలవడుతుందో, మార్గ నిర్దేశం ఎలా ఏర్పడుతుందో మనం ప్రతిసారీ తెలుసుకోలేకపోవచ్చుగా. వూల్ఫ్ 1923లో తల్లికి రాసిన లేఖలోని కొన్ని అంశాల్ని చదివి చూడండి. అప్పటికి అతడికి ఇరవైరెండేళ్లు.

"నాకు తెలుసు. నేను రాయక తప్పదు. రచన తప్ప నా జీవితానికి మరో లక్ష్యం లేదు. మృత్యువు కబళిస్తేనో, కాళ్లూ చేతులూ పడిపోతేనో తప్ప నన్ను రాయకుండా ఎవరూ ఆపలేరు. సజ్జనులూ, మర్యాదస్తుల కోసం కాదు రచనలు. పడుచు పిల్లల్ని పగటి కలల్లో విహరింపచేయవు నా కథలు. ఉన్నదున్నట్లుగా రాస్తాను. అందువలన కొందరు తప్పక బాధ పడతారు. వేదికల మీద మనం ప్రవచించే సూక్తులు వేరు, ఆచరణ వేరు. ఎవరి మెచ్చుకోలు కోసమూ రాయను. 'నిజాయితీ పరుడు' అన్నమాటకు నా నిర్వచనం "నమ్మింది ఆచరించేవాడని". అబద్ధాలే తియ్యగా ఉంటాయి. దేవుడు (ఉంటే) అందర్నీ చల్లగా చూడడు. లోకంలో మంచి లేదని కాదు. అందమూ, కురూపితనమూ కలిసి కాపురం చేస్తున్నాయి. బాధ, ఆనందం, ఏకకాలంలో మనల్ని ముప్పిరిగొంటున్నాయి. ఇవన్నీ నేను అనుభవించి పల

వరిస్తాను. ప్రపంచం మూలమూలలా వెదికి వ్యక్తుల అంతర్లోక రహస్యాల్ని ఆవిష్కరిస్తాను. ఈ దేశంలోని అంగుళమంగుళమూ పరిశీలించి, కాగితం మీద పునఃసృష్టి చేస్తాను.

ఈ క్రమంలో కొందర్ని బాధించక తప్పదు. ప్రగతి కావాలంటూ అందరూ గొంతెత్తి అరుస్తున్నారు. అంటే, అందరికీ కార్లూ, క్లబ్బుల్లో సభ్యత్వమూ కావాలా? ప్రగతి అంటే జనాభా పెరగటమా? పూర్వీకులతో పోలిస్తే మనం కార్లల్లో వందరెట్లు ఎక్కువ వేగంగా పరిగెడుతున్నాం గనక, ఆకాశ హార్మ్యాలు నిర్మిస్తున్నాం గనక అవి మనలో మంచి విలువల్ని పెంచిన దాఖలాలేమీ లేవు. కాని ఈ లోకంలో అద్భుత సౌందర్యమున్నది. పేదరికంలో, పూరిగుడిసెల్లో, చిక్కి శల్యమైన కష్టజీవుల ధీరవదనాలింకా అద్భుత సౌందర్యంతో వెలుగుతున్నాయి. అష్టకష్టాలకెదురొడ్డి నిల్చిన మనిషి బోర్డ్ ఆఫ్ ట్రేడ్ డైరెక్టర్ల కన్నా, కుహనా నినాదాల శుష్కఉపన్యాసకుల కన్నా ఉన్నతుడు.

ఇవన్నీ తెలిసిన మనిషి విద్యాధికుడూ, మేధావీ కానవసరం లేదు. సాటి మనిషిని ప్రేమించటానికి డిగ్రీ చదువులు కావాలా? బి.ఏ., ఎం.ఏ.లంటూ తోకలు తగిలించుకున్న కోతులకన్నా మనిషిగా బతకటం మేలు కదా!

అందమంటే? - మేకప్ పులుముకున్న సినిమా హీరోహీరోయిన్లు కాదు. రోజువారీ సంసార సమస్యలతో విసుగెత్తిన మనం తెరమీద సూపర్ లవర్స్‌ని చూసి చొంగకార్చుకుంటాం. మన జీవితాలు ఎందుకింత దరిద్రంగా తయారైనాయి? వాస్తవమంటే అసహ్యం. కృతిమ జీవితమంటే కోరిక. ఆ ఫైవ్‌స్టార్ సుఖాలక్కర్లేదు. కన్నీళ్ళు లేకపోతే చాలదా. ఒక వేసవి మధ్యాహ్నం చెట్టునీడలో నిల్చోగలగటమే సుఖం.

విశాలమైన మైదానాల సౌందర్యం, నా బంధువులు, పరిచితుల మరణాలు. ఆ విషాదం, ఆ జ్ఞాపకాలు... కొడుకు మరణించాడంటే - మరణించింది కొడుకు కాదు. తల్లిలోని ఒక భాగం. అంటే ఇక ఆమె సజీవ మృత్యురూపం. కని పెంచిన బిడ్డను పోగొట్టుకున్న ఏ తల్లి మాత్రం బతికుండగలదు! శరీరధర్మాలు నిర్వర్తించినా ఆమె ఆ క్షణాన్నే మరణించింది.

పిచ్చెక్కినట్లుగా ఉంది. ప్రతి క్షణం నన్ను నిలవనియ్యని ఆలోచనలు. రాసి, రాసి అలసిపోతే తప్ప నిద్ర పోలేను.

ఊరూరు తిరిగి, మనిషి మనిషిని చూసి ఒకొక్కరి కష్టసుఖాలను చూసింది చూసినట్టుగా, విన్నది విన్నట్టుగా రికార్డు చేస్తాను.

రచనే నాజీవితం.

**- ముక్తవరం పార్థసారథి**

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు)

**చతుర సమీక్ష** | **అక్టోబరు 'చతుర' నవల జీవన మథనం**

**సమీక్షకుని పేరు:** ______________________

**చిరునామా:** ______________________

______________________

______________________

కాంతిపం | ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# గలివర్స్ ట్రావెల్స్

ఇంగ్లండు సమాజంపై జొనాథన్ స్విఫ్ట్ సంధించిన అక్షరాస్త్రం



బడా భూస్వాముల ప్రజాస్వామ్యంలో అవినీతి రాజ్యమేలుతోంది. ధనిక వ్యాపారులు, షిప్పింగ్ మాగ్నెట్లు, స్టీలు, బొగ్గు, వజ్రాలు, బంగారం, మద్యం వగైరా పరిశ్రమల పెట్టుబడిదారీ ప్రభువుల పాలనకు పునాది పడుతోంది. డబ్బు, అధికారం తప్ప మరో కోరిక లేదు. వ్యక్తికుండాల్సిన ఏకైక సుగుణం ధనార్జన అనే మనస్తత్వం. మత గురువులు కూడా అధికారుల ప్రాపకం కోసం పాకులాడారు. రాజకీయాలకు మరో పేరు నయవంచన. అధికార పక్షాన్ని విమర్శించడమే ప్రతిపక్షానికున్న సింగిల్ పాయింట్ ఎజెండా- పద్దెనిమిదవ శతాబ్దంలో ఇంగ్లండు వాతావరణమది. దీనిపై సంధించిన శరాలే జొనాథన్ స్విఫ్ట్ రచనలు. అందులో భాగంగా వెలువడిందే "గలివర్ ట్రావెల్స్" ప్రపంచ సాహిత్యంలో ఆయనకు శాశ్వత స్థానం సంపాదించి పెట్టింది. బహుశా తొలి సోషియో ఫాంటసీ నవల ఇదే కావచ్చు కెప్టెన్ లెమూర్ గలివర్ స్వంత అనుభవాలు చెప్పుకున్నట్టుగా రాసిన ఈ నవలలోని వ్యంగ్యం నేటికీ పాఠకుల్ని చకితుల్ని చేస్తుంది.

## లిల్లిపుట్ యాత్ర

1699లో, మే నెల, నాలుగో తారీకునాడు నాలుగువందల పౌండ్ల కట్నం తెచ్చిన నా పడుచు భార్యను వదిలి, 'ఆంటిలోప్' అని పిలిచే నావకు సర్జన్‌గా దక్షిణప్రాంత సముద్రం దిశగా యాత్ర ప్రారంభించాను. వాన్ డీమాన్స్ లాండ్ చేరగానే ఒక భయంకరమైన తుఫాను వచ్చి నావ మధ్యలో విరిగి ఒక కొండను ఢీకొట్టింది. కళ్లు తెరిచేసరికి నేను ఒంటరిగా, నిర్మానుష్యమైన బీచ్‌లో ఉన్నట్టుగా గ్రహించాను. అలసి, అక్కడే కాసేపు నిద్రించాను. మరికాసేపటికి స్పృహ వచ్చింది. లేవలేకపోయాను. నా కాళ్లూ, చేతులూ, జుత్తూ ఎవరో తాళ్లతో కట్టేశారు. చుట్టూ గోల. అల్లరి. శరీరం మీద ఏవో కీటకాలు పాకుతున్నాయి. నా ఛాతీ మీద ఓ మానవాకారం నిల్చున్నది. ఎత్తు ఆరంగుళాలు. చేతిలో విల్లంబులున్నాయి. నమ్మలేని నిజం. బిగ్గరగా నవ్వాను. ఆ శబ్దం వాళ్లను భయపెట్టింది కాబోలు. పారిపోయారు. కట్లు తెంచుకోబోయాను. గుండుసూదుల్లాంటి వందలాది బాణాలు నా ఎడమ చేతికి తగిలాయి. మరికాసేపటికి వాళ్లలో ముఖ్యుడొకడు - నా మధ్యవేలంత ఉంటాడు- స్టేజెక్కి ఏదో మాట్లాడాడు. నేను లేవటానికి ప్రయత్నించలేదు. ఆకలిగా వుంది. భోజనం కావాలని సైగ చేశాను. ఓ వంద మంది నిచ్చెన వేసుకుని నా నోటి దగ్గరకు భోజనం తీసుకొచ్చారు. ఒక్కొక్క పళ్లెంలో గోళీకాయకన్నా చిన్న భోజనం ముద్దలున్నాయి. అయిదారు ముద్దలు ఒకేసారి నోట్లో వేసుకున్నాను. (ఆ దేశం పేరు లిల్లిపుట్) వాళ్లు నా ఆకలికి ఆశ్చర్యపడి ఆనందంగా నా ఛాతీ మీద నాట్యం చేశారు. ఖైదీకి అన్ని సదుపాయాలూ కల్పిం

చాలని హర్గో (ఉన్నతాధికారి) ఆజ్ఞ జారీచే శాడు. ఆ రాజ్యంలో అతిపెద్ద ఇంజన్ మీద నన్ను రాజధానికి తీసికెళ్లారు. ఒక పాడు పడిన గుళ్లో నన్ను బంధించారు. చక్రవర్తి నన్ను చూడటానికి వచ్చాడు.

పట్టుబడిన ఖైదీని చంపకుండా, సపర్యలు చెయ్యమని ఆదేశించిన ఈయనగారు యూరోపులో ఉన్న దేశాధీశులందరిలోకీ ఉత్తముడన టంలో సందేహం లేదు. ఈయనగారు ఇతర్ల కన్నా గోరంత ఎక్కువ పొడుగున్నాడు. వాళ్లు వేసుకున్న రంగు రంగుల దుస్తులతో నేలపై రంగవల్లికలా కనిపించింది. రాజుగారి కప్పటికే వృద్ధాప్యం వచ్చినట్టుంది. వయసు ఇరవై తొమ్మిదేళ్లు (ఏడేళ్లు పాలించాడు). తరచు నాతో మాట్లాడి, వాళ్ల భాష కూడా నేర్పించాడు. మరికొన్నాళ్లకు నన్ను సోదా చెయ్యనివ్వమని అభ్యర్థించాడు. నా అంగీకారంతో ఇద్దరాఫీసర్లు నా జేబుల్లో దూరి నావద్ద దొరికిన వస్తువుల లిస్టు తయారు చేశారు.




నా సత్ప్రవర్తన చక్రవర్తి గారి మెప్పు పొందింది. ఆ స్థానంలో నాకోసం అనేక వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. అయితే దేశంలో పరిస్థితులు విదేశీయులు మెచ్చుకున్నంత గొప్పగా ఏమీ లేవని అర్థమయ్యింది. రెండు రాజకీయ పక్షాల మధ్య గొడవలతో సంక్షోభం నెలకొంది. బ్లెఫస్కూ ద్వీపవాసులు లిల్లిపుట్ మీద దాడికి సిద్ధమవుతున్నారు. గుడ్డును ఎటు నుంచి పగలగొట్టాలన్న విషయం మీద రేగిన వివాదమే అందుకు కారణం. చక్రవర్తి నా సహాయం అర్థించాడు. రెండు దేశాల మధ్య ఎనిమిది వందల గజాల సముద్రం ఉంది. శత్రుసైనికులు కనిపిస్తున్నారు. నేను కోటూ, బూట్లూ విప్పి నీళ్లలోకి దిగి (ఆరడుగులలోతే వున్నది) అరగంటలో అటువైపుకు చేరుకున్నాను. నామీద బాణాల వర్షం కురిసింది. కళ్లద్దాలు పెట్టుకోకపోతే కళ్లు పోయేవే. శత్రువుల నౌకలూ, ఆయుధాలూ పట్టుకుని వచ్చి లిల్లిపుట్ చక్రవర్తికి సమర్పించాను.

కాని పాలకుల ఆశకంతుండదు. బ్లెఫస్కూ రాజ్యం తనకు కావాలనీ, దాన్ని తన ప్రతినిధి పాలించాలనీ చక్రవర్తి కోరిక. ప్రజలను బానిసలుగా చేసుకోవటం నాకిష్టం లేదు. చక్రవర్తి మాట తిరస్కరించినందుకు నామీద కుట్ర చేశారు. అక్కడి ఉన్నతాధికారులు నా మీద దేశద్రోహ నేరం మోపచూస్తున్నారని తెలిసింది. ఒకబోటు సాయంతో బ్లెఫస్కూ చేరుకున్నాను. దారిలో తారసపడ్డ ఓ ఇంగ్లీష్ నావికుడికి నా అడ్వెంచర్ చెప్పాను. అతడు నమ్మలేదు. జేబులో శాంపిల్‌గా వేసుకొచ్చిన పశువుల్నీ, గొర్రె పిల్లల్నీ చూపించాను.

**బ్రాబ్డింగ్ నాగ్ యాత్ర**

ఇంగ్లండులో రెండు నెలలు విశ్రాంతి తీసుకున్నాను. వెంట తెచ్చుకున్న బుల్లి జంతువుల్ని ప్రదర్శించి కాసింత డబ్బు కూడా చేసుకున్నాను. ఆ తర్వాత సూరత్ వెళుతున్న బోట్ ఎక్కి నా రెండవ యాత్ర ప్రారంభించాను. మలాకా దీవులు దాటాక మాన్‌సూన్‌లో చిక్కుకున్న బోటు మమ్మల్ని ఏ అజ్ఞాత ద్వీపానికో చేర్చింది. ఓ డజను మందిమి తాగటానికి నీళ్లు ఎక్కడ దొరుకుతాయో తెలుసుకోవటానికి బయల్దేరాం. కాసేపట్లోనే అన్వేషణకు వెళ్లిన వాళ్లు ప్రాణభయంతో బోటులో వెనక్కు తిరిగి వచ్చారు. ఓ రాక్షసుడు నీళ్లలో పెద్ద పెద్ద అంగలు వేస్తూ వాళ్ల వెంట పడ్డాడు. నలభై అడుగుల ఎత్తుకెదిగిన పంట పొలంలో నేను దాక్కొన్నాను. ధ్వజస్తంభాలంత ఎత్తున్న ఏడుగురు కోతలకు కాబోలు వచ్చారు.

జొనాథన్ స్విఫ్ట్ 1667లో ఐర్లండ్‌లో పుట్టాడు. తల్లిదండ్రులు ఇంగ్లిష్ వాళ్లు. డబ్లిన్‌లో బి.ఎ. దాకా చదివి, ఇంగ్లండు వెళ్లి సర్ విలియం టెంపుల్ వద్ద సెక్రటరీగా పని చేశాడు. ఆ సమయంలోనే అనేక ప్రముఖ వ్యక్తులతో పరిచయం ఏర్పడింది. సాహిత్యం మీద మక్కువ పెరిగింది. రచనా వ్యాసంగమూ ప్రారంభమైంది. ఐర్లండుకు వచ్చి మత పరమైన జీవితాన్ని ఎంచుకున్నాడు. డాక్టర్ ఆఫ్ డివినిటీ పట్టా పొందాడు. రోమన్ కాథలిక్కులమీద, కాల్వినిస్టుల మీదా స్విఫ్ట్ సంధించిన తొలి వ్యంగ్యాస్త్రం "ఎ టేక్ ఆఫ్ ది టబ్". ఇంగ్లండు వచ్చి, టోరీ పార్టీ ప్రచారకుడిగా ప్రభుత్వంలో కొంత పలుకుబడి కూడా సంపాదించుకున్నాడు.


జొనాథన్ స్విఫ్ట్

బిషప్ కావాలని కోరిక. కాని అది దక్కలేదు. డబ్లిన్‌లో ఒక చర్చికి డీన్‌గా నియమితుడయ్యాడు. నిరాశా నిస్పృహలతో ఐర్లండ్ వచ్చి స్థిరపడ్డాడు.

జీవిత సంక్షోభాలే రచనకు ప్రేరణ. ఐర్లండ్‌నే తన మాతృదేశంగా భావించి, అక్కడి సమస్యలనూ, ప్రజాభిప్రాయాన్నీ ప్రతిబింబిస్తూ "ది డ్రేపియర్ లెటర్స్" ప్రచురించాడు. ఇంగ్లండు

ప్రాణాలు అరచేత పట్టుకుని నక్కి దాక్కున్నాను. నన్ను మహాకాయుడనుకున్న లిల్లిపుట్‌లు జ్ఞాపకం వచ్చారు. ఓ రాక్షసుడు నా మీద అడుగెయ్యబోతే బిగ్గరగా అరిచాను. వాడు నన్నో కీటకమనుకుని నేల రాసేవాడే. కాని నా సైగలతో వాణ్ణి వారించాను. బొటనవేలూ, చూపుడువేలు మధ్య నన్ను పట్టుకుని రైతు వద్దకు తీసుకెళ్లాడు.

రైతు భార్య నన్ను చూసి కప్పను చూసి జడుసుకునే ఇంగ్లీషు ఇల్లాలిలా బెదిరింది. రైతు కూతురు నన్నో బొమ్మలా చూసుకుని మురిసింది. ఇరుగు పొరుగులకు నేనో వింత జంతువును. బజార్లో నిలబెట్టి అందరికీ చూపించారు. తరువాత పెట్టెలో పెట్టి గుర్రం మీదవేసి తీసుకెళ్లారు. కొత్త ఊరి సత్రంలో నాతో 'షో' ఏర్పాటు చేశారు. నేను విన్యాసాలు చేసి చూపించాలి. ప్రతి 'షో'కూ కొత్త ప్రేక్షకులు టికట్లు కొనుక్కుని మరీ వచ్చారు. నేను లాభసాటి 'జంతువు'నని తెలిశాక, ప్రధాన నగరం లార్బ్రుల్‌గ్రడ్‌లో కూడా ప్రదర్శనలిప్పించారు. రాణిగారికీ వార్త తెలిసి నన్ను కొనుక్కుంది.

రాణికి నన్ను చూస్తే భలే సరదా. రోజూ ఆమెతోపాటు డిన్నర్ టేబుల్ వద్ద కూర్చునే వాణ్ణి. అయితే ఆమె భోజనంచేసే పద్ధతి నాకు వెగటు పుట్టించింది. సీమకోడికన్నా తొమ్మిది రెట్లు పెద్దగా ఉన్న మాంసం ముద్దలు నోట్లో పెట్టుకుని మింగేది. ఇంక బ్రెడ్డు సంగతి చెప్పక్కర్లేదు. రాజుగారు ప్రతి బుధవారం ఆమెతో కలిసి భోజనం చేసేవాడు. ఆరోజు ఆయన యూరోపియన్ దేశాల పద్ధతులు నాకు వివరించి చెప్పేవాడు. నేను మన దేశ చరిత్ర ఆయనకు తెలియచెప్పాను. "దురాశ, క్రౌర్యం, ద్వేషం, రాజ్యకాంక్షల మూలంగా చేసిన కుట్రలు, హత్యాకాండలు, తిరుగుబాట్లు తప్ప మరేం జరిగింది గత శతాబ్దిలో. అజ్ఞానం, దుర్వ్యసనాలు ప్రజాప్రతినిధులకు ఉండవలసిన లక్షణాలు. చట్టాలను వక్రీకరించేవాళ్లూ, ఉల్లంఘించేవాళ్లూ వాటిని ప్రస్తుతిస్తారు. "మీ దేశవాసులు ఈ ప్రకృతిలోని విషకీటకాలు. మీది నీచాతినీచమైన జాతి" అంటూ చీదరించుకున్నాడు రాజుగారు. రాజుగారి మెప్పు పొందాలని, మందుగుండు సామాగ్రి తయారుచెయ్యటం గురించి చెప్పాను. "దీన్ని ఉపయోగించి, ఊళ్లనూ, నగరాలనూ పేల్చివేయవచ్చు" అన్న

పెత్తందారీతనానికి వ్యతిరేకంగా ఉద్యమించి, ఐరిష్ జాతీయ వాదాన్ని సమర్థించి, "నేషనల్ హీరో" అయ్యాడు. రచనలు మాత్రమే కాదు, తన ఆదాయంలో మూడవ భాగం దానధర్మాలకు ఖర్చు పెట్టాడు. చివరి రోజుల్లో ఆస్తినంతా పిచ్చాసుపత్రి కట్టటానికి విరాళంగా ఇచ్చాడు. చివరి రోజుల్లో అతడికే పిచ్చెక్కింది. 1745లో మరణించాడు.

ఇంగ్లండు చేస్తున్న దోపిడీని నిరసిస్తూ స్విఫ్ట్ రాసిన వ్యంగ్య రచన 'మాడెస్ట్ ప్రపోజల్' (1720). "ఇంగ్లండు ఆహారాన్ని దిగుమతి చేసుకోవలసిన అవసరం లేదు. ఇక్కడ(ఐర్లండ్) ప్రజలు ఆకలితో మాడిపోతున్నారు. అందువల్ల ఇంగ్లిష్ వాళ్లు మనకు బాగా తిండి పెడితే మనం పిల్లల్ని కొవ్వు పట్టేలా పెంచి ఇంగ్లండు వాళ్లకు ఆహారంగా పంపిస్తే సరి. రెండు దేశాల సమస్యలూ తీరతాయి. "బతికిన కొద్దిరోజులైనా పిల్లలు సంతోషంగా ఉంటా"రంటూ ఇంగ్లండు దోపిడీపై అక్షరాస్త్రాలు సంధించాడు. 1726లో వెలువడిన "గలివర్స్ ట్రావెల్స్" సామాజిక విమర్శ, మానవ బలహీనతల మీద విసుర్లూ కలగలసిన నవల. ఇది "మాస్టర్ పీస్" అని అందరూ అంగీకరించారు. "మర్యాదస్తులను" చికాకుపర్చటానికే తానీ నవల రాశానని చెప్పుకున్నాడు స్విఫ్ట్. బాలసాహిత్యంగా, సాహస యాత్రా గాథగా, సమకాలీన పరిస్థితుల మీద ఘాటైన విమర్శగా అటు పిల్లలనూ, ఇటు పెద్దలనూ ఏకకాలంలో అలరించగల కథ 'గలివర్స్ ట్రావెల్స్'. ఈ నవల ఇప్పటికీ వన్నె తగ్గని నవలే.

నా మాటలు విని రాజుగారు ఖిన్నుడయ్యాడు. "ఎదురు తిరిగినంత మాత్రాన నగరాలు ధ్వంసం చెయ్యటమేనా. నా రాజ్యాన్నయినా వదులుకుంటాను గాని అలాంటి పని చెయ్య"న్నాడు. బ్రాబ్‌డింగ్‌నాగ్‌లో రెండేళ్లు గడిపాను. పంజరంలో చిలకలాగా ఉంది బతుకు. రాణిగారు ఒకసారి తనవెంట సముద్ర తీరానికి తీసికెళ్లింది. అక్కడ, ఒక డేగ నేనున్న పంజరాన్ని ఎత్తుకెళ్లి సముద్రంలో వదిలింది. అటుగా వచ్చిన ఒక ఓడలోని వాళ్లు నన్ను రక్షించారు. వాళ్లంతా బాగా కురుచ మనుషులు.

## లాపూటా యాత్ర

రెండు నెలల తర్వాత మళ్లీ ఇంగ్లండు నుండి ఈస్ట్ ఇండీస్‌కు బయల్దేరాను. దారిమధ్యన సముద్రపు దొంగలు వచ్చి నావను స్వాధీనం చేసుకున్నారు. నేను మరో చిన్న పడవలో ఒక ద్వీపాన్ని చేరుకున్నాను. హఠాత్తుగా మేఘాలు కమ్ముకున్నట్లైంది. పైన, గాలిలో ఒక ద్వీపం తేలియాడుతోంది. పది వేల ఎకరాల వైశాల్యమున్నది. మూడు వందల గజాల మందం. ఆ ద్వీపవాసులు దాన్నలా కంట్రోల్ చేస్తున్నారు. నా సైగలు చూసి వాళ్లు నన్ను పైకి లాక్కున్నారు. ఇలాంటి జాతి మనుషులనింతవరకూ చూడలేదు. తలలన్నీ కుడికో ఎడమకో వంగి ఉన్నాయి. రెండు కళ్లలో ఒకటి లోపలికీ, ఒకటి పైకీ తెరచుకుంది. వాళ్ల దుస్తుల మీద సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, సంగీత వాయిద్యాల బొమ్మలున్నాయి. అందరూ తన్మయులై ఉన్నారు. వాళ్ల దృష్టి నాకర్షించటానికి సేవకులు పెద్ద చప్పుళ్లు చేస్తారు. అతి ప్రయత్నం మీద రాజుగారి దృష్టిని నావైపు తిప్పుకోగలిగాను. ఇక్కడ తిరుగుబాట్లు నణచటానికి రాజుగారు ఓ వినూత్న పద్ధతి ప్రయోగిస్తారు. విప్లవకారులమీద ద్వీపం తన నీడ కప్పేసి ఎండ లేకుండా చేస్తుంది. ఫలితంగా క్షామం, రోగాలు సంభవిస్తాయి.

ఒక కోర్టు అధికారి సహకారంతో నాకు విముక్తి లభించింది. లాగాడో నగరం వెళ్లటానికి అనుమతి దొరికింది. ఇక్కడ ఇళ్లన్నీ పాడుబడి నట్టుగా వున్నాయి. మనుషులూ అలాగే వున్నారు. వీళ్లంతా లాపూటిమన్ సిద్ధాంతాల గురించి బుర్రలు పాడుచేసుకుంటూ, జీవితానికవసరమైన పనులు చెయ్యటం మానేశారు. దేశమంతా క్షామం వచ్చినట్టుగా కనిపించింది.

ఆ తర్వాత నేను మాంత్రికుల ద్వీపం గ్లబ్‌డచ్‌రిచ్ చేరుకున్నాను. ఆ ద్వీప గవర్నర్ నాకు మృతులను చూడగలిగే అవకాశం కల్పించాడు. అలెగ్జాండర్, సీజర్‌లతో మాట్లాడాను. కాని అణగారిన ప్రజలకు విముక్తి కలిగించి వాళ్లంటే నాకు గౌరవం. చరిత్ర అధ్యయనం నాలో అసహ్యాం పెంచింది. అమ్ముడుపోయిన చరిత్రకారులు పిరికిపందలను సాహసవీరులుగా, మూర్ఖులను విజ్ఞులుగా, భట్రాజులను నిజాయితీపరులుగా చిత్రించారు.

అటునుంచి, జపాన్ సమీపంలోని లగ్నాగ్ రాజ్యం చేరుకున్నాను. రాజు సన్నిధిలో నేను పొట్టమీద పాకి, నేల మీది దుమ్ము నాకాలట... ఆచారం. తప్పదు మరి. అక్కడ చిరాయువులుంటారట. అక్కడే వుండి సంపన్నుణ్ణి, సకల కళలూ, శాస్త్రాలు నేర్చుకుని, చరిత్రనంతా రికార్డుచేసి, జ్ఞానిని కావాలనుకున్నాను. కాని అక్కడి వృద్ధుల దీనావస్థ చూసి అభిప్రాయం మార్చు కున్నాను. అయిదున్నర ఏళ్ల ప్రయాణం చేసి కేప్ ఆఫ్ గుడ్ హోప్ ద్వారా ఏప్రిల్ 11న ఇంగ్లండు చేరుకున్నాను.

## హూన్హ్మ్ దేశయాత్ర

అయిదు నెలల విశ్రాంతి తర్వాత "అడ్వెంచర్" నౌకకు కెప్టెన్‌గా తిరిగి బయల్దేరాను. దక్షిణ దిశగా ప్రయాణిస్తున్నప్పుడు సముద్రపు దొంగలు నన్ను పట్టుకుని ఓ అజ్ఞాత ద్వీపం మీద వదిలారు. అక్కడ ఇంతవరకూ నా యాత్రల్లో చూడని ఓ వింతజంతువును చూశాను. అతడి తలమీదా, ఛాతీ మీదా జుత్తు అట్టకట్టుకుపోయింది. గోధుమరంగు చర్మం. లావాటి పెదవులూ, పెద్ద ముక్కుపుటాలూ. చేతులు మనలాగానే ఉన్నాయి. గోళ్లుమాత్రం పొడుగ్గా ఉన్నాయి. మనిషిలాంటి జంతువులు. ఈ మంద నామీద దాడి చేయబోయింది. గాని ఎందుకో పరుగుతీసింది. గడ్డిమేస్తూ ఓ గుర్రం అటుగా రావటమే అందుక్కారణం. కాసేపట్లో మరో గుర్రం వచ్చింది. రెండూ సకిలిస్తూ ఏదో మాట్లాడుకుని, నన్ను పరీక్షగా చూశాయి- మారువేషంలో వచ్చిన మాంత్రికుల్లాగ. ఓ గుర్రం నన్ను దగ్గరలో వున్న భవనానికి తీసికెళ్లింది. అక్కడ మరో అయిదు గుర్రాలు మనుషుల్లాగే ఇంటిపనులు చేసుకుంటున్నాయి. హూన్హ్మ్ అంటే గుర్రం లేదా పరిపూర్ణ ప్రకృతి రూపం. హూన్హ్మ్‌ల వద్ద ఈ మనుషుల్లాంటి జంతువులు (యాహూలు) బానిసలుగా ఉంటున్నారు. యాహూల పోలికలున్న నేను తెలివిగా మాట్లాడటం చూసి ఆశ్చర్యపడ్డారు. నన్ను వాళ్లతో పోల్చొద్దని విన్నవించుకున్నాను.

హూన్హ్మ్‌లది హేతుబద్ధ జీవన విధానం. హేతుబద్ధత అంటే నిరంతర చర్చలు, వివాదాలు కాదు. సౌభ్రాతృత్వం, దాతృత్వమే నిజమైన హేతుబద్ధత. పిల్లలకు బాల్యంలోనే శ్రమ విలువ బోధిస్తారు. ఎల్లప్పుడూ చురుకుగా, శుభ్రంగా ఉండటం అలవాటు చేస్తారు. మరణశిక్ష కన్నా, చేసిన తప్పులను సరిదిద్దుకోగలిగిన అవకాశం ఇవ్వటమే శ్రేయస్కరమని భావిస్తారు.

ఇలాంటి విషయాలు విని, తెలుసుకుని నా తెలివితేటలు పెంచుకున్నాను. ఇది పరిపూర్ణ జీవితం. అయితే కొంతమంది హూన్హ్మ్ ప్రతినిధులు నాకు- ఒక యాహూకు- తమతో సమాన హోదా కల్పించినందుకు యజమానిని తప్పుపట్టారు. ఇంక అక్కడ ఉండటం వీలుపడదు. బాధతో, దుఃఖంతో గుండె బరువెక్కింది. యజమాని వద్ద వీడ్కోలు తీసుకుని లిస్బన్‌కు బయల్దేరాను. కాని హూన్హ్మ్‌ల ఉన్నత జీవితానికి అలవాటు పడిన నాకు మనుషులంటే ఏవగింపు మాత్రమే మిగిలింది. పాఠక మహాశయా, నా యాత్రల విశేషాలన్నీ మీకు వినిపించింది కీర్తి, డబ్బుకు ఆశపడి కాదు. ఇవి తెలుసుకుని జీవితాన్ని సక్రమ మార్గంలో పెట్టుకోవాలని మాత్రమే అని గలివర్ యాత్రాకథనాన్ని ముగిస్తాడు.

ఎం. వసంత ✦

మదిమదినీ స్పృశించిన

# జీవనతరంగాలు

## కథ వెనుక కథ




తొలి నవల 'సెక్రెటరీ'తోనే విశేష పాఠకాభిమానాన్ని కొంగున ముడివేసుకున్న రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి. రచనలద్వారా ఉపన్యాసాలు, సందేశాలు ఇవ్వడం ఇష్టంలేదనే ఈ రచయిత్రి తన పాత్రల ద్వారా పాఠకుల్లో జీవితంపట్ల ప్రేమని, ఆశావాదాన్ని పుష్కలంగా నింపుతారు. 'కొత్తలో వాళ్లు నా పాఠకులయ్యారు. తర్వాత నేను వాళ్ల రచయిత్రినయ్యాను..' అంటూ తనకు, పాఠకులకు మధ్య అల్లుకున్న అనుబంధాన్ని అర్థవంతంగా చెప్పారు సులోచనారాణి. తనకిష్టమైన "జీవనతరంగాలు" నవల గురించి, దానికి ముందు, తర్వాత జరిగిన సంఘటనల గురించి యద్దనపూడి సులోచనారాణి చెప్పిన వివరాలివి...


యద్దనపూడి సులోచనారాణి

నలభై ఏళ్ల క్రితం నేను రాసిన ఈ నవల ఇప్పటికీ ఏటా పునర్ముద్రణ పొందుతూనే ఉంది. సీరియల్‌గా, నవలగా, సినిమాగా 'జీవనతరంగాలు'నాకెందరో అభిమానుల్ని సంపాదించిపెట్టింది. సినిమాలో టైటిల్ సాంగ్ సైతం ఎంతో అర్థవంతంగా డాక్టర్ సి. నారాయణరెడ్డి రాయడం, అది అందరికీ నచ్చడం గొప్ప విషయం. 'జీవనతరంగాలు' సబ్జెక్టు గురించి గానీ, పాత్రల గురించి కానీ నేను ప్రత్యేకంగా ఆలోచించలేదు. సాధారణంగా కుటుంబ జీవితం గురించి, అనుబంధాల గురించి నేనెక్కువగా రాస్తాను. అలాంటిదే రాద్దామని మొదలెట్టాను. 'ఆంధ్రజ్యోతి' వీక్లీలో వారం వారం రెండున్నరేళ్ల పాటు పాఠకులను ఉర్రూతలూగించిన ఈ నవల గురించి చెప్పాలంటే ఎన్నో సంగతులున్నాయి. అవన్నీ గుర్తు చేసుకుంటే నాకిప్పుడు బీపీ వచ్చేస్తుంది. ఎలా రాయగలిగానా.. అన్నంత ఆశ్చర్యం కలుగుతుంది. ఇప్పటిలా కాదు కదా.. ఆ రోజుల్లో వారంవారం రాసి పోస్టు చేయడమే. ఎడిటర్లు నామీద నమ్మకం ఉంచి చేతిలో పూర్తి నవల స్క్రిప్టు లేకుండా ప్రచురణ ప్రారంభించేయడం నిజంగా వారి గొప్పదనం.

అమ్మాయిలు నాయిక పాత్రలో తమని చూసుకున్నారు. నవలలో క్యారెక్టర్లు రోజా, విజయ్, అనంత్, లావణ్య, ముఖ్యంగా చందూ... పాఠకులకు ఎంతగా నచ్చారంటే నవలలోని పాత్రలుగా కాక ఒకదశలో నిజజీవితంలో వ్యక్తులుగా భావించి వారి పరిస్థితి

## పురాణం చెప్పిన పెట్టెపురాణం

జీవనతరంగాలు గురించి పురాణం సుబ్రహ్మణ్యశర్మ ఓ సంఘటన చెప్పారు. ఒక మ్మాయి పెళ్లి చేసుకుని అత్తగారింటికి వెళ్లింది. సామానుతో పాటు ఒక ట్రంకుపెట్టె పట్టు కెళ్లిన ఆ అమ్మాయి దానిని అతి భద్రంగా దాచుకోవడం, అప్పుడప్పుడు ప్రేమగా తడిమి చూసుకోవడం చూసి అత్తారింట్లోని వారంతా దానిలో నగలు, పట్టుచీరలు ఉన్నాయ నుకున్నారు. ఒకరోజు ఆ అమ్మాయి గుడికెళ్లగానే వారు ఆ పెట్టె తెరచిచూడగా - దాన్నిండా జీవనతరంగాలు, సెక్రటరీ సీరియల్స్ కాగితాలు కత్తిరించి భద్రంగా పేర్చి ఉన్నాయట. ఇలాంటి సంఘటనలెన్నో సీరియల్స్ గురించి నాకు చెప్పారాయన.

గురించి తెలుసుకోవడానికి పత్రికకోసం ఆత్రుతగా ఎదురుచూసేవారు. కథానాయిక రోజా మధ్యతరగతి కుటుంబాల్లో ఏటికి ఎదురీదే తరహా వ్యక్తి. ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం మెండు. తన జీవితం మీద ఎవరి పెత్తనాన్నీ సహించలేదు. 'నన్ను నేను తప్ప ఈ ప్రపంచంలో ఎవ్వరినీ నేను నమ్మను' అనే ఆమె డైలాగ్ ఇప్పటికీ చాలామందికి గుర్తే. మధ్యతరగతి యువతులు తమను తాము ఆమెతో ఐడెంటిఫై చేసుకునేవారు.

### చందూ పాత్రకు అదే ప్రేరణ

చందూ పాత్రపై మాత్రం నన్ను స్పందింపజేసిన ఒక సంఘటన ప్రభావం నాకు తెలియకుండానే పడింది. మా కాలనీలో తరచుగా దొంగతనాలు జరిగేవి. ఒకరోజు పోలీసులు మాటు వేసి ఇద్దరిని పట్టుకున్నారు. వాళ్లను కొట్టి లాక్కొచ్చి మా ఇంటిముందే జీప్‌లోకి ఎక్కించడం చూశాను. రాజస్థానీ వాళ్లను కుంటా... ఒక కుర్రాడు ఎంతో నాజూగ్గా ఉన్నాడు. పందొమ్మిదేళ్లు కూడా ఉన్నాయో లేవో. క్రాఫ్ చెదిరి, నోటినుంచి రక్తం కారుతూంటే ఒకలాంటి నిర్లిప్తభావంతో జీప్ ఎక్కాడు. వాళ్లను చూసి పక్కనున్న ఒకావిడ 'ఏతల్లి కన్నదో ఇలాంటి బిడ్డల్ని.. ఆ తల్లి కడుపుకాల..' అంటూ తిట్టింది. అది విని నా మనసు చివుక్కుమంది. ఏ పరిస్థితులు ఆ పిల్లవాడిని ఇలా తయారుచేశాయో అన్న ఆలోచన చాలాకాలం నన్ను వదలలేదు. ఆ ప్రభావమే చందు పాత్ర మీద పడింది.

### ప్రెస్‌వాళ్ల లీకేజీ

ఈ నవల సీరియల్‌గా వస్తున్నపుడు జరిగిన మరో సంఘటన బహుశా ఇంకే రచన విషయంలోనూ జరిగి ఉండదు. ఈ విషయంలో పత్రిక సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావు స్వయంగా పూనుకోవడం విశేషం. ఒకరోజు ఆయనే మా ఇల్లు వెతుక్కుంటూ వచ్చారు. వాళ్లమ్మాయి అప్పుడు కాలేజీలో చదువుతోంది. ఆమె స్నేహితులంతా సీరియల్‌కి సంబంధించి వచ్చేవారం పత్రికలో వచ్చే అంశాల గురించి డైలాగులతో సహా చెప్పేస్తున్నారని వచ్చి తండ్రికి చెప్పింది. ఆయన ఆ విషయమే చెప్పి ఇదెలా సాధ్యం.. అంటూ ఆలోచనలో పడ్డారు. నేను ఒకవారం ముందు మాత్రమే ఇస్తున్నాను. నా దగ్గర కథ బయటకు వెళ్లే అవకాశం లేదు. చివరికి ఆయన కంపోజింగ్, ప్రింటింగ్‌చేసే వర్కర్ల మీద నిఘా పెట్టారు. పనివాళ్లే ఆ కాగితాలను దొంగతనంగా తీసుకెళ్లి స్టూడెంట్లకు అమ్ముతున్నట్లు తెలిసింది. వారిని కోప్పడి అప్పట్నుంచీ నిఘా పెంచారు. ఒక రచన గురించి పాఠకులు ఇంత ఆత్రుతత పడడం అరుదు. నార్ల ఢిల్లీలో ఒక సమావేశంలో ఎడిటరుగా ప్రసంగించాల్సి వచ్చినపుడు ఈ విషయం ప్రత్యేకంగా ప్రస్తావించినట్లు చెప్పారు.

రచయిత్రిగా యథాలాపంగా ఓ కథాంశం ఎంచుకుని రాసుకుంటూ పోయిన ఒక నవల ఇంతగా పాఠకులకు నచ్చడం, చలనచిత్రంగా తెరకెక్కి, చదువురాని వారికి కూడా చేరువై కదిలించడం, నలభై ఏళ్ల తర్వాత కూడా పునర్ముద్రణ పొందుతూనే ఉండడం.. ఇదంతా నా అదృష్టమనే అనుకుంటాను.

– పద్మశ్రీ యలమంచిలి ✦




ఏదో పోగొట్టుకున్న వాడిలా రోజూ దిగులుగా కన్పించే విశ్వం ఆరోజు ఈలపాటతో చాలా హుషారుగా ఉండటం చూసి ఆశ్చర్యపోవడం మూర్తి వంతయింది.

"ఏరా విశ్వం? ఏంటి విశేషం? ఈరోజు చాలా ఆనందంగా ఉన్నావ్? " అడిగాడు మూర్తి.

# 'విశ్వ' సందేశం

గుబ్బల సత్యనారాయణమూర్తి

"ఔన్రా. విశేషమే. ఆడపిల్లను కన్న ప్రతి తండ్రీ ఏక్షణం కోసం ఆశగా ఎదురుచూస్తాడో అది నెరవేరిన రోజిది. మా పాపకు సంబంధం కుదిరింది"

"అలాగా! చాలా సంతోషంరా. ఇంతకీ ఎవరు? "

"వాళ్లది అమలాపురం. భానుమూర్తిగారని ఓ పేరున్న ప్లీడరుగారబ్బాయి. హైదరాబాద్‌లో ఓ ప్రైవేట్ కంపెనీలో ఇంజనీర్‌గా చేస్తున్నాడు. మా అమ్మాయి వాళ్లకు నచ్చింది. కట్నం కూడా మనకు అందుబాటులోనే ఉంది. త్వరలో నిశ్చితార్థానికి ఏర్పాట్లు చేస్తాను"

"కంగ్రాట్స్‌రా విశ్వం! ఇన్నాళ్లకు ఓ శుభ వార్త చెప్పావ్"

"అన్నట్టు మూర్తీ! మీ అమ్మాయికి కూడా ఎక్కడైనా చూస్తున్నావా సంబంధాలు? "

"ఇంకా ఎక్కడా కుదరలేదురా. చూడాలి"

పదిరోజులు గడిచాయి. మూర్తి కంగారుగా విశ్వం దగ్గరకు వచ్చి "ఒరేయ్ విశ్వం మా అమ్మాయి పెళ్లిరా. నువ్వు కుటుంబంతో సహా వచ్చి దగ్గరుండి పెళ్లి జరిపించాలి. ఇదిగో శుభలేఖ. ఇంకా చాలామందికి పంచాలి" అంటూ శుభలేఖ అందించి వడివడిగా వెళ్లిపోయాడు.

"ఇదేంటి వీడు మాటమాత్రమైనా తెలీనీకుండా కూతురు పెళ్ళి ఖాయం చేసుకున్నాడు" అని ఆశ్చర్యపోతూ శుభలేఖ తెరిచాడు విశ్వం. అతనికి నెత్తిమీద వెయ్యి పిడుగులు పడినట్లు, సునామీలో మునిగిపోతున్నట్టు, అగాధంలోకి కూరుకుపోతున్నట్టు ఫీలై ఉన్నచోటే కూలబడిపోయాడు. శుభలేఖలోని అక్షరాలు అతన్ని వెక్కిరిస్తూ నీళ్ళు నిండిన అతని కళ్లకు మసకమసకగా కన్పిస్తున్నాయి. ఆ పెళ్లికొడుకు




ఎవరో కాదు. తను తన కూతురుకు కుదుర్చుకున్న అమలాపురం సంబంధమే. 'ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులారా! మీరు కుదుర్చుకున్న సంబంధాన్ని ఎక్కువ కట్నం ఆశచూపి ఎవరైనా తన్నుకుపోగలరు. నిశ్చితార్థం కాకుండా ఎక్కడా నోరు జారకండేం. తస్మాత్ జాగ్రత్త!' విశ్వం వణుకుతున్న పెదాల్నుంచి స్వగతంగా వెలువడిందా సందేశం. ✦

# జీవన మథనం

## వక్కలంక లక్ష్మీపద్మ సుందరి



నిండైన స్నేహానికి నిలువెత్తు నిర్వచనాలు ఆ ముగ్గురు యువతులు. ముగ్గురి కుటుంబాల నేపథ్యాలు వేరైనా అసూయలు, ఆవేశకావేషాలు ఏ మాత్రం తొంగిచూడని స్వచ్ఛమైన అనుబంధం వాళ్లది. ఆర్థిక సమస్యలు లేవు. ప్రేమ జంజాటాలు లేవు. కెరీర్ గురించిన కలలు అంతకన్నా లేవు. అయినా హృదయం నిండా ఏదో వెలితి. కుటుంబ వాతావరణంలోని అశాంతి వారి మనసుల్లోనూ నిండిపోయి ఊపిరాడనితనం. యాధృచ్ఛికంగా సైకాలజీ, కౌన్సెలింగ్ గురించి విన్న ఉపన్యాసం ప్రభావంతో సైకాలజిస్టును కలుసుకుని తమ ఆవేదన వెళ్లబోసుకుంటారు. ఆ సైకాలజిస్టు కలిగించిన అవగాహన, ధైర్యంతో జీవితాన్ని సరికొత్తగా మలచుకోవాలనుకుంటారు. సరిగ్గా అదే సమయంలో అనూహ్యమైన అనుభవాలు ఎదురై అనుకోని మలుపుల్లోకి హఠాత్తుగా అడుగు పెట్టాల్సి వస్తుంది. తర్వాత...

సమస్యలు, భావోద్వేగాలు, పరిష్కారయత్నాల మధ్య మనోవిశ్లేషణ అంతఃప్రవాహంగా సహజ సిద్ధంగా సాగిపోయే కథన శైలితో నిండిన నవల చతుర పాఠకులకు ఈ నెల కానుక.



వి శాలమైన ఆ కాలేజీ ఆవరణలో ముగ్గురు ముద్దుగుమ్మలు కిలకిలలతో కళకళలాడుతూ నడుస్తున్నారు.

ఆ ముగ్గురూ ఒకరి కోసం ఒకరు పుట్టినట్లు, జీవితంలో ఎన్నడూ ఎడబాటు ఎరగని మైత్రి తమది అన్నంత ధైర్యంగా, ధీమాగా ఉన్నారు.

దారి పొడవునా ఎత్తయిన అశోక వృక్షాలు, అగ్నిపూలు, వాళ్ల మైత్రికి ముచ్చటపడి చిరుగాలి తాకిడికే పూలజల్లు కురిపిస్తున్నాయి. దారిలో ఎదురుపడే క్లాస్‌మేట్స్‌ని, లెక్చరర్స్‌ని, పరిచయస్తుల్ని చిన్న చిన్న మాటలతో, పెదాలపై చిరునవ్వుతో, చేతి సైగలతో పలకరిస్తూ నిర్దిష్ట గమ్యం లేనట్లు ముందుకు సాగిపోతున్నారు.

"క్లాసులయిపోయాయి. కాఫీ, టిఫిన్‌లు కూడా కానిచ్చేశాం. వాట్స్ నెక్స్ట్" సన్నగా, పొడవుగా చామన ఛాయలో ఉన్న సుమన అడిగింది.

"ఏముంది. మను కంప్యూటర్ క్లాసుకి, నువ్వు మీ ఇంటికి, నేను హాస్టల్‌కి బయలు దేరడమే" జీన్స్ పేంటు, టీ షర్టుతో ఆధునికంగా ఉన్న సహృదయ కాస్త నిర్లక్ష్యంగా అంది.

"ఏయ్ హృదీ...! కేంటిన్ టిఫిన్ తిని బుద్ధి మందగించిందా...? ఈరోజు మంగళవారం. మను కంప్యూటర్ క్లాసులు రోజు విడిచి రోజు. ఈ రోజు శెలవు" సుమన విసుక్కొంది.

తల వెనక చిన్నగా తట్టుకుంది సహృదయ. "సారీ... మర్చిపోయాను"

"నష్టమేమీ లేదు కానీ, దొరికిన స్వేచ్ఛను ఎలా ఉపయోగించుకోవాలో ఆలోచించండి" విశాలమైన కళ్ళు, తీరైన ఆకృతితో అందాల బొమ్మ అనిపించే మనస్వి ఇద్దరినీ ఉద్దేశించి అడిగింది.

"ఏదైనా సినిమాకి వెళదామా...?" హృది ప్రశ్నించింది.

"అదయ్యేసరికి తొమ్మిది దాటుతుంది. నేను ఎనిమిదికల్లా ఇంట్లో ఉండాలి" తల అడ్డంగా ఊపి తన సమస్య గుర్తు చేసింది మనస్వి.

మాటల్లోనే వాళ్లు కాలేజి ఆడిటోరియం దాకా వచ్చేశారు. యధాలాపంగా చూసిన సుమన దృష్టి 'సాయంత్రం ఐదున్నరకు ప్రముఖ సైకాలజిస్టు సుధామూర్తి ఉపన్యాసం' అన్న నోటీసు మీద పడి..., "ఏయ్... ఇదేమిటో చూద్దామా...?" కాస్త ఉత్సాహంగా ఫ్రెండ్స్‌ని అడిగింది.

"ఉపన్యాసమా... బాబోయ్. తలుపులు మూసి మరీ బాదుతారు వద్దు" వెంటనే అభ్యంతరపెట్టింది సహృదయ.

మనస్వి ఒక్క క్షణం ఆలోచించి, "పోనీ పదండి. ఏం చెబుతారో విందాం" లోపలికి దారి తీసింది. తప్పనిసరై వారిని అనుసరించింది హృది.

"సైకాలజీ అంటే ఏమిటే...?" సుమనని ప్రశ్నించింది.

"మనస్తత్వ శాస్త్రం కదూ...!" మనస్వి బదులిచ్చింది. అవునన్నట్లు తల ఊపింది సుమన.

"శాస్త్రం సరే,ఇంతకీ మనసంటే ఏమిటే..?" హృది మళ్ళీ ప్రశ్నించింది. పెదాలు బిగించింది సుమన. "ఆ! మనసంటే మనకి లేనిది" అంటూ డోర్ తెరిచి లోనికి లాక్కుపోయింది. లోపల జనం వీళ్ళు అనుకున్నంత హీనంగా లేరు. బాగానే ఉన్నారు. వెళ్ళి కాస్త ఖాళీగా ఉన్నచోట కూర్చున్నారు. అప్పటికే సుధామూర్తిని సభకు పరిచయం చేస్తూ ప్రిన్స్‌పాల్ ప్రారంభోపన్యాసం పూర్తయ్యి సుధ వేదిక దగ్గరకు వచ్చి అందరికి విష్ చెయ్యడం నేరుగా తాను మాట్లాడవలసిన విషయంలోకి వచ్చేసింది.

"సైకాలజీ అంటే మనస్తత్వ అధ్యయనమని మీకందరికీ తెలుసు. మీలో సైకాలజీని ఒక సబ్జెక్టుగా చదువుతున్న వాళ్ళు కూడా ఉన్నారు. అందుకే మీ అందరికీ నాదో ప్రశ్న. అసలు మనసు అంటే ఏమిటి...?" అడిగింది సుధ.

ఉలిక్కిపడ్డట్టు మొహాలు చూసుకున్నారు

## రచయిత్రి పరిచయం

వక్కలంక లక్ష్మి పద్మ సుందరి ఎంఎ తెలుగు, హిందీ ప్రవీణ చేశారు. సాయి గణేశ్ హిందీ విద్యాలయ్ ద్వారా హిందీ పరీక్షలు రాసే విద్యార్థులకు బోధన చేస్తారు. ఆమె తండ్రి వక్కలంక విజయ రామ్‌గోపాలరావు, ట్రాన్స్‌కోలో పని చేసి రిటైర్ అయ్యారు. కవితలు, కథలు రాయడం, చదవడం ఆమె అభిరుచి. ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతికశాఖ నిర్వహించిన స్వాతంత్ర స్వర్ణోత్సవాల యువ కవి సమ్మేళనంలో పురస్కారం పొందారు. వివిధ సంస్థలు నిర్వహించిన కవితల పోటీలలో అనేక పురస్కారాలు అందుకున్నారు. ఈనాడు, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి వంటి వివిధ పత్రికల్లో కథలు, కవితలు ప్రచురింపబడ్డాయి. అలిండియా రేడియో యువవాణి, హైదరాబాద్, విజయవాడ కేంద్రాల నుంచి లక్ష్మి పద్మసుందరి పలు కథలు, కవితలు ప్రసారమయ్యాయి.


చిరునామా: **వి.ఎల్. పద్మ సుందరి**
D/o. వి.వి. రామ్‌గోపాలరావు
ఇంటి నంబరు. 7-14-7
దర్గాపేట, పెద్దాపురం- 533437.
ఫోన్: 08852-243107.


ముగ్గురు స్నేహితురాళ్లు.

"ఇదేమిటి...? హృదికి కలిగిన సందేహాన్నే ఈవిడా లేవనెత్తింది" గుసగుస లాడుకున్నారు.

ముందు వరసలోని ఒక అమ్మాయి నేను చెబుతానన్నట్లు చెయ్యెత్తింది. "చెప్పమ్మా..." అనుమతి నిచ్చింది సుధ.

"మనసు అంటే గుండె" పైకి లేచి తనకు తెలిసిన విషయాన్ని చెప్పిందా పిల్ల. "ఓ.కే. నేనూ ఒప్పుకుంటాను. మన కవులు, మేధావులు అంతా మనసంటే గుండె అనే నిర్వచించారు. కానీ ఒక విషయం గమనించారా, మనసు గురించి చదివే శాస్త్రాన్ని సైకాలజీ అంటున్నారు. గుండెను గురించి తెలుసుకొనే శాస్త్రాన్ని కార్డియాలజీ అంటున్నారు. మనసు గుండె రెండు ఒకటే అయితే ఈ తేడాలేమిటి...?" చిరునవ్వుతో ప్రశ్నించింది.

హాలంతా ఊపిరి పీల్చి వదిలినా పక్కవారికి వినిపించే నిశ్శబ్దం అలముకుంది. ఆ నిశ్శబ్దం నుండి ఓ సైకాలజీ విద్యార్థిని పైకి లేచింది. "మేడమ్...! కార్డియాలజీ అంటే శారీరకంగా శరీరంలో ఒక భాగమైన గుండె అనే అవయవాన్ని గురించి అధ్యయనం చేయడం. సైకాలజీ అంటే స్టడీ ఆఫ్ ఎమోషనల్ ఫీలింగ్స్ ఆఫ్ ది హార్ట్, మానసికంగా గుండె లోనయ్యే భావోద్వేగాలను గురించి తెలుసుకోవడం" వివరిస్తున్నట్టు చెప్పింది.

"ఎస్. యూ ఆర్ రైట్ మై డియర్ యంగ్ లేడీ" సుధ ఆమెను మెచ్చుకుంది.

హాలంతా ఆ అమ్మాయిని అభినందిస్తూ చప్పట్లతో మారుమోగింది. అందరినీ విష్ చేసి సంతోషంగా కూర్చుంది ఆమె.

సందడి సద్దు మణిగాక సుధ మళ్ళీ తను చెప్పేది మొదలు పెట్టింది. 'ఆ అమ్మాయి చెప్పినట్లు ఒక వ్యక్తి మానసికంగా గురి అయ్యే భావోద్వేగాల అధ్యయనమే సైకాలజీ. చాలా కాలం క్రితమే విదేశీయులు దీనిని ముఖ్యమైన శాస్త్రంగా గుర్తించి గౌరవించినా మన దేశంలో మాత్రం ఇప్పుడిప్పుడే దీని ప్రాధాన్యతను అర్థం చేసుకొంటున్నారు. అంతే కాదు దీని గురించి ప్రతి ఒక్కరు తెలుసుకోవలసిన అవసరం కూడా ప్రస్తుతం బాగా పెరిగింది. కారణం... ఒకప్పుడు ఆడపిల్ల అన్నీ అమ్మా, నాన్న, భర్త పిల్లలు అన్నట్లు

బతికేది కనుక తన మానసిక సమస్యలకు కూడా తానే బాధ్యత వహిస్తూ కుమిలిపోయేది. తల్లితండ్రుల నిరాదరణైనా, భర్త నిర్లక్ష్యమైనా, అత్తింటి ఆరళ్ళైనా, పిల్లల తిరస్కరణైనా అవన్నీ తన ఖర్మ అనే నిర్వేదంతో బతికేది. ఇవేవి కాక సంసారంలో ఎదురయ్యే సమస్యలను కూడా కాలానికే వదిలేసేది. లేదా కన్నీళ్ళతో కడిగేసుకోవాలని ప్రయత్నించేది. ఎందుకంటే తన సమస్యలు ఇతరులకి చెప్పి మానసిక స్వాంతన పొందవచ్చని, స్థిమితపడిన మనసు సరైన నిర్ణయాలు తీసుకోగలదనే ఆలోచన లేకపోవడం, ఇంటి గుట్టు బైటపడితే కుటుంబ పరువు పోతుంది; కాపురం బుగ్గవుతుందేమోననే భయం". సుధ చెప్పడం ఆపి హాలంతా కలయచూసింది, పిల్లలు శ్రద్ధగా వింటున్నారా లేదా అన్నట్లు.

అది ఉమెన్స్ కాలేజి కావడం వల్ల, సుధ చెప్పేది స్త్రీ సంబంధిత విషయం కావడం వల్ల సహజమైన జాతి అభిమానంతో అంతా ఆసక్తిగా వింటున్నారు. కాసిన్ని నీళ్ళు తాగి మళ్ళీ తన ప్రసంగాన్ని మొదలు పెట్టింది.

"అదంతా గతం. అప్పుడు స్త్రీలకి స్వంత నిర్ణయాలు తీసుకొనే అధికారం కానీ, అవసరం కానీ, ఆలోచన కానీ లేదు. అడుగడుగునా వీళ్ళ భవిష్యత్తు కూడా ఎవరో పెద్దలు నిర్ణయించే వాళ్ళు. వీళ్ళు తూచా తప్పక పాటించేవారు. కనుక వాళ్ళ మానసిక భావ ఉద్వేగాలు కూడా కుటుంబానికే ఎక్కువ శాతం పరిమితమై ఉండేవి. కానీ, ప్రస్తుతం ఈనాటి తరం స్త్రీ పరిస్థితి అలా కాదు. ఇంటా బయటా ఎక్కడ పడితే అక్కడ మనల్ని గాయపరిచే సంఘటనలు, మనసుకి నచ్చని విషయాలు ఎన్నో జరుగుతుంటాయి. ప్రతిసారీ వ్యతిరేకించడం సాధ్యం కాదు. అలాగని మనసులోనే అదిమేసుకుంటే ఆ భావోద్వేగాల కారణంగా శరీరంలో కలిగే మార్పులు మెదడు మీద, శరీరం మీద కూడా చెడు ప్రభావాల్ని చూపిస్తాయి. ఫలితం తలనొప్పి, బ్లడ్ ప్రెషర్, షుగర్ వీటికి తోడు అదుపు తప్పి, వేగాన్ని పెంచే గుండె సవ్వడి చిన్న వయసులోనే పెద్ద వ్యాధులకు దారి తీస్తాయి"

"ఈ మానసిక వొత్తిడి మనకి ఊహ తెలిసిన దగ్గరనుండి మొదలై వయసుతో పాటు పెరుగుతూ వస్తుంది. ఉదాహరణకు తొలిసారి యవ్వనంలో అడుగుపెట్టే మీ వయసు అమ్మాయిలనే తీసుకుంటే మార్కులు సరిగా రాలేదనో, ప్రేమ వ్యవహారాలు విఫలమయ్యాయనో ఎవరో పోకిరివాళ్ళు ఏడిపిస్తున్నారనో.... ఇలా పలు కారణాలతో తమలో రేగే భావోద్వేగాలను అదుపు చేసుకోలేక ఆత్మహత్యలకు కూడా సిద్ధపడుతున్నారు. మిమ్మల్ని ఇలాంటి అవస్థల నుండి తప్పించడానికే మీ ప్రిన్స్‌పాల్ శారదాదేవిగారు నన్ను కలిసి ఈ రోజు మీకు ఈ ఉపన్యాసాన్ని ఇవ్వవలసిందిగా కోరారు. నేను వెంటనే అంగీకరించాను. నా ఉపన్యాసం మీకు ఏమాత్రం ఉపయోగకరంగా ఉందని భావించినా మొదట మీరు మీ కృతజ్ఞతలను మీ ప్రిన్స్‌పాల్ గారికి తెలియచెప్పండి" వేదిక మీద కూర్చున్న శారదాదేవి వైపు సాభిప్రాయంగా చూస్తూ చెప్పింది సుధ. అమ్మాయిలంతా కరతాళ ధ్వనులతో శారదాదేవికి తమ కృతజ్ఞతలు తెలియజేశారు.

రెండు నిమిషాల అనంతరం సుధ తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ, "కనుక అమ్మాయిలూ నేను చెప్పేది ఒక్కటే, ప్రస్తుత సామాజిక పరిస్థితిలో ఆడపిల్లలు మానసిక వొత్తిళ్ళకు గురికావడం చాలా సహజం. ఎవరో ఏదో తప్పుడు అర్థాలని తీస్తారనో, మరెవరో ఏదో అంటారనో అనవసరపు భయాలకు గురయ్యి వాటిని మీలోనే అణుచుకొంటే మానసికంగానూ, శారీరకంగానే కాదు వ్యక్తిగతంగా కూడా మీరే చాలా నష్టపోవలసి వస్తుంది. సాధ్యమైనంత వరకు మా సైకాలజిస్టులు కౌన్సిలింగ్ సమావేశాలతో హిప్నోథెరపీ లాంటి ప్రక్రియలతోటే చికిత్స చేస్తారు. కనుక ఇది శారీరకంగా ఎవరినీ గాయపర

చదు. మన సమస్య నిపుణుడైన మానసిక వైద్యునితో చర్చించి చికిత్స తీసుకోవడం వల్ల మానసిక ఉపశమనం దొరుకుతుంది. సమస్య పట్ల స్పష్టమైన అవగాహన కలిగితే త్వరలో సరైన పరిష్కార మార్గాన్ని కనుక్కో గలం. తొందరపాటు నిర్ణయాలు తీసుకొనే పరిస్థితి తప్పిపోతుంది. నేను చెప్పిన విష యాల్లో నిజానిజాలు మీరు ఆలోచిస్తారని ఆశిస్తాను. ఇంతసేపూ శ్రద్ధగా, ఆసక్తిగా నేను చెప్పేది విన్నందుకు మీ అందరికీ నా కృతజ్ఞ తలు." చేతులు జోడించి అభివాదం చేస్తూ సుధ ప్రసంగాన్ని ముగించింది.

ఆడిటోరియం అంతా లేచి నిలబడి ఆమెను చప్పట్లతో అభినందించారు. "సుమా! నేను వెళ్లి ఆవిడ దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకొస్తాను" కొద్దిగా సుమన వైపు వాలి చెప్పింది హృది. "ఎందుకూ...? సైకాలజి స్ట్‌ని కలిసేంతటి సమస్యలు మనకి ఏము న్నాయి? "కాస్త చిత్రంగా అడిగింది సుమన.

"నీకేమీ లేకపోవచ్చు. కానీ మాకున్నాయి." చురుగ్గా చూస్తూ దెప్పినట్లు అని "మనూ, నేను సుధా మేడమ్‌ని కలిసి వస్తాను" మన స్వితో చెప్పి జనం మధ్యనుండి దారి చేసు కుంటూ వేదిక వైపు వెళ్ళిపోయింది.

పదేళ్ళ వాళ్ళ మైత్రీ బంధంలో స్త్రీ సహజ ఈర్ష్యాద్వేషాలు, అసూయ దెప్పుళ్ళు లేవనే చెప్పవచ్చు. ఒకరి పరిస్థితి మరొకరికి వివ రంగా తెలియడం వల్ల స్నేహాన్ని, ఓదార్పుని, ఆధారంగా చేసుకొని కలసి మెలసి జీవిస్తు న్నారు. అటువంటిది తొలిసారిగా హృది నోటినుండి వచ్చిన వ్యంగ్యాస్త్రం సుమనని కాస్త గాయపరిచిందనే చెప్పవచ్చు. మ్రాన్పడి పోయినట్లు నిలబడిపోయిన సుమ భుజం చుట్టూ చెయ్యివేసి బయటికి నడిపిస్తూ "సుమా! నాకూ మనం ఒకసారి సుధా మేడ మ్‌ని కలవడమే మంచిదనిపిస్తోంది. ఆవిడ చెప్పినట్లు అనవసర భయాలు, అనుమానా లతో మనలో మనం మధనపడేకన్నా కలి స్తేనే మంచిదేమో కదా" అడిగింది మనస్వి.

"నువ్వు చెప్పేది నిజమే సుమా! కానీ మనవి ఆర్థిక సమస్యలు కావు. చదువులోనో, ప్రేమలోనో, వయసులో ఉండడం వల్లనో తలెత్తే సమస్యలు ఏవీ కానపుడు ఆవిడకు మాత్రం మన సమస్య ఇదీ అని ఎలా చెప్ప గలం" సుమ ప్రశ్నించింది.

మనస్వి పెదవి విరిచి తల అడ్డంగా ఊపింది "ఏమో! నాకూ తెలియదు. చూద్దాం, మనిషినంటూ కలిస్తే ఏం చెప్పాలి అన్నది అక్కడే నిర్ణయించుకోవచ్చు"ఇద్దరూ హృది స్కూటీ పార్క్ చేసిన చోటికి వచ్చారు.

కాస్త సందడికి దూరంగా ఉన్న నియాన్ లైటు కిందకి వెళ్ళి సెల్ తీసి ఇంటి నెంబరు నొక్కింది 'హలో' తల్లి సుభద్ర గొంతు విని పించింది. "అమ్మా... నాకు ఇప్పుడే కంప్యూ టర్ క్లాసు అయింది. ఇంకో అరగంటలో వచ్చేస్తాను" నిర్వికారంగా చెప్పింది

"పది నిమిషాల నుండి నీ ఫోన్ కోసం పడిగాపులు పడి చూస్తున్నాను. చేసేది స్వంత సెల్ నుండేకదా! మధ్యలో ఒకసారి ఇంటికి ఫోన్ చేసి చెప్పొచ్చుగా" అరచినట్లు అడిగింది సుభద్ర అటువైపునుంచి.

అప్రయత్నంగా సెల్ చెవికి దూరంగా జరుపుకుంది మనస్వి. ఆమెలో ఆగ్రహం చివ్వున రేగింది.

"అమ్మా! మాట్లాడితే అర్థం ఉండాలి. క్లాసు మధ్యలో నీతో కబుర్లు చెప్పడం ఎలా కుదు రుతుంది? " విసుగ్గా ప్రశ్నించింది.

"సర్లే, వెధవ వంకలు ఎన్నయినా చెబు తావు. పెత్తనాలు చాలించి త్వరగా కొంపకి తగలడు" అంతకు రెట్టింపు విసురుగా బదులి చ్చింది సుభద్ర. కసిగా పెదవి కొరుక్కుంటూ సెల్ ఆఫ్ చేసి అక్కడే నిలబడి పోయింది మనస్వి.

"ఏమయ్యింది? " సుమన దగ్గరకి వచ్చి అడిగింది.

"రోజు రోజుకి అమ్మ చాదస్తం పెరిగిపో తోంది. క్లాసు మధ్యలో రింగ్ చెయ్యొచ్చు కదా అంటుంది. లాభం లేదు సుమా! సాధ్యమై

నంత త్వరగా సుధగారిని కలిసి ఏదో ఒక పరిష్కారం కనుక్కోకపోతే మెదడుపై వొత్తిడి పెరిగి తల పగిలిపోతుందనే భావన కలుగుతోంది" కుడిచేత్తో కణతలు నొక్కుకుంటూ వేదనగా అంది.

సానుభూతిగా భుజం తట్టింది సుమన.

హృది వాళ్ళని వెతుక్కుంటూ వచ్చి "ఎల్లుండి సాయంత్రం ఆరు గంటలకి సికింద్రాబాద్‌లోని వాళ్ళ ఆఫీసుకు వచ్చి కలవమన్నారు" ఉత్సాహంగా చెప్పింది.

"ఎవరెవరం కలుస్తామో చెప్పావా...?" సుమన అనుమానంగా అడిగింది.

"మన ముగ్గురం కలుస్తామని చెప్పాను" హృది మామూలుగా చెప్పింది.

సంతోషంగా ఆమె చేతిని బిగించి పట్టుకుంది సుమన. వాళ్ళ మధ్య సారీలు థేంక్స్‌లు వంటివి లేవు. కారణం వాళ్ళకి తెలిసింది కేవలం స్నేహం మాత్రమే.

"మిమ్మల్ని డ్రాప్ చేసి నేను హాస్టల్‌కి వెళతాను పదండి" హృది తన స్కూటీ స్టార్ట్ చేసింది. ఆమె వెనుక మనస్వి, సుమన ఎక్కారు. మనస్విని బస్ స్టాప్‌లో, సుమనని వాళ్ల ఇంటి గల్లీలో డ్రాప్ చేసి, దారిలో ఎ.టి.ఎమ్‌లో డబ్బులు డ్రా చేసుకొని అవసరమైన వస్తువులు కొనుక్కొని హాస్టల్‌కి చేరింది సహృదయ.



**2**

సుమన ఇంట్లోకి అడుగు పెట్టేసరికి నందనరావు, యశోదల కంఠాలు తారాస్థాయిలో గేటుదాకా వినిపిస్తున్నాయి. బయటవాళ్లు వింటారనే స్పృహ లేనట్లు పోటీపడి వాదులాడుకుంటున్నారు ఇద్దరూ.

"మీరు వచ్చి తీసుకొస్తారని ఏడున్నరదాకా ఆఫీసు గేటుముందు ముష్టిదానిలా ఎదురు చూశాను. ఆటోలో వస్తే యాభై అయ్యింది. అయ్యో! పెళ్ళాం ఎలా తంటాలుపడి కొంపకొచ్చిందో అనే జాలైనా లేకుండా తీరిగ్గా ఇప్పుడొచ్చి ఎవడో స్నేహితుడు కలిశాడు. రాలేకపోయానని కహానీలు చెబుతున్నారు. మనిషన్నాక అబద్ధమాడేందుకు సిగ్గుండాలి". భర్త మీద ఎగురుతోంది యశోద.

"మనిషివి కావా? చెబితే అర్థం కాదా? రోజూ వచ్చి పికప్ చేసుకుంటూనే ఉన్నాగా! ఒక్కరోజు రాకపోతే ఆటోలో వస్తే ప్రాణం పోతుందా...?" ఆమెకి ఏమాత్రం తగ్గకుండా అరిచాడు నందనరావు.

సుమనకి విషయం అర్థమయింది. బి.హెచ్.ఇ.ఎల్.లో ఇంజనీరుగా పని చేస్తున్నాడు నందనరావు. యశోద ప్రైవేటు కంపెనీలో సీనియర్ అసిస్టెంట్‌గా చేస్తోంది. ఇద్దరి ఆఫీసులు ఒకే రూటులో ఉండడం వల్ల పొదుపు పద్ధతి వల్ల నైతేనేం రోజూ భార్యను ఆఫీసులో దింపడం, తిరిగి తీసుకురావడం తనే చేస్తాడు. ఈరోజు ఏ కారణంగానో తీసుకురావడానికి వెళ్ళకపోవడం వల్ల యశోద ఆటోలో రావలసివచ్చింది. అదీ గొడవకు కారణం. చిన్నగా నిట్టూర్చి వాళ్ళని పలకరించకుండా పైనున్న తన రూమ్‌లోకి వెళ్ళిపోయింది. తను రిఫ్రెష్ అయ్యి వచ్చి చూసినా కింద గొడవ సద్దుమణగలేదు. పక్కగది దగ్గరకి వెళ్లి కొద్దిగా తెరచి చూసింది. అన్నగారు ఎదురుగా ఉన్న స్క్రీన్ మీద చూస్తూ ఏదో ఏనిమేషన్ ప్రోగ్రామ్ తయారీలో నిమగ్నమై ఉన్నాడు. లోపలికి వచ్చి తలుపు మూసి పక్క కుర్చీ లాక్కుని కూర్చుని, "నువ్వు ఇంట్లోనే ఉన్నావా? నీ గది హాయి. బయట గోల లోపలికి చేరదు" అంది.

"లేకపోతే, ఈ ఇంట్లో, ఈ సమయంలో ఇంత ప్రశాంతంగా పని చేసుకోగలనా...?" చెల్లెలిని తిరిగి ప్రశ్నించాడు మనోజ్.

"ఏం చేస్తున్నావు?" స్క్రీన్ మీద కదులుతున్న 'టామ్' పిల్లి బొమ్మను గమనిస్తూ అడిగింది.

"కుటుంబ సంక్షేమ శాఖవాళ్లు అధిక జనాభా సమస్య గురించి పిల్లలకి అర్థమయ్యేలా ఓ పదినిమిషాల ఫిల్మ్ తీయమని మా ఏనిమేషన్స్ సంస్థను అడిగారు. మా డైరక్టర్ కులకర్ణి ఆ బాధ్యత మాకప్పగించారు. 'టామ్ అండ్ జర్రీ' బాగా పేరున్న పాత్రలు కదా! వాటిని ముఖ్య పాత్రలుగా చేసి ఫిల్మ్ చేద్దామని నిర్ణయించాం. టామ్ పాత్రను డిజైన్ చేసే డ్యూటీ నాది" మౌస్‌ని కదిలిస్తూ తాను కోరుకున్న భావాలు పిల్లి బొమ్మలోకి చొప్పిస్తూ చెప్పాడు.

"ఎప్పటికి పూర్తవుతుంది?"

"నేను చేసేది ఇంకో మూడు నాలుగు రోజులు పట్టవచ్చు"

కాసేపు చూసేసరికి ఒకే బొమ్మని చూడడం విసుగనిపించి, పైకి లేచి "నువ్వు భోజనం చేశావా?" అడిగింది.

"కింద వాళ్ళ యుద్ధం ఆగకుండా దిగే ధైర్యం నాకు లేదు" బదులుగా చెప్పాడు. తలుపు కొద్దిగా తెరిచి చూసింది. ఇందాకటంత గట్టిగా తల్లితండ్రుల గొంతు వినబడకపోవడంతో "వాళ్ళిద్దరూ వాళ్ళ రూమ్‌లోకి వెళ్ళిపోయారు వస్తావా? భోజనం చేసేద్దాం" వెనక్కి తిరిగి అన్నగారిని అడిగింది.

సిస్టమ్ ఆఫ్ చేసి అన్నీ సర్ది ఒళ్ళు విరుచుకుంటూ వచ్చాడు మనోజ్. ఇద్దరూ డైనింగ్ టేబుల్ దగ్గరికి చేరారు. ఇద్దరికీ చెరో కంచంలో అన్నం, కూర వడ్డించింది సుమన. ఎదురెదురుగా కూర్చుని మౌనంగా తినసాగారు ఇద్దరూ. తమ గది తలుపు తెరుచుకొని ఫ్రిజ్ దగ్గరికి వచ్చి ఐస్ ట్రేలు తీసుకుంటూ, "ఇంకా మీరు భోజనాలు చెయ్యలేదా? ఒక వేళాపాళా లేకుండా తింటే రోగాలు వస్తాయి" తండ్రిగా పెద్దరికాన్ని ప్రదర్శిస్తూ విసుక్కొన్నాడు నందనరావు.

అన్నా చెల్లెళ్ళు బదులు చెప్పలేదు. వాళ్ళకి ఆ అవసరం కూడా రాలేదు. పడకగది గుమ్మం నుండే అందుకుంది యశోద. "మనిషన్నాక కాస్తయినా ఇంగితం ఉండాలి. ఎదిగిన పిల్లలున్న ఇంట్లో తాగి తందనాలు ఆడడానికి సిగ్గులేదూ"

"నోర్మూయ్యి. నా ఇంట్లో నా ఇష్టమొచ్చినట్లు ఉంటాను. పిచ్చివాగుడు వాగితే పళ్ళు రాలగొడతాను" గట్టిగా అంటూ ఆమెని నెట్టుకుంటూ లోపలికి వెళ్ళిపోయాడు. కసితీరా తిడుతూ తలుపు మూసేసింది యశోద.

నందనరావుకున్న తాగుడు వ్యసనం కారణంగా తరచు ఆ ఇంట్లో జరిగే తతంగానికి చిన్నగా నిట్టూర్చి "అన్నయ్యా! మన ఇల్లు ఎప్పటికి బాగుపడుతుందంటావు?" దిగులుగా అడిగింది సుమన.

గబగబా తినడం పూర్తి కానిచ్చి చూపుడు వేలు పైకెత్తి శూన్యంలోకి చూపిస్తూ, "గాడ్ నోస్ ఓన్లీ" చెప్పి లేచి చెయ్యి వాష్ చేసుకోడానికి వెళ్ళిపోయాడు మనోజ్.

"ఆయనకైనా తెలుసో లేదో?" తనలో తాను అనుకుంటూ నిట్టూర్చింది. అంతలో ఆమెకి సుధ ఉపన్యాసం గుర్తొచ్చింది. ఆవిడకి చెప్పి ఏదైనా ఉపాయం ఉందేమో కనుక్కోవాలి. మళ్ళీ తనే అనుకుంది.

* * *

వస్తూనే తిన్నగా తన రూమ్‌లోకి వెళ్ళబోయిన మనస్విని హాల్లోనే ఆపి "ఫోన్ చేసి నలభై నిమిషాలు అయ్యింది. ఇంత ఆలస్యంగా వచ్చావేం?" నిలదీసింది సుభద్ర.

"బస్సు లేటయింది" మామూలుగా చెప్పింది.

"ఆటోలో వచ్చెయ్యకపోయావా?"

"ఎందుకూ? బస్‌పాస్ ఉండగా ఆటోకి డబ్బులెందుకు తగలేశావని తిట్టడానికా?" చిరాగ్గా ప్రశ్నించింది మనస్వి.

బదులు చెప్పలేనట్లు మింగేసేలా చూసి, "స్నానం చేసిరా! భోజనం చేద్దువు గానీ" వంటింట్లోకి దారితీస్తూ చెప్పింది.

ఒళ్ళంతా చిరాకుగా అనిపించడంతో "ఇంకా



ఆకలిగా లేదు. ఓ అరగంట పోయాకా తింటాను" తన గదికేసి నడిచింది. చివ్వున తిరిగింది సుభద్ర. "కాలేజీ దగ్గర అడ్డమైన గడ్డి తిన్నావా? లేకపోతే ఆకలి ఎందుకు వెయ్యదు? " కొట్టినట్లు అడిగింది. తల్లి ప్రశ్నలతో విసిగిపోయిన మనస్వి పర్స్ ఆవిడ ముందు పారేసి. "రోజూ అవీ, ఇవీ తినడానికి నాకేం నువ్వు వందలివ్వవు. ఇచ్చేది ఇరవై రూపాయలు. నోట్స్ కొనుక్కోవలసి వచ్చినా, దాహం వేసినా ఏ అవసరానికైనా అదే దిక్కు. ఇంక తినడానికి, తిరగడానికి అవకాశం ఎక్కడ ఉంది. బయట చెప్పుకోడానికి నా హోదా గొప్పగానే ఉంటుంది. పెద్ద లిమిటెడ్ కంపెనీ జనరల్ మేనేజర్‌గారి ఒక్కగానొక్క కూతురు. డిగ్రీ చదువుతోంది. కంప్యూటర్ కూడా వెలగబెడుతోందని గప్పాలు కొట్టుకోవచ్చు కానీ నా అవసరాలకు మీరు రోజూ ఇచ్చేది ఇరవై రూపాయలు. తలుచుకుంటే నామీద నాకే జాలి వేస్తోంది" రోషంగా అంది.

అప్పుడే ఆఫీసు నుండి వచ్చిన చక్రధరం కూతురు ఆవేశం అర్థంకాక "ఏమైంది? " అని అడిగాడు.

మనస్వి జవాబు చెప్పలేదు. ఉక్రోషం వల్ల కళ్ళలో తిరిగే నీళ్ళు తండ్రి కంటపడకుండా తలొంచుకొని పక్కకి తిరిగి చేతులు కట్టుకొని నిలబడింది.

"మీ అమ్మాయికి తిండి, బట్ట అన్నీ ఇచ్చి ఫీజులు కట్టి పుస్తకాలు, బస్‌పాస్‌తో సహా సర్వం అమర్చి రోజుకి ఇరవై రూపాయలు ఇస్తుంటే చిల్లర ఖర్చులకు చాలడం లేదుట.

అవును మరి నేను సవతి తల్లిని కదా! ఇదంతా ఈవిడకు లేకుండా కూడపెట్టి నా కన్నబిడ్డలకు దోచిపెట్టాలనే పేరాశతో మీ కూతుర్ని ఎండ గట్టేస్తున్నాను" వ్యంగ్యంగా అంటుండగానే సుభద్ర కళ్ళనుండి బొటా బొటా కన్నీళ్ళు కారిపోయాయి. గొంతు పూడుకు పోయింది.

సహజంగానే చక్రధరం కరిగిపోయాడు. "ఊరుకో సుభద్రా! చిన్నపిల్ల ఏదో తెలియక అంటే నువ్వు కూడా బాధ పడితే ఎలా? " భార్యని ఓదా రుస్తూనే మనస్విని ఉద్దేశించి, "మనూ! అమ్మ ఏం చేసినా నీ మంచి కోరే చేస్తుంది. అమ్మని బాధ పెట్టడం సంస్కారం కాదు. అమ్మకి సారీ చెప్పు" గంభీరంగా ఆదేశించాడు.

చాలామంది ఆడవాళ్ళ తిరుగులేని ఆయుధం కన్నీరు. సుభద్ర కూడా తరచు ఆ ఆయుధంతోటే భర్తని, కూతుర్ని లొంగదీసుకొని తను అను కున్నది సాధిస్తుంది. ఇప్పుడూ అదే జరిగింది. మనస్వికి కూడా వాదాన్ని పెంచడం వల్ల ప్రయోజనం లేదనిపించి తన పర్స్, పుస్తకాలు తీసుకొని తలొంచుకొని మెల్లగా "సారీ అమ్మా" అని చెప్పింది.

క్షణాల్లో ఆగిపోయింది సుభద్ర కన్నీరు. చీరకొంగుతో కళ్ళు వత్తుకొని భర్తను ఉద్దేశించి "మీరూ, బట్టలు మార్చుకొని రండి. ఏకంగా భోజ నాలు చేసేద్దాం" ఆయన చేతిలో బ్రీఫ్‌కేస్ తీసుకొని బెడ్‌రూమ్‌లోకి నడుస్తూ చెప్పింది. ఇంకా అక్కడే తల వంచుకొని నిలబడిపోయిన కూతుర్ని ఒకసారి చూసి చిన్నగా నిట్టూర్చి భార్య వెనకే వెళ్ళిపోయాడు చక్రధరం.

✶ ✶ ✶

సహృదయ స్కూటీ సౌండ్ వినగానే గేటు ఓపెన్ చేసి సెల్యూట్ చేశాడు హాస్టల్ వాచ్‌మేన్. స్కూటీ పార్కుచేసే బాధ్యత అతనికే వదిలి తన హేండ్‌బేగ్ తీసుకుని వార్డెన్ రూమ్‌కి వెళ్ళింది. ఆమెను చూస్తూనే మొహం అంతా నవ్వు పులుముకొని ఆహ్వానించింది వార్డెన్.

దగ్గరకు రానిచ్చి బ్యాగ్‌లో నుండి ఒక ఐదొందల నోట్ల కట్టను తీసి ఆవిడకి అందిస్తూ, "నిన్నేదో వెల్ఫేర్ ప్రోగ్రాం డొనేషన్ అడిగారుగా! ఇదిగో ఏభైవేలు" అందిస్తూ చెప్పింది.

"ఒక్క నిమిషం ఉండమ్మా రిసీప్ట్ ఇస్తాను" గబగబా వెళ్ళి బిల్ బుక్ తెచ్చి "దాత పేరుగా నీ పేరే రాయమంటావా? " పెన్ను సిద్ధంగా పట్టు కొని అడిగింది. "ఉహూ! మా అమ్మగారు జానకి పేరు రాయండి" సహృదయ అంది. ఆవిడ మురిసిపోయింది. "నీలాంటి కూతురు దొర కడం మీ అమ్మగారి అదృష్టం. లేకపోతే ఇంతచేసి అంత గొప్ప చెప్పు కునే ఈ రోజుల్లో నువ్వు చేసే మంచి పని పుణ్యం కన్నతల్లికి చెందాల నుకోవడం ఎంత గొప్ప" గబగబా రిసీప్ట్ పూర్తిచేసి చింపి హృది చేతిలో పెడుతూ పొగిడింది.

"ఇదంతా మా అమ్మ సంపాదించిన పాపపు సంపాదనే. ఇలాంటి మంచి పనుల కోసం దాన్ని ఖర్చు చేస్తేనైనా ఆవిడ పద్ధతిలో మార్పు వస్తుందేమోనని నా ఆశ" నిర్లిప్తంగా చెప్పి వేగంగా వెళ్ళిపోయింది.

**ఇదంతా మా అమ్మ సంపాదించిన పాపపు సంపాదనే. ఇలాంటి మంచి పనుల కోసం దాన్ని ఖర్చు చేస్తేనైనా ఆవిడ పద్ధతిలో మార్పు వస్తుందేమో నని నా ఆశ**

హృది చెప్పినదాన్ని అర్థం చేసుకోలేనట్లు ఉండిపోయింది వార్డెన్.

తిన్నగా క్యాంటిన్‌కి వెళ్లింది. అప్పటికే బల్లలు, కుర్చీలు సర్దేసి వంటగది శుభ్రం చేసుకుంటున్న దాసుకి భోజనం తెమ్మని సైగ చేసింది.

ఒక ప్లేటులో వంకాయకూర, ఆలుగడ్డ వేపుడు, అన్నం పెట్టి ఓ కుర్రాడితో ఆమె కూర్చున్న దగ్గరికి పంపాడు దాసు.

చెమ్చాతో అన్నం, వేపుడు కలుపుకొంటుంటే బ్యాగ్‌లోని సెల్ మోగింది. బయటకి తీసి నెంబరు చూసింది. ముంబాయి నుండి జానకి చేస్తున్నట్లు సూచించిందా నెంబరు. ఆఫ్ చేసేద్దామా అనుకుని అంతలోనే మనసు మార్చుకొని ఆన్ చేసి చెవి దగ్గర పెట్టుకొని "హలో" అంది.

"చిన్నా! ఎలా ఉన్నావమ్మా?" జానకి గొంతులో వాత్సల్యం జాలువారింది.

"బతికే ఉన్నాను సరేనా...?" హృది గొంతులో హేళన పలికింది.

చివుక్కుమంది జానకి తల్లి మనసు. "అదేం మాటమ్మా? అన్నం తిన్నావా?" ఆదరంగా అడిగింది.

సహృదయలో ఉక్రోషం బుస కొట్టింది. 'ఒక్కసారైనా తల్లిగా ఆప్యాయంగా అన్నం పెట్టిన పాపానపోలేదు కానీ ఫోన్‌చేసి పరామర్శిస్తోంది' కసిగా అనుకుంటూ, "ఆ! తింటున్నాను మటన్ కుర్మా, ఎగ్ కర్రీ" సెల్ ఎడమ చేతిలోకి మార్చుకొని స్పూన్‌తో ప్లేటులోని కూరల్ని కెలుకుతూ చెప్పింది.

జానకికి ఆ మాటలు కలుక్కుమనిపించాయి. "చిన్నా! నువ్వు... నువ్వు నాన్‌వెజ్ తింటున్నావా?" బలహీనంగా అడిగింది.

"ఎంతైనా నీ కూతుర్ని కదా! నీ సుగుణాల్లో కొన్నయినా రావద్దా?" వెక్కిరింతగా చెప్పింది.

సమాధానం చెప్పలేనట్లు ఉండిపోయింది జానకి. హృది రెట్టించలేదు. కొన్ని క్షణాల మౌనం తర్వాత "ఒక్కసారి రా చిన్నా! నువ్వు వచ్చి నిన్ను చూసి ఏడాది దాటింది. చూడాలనిపిస్తోంది" మనసులోని ఆశ గొంతులో ధ్వనిస్తుండగా అడిగింది.

హృది పెదాలు నొక్కుకుంటూ కుర్చీలో వెనక్కివాలి చెప్పింది. "అదే ఆలోచిస్తున్నాను. మరో మూడు నెలల్లో ఈ చదువు నాటకానికి తెర పడిపోతుంది. ఈ హాస్టల్లో ఉండనీయరు. బయట ఎక్కడైనా రూమ్ తీసుకోనా? లేక వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్లో చేరనా? అని ఆలోచిస్తున్నాను"

"అదేం మాట చిన్నా! లంకంత ఇల్లు, లక్షల ఆస్తి పెట్టుకొని బతుకంతా హాస్టళ్ళల్లోనూ, అద్దె కొంపల్లోనూ గడిపే ఖర్మ ఏమిటమ్మా? ఇంటికొచ్చేయి" ఆర్తిగా బతిమాలుకుంటున్నట్లు అడిగింది.

అంతవరకు హృది గొంతులో తెచ్చిపెట్టుకున్న మృదుత్వం ఎగిరిపోయింది. మొహం ఆగ్రహంతో ఎర్రగా కందిపోయింది. "ఇంటికా...? అదీ నీ దగ్గరకా...? అది ఇల్లని, నిన్ను తల్లని బుర్రా, బుద్ధి ఉన్నవాళ్ళు ఎవ్వరూ అనరు. అంతగా కోరుతున్నావు కనుక తప్పకుండా వస్తాను. ఎప్పుడో తెలుసా? ఇంకా నేను పతనానికి మొదటి మెట్టు మీదే ఉన్నాను. ఒక్కొక్కటిగా దిగజారి నీతో సమాన స్థాయికి వస్తాను చూడు అప్పుడు వస్తాను. ఆనాడు మనిద్దరం కలిసి ఇల్లనే ఆ శ్మశానంలో శవాల్లా సహజీవనం చేద్దాం. అంతవరకు నా మానాన నన్ను వదిలెయ్" తల్లి పిలుస్తున్నా వినిపించుకోకుండా సెల్ ఆఫ్ చేసేసి ఒక్క ముద్దయినా నోట్లో పెట్టుకోకుండానే లేచి రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

ఆమె తత్వాన్ని ఎరిగిన దాసు కుర్రాడికి సైగ చేసి, "ఆ అన్నం పారేసి ప్లేటు కడిగి లోపల పెట్టు. ఇంక తినేదేం లేదు" చెప్పాడు.

ఎవ్వరితోటి పంచుకోకుండా తనకి మాత్రమే చెందేలా ఏర్పాటు చేసుకున్న తన గది తాళం తీసి బార్లా తెరిచింది. కిటికీలోంచి లోనికి వచ్చే వీధి దీపం కాంతి గది బైట వరండాలో

ఉన్న అరవై వాట్స్ బల్బ్‌కాంతి తప్ప మరే తీక్షణమైన కాంతి లేకుండా చీకటిగా, నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా తన జీవితానికి ప్రతిరూపంలా ఉన్న ఆ గదిలోకి అయిష్టంగా అడుగుపెట్టి తలుపుల్ని మూసేసింది. కాలి చెప్పులు పీకి ఓ మూలకి విసిరేసి, చేతిలో బ్యాగ్ ఓ వారనున్న టేబుల్ పైకి గిరాటేసి ఆ మసక చీకట్లోనే తడుముకుంటూ వచ్చి మంచం మీద వాలిపోయింది. తల్లితో మాట్లాడిన తర్వాత 'నేను ఒంటరిని, నాకెవ్వరూ లేరు' అనే భావన మరింత పెరిగినట్లయ్యింది. గుండె లోతుల్లోంచి దుఃఖం ఉబికి వచ్చింది. అడ్డుపెట్టేవాళ్ళు, అదుపు చేసేవాళ్ళు ఎవ్వరూ దగ్గర లేనందున స్వేచ్ఛగా గుండె బరువు తీరేలా కరువుదీరా రోదిస్తూ ఎప్పటికో నిద్రలోకి జారుకుంది.




మధ్యాహ్నం నుండి రెండు క్లాసులు కేన్సిల్ అవ్వడంతో కబుర్లు చెప్పుకుంటూ దగ్గరలో ఉన్న సుమన ఇంటికి చేరుకున్నారు ముగ్గురూ! గేటు తీస్తూ అన్నగారి గది కిటికీ రెక్కలు తెరచి ఉండడం గమనించి "మా మనోజ్ ఇంట్లోనే ఉన్నాడు. మనం నా రూమ్‌లో కూర్చుందాం" సుమన అంది.

"నీ ఇష్టం" మనూ, హృది అంగీకారాన్ని తెలిపారు.

వంటింట్లోకి వెళ్ళి ముగ్గురికి కాఫీలు కలుపుకొని, బ్రెడ్ స్లైస్ ఉంటే సేండ్‌విచెస్ చేసుకొని అన్నీ ఓ ట్రేలో సర్దుకొని సుమన గదికి చేరుకున్నారు. కబుర్లతో, నవ్వులతో వాటిని తింటుంటే హృది దృష్టి ఓ వార ఉన్న మ్యూజిక్ సిస్టమ్ మీద పడింది "ఏమే సుమా! మంచి పాటలు పెట్టవే డాన్స్ చేద్దాం" కోరింది.

లేటెస్ట్ ఫల్గుణి పాఠక్ హిందీ పాప్ సాంగ్స్ ఫుల్ వాల్యూమ్ పెట్టుకొని ముగ్గురూ దానికి అనుగుణంగా గంతులెయ్యడం మొదలుపెట్టారు.

చాలాసేపటి నుండి కూర్చుని చేస్తుండడంతో నడుం నొప్పిగా అనిపించి చేస్తున్న వర్కు పాజ్‌లో ఉంచి బైటికి వచ్చిన మనోజ్‌కి సుమ గదిలోంచి వచ్చే శబ్దానికి తల అదురుతున్నట్లయి వెళ్ళి తీసున్న తలుపులపై గట్టిగా తట్టాడు. పాట గోలలో వాళ్ళకి ఆ చప్పుడు వినపడలేదు. విసిగిపోయి తిన్నగా మ్యూజిక్ సిస్టమ్ దగ్గరికి వెళ్ళి ఆఫ్ చేశాడు. ఒక్కసారిగా భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది. ముగ్గురి చిందులు కూడా ఆగిపోయాయి. మనూ మంచంమీద పారేసిన చున్నీ మెడలో వేసుకుంది.

"అన్నయ్యా! ఎందుకు ఆపేశావు?" అరిచినట్లు అడిగింది సుమన.

"నీ ఇష్టం వచ్చినంత సౌండ్ పెట్టుకొని గంతులు వెయ్యడానికి ఇది డిస్కోథెక్ కాదు. ఇల్లు" కోపంగా బదులిచ్చాడు.

"అది నీకు అనవసరం, ఇది నా రూమ్ నా ఇష్టం. నీ గదికొచ్చి నీ పని చెడకొడితే అడుగు. అంతేకానీ నా మీద పెత్తనం చెయ్యకు" వెక్కిరించింది.

"అలాగా! అయితే పక్కవాళ్ళకి ఇబ్బంది కలిగించే అధికారం నీకూ లేదు కనుక" అంటూనే మ్యూజిక్ సిస్టమ్ జాక్‌ప్లెగ్ తీసి చుట్టి జేబులో పెట్టుకున్నాడు.

"అన్నయ్యా! ఇచ్చెయ్యి ప్లీజ్" అడ్డుపడింది సుమన.

"ఇది నీకు కావాలంటే నాకు చాలా ఆకలిగా ఉంది. కిందికి వెళ్ళి కాఫీ, టిఫిన్ చేసి తీసుకురా!" చెల్లిని పక్కకి నెడుతూ అన్నాడు.

"కాఫీ టిఫిన్ల కోసం కిందకి వెళ్ళడం ఎందుకూ, ఇప్పుడే ఇస్తాం" అంటూ హృదికి సైగచేసి అన్నగారిని మంచంమీద కూర్చోబెట్టి

వాళ్ళు తెచ్చుకున్న పాట్‌లో ఉన్న కాఫీ, రెండు సాండ్‌విచ్‌లను అందించింది.

"అన్నీ సిద్ధం చేసుకుని అల్లరి చేస్తున్నారన్న మాట." సాండ్‌విచ్ రుచి చూస్తూ "ఎవరు చేశారు ఇది? " ప్రశ్నించాడు.

కాఫీ నేను కలిపాను. హృది కట్‌చేసి ఇస్తే మనస్వి సాండ్‌విచ్ చేసింది. ఎలా ఉన్నాయి? " ఆత్రంగా అడిగింది సుమన.

"ఏడిసినట్లున్నాయి. మీరు పేరుకి ఆడపి ల్లలయినా అల్లరి తప్ప ఇంటిపని, వంటపని ఏదీ రాదు. ఈసారెప్పుడైనా తీరిక దొరికినప్పుడు నేను చేసి చూపిస్తాను. నేర్చుకోండి" సలహా ఇస్తున్నట్లు అని నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ "అవును మరి! ఎలా వస్తుంది. ఒక్కళ్ళకైనా అమ్మా నాన్నల భయం ఉంటేగా? " గొణిగినట్లు అన్నాడు. అతని అభిప్రాయానికి ఉక్రోషపడుతూ తెల్లబోయి వింటున్న ముగ్గురూ ఆఖరిమాట విని, ఆశ్చర్యంగా మొహాలు చూసుకొని గట్లు తెగిన నదుల్లా విరగబడి నవ్వారు. వాళ్ళని అంతగా నవ్వించే మాట తానేమన్నాడో అర్థంకాక జేబులోని జాక్‌ఫ్లైగ్ సుమన మీదకి విసిరేసి "మీ ముగ్గురికి పిచ్చి ఉంది. అందుకే ఒకళ్ళకి ఒకళ్లు బాగా స్నేహం కుదిరింది" వెక్కిరింతగా అని వెళ్ళిపోయాడు.

ఆ మాట తలుచుకుని మరికాసేపు నవ్వుకున్నారు ముగ్గురూ. మరో పావుగంట తర్వాత మనస్వి లేచింది. "సుమా! కంప్యూటర్ క్లాసుకి టైమ్ అవుతోంది. నేను వెళతాను" తన బ్యాగ్ తీసుకొని బయలుదేరింది.

"ఉండు. నేనూ వస్తాను. పక్కవీధిలో ఆంటీ డ్వాక్రా గ్రూపు మెంబరు. నాకు జూట్‌తో వస్తువులు చెయ్యడం నేర్పుతానంది" అంటూ సుమన తయారయ్యింది.

"మరి నేనేం చెయ్యను. ఇప్పటి నుండీ హాస్టల్‌కి వెళితే పిచ్చెక్కుతుంది" చిన్నపిల్లలా ఇద్దరినీ అడిగింది హృది.

"నాతో రావే. నువ్వూ అల్లికలు నేర్చుకుందువు గాని" సుమన పిలిచింది.

"నన్నొదిలెయ్ తల్లీ. నా వల్లకాదు. ఆ దారాలు, ముడులు, మెలికలు"

"నాతో సైబర్ కేఫ్‌కి రా! నీకు



మెయిల్స్ ఏమైనా వచ్చాయేమో చూసుకుందువు గాని. బోలెడు టైమ్ పాస్ గేమ్‌లు కూడా ఉంటాయి" మనస్వి అంది.

"ఇట్స్ మచ్ బెటర్" హృది ఒప్పుకుంది.

ముగ్గురూ బయటికి వచ్చాక రూమ్ తాళం వేసి మనోజ్ గదిలోకి తొంగిచూసి చెప్పింది సుమన. "నువ్వు ఈ నిశ్శబ్ద గుహలో కూర్చోక మమ్మీ డాడీ వచ్చేదాక ఇల్లు చూసుకో"

"ఏయ్ సుమా! ఒక్క చిన్న హెల్పు చెయ్యవే" అడిగాడు మనోజ్.

"ఏమిటో చెప్పు" ఒక అడుగు అన్నగారి గదిలో వేసి నిలబడి అడిగింది. "మన వీధి చివర ఊరకుక్క కుక్కపిల్లల్ని పెట్టింది. వెళ్ళేప్పుడు కాస్త బ్లూక్రాస్‌కి ఫోన్‌చేసి చెప్పి వెళ్ళు" చాలా మామూలుగా చెప్పాడు. అన్నగారు వేళాకోళం ఆడుతున్నాడనే ఉక్రోషంతో "షటప్" అని గట్టిగా అరిచి పకపకా నవ్వుతున్న స్నేహితురాళ్ళతో కలిసి వెళ్ళిపోయింది.

ముగ్గురు హృది స్కూటీపై బయలుదేరారు. నిజంగానే ఆ వీధి చివర చెత్తకుండీ దగ్గర కళ్ళు తెరవని నాలుగు కుక్కపిల్లలు చచ్చిందో బతికిందో తెలియనట్లున్న ఓ ఊరకుక్కను పాలకోసం పీకుతున్నాయి. "మీ అన్నయ్య చెప్పింది నిజమే సుమా! పాపం బ్లూక్రాస్‌కి ఫోన్ చేద్దామా?" వాటిని జాలిగా చూస్తూ అడిగింది మనస్వి.

"అన్నయ్యతో పాటు మీక్కూడా మతిపోయిందా ఏం? వీధికి డజను ఊరకుక్కలున్నాయి. వాటన్నింటి యోగక్షేమాలు విచారించాలంటే మన జీవితం చాలదు" సుమ విసుక్కోవడంతో మనస్వి మౌనంగా ఉండిపోయింది. ఆమె మనసు ఆ కుక్కపిల్లల సమస్యకు మరో పరిష్కారం సూచించింది.

"అన్నయ్యతో పాటు మీక్కూడా మతిపోయిందా ఏం? వీధికి డజను ఊరకుక్కలున్నాయి. వాటన్నింటి యోగక్షేమాలు విచారించాలంటే మన జీవితం చాలదు"

పక్కవీధిలో సుమన దిగిపోయింది.

హృది, మనస్వి ఇద్దరూ సైబర్ కేఫ్‌కి చేరుకున్నారు.

తను తరచుగా వాడుకొనే కంప్యూటర్ పక్కనే హృది కూడా ఛాటింగ్‌కి కూర్చుంది. ముందురోజు చెప్పిన కామర్స్ లెసన్ చూసుకుంటానని చెప్పి ఇనస్ట్రక్టర్‌ని పంపేసింది మనస్వి. కంప్యూటర్ ఆన్ చెయ్యగానే మొదట చేసిన పని కుక్కపిల్లల గురించి బ్లూక్రాస్‌కి ఇన్‌ఫాం చెయ్యడం.

తల్లి సంపాదన తగలెయ్యడమే ప్రధానోద్దేశంగా బతికే సహృదయ సొంత మెయిల్ కూడా ఏర్పాటు చేసుకొంది. తన సీట్లో కూర్చుని మెయిల్ బాక్స్ ఓపెన్ చేసింది. ఎవరో ఓల్డ్ ఫ్రెండ్స్ పంపిన క్రిస్మస్, న్యూఇయర్ శుభాకాంక్షలు, ఇంకా ఏవో వ్యాపారస్తుల ప్రకటనలు, లాటరీలు వంటి వాటితో పాటు ముంబాయి నుండి జానకి కుటుంబమిత్రుడు, ఫ్యామిలీ డాక్టర్ అయిన చటర్జీ ఉత్తరం కనిపించాయి. కాస్త అయిష్టంగానే ఓపెన్ చేసింది.

ప్రియమైన హృదీ బేబీకి,

చటర్జీ అంకుల్ ఆశీస్సులు. ఎలా ఉన్నావు? గత ఏడాది అంతా నువ్వు ముంబాయి రాలేదు. అమ్మ నీ గురించి చాలా దిగులు పడుతోంది. నువ్వు ఫోన్ చేసినా సరిగ్గా మాట్లాడడం లేదట. ఆమె చాలా

## తెలివికి నిదర్శనం

'మా కాలంలో ముసలోళ్ళ దృష్టి కూడా దివ్యంగా ఉండేది. ఈ కాలం పిల్లలు పుడుతూనే కళ్లద్దాలతో పుడుతున్నారు' అని ఎవరైనా ఈసడిస్తే 'అయ్యో' అనుకోకండి. కళ్లద్దాలు తెలివికి చిహ్నం అని అరచి చెప్పండి. ఇటీవలే బ్రిటిష్ మెడికల్ జర్నల్‌లో ప్రచురించిన ఓ వ్యాసం, పసివయసులో కళ్లద్దాలు అవసరం అవటం ఆ పిల్లవాడి పెరిగే తెలివికి నిదర్శనం అని కళ్ళద్దాలు విసిరి మరీ చెప్తుంది. 17000 మంది పిల్లల ఎదుగుదలను పరిశీలించిన తరువాత డాక్టర్లీ నిర్ణయానికి వచ్చారు. 11 ఏళ్ళ వయసు వచ్చేసరికల్లా కళ్లద్దాలున్న పిల్లలు లెక్కల్లో మిగతావారికన్నా ముందున్నారట. ఇతర సబ్జెక్టులు కూడా సులభంగా నేర్చేసుకుంటున్నారట. ఈ పిల్లలే కళ్లద్దాలు లేక ముందు మందకొడిగా ఉండేవారట. కళ్ళద్దాలు రాగానే వారు జీనియస్‌లైపోయి పుస్తకాలు చదివేసి ఆలోచించటం ఆరంభించేస్తున్నారని తేలింది. ఇంకేం... మనమూ కళ్లద్దాలేసేసుకుందామా! ఏ వయసైనా ఏమిటి కళ్లద్దాలే, తెలివికి ద్వారాల 'కీ'లు అనుకుందామా!



కుమిలిపోతోంది. ఆ బాధతో ఈమధ్య పగలు కూడా ఎక్కువగా తాగుతోందని, అందుకు నీ నిర్లక్ష్య ప్రవర్తనే కారణమని నాకు తెలిసింది. బేబీ... నీకున్నది ఆవిడ ఒక్కరే. ప్రవర్తన నచ్చకపోతే ఎదిగిన కూతురిగా బెదిరించో, బతిమాలో మార్చుకోవాలి కానీ మొహం కూడా చూడకుండా నీ ద్వేషాన్ని మాటల్లో, చేతల్లో ప్రదర్శిస్తే ఎలా చెప్పు. అది అమ్మలో తీవ్ర నిరాశకు, జీవితంమీద విరక్తికి కారణమయి జానకిని ఆత్మహత్యకు ప్రేరేపించే ప్రమాదం ఉంది జాగ్రత్త. ఒకసారి ప్రాణం పోతే దేముడు కూడా పొయ్యలేడు జాగ్రత్త. ఒక డాక్టర్‌గా, మీ కుటుంబ శ్రేయోభిలాషిగా ఇది నా హెచ్చరిక. ఉంటాను. శరత్, ఆంటీ నిన్ను అడిగినట్లు చెప్పమన్నారు."

ప్రేమతో

డాక్టర్ ద్వివేద్ చటర్జీ

లెటర్ చదివి కళ్లలో నీటి పొరతో పెదవి నొక్కుకుంటూ ఉండిపోయింది. చాలా బిజీగా ఉండే డాక్టర్ చటర్జీ ప్రత్యేకించి తనకి మెయిల్ పంపారంటే తల్లి పరిస్థితి గురించి ఆయన ఎంత కంగారు పడుతున్నారో అర్థమయ్యింది. కానీ నేనేం చేసినా అమ్మని మార్చుకోవాలనే చేస్తున్నానని మీకెలా చెప్పాలి? తనలో తాను మథనపడుతున్నట్లు అనుకుంది సహృదయ.

ఆమె మొహంలో కదలాడే విషాదాన్ని గమనించి "ఏమయ్యింది? " అడిగింది మనస్వి. "ఛటర్జీ అంకుల్ మెయిల్ పంపారు" చెబుతూ మానిటర్ ఆమె వైపు తిప్పింది. మనస్వి దానిని చదివి హృదికి ఏదో నచ్చచెప్పబోయింది.

కుడిచెయ్యి అడ్డంగా ఎత్తి పట్టుకొని "ప్లీజ్ మనూ! ఇప్పుడే అంకుల్ తిట్టారు. మళ్ళీ నీ ఉపదేశాలు వద్దు. నేనేం ఇదంతా సంతోషంగానో, అమ్మ మీద కక్ష సాధింపుకో చెయ్యడం లేదు. ఆవిడ పడే క్షోభకి రెట్టింపు చిత్రవధ నేనూ అనుభవిస్తున్నాను. కానీ ఏం చెయ్యను. అమ్మ బలం, బలహీనత రెండూ నేనే. అందుకే నేను దూరమైపోతాననే భయంతోనైనా మారుతుందని నా ఆశ. ఇంతకిమించి మరో మార్గం నాకు కనపడడం

లేదు. డాక్టర్ చెప్పినట్లు అమ్మ ఆత్మహత్య చేసుకుంటుందనే భయం నాకు లేదు. ఎందుకంటే నన్నొదిలి వేరే లోకాలకి వెళ్లే ధైర్యం ఆవిడకి లేదు. అదీ నా ధీమా" కళ్ళ నుండి ధారాపాతంగా కారే కన్నీళ్లను రుమాలుతో ఒత్తుకుంటూ విషాదంగా నవ్వింది. ఓదార్పుగా ఆ చేతిని నొక్కింది మనస్వి.

ఆ చేతిని మెల్లగా వదిలించుకొని "ఐయామ్ ఓ.కె. మనూ! అయినా నేనిక్కడికి వచ్చింది బాధల్ని పెంచుకోడానికి కాదు. సరదాగా ఏదైనా టైమ్‌పాస్ ఆటలతో నా బాధల్ని మర్చిపోడానికి వచ్చాను. నీ ప్రోగ్రామింగ్ నువ్వు చూసుకో. నా ఆటలు నేను ఆడుకుంటాను" మానిటర్ మళ్ళీ తన వైపు తిప్పుకుంటూ మామూలుగా ఉన్నట్లు నటిస్తూ అంది.

మనస్వి గాఢంగా నిట్టూర్చి మళ్లీ తన వర్క్‌వైపు దృష్టి మరల్చుకుంది.

ఏవేవో లాటరీ గేమ్స్ లాంటివి ఓ పది నిమిషాలు ఆడి ఒక్కటీ కలిసిరాక ఎయిమ్‌లెస్‌గా సెర్చ్ చేస్తూ ఒక ప్రకటన చూసి చిన్నగా ఈలవేసి "మనూ! ఇది చూడు. ఇంట్రెస్టింగ్‌గా ఉంది. ఆస్ట్రేలియా నుండి జాంటీ మెక్ మిలన్‌ట. 'నా మనసు ఏ తోడు లేక ఒంటరితనంతో తపిస్తోంది. స్నేహ హస్తాన్ని చాపి ఓదార్చే ప్రియ నేస్తాలకి ఇది నా ఆహ్వానం" వర్ణనాత్మకంగా చెప్పింది.

"అయితే ఏమిటి? " తన పని ఆపకుండానే ప్రశ్నించింది మనస్వి.

"ఏముంది. నేనూ సరదాగా ఓదారుస్తాను." కొంటెగా అంది.

తన వర్క్‌ని పాజ్‌లో ఉంచి చివ్వున ఆమెకేసి తిరిగి "పిచ్చి పిచ్చి ఆటలు ఆడకు. ముక్కూ మొహం తెలియని వాళ్లతో ఫ్రెండ్‌షిప్ గేమ్స్ ఆడితే రేపు ఏదైనా సమస్యలు ఎదురైతే అండగా ఉండడానికి మనం పెద్దల అదుపులో పెరిగే వాళ్లం కాదు. వాళ్ళ అధికారంలో, ఆంక్షలలో పెరిగేవాళ్లం" హెచ్చరిస్తున్నట్లుగానే మందలించింది.

"మనూ! నువ్వు మరీ ఆవేశపడుతున్నావు. నేనే నా స్వంత పేరు వివరాలు ఇస్తాననడం లేదు. సరదాగా ఫాల్స్ సమాచారంతో టైమ్ పాస్‌కి ఆడుకుంటాననంటున్నాను" తేలిగ్గా అనేసింది.

మనస్వి అసహనంగా చూసింది. "అదే వద్దంటున్నాను హృదీ! తను ప్రేమగా నాటిన పూలమొక్క తొడిగిన తొలి మొగ్గ ఏ కారణంగానో మొగ్గగానే రాలిపోతే దానిని పదిలంగా దాచుకొని రోజూ చూసి నిట్టూర్చే మనిషి లోకానికి పిచ్చివాడిలా కనిపించవచ్చు. కానీ ఆ మాట అని ఆ వ్యక్తిని కించపరిచే అధికారం ఎవ్వరికీ లేదు. ఎందుకంటే అది అతని పర్సనల్ ఫీలింగ్. ఆ మొక్కతో అతని అనుబంధం మనకి అర్థం కానిది. ఆ వ్యక్తికి అపురూపమైనది కనుక. స్నేహం కూడా అలాంటిదే. నిజాయితీతో కాక కేవలం కాలక్షేపం కోసం ఎదుటివాళ్ళ ఫీలింగ్స్‌తో ఆడుకోవడం దారుణం. నా స్నేహితురాలిగా నువ్వాపని చెయ్యడం నాకు ఇష్టం లేదు" ఖచ్చితంగా అంది.

కొన్ని క్షణాల ఆలోచన అనంతరం హృదికి మనస్వి మాటల్లోని గాఢత అర్థం అయ్యింది. "సరే మనూ! నీకు మాటిస్తున్నాను. తెలిసి నేనుగా ఇకపై ఏ వ్యక్తి మనసుతోనూ, సున్నితమైన భావాలను గాయపరచేలా ప్రవర్తించను" చేతిలో చెయ్యేసి మాట ఇచ్చింది.

సంతోషంగా చూసింది మనస్వి. కానీ అతి తొందరలోనే హృది మాట తప్పబోతోందని అందుకు మనస్వి పరోక్ష కారణంగా మారుతుందని ఆ క్షణాన ఆ మిత్రురాళ్ళు ఊహించ లేదు. ఊహకి అందనిదేగా జీవితం.

మరో పది నిమిషాలు గడిచింది. ఈసారి హృదిని మరో ప్రకటన ఆకర్షించింది. "ఇదేమిటే, మాట్రిమోనియల్ డాట్ కాం అంటాడు. ఇదేం చేస్తుంది"

ఒకసారి ఆమె మానిటర్‌లోకి తొంగిచూసి "మోడరన్ పెళ్ళిళ్ళ పేరయ్య. పెళ్ళి సంబంధాలు చూస్తుంది" నవ్వింది మనస్వి.

"అంటే...!?" అర్థం కానట్లు చూసింది.

"మరీ ఇంత మట్టిబుర్రవేంటే? ఆదివారం పేపర్లో పెళ్ళి పందిరి వేస్తాడు చూస్తావా? ఇదీ అంతే. ప్రపంచం మొత్తం మీద ఇంటర్‌నెట్ లింకింగ్స్ ఉన్న అన్ని ప్రాంతాలలో నమోదు చేయించుకున్న పెళ్ళికొడుకుల వివరాలు, పెళ్ళికూతుళ్ళ సంగతులు ఇందులో ఉంటాయి. అంటే వధూవరుల ఉద్యోగ వివరాలు, కుల గోత్రాలు, ఆస్తిపాస్తులు, చదువు, వయసు, ఉద్యోగం... ఇలా అన్నీ ఉంటాయి. కొందరు ఫొటోస్ కూడా ఫీడ్ చేస్తారు. ఇండియన్స్ వివరాలు తెలుగువాళ్ళ వివరాలతో సహా కులగోత్రాల సహితంగా ఉంటాయి" సవివరంగా చెప్పింది.

"అవునా? అయితే నేనోసారి ప్రయత్నించి చూస్తాను" హృది ఉత్సాహంగా అంది.

"నువ్వా? ఎవరికి?" ఆశ్చర్యంగా అడిగింది మనస్వి.

"ఇంకెవరికి? నాకే. మన సంబంధాలు మనమే వెతుక్కోవాలి కదా! నాకోసం పుట్టిన వాడు ఈ సైబర్ నెట్‌లో ఉన్నాడేమో ప్రయత్నిస్తాను."

ఒక్క క్షణం తెల్లబోయినట్లు చూసి 'గుడ్ లక్' అని ప్రోత్సహించింది మనస్వి.

ప్రకటనలో ఇచ్చిన వివరాల ప్రకారం తెలుగు మాట్రిమోనియల్ తెరిచింది. దేశాల వారీగా, కులాల వారీగా ఎక్కడెక్కడో డాక్టర్లు, ఇంజినీర్లు, పెద్ద కంపెనీల్లో ఉద్యోగాలు చేసే డబ్బున్న తెలుగు వరుళ్ళ వివరాలు స్క్రీన్‌మీద కదిలిపోసాగాయి. కొందరు రకరకాల ఫోజుల్లో ఫొటోలను, మరి కొంతమంది మెడికల్, ఇన్‌కం సర్టిఫికెట్లు, గ్రీన్‌కార్డుల నకళ్ళు కూడా ఫీడ్ చేశారు. ఎంత చూసినా హృదికి ఎవరూ నచ్చలేదు.

"ఇదేమిటే వీళ్ళంతా ఎమ్.సి.ఎలు, ఎమ్.టెక్‌లు చదివి ఆస్ట్రేలియా, అమెరికాలో ఉన్నవాళ్ళ వివరాలు తప్ప ఇండియాలో స్థిరపడ్డ సామాన్య మానవుని వివరాలు ఇవ్వడం లేదు" కాస్త విసుగ్గా అడిగింది.

మనస్వి మానిటర్‌లోకి తొంగిచూసి "నువ్వు విదేశాల్లో స్థిరపడ్డ తెలుగు వాళ్ళ గురించి అడిగావు. ఇండియాలో వాళ్ళు కావాలంటే ప్లేస్ అన్నచోట ఇన్ ఇండియా అని కొట్టాలి" చెప్పింది.

"ఇదేం గోల, ఆ లెక్కన నాకు ఆంధ్రాలోనే కావాలంటే ఇన్ ఎ.పి. అని మళ్ళీ ఫీడ్ చెయ్యాలా...?" చికాకుగా ప్రశ్నించింది.






ఆఫీసులో నిద్రపోతుంటే మీ బాస్ డిస్టర్బ్ చేస్తున్నాడా? కోపం తెచ్చుకోకండి. మీ బాస్ అజ్ఞానాన్ని చూసి జాలిపడి, అతడికి కాస్త మీ జ్ఞానాన్ని పంచండి. హార్వర్డ్ యూనివర్సిటీవారు జరిపిన పరిశోధనల ప్రకారం పగలు నిద్రపోకుండా రోజంతా పనిచేసే వాళ్ల మెదడు చురుకుదనం యాభై శాతం పడిపోతుందని తేలింది. అదే మధ్యాహ్నం ఓ గంట కునుకు తీసి, కలలు కని ఫ్రెష్‌గా పనిలోకి దిగితే వారి పనిలో కూడా ఉదయం నిద్ర లేవగానే పనిలో కనబడే చురుకుదనం కనిపిస్తోంది. గంట కాకుండా అరగంట సేపే నిద్ర పోయినవారు కూడా మంచి చురుకుదనంతో పనిచేసేస్తారని తేలటంతో మధ్యాహ్నం నిద్ర ప్రాధాన్యం అందరికీ అర్థమయింది. ఈ ఫలితాలకు పెద్ద ఎత్తున ప్రచారం కల్పిస్తే అరగంటో, గంటో ఇకనుంచి అఫీషియల్‌గా ఆఫీసులో నిద్రపోవచ్చు ఎవరైనా 'అదేమిటి?' అంటే, నీకు అరగంట మేల్కొని రోజంతా పనిచేయనివాడు కావాలా? అరగంట నిద్రపోయి రోజంతా పనిచేసేవాడు కావాలా? అని నిలదీసి అడగవచ్చు

"అంతేగా మరి!" ప్రింటర్ నుండి తన ప్రోగ్రాం కాగితాలు కట్‌చేసి బ్యాగ్‌లో పెట్టుకుంటూ "నీ కింతకీ ఎలాంటి మొగుడు కావాలేంటి? " అడిగింది.

"మనకి కావల్సిన వ్యక్తుల్ని కూడా తీసుకొస్తుందా ఇది? " అనుమానంగా అడిగింది.

"ఆహా! దివ్యంగా! నన్నడిగితే అదే సుఖం. ఈ వందలాది మందిలో మనకు తగిన వాడు ఎవడా అని తల బద్దలు కొట్టుకోవడం కన్నా మనం ఇచ్చే వివరాలకు తగ్గవాళ్ళని ఓ పదిమందినో, ఇరవై మందినో అదే సూచిస్తుంది. అందులోంచి నచ్చిన వాళ్ళని ఎన్నుకోవచ్చు" వివరించింది.

"నిజంగానా! ఛ అనవసరంగా ఈ చెత్త అంతా వెదుకుతూ టైమ్ వృధా చేసుకున్నాను" అంటూ మను సూచించిన విధంగా అప్లికేషన్ కోరింది. అరవై సెకండ్లలో మేట్రిమోనియల్ కంపెనీ శుభాకాంక్షలతో, వాళ్ళ ద్వారా వరుడిని ఎన్నుకోదలచినందుకు అభినందనలతో, వాళ్ళ సంస్థ సాధించిన విజయాలు ప్రకటిస్తూ- ఆఖరికి ఒక అప్లికేషన్ నమూనా తెరమీదకి వచ్చింది. దానిని పూర్తి చెయ్యడానికి మనస్వి సహకరించింది. పేరు, ఎత్తు, పొడవు అన్నీ తనవే ఇచ్చింది.

"హృది! నిజంగానే సంబంధం వెతుక్కొంటోందా? " మనస్వి కాస్త సందేహపడింది కానీ మరుక్షణమే ఆమె అనుమానం తీరిపోయింది.

చదువు- పదో తరగతి ఫెయిల్, ఆస్తిపాస్తులు- లేవు, తల్లి తండ్రుల వివరాలు- అనాథ, అని ఇచ్చింది. హాబీలు కింద కర్ణాటక సంగీతం, కవిత్వం రాయడమని చెప్పింది. అప్పటికే మనస్వికి నవ్వు ఉబికి వస్తోంది. తనకి కావలసిన వరుడు సరిగ్గా పాతికేళ్ళవాడై ఆంధ్రప్రదేశ్‌లోని గొడ్డు పల్లెటూరిలో ఉంటూ అదే ఊరి ఎలిమెంట్రీ స్కూలులో డ్రిల్లు మాస్టరై ఉండాలి. అతను ఆ ఊళ్ళో కనీసం పాతికేళ్ళ నుంచైనా ఉంటూ ఇంట్లో ఆవులు, గేదెలు, కోళ్ళు వంటి పశుసంపదతో పాటు ఖళ్ళు ఖళ్ళుమని దగ్గే ముసలి తల్లి, కళ్ళకి చెయ్యి అడ్డు పెట్టుకొని చూసే ముసలి తండ్రి ఉండాలి. అన్నదమ్ములు,

అక్కచెల్లెళ్ళు లేని ఒంటిరి ప్రాణై ఉండాలని ఫీడ్ చేసింది. చదువుతున్న మనస్వి పొట్టప ట్టుకొని నవ్వసాగింది. హృది మాత్రం చిరున వ్వుతో మాట్రీమోనియల్ జవాబుకోసం ఆత్రంగా ఎదురు చూడసాగింది. కొన్ని నిమి షాల అనంతరం స్క్రీన్‌మీద "సారీ మేడమ్! మీరు కోరిన వివరాలతో ఉన్న వరుడు ప్రస్తుతం మాకు అందుబాటులో లేరని తెలి యజేయడానికి చింతిస్తున్నాం. మీ ప్రకటన మా ఏజెంట్లకు అందజేసి మీరు కోరిన వరు డిని మీకు కలుపుతాం కృతజ్ఞతలు" అన్న మేటర్ ఇంగ్లీషులో మెరవ సాగింది.

అది చూశాక తనూ మనస్వితో శృతి కలిపి నవ్వసాగింది హృది. నవ్వి నవ్వి ఇద్దరికి కళ్ళలో నీళ్ళు వచ్చాయి. రుమాలుతో కళ్ళు వొత్తుకుంటూ "చేసిన ఘనకార్యం చాలు ఇక పద" సిస్టమ్ ఆఫ్ చేసి హృది చెయ్యి పట్టి ఇంటర్‌నెట్ వాడుకొన్నందుకు డబ్బులు చెల్లించి బయటకి నడిచింది మనస్వి.

"ఆ మాట్రిమోనియల్‌తో అలా ఆడుకోవా లని నీకెందుకు అనిపించింది. నేనైతే మొదట నువ్వు నిజంగానే పెళ్ళికొడుకు కోసం వెతుకున్నావనుకొన్నాను" స్కూటీ దగ్గరకి నడుస్తూ అంది.

"ఊరుకోవే. నా బతుకు నేను భరించడా నికే భారంగా ఉంది. మరొక అమాయకపు ప్రాణిని కట్టుకొని వాడి జీవితాన్ని నాశనం చేసే కోరిక నాకు లేదు. కాకపోతే ఈ ఇంట ర్‌నెట్ మేరేజ్ సర్వీసులు నాకు అంతగా నచ్చలేదు. వీళ్ళెంతసేపూ డాక్టర్లు, ఇంజినీర్లు, ఎగ్జిక్యూటివ్స్ అంటూ విదేశాల్లో ఉన్నతస్థా యిలో ఉండే వివరాలు మాత్రమే ఇస్తూ ఆడ పిల్లల్లో లేనిపోని ఆశలు రేపుతున్నారు. మనకి అందుబాటులో, నిజానిజాలు ఆరాతీసి తెలుసుకోగలిగేలా అన్ని స్థాయిలకు చెందిన వివరాలు ఇవ్వాలి కానీ, చూపుకి, మాటకి అందనంత దూరాన ఉన్న వ్యక్తుల వివరాలు ఇస్తే అవి సరైనవో కాదో, ఆ వ్యక్తి ఎలాంటి వాడో తెలుసుకోవడం ఎలా సాధ్యం?" ప్రశ్నించింది.

కొద్దిసేపు ఆలోచించి పెదవి విరిచింది మనస్వి. "కంప్యూటర్ మ్యారేజ్ బ్యూరోలు తప్పని కూడా అనలేం. ఒకనాటి మన పేర య్యలు నిన్నటి వివాహవేదిక సంస్థలు, నేటి ఈ కంప్యూటర్ బ్యూరోలు ఏవైనా అన్నిరకాల వివరాలు ఇస్తున్నాయి. అందులో మనకి నచ్చినదే ఎన్నుకుంటున్నాం. వాటిలో నిజాని జాలెంత అనే దానికి పూర్తి బాధ్యత ఆడపిల్లల తల్లితండ్రులదే. ఎందుకంటే అందని ఆశల కోసం, గొప్ప సంబంధాలంటూ పరుగులు పెట్టి తొందరపడి మోసపోయినా, పిల్ల దూరమై వేదన పడినా అది మన వ్యక్తిగత పొరపాటు అవుతుంది" మనస్వి తన అభి ప్రాయం చెప్పింది.

"మనూ! నీ మాటల్లో నిజముంది" ఒప్పు కుంది హృది. మనూని బస్టాప్‌లో దింపి తను హాస్టల్‌కేసి సాగిపోయింది.




"అప్పుడే తొమ్మిది అవుతోంది. చచ్చీ చెడి చేసినవన్నీ చల్లారి చస్తున్నాయి. ఒక్కళ్ళు కూడా తినడానికి రాలేదు. ఏమర్రా! తిండి తినే ఉద్దేశం లేదా?" మేడమెట్ల దగ్గర నిల బడి పైకి చూస్తూ అరిచింది యశోద.

"పైనుండి సమాధానం రాలేదు కానీ, హాల్లో టి.వి. చూస్తున్న నందనరావు "పిల్లలు ఏదో పనిలో ఉన్నట్లున్నారు. నీకు ఆకలి వేస్తే నువు తినేయ్" సలహా ఇచ్చాడు.

"అవును మరి. నేను తినేయడానికే పగ లంతా ఆఫీసులో చచ్చి కొట్టుకువచ్చి మళ్ళీ వేడిగా వండి వారుస్తున్నాను. పిల్లల సంగతి

సరే. తమరేం రాచకార్యాలు వెలగబెడుతున్నారు. తినడానికి రావచ్చుగా!" ఆవిడ గాలి భర్త పైకి మళ్ళింది.

"వార్తలు అవ్వనీ వస్తాను" టి.వి. నుండి దృష్టి మరల్చకుండా బదులిచ్చాడు.

విసురుగా వెళ్ళి సెట్ పైన స్విచ్ ఆఫ్ చేసి "ఒక్కపూట చూడకపోతే కొంపలు మునిగిపోవు. లక్ష ఛానెల్స్ వచ్చాయి. ఎప్పుడు పెట్టినా తెలుస్తాయి వార్తలు. ముందు తినడానికి పదండి" నందనరావు ఫీలింగ్స్‌తో పని లేనట్లు అంటూ డైనింగ్ హాల్లోకి నడిచింది.

తినే యోగం మీ పుణ్యాన నాకు లేకుండాపోయింది" గొంతు పూడుకుపోతుండగా కళ్ళు ఒత్తుకుంటూ అంది.

భార్య మాటలు అటు తిరిగి ఇటు తిరిగి తన డ్రింకింగ్ అలవాటు మీదకి మళ్ళుతున్నట్లు గమనించి తగ్గిపోయాడు నందనరావు. పై మెట్టు దగ్గర నిలబడి కింద తల్లితండ్రుల వాదన వింటున్న మనోజ్ "వీళ్ళు మారరు" అనుకుంటూ సుమన గదిలోకి వెళ్ళాడు.

టేప్‌లో సోనూనిగమ్ పాటలు వింటూ ఏదో లేసుని సీరియస్‌గా ముడులు వేస్తోంది.



"ఛీ... ఛీ... చదువుకున్నావన్న పేరే కానీ జనరల్ నాలెడ్జిపట్ల ఆసక్తి, లోకజ్ఞానం బొత్తిగా శూన్యమైపోతున్నాయి" రిమోట్ సోఫాలో పారేసి విసురుగా లేస్తూ విసుక్కొన్నాడు.

"అవును, మిమ్మల్ని కట్టుకున్నాకే అవన్నీ నాలో లోపించాయి. త్వరగా రెండు ముద్దలు మింగి మనం గదిలోకి వెళితే పిల్లలు తినడానికి వస్తారు. పిల్లలతో కలిసి సంతోషంగా

అన్నగారిని గమనించి అంతవరకు అల్లిన దాన్ని చూపిస్తూ "సాయంత్రం ప్రక్కవీధిలో రమా ఆంటీ దగ్గర నేర్చుకున్నాను. బాగుందా?" అడిగింది. మనోజ్ చెల్లెలి మాట పట్టించుకోలేదు. "అమ్మ భోజనానికి పిలిచింది" టేప్ ఆఫ్ చేసి మంచం చివర కూర్చుంటూ చెప్పాడు.

"విన్నాను. వాళ్ళ యుద్ధం అవ్వనీ. అప్పుడు తిందాం" నిర్లక్ష్యంగా అంది. కాళ్ళు

కింద వేలాడేసి మంచం మీద వెల్లకిలా తల కింద చేతులుంచుకొని పడుకుంటూ గుర్తొచ్చి నట్లు అడిగాడు. "బ్లూ క్రాస్‌కి ఫోన్ చేశావా...?"

చురుక్కు మన్నట్లు చూసి "నాకలాంటి వెర్రిమొర్రి దురదలు లేవు" చిరాకుపడింది. గభాలున లేచాడు మనోజ్. "ఇడియట్. అసలే చలికాలం. పాపం పసికూనలు చచ్చి పోవూ? ఈ ఇంటి వాతావరణం వంటపట్టి నీలో సున్నితత్వం పూర్తిగా చచ్చిపోయింది" విసుక్కొంటూ వెళ్ళి బ్లూ క్రాస్‌కి ఫోన్ చేసి విషయం చెప్పాడు. అటు వైపునుండి 'ఆ ప్రాంతంలోని కుక్కపిల్లల గురించి మాకు సాయంత్రమే ఈ-మెయిల్ వచ్చింది సార్. ఆ కుక్కల్ని తీసుకొచ్చేశాం కూడా" సమాధానం వచ్చింది. 'థాంక్స్' చెప్పి ఫోన్ పెట్టేసి "ఎవరో సాయంత్రమే ఈ-మెయిల్ చేశారుట. వాటిని తీసుకెళ్ళారుట" చెల్లెలి దగ్గరకి వస్తూ చెప్పాడు.

"ఈవినింగ్ ఈ-మెయిల్ చేశారా...? నాకు తెలిసి మన వీధిలో అంత జాలిగుండె కలవాళ్ళు ఎవరూ లేరు. బహుశా మనస్వి చేసి ఉంటుంది. ఇందాక మేము వెళ్ళేప్పుడు వాటిని చూసినపుడే బ్లూక్రాస్‌కి ఫోన్ చేద్దాం అంది. నేనే వద్దన్నాను" సుమన సాలోచ నగా అంది.

మనోజ్ కళ్ళు ముడుచుకున్నాయి. తొలి సారి మనస్విని గమనించినట్లు "మనస్వి అంటే... పెద్దపెద్ద కళ్ళతో ఎక్కువగా చుడి దార్స్ వేసుకుంటుంది. ఆ అమ్మాయే కదూ!" సందేహంగా అడిగాడు.

"ఆc! ఆ అమ్మాయే. అయినా మొదటి సారి చూసినట్లు అడుగుతావేం. మనస్వి మన ఇంటికి చాలాసార్లు వచ్చిందిగా" విచి త్రంగా చూస్తూ అడిగింది. మనోజ్ బదు లుగా నవ్వేశాడు. కింద గొడవ సద్దుమణిగి నట్లు అనిపించి "పద భోజనం చేద్దాం" అంటూ బయటకి నడిచాడు.

అల్లుతున్న లేసుని ప్రక్కన పెట్టి గదిలో లైట్లు ఆర్పి అన్నగారిని అనుసరించింది మనస్వి.

* * *

మనస్వి ఇంటికి చేరేసరికి సుభద్ర గేటు దగ్గరే కాసుకుని ఉంది. కూతుర్ని చూస్తూనే రుసరుసలాడుతూ "నిన్న తొమ్మిదికి వచ్చావు. ఈవాళ ఎనిమిదిన్నరకి, రేపు ఏ పన్నెండింటికొస్తావో? ఉదయం వెళ్ళడం మాత్రం టంచన్‌గా ఎనిమిదికల్లా వెళ్ళిపో తావు. వచ్చేపుడు మాత్రం టైము ఉండదు" సాధిస్తున్నట్లు అంది.

శీతాకాలపు మంచుకు జడిసి అంతా ఇళ్ళలో ఉండడంవల్ల ఎవరూ ఆ మాటలు విననందుకు సంతోషిస్తూ లోనికి నడుస్తూ "బస్సులు మన ఇష్టప్రకారం రావు. అవి రోజూ ఒకే టైమ్‌కి వచ్చినపుడు నేనూ వస్తాను".

సుభద్ర ఆ మాత్రానికే తగ్గేరకం కాదు. "అన్నింటికీ ఏదో కారణం సిద్ధంగా ఉంటుంది. ఉదయం వీధి చివర నిలబడి పక్కింటి మాలతి కూతురు రశ్మితో నడిరోడ్డు మీద అంతసేపు మంతనాలేమిటి?" అను మానంగా ప్రశ్నించింది. తల్లి దేని గురించి అడుగుతోందో కొన్ని క్షణాలు అర్థం కాలేదు. ఆపైన గుర్తొచ్చి కాస్త విసుగ్గా చెప్పింది. "నీ డ్రస్ బాగుంది అక్కా. ఎక్కడ కొన్నావు అని అడిగితే, నాకు తెలియదు. మా అమ్మ కొని తెచ్చిందని చెప్పాను. అంతే. ఆ పిల్ల నాకు పరిచయమేలేదు. ఇంక మాటలేం ఉంటాయి?"

"అంతేనా...! లేక ఆ పిల్ల రాయబారాలే మైనా నడుపుతోందా?"

'రాయబారాలేమిటి?" అయోమయంగా చూసింది.

"రశ్మి అన్నగారు మొన్ననే మిలట్రీ నుండి సెలవులకని వచ్చాడు. రోజూ వాడు నువ్వొచ్చేపుడు, వెళ్ళేపుడు తినేసేలా చూడడం నేను గమనించాను. చెల్లెలి ద్వారా నీకు ప్రేమ రాయబారాలు పంపుతున్నాడేమోనని అను

మానంగా ఉంది"

సుభద్ర మాటలకి తల గిర్రున తిరిగినట్లయ్యింది. "అమ్మా! ఏం మాట్లాడుతున్నావు? నువ్వు చెప్పేదాకా ఆ అమ్మాయి పేరు రశ్మి అని, ఆమెకో అన్నగారు ఉన్నాడని నాకే తెలియదు. ఒక్కసారి నీ కూతుర్ని చూసినంతమాత్రాన నీ ఇష్టమొచ్చినట్లు ఊహించేసుకోవడమేనా? " అరిచినట్లు అడిగింది.

సుభద్ర ఏ మాత్రం కూతురి ఆగ్రహం లెక్కచేయలేదు. "చిన్న పిల్లవి నీకేం తెలుసు మగాడి నైజం. వయసులో ఉన్న అందమైన అమ్మాయిని చూస్తే తొంభైతొమ్మిది ఉచ్చులు పన్నుతారు"

తల్లితో వాదించడం వ్యర్థమనిపించి మౌనంగా తన గదికేసి నడిచింది.

"త్వరగా స్నానం చేసిరా! భోజనం చేద్దువుగాని"

"ఇంకా డాడీ రాలేదుగా! వచ్చాక తింటాను."

"మీ డాడీకి మీటింగ్ ఉందట. పది దాటితేనే కానీ రానని ఫోన్ చేశారు. అప్పటి దాకా నువ్వూ తినకుండా ఉంటావా? " బ్యాగ్‌లోంచి బాక్స్ తీస్తూ అడిగింది.

"ఉంటాను" అనబోయి తనకా అవకాశం లేదని గుర్తొచ్చి "పెట్టు వస్తున్నాను" అంటూ వెళ్లిపోయింది.

తనకి అస్సలు ఇష్టం లేకపోయినా ఎక్కువ పోషకాలుంటాయని తల్లి తరుచుగా చేసే కాకరకాయ కూరను బలవంతంగా తింటున్న మనస్వికి "రేపు కంప్యూటర్ క్లాసుకి వెళ్లకుండా కాలేజి అవ్వగానే తిన్నగా ఇంటికి వచ్చేయ్" అని ఆర్డర్ వేసింది సుభద్ర.

ఎప్పుడూ లేనిది కంప్యూటర్‌కి వెళ్లడం మానేయమనడంతో "ఎందుకూ? " ఆశ్చర్యంగా అడిగింది.

"మర్చిపోయావా? ముప్పై ఒకటిన నీ పుట్టినరోజు. బట్టలు కొనాలి. ఈ రోజు అప్పుడే ఇరవైఏడు. రేపు నువ్వు త్వరగా వస్తే మనం ముగ్గురం వెళ్లి నీ బట్టలవీ కొనుక్కొని వద్దాం"

"నేనెందుకమ్మా? నువ్వు, డాడీ వెళ్లి తెచ్చేయండి. మీరేంతెచ్చినా నాకు నచ్చుతాయి" తల్లిని సంతోషపెట్టాలని అంది.

సుభద్ర సంతోషించలేదు. పైగా "ఏం మాతో రావడానికి కూడా తీరిక దొరకనంత స్నేహాలు పెరిగాయా? " సందేహంగా చూసింది.

ముద్ద గొంతుకు అడ్డుపడినట్లు తుళ్లిపడింది మనస్వి. తల్లి నాలికకు రెండువైపులా పదునుందని గ్రహించింది. అందుకే "వస్తాను" అనబోయి ఆఖరి క్షణంలో సుధా మేడమ్‌తో అపాయింట్‌మెంట్ గుర్తొచ్చి తమాయించుకొని. "అదేం లేదమ్మా! ఈ మూడునెల్ల కోర్సు మీద రేపు పరీక్ష పెడతానన్నారు. క్లాసులైతే మానేసినా ఫరవాలేదు. టెస్టు మానేయడమెందుకని మిమ్మల్ని వెళ్లి తెచ్చెయ్యమన్నాను. నీ ఇష్టం. నువ్వు మానేయమంటే మానేస్తాను."

నాకేం అభ్యంతరం లేదన్నట్లు మొహం పెట్టి చెప్పింది. గ్లాసులోని మంచినీళ్లు తాగుతూ తల్లి మొహంలో మారే రంగులను, భావాలను

మర్చిపోయావా? ముప్పై ఒకటిన నీ పుట్టినరోజు. బట్టలు కొనాలి. ఈ రోజు అప్పుడే ఇరవైఏడు. రేపు నువ్వు త్వరగా వస్తే మనం ముగ్గురం వెళ్లి నీ బట్టలవీ కొనుక్కొని వద్దాం

గమనిస్తూ సమాధానం కోసం ఆత్రంగా వేచి చూడసాగింది. ఆమె ఊహించినట్లే టెస్ట్ మానడం అనేసరికి సుభద్ర ఆలోచనలో పడింది.

"పోనీ! వద్దులే. ఎల్లుండి వెళదాం" పర్మి షన్ ఇచ్చేసింది. సమయానికి తనకి అంత మంచి ఐడియా తట్టినందుకు తన తెలివికి తనే మురిసిపోతూ పైకి మాత్రం చెయ్యి కడు క్కొని "నేను వెళ్ళి చదువుకుంటానమ్మా" అంటూ తన గదిలోకి జారుకుంది మనస్వి.

* * *

సహృదయ రూమ్‌లోకి వచ్చి నీలిరంగు బెడ్ లాంప్ వేసి తలుపులు మూసేసుకుంది. ఆమె గదిలో ఖరీదైన షో బల్బులు, ట్యూబ్ లైట్లు ఉన్నా ఆమెకి వెలుగంటే ద్వేషం. ఏదో తెలియని భయం. అందుకే ఎంతో అవసర మైతే తప్ప ట్యూబ్‌లైట్ వేసుకోదు. ఆ మసక వెలుతురులోనే తన పనులు పూర్తి చేసుకుం టుంది. చదువు అనేది ఒకసాకు మాత్రమే కావడంతో ఈ రోజు నోట్స్ పూర్తిచెయ్యాలి. రేపు పరీక్ష ఉంది బాగా చదవాలి అనే తాప త్రయం ఏవీ ఆమెకు లేవు. ఆమె గదిలో రోడ్డువైపు ఉండే కిటికీలో కూర్చుని దారిని పోయే, నవ్వుతూ, తుళ్ళుతూ తిరిగే తన ఈడు వాళ్లని చూస్తూ తనకే అగమ్యగోచ రంగా ఉండే తన భవిష్యత్తు ఏమిటో ఆలో చిస్తూ గంటలు, గంటలు గడిపేసి ఏ నడి ఝామునో వచ్చి నిద్రకోసం మంచంమీద వాలిపోతుంది.

మొహం కడుక్కొని నైటీ వేసుకుని కూజా లోని నీళ్ల గ్లాసులోకి ఒంపుకుని వెళ్ళి కిటికీలో కూర్చుంది. చాలాసేపు దానిని చేతుల మధ్య కవ్వంలా కదుపుతూ అలాగే ఉండిపోయింది.

ఆమె మనసులో బాధ తెరలు తెరలుగా ఎగిసిపడుతోంది. ఎందుకో గుండె పిండేసి నట్లుగా ఉంది. డాక్టర్ చటర్జీ పంపిన ఈ మెయిల్ గుర్తొచ్చింది. బాధ రెట్టింపయ్యింది. తల్లి చూస్తే అలా... ఆమెను ఎలా మార్చుకో వాలో తెలియక తనిలా... ఏదో నిస్సత్తువ కమ్మేసింది. ఏడవాలని ఉంది కానీ ఏడుపు రావటం లేదు. ఎక్కడికైనా పారిపోవాలని ఉంది... కానీ ఎక్కడికో తెలియని అయోమ యం. ఎవరికీ చెప్పుకోలేని ఆవేదన గుండెలో ఇమడలేక... బయటకు వెళ్ళగక్కుకోలేక... చాలాసేపు అలాగే కూర్చుండిపోయింది. ఎప్ప టికో ఆ నిస్సత్తువతోనే లేచి వచ్చి మంచం మీద వాలిపోయింది.




సమయం సాయంత్రం ఆరుగంటలు కావొ స్తోంది. సికింద్రాబాద్ స్టేషన్‌కి దగ్గరగా ఉన్న ఆ ఐదంతస్తుల బిల్డింగ్ పరిసర ప్రాంతాలన్నీ ఆఫీసుల నుండి, వివిధ వృత్తులు, వ్యాపారాల విధుల నుండి ఇళ్లకి వెళ్తున్న వ్యక్తులతో బడుల నుండి ఇంటికి మరలుతున్న పిల్లలతో, వాళ్లని వారి గమ్యాలకు చేరవేసేందుకు హడా విడిగా తిరుగుతున్న వాహనాలతో గందరగో ళంగా ఉంది. కానీ మూడో అంతస్తు చివర నున్న "సుధా సైకాలజీ కన్‌సెల్‌టెన్సీ"లోని ఎయిర్‌టైట్ ఎ.సి. రూమ్ మాత్రం నిశ్శబ్దంగా, గంభీరంగా ఎవరి మాటలో వినడానికి ఆస క్తిగా ఎదురు చూస్తున్నట్లు ఉంది. ఆ గాంభీ ర్యాన్ని చీలుస్తూ సుధ గొంతు వినిపించింది. "చెప్పండమ్మా!"

"సుమా! ముందు నువ్వు చెప్పు" ప్రక్క నున్న సుమనని మోచేత్తో పొడిచింది మనస్వి. "నేనా? ఊహూ! నువ్వు చెప్పు హృదీ!" సహృదయ చెవిలో గొణిగింది సుమన. హృ ది ఇబ్బందిగా కదిలి "మనూ! నువ్వే చెప్పు!" మళ్లీ మనస్విపైకి నెట్టేసింది బాధ్యత.



వాళ్ల ముగ్గురూ స్కూల్లో పిల్లల్లా వాదులాడుకోవడం సుధకి నవ్వు తెప్పించింది. కానీ మనసు పొరల్లో గుట్టుగా దాచుకున్న భావాలను పరాయి వ్యక్తి ముందు వెలికితీయడం సులభం కాదని ఒక సైకాలజిస్టుగా ఆమెకు తెలుసు. అందుకే "మీ సమస్య నాకు అర్థమయింది. కానీ నేను మీ టీచర్‌ని కాదు. మీరేం చెప్పినా తప్పులు ఎంచి దండించడానికి. అలాగే నేను మీకు పరాయి వ్యక్తిని. ఈమెతో మన స్వవిషయాలు ఎలా చెప్పాలని భయపడినంతసేపు నిజాయితీగా మీ సమస్యను మీరు స్వేచ్ఛగా వివరించలేరు. ఒక వైద్యుడి దగ్గర రోగి, లాయర్ దగ్గర క్లయింట్ ఎంత నిజాయితీగా ఉంటారో మీరు నా దగ్గర అలా ఉండగలగాలి. అప్పుడే మీ సమస్యల్ని గురించి మనం సమగ్రంగా చర్చించి సరైన పరిష్కారం వెతకగలం. మరో విషయం. నాకు చెప్పడంవల్ల మీ స్వవిషయాలు బయటికి పొక్కి జీవితం అల్లరి అవుతుందేమోనని భయం కూడా మీకు అనవసరం. ఎందుకంటే నా క్లయింట్స్ రహస్యాలను జాగ్రత్తగా కాపాడుకోవడం అనేది నా వృత్తి ధర్మం, బాధ్యత. ఇకపోతే మీ ముగ్గురు కలిసే అపాయింట్‌మెంట్ తీసుకున్నారు కనుక సమస్య మీ ఉమ్మడిదని లేదా మీ ముగ్గురి మధ్య ఒకరి సమస్యల పట్ల మరొకరికి అవగాహన, సానుభూతి ఉన్నాయని నేను అనుకుంటున్నాను. ఇక మొదలుపెడదామా?" మృదువైన స్వరంతో బుజ్జగింపుగా అడిగింది.

సుధ మాటల్లోని వాస్తవం ముగ్గురిని ఆకర్షించింది. వాళ్లలోని భయం, బెరుకు మెల్లగా తగ్గుముఖం పట్టాయి. ముగ్గురు స్నేహితురాళ్లు తమని తాము పరిచయం చేసుకున్నారు. "మిమ్మల్ని కలవడం చాలా సంతోషంగా ఉంది. మరి, విషయానికి వద్దామా" ఒక ఫైల్ లాంటిది తెరచి వాళ్లు చెప్పిన వివరాలు అందులో నోట్ చేసుకుంటూ అడిగింది సుధ.

ముందు మనస్వి మొదలుపెట్టింది. "మేడమ్ నిజానికి మావి సైకాలజిస్ట్‌ని కలిసేంత తీవ్రమైన సమస్యలు అవునో కాదో మాకు తెలియదు. మావి ఆర్థిక సమస్యలు కావు. ముగ్గురి కుటుంబ స్థితిగతులు మధ్యతరగతికి ఒక మెట్టుపైనే ఉన్నాయి. అలాగే చదువువల్ల వచ్చిన ఇబ్బందులు లేవు. మేమేదో డాక్టరేట్లనో, గోల్డు మెడల్స్‌నో సాధించాలనే కోరిక

మాకూ, మా కన్నవాళ్లకి కూడా లేదు. నావరకు మా అమ్మ డిగ్రీకి కంప్యూటర్ కూడా అదనపు అర్హత అయితే విదేశీ వరుళ్లు వెతుక్కుంటూ వస్తారనే ఆశతో చదివిస్తోంది" చెప్పి నవ్వింది. మిగిలిన ముగ్గురూ ఆమెతో శృతి కలిపారు.

"ఇకపోతే మీరు చెప్పిన మరో ముఖ్య సమస్య ప్రేమ వ్యవహారాల వల్ల తలెత్తే ఇబ్బందులు. మా కుటుంబ నేపథ్యాలు కానీ, మరో మనిషిని మా జీవితాల్లోకి రానివ్వలేని పిరికితనం కానీ, అసలు ప్రేమ జోలికే మమ్మల్ని వెళ్ళనివ్వలేదు"

"అంటే? ఎవ్వరూ మిమ్మల్ని ప్రపోజ్ చెయ్యలేదా? " సుధ సందేహంగా అడిగింది. ఫకాల్న నవ్వారు ముగ్గురూ! "అదేం లేదు మేడమ్. రోజూ బస్టాప్ మొదలు కాలేజి గేటు దాకా కనీసం అరడజను మందైనా చేతిలో పువ్వునో, ప్రేమలేఖనో పట్టుకొని వెంటపడతారు. ఒకడైతే ముగ్గురికి కలిపి ఉమ్మడిగా రాసేశాడు. మీలో ఎవరు నా ప్రేమను అంగీకరించినా ఫరవాలేదు అంటూ!" సుమన నవ్వింది.

"మూడేళ్ళుగా కిశోర్ అనే కుర్రాడు నా హాస్టల్ దగ్గర ఉదయం, సాయంత్రం రకరకాల వేషాలతో నన్ను ఆకట్టుకోవాలని అవస్థ పడుతున్నాడు" హృది చెప్పింది.

"కనుక మీరు అంగీకరించని కారణాలేవైనా మొత్తానికి మీకు ప్రేమ, దాని తలనొప్పులు లేవని నాకర్థమయ్యింది. సరే, మీకున్న సమస్య ఏమిటో ఎవరితోనో చెప్పగలరా? " సుధ తిన్నగా విషయానికి వచ్చింది.

మనస్వి కాస్త ముందుకు జరిగి "సమస్య అంటే, నేను ఎదుర్కొనే పరిస్థితులు నా మీద కలిగించే మానసిక వత్తిడిని మీకు చెబుతాను. అది సమస్య అవునో కాదో మీరే నిర్ణయించండి" అని ఆగి "మా అమ్మా నాన్నలకు నేను ఒక్కర్తినే బిడ్డను. నాకు ఊహ తెలిసిన దగ్గర నుండి నాన్న దగ్గర చేరికగాకన్నా, అమ్మ అదుపులోనే పెరిగాను. ఆ అదుపు నాతో పాటే పెరిగి ఇప్పుడు అమ్మ మాట శాసనం, చూపిన బాటే నా జీవనం సాగాలి అనేంతటి ఆంక్షలుగా మారింది. వయసు, వ్యక్తిత్వం ఎదిగిన మనిషిగా నాపై అమ్మ అజమాయిషీ భరించలేనిదిగా అనిపిస్తోంది".

"మనస్వీ, కాస్త మీ అమ్మగారి దృష్టితో కూడా ఆలోచించి చూడు. అడుగడుగునా ఎన్నో మోసాలు, దారుణాలు, అత్యాచారాలు జరిగే లోకంలో ఒక కన్నతల్లిగా తన కూతుర్ని పదిలంగా పెంచుకోవడంలో తప్పు లేదుగా!" నచ్చచెబుతున్నట్లుగా అంది.

మనస్వి ఆవిడ మాటల్ని అంగీకరిస్తున్నట్లు తల ఊపింది. "నిజమే మేడమ్! తల్లి కూతుర్ని సంరక్షించుకోవాలనుకోవడంలో ఏ తప్పు లేదు. కానీ అరగంట ఆలస్యమైతే కించపరుస్తూ మాట్లాడడం, నాకంటూ స్నేహితులు ఉండకూడదని శాసించడం, బంధువులను కనీసం పరిచయస్తులుగా కూడా తెలియనంత దూరంగా ఉంచడం, కన్నతండ్రిని సైతం పరాయి వ్యక్తిలాగే ఎడంగా ఉంచడం ఇవన్నీ అవసరమంటారా? " సూటిగా అడిగింది.

"నాకర్థం కాలేదు? " సుధ పెదవి విరిచింది.

"మేడమ్ ఉదయం ఎనిమిదికల్లా నేను కాలేజీకి బయలుదేరుతాను. తాగే బూస్ట్, వాడే పేస్ట్, వేసుకొనే దుస్తులు అన్నీ అమ్మ ఇష్టాలే. నెలకి బస్‌పాస్, రోజుకి ఇరవై రూపాయల పాకెట్ మనీ ఇస్తుంది. ఇప్పుడు సెల్ ఫోన్స్ వచ్చాయి కనుక నాన్న నెలకోసారి సిమ్‌కార్డ్ వేయించి ఇస్తున్నారు. లేకపోతే కాలేజీకి వెళ్ళాకా, ఇంటికి వచ్చేముందు వెతుక్కుంటూ వెళ్ళి మరీ ఇంటికి ఫోన్ చెయ్యాల్సి వచ్చేది. ఏ వంకతో ఎక్కడ తిరిగినా ఎనిమిది, ఎనిమిదిన్నర టైముకి ఇంటికి చేరాలి. నా ఆకలితో ప్రమేయం లేదు. అమ్మ పెట్టింది తిని పదింటికల్లా నిద్ర వచ్చినా, రాకపోయినా పక్కమీద చేరిపోవాలి. శెలవు రోజుల్లో కూడా ఈ విధానంలో మార్పుండదు. కాకపోతే ఎదురుగా ఉంటే ఏదో ఒకటి

సాధిస్తుందని ఎక్కువ శాతం నా గదిలోనే గడిపేస్తాను" తన దినచర్య చెప్పింది. "నీకు స్నేహితులే ఉండకూడదు అన్నప్పుడు వీళ్ళిద్దరితో స్నేహం ఎలా కుదిరింది? " హృదీ, సుమనలను చూపుతూ అడిగింది సుధ.

మనూ పెదాలపై చిరునవ్వు కదిలింది. "అదీ మా పుణ్యమే మేడమ్" నా చిన్నప్పుడు నేను అమ్మ మాట కాదని మారాం చేస్తే హాస్టల్లో వేస్తానని బెదిరించింది. ఒకసారి నేను మరీ మొండికేయడంతో నిజంగా చేర్పించేసింది. అక్కడ రూమ్‌మేట్స్‌గా వీళ్ళిద్దరూ పరిచయం అయ్యారు. హాస్టల్ జీవితం నాకు మంచి స్నేహితులను, స్వేచ్ఛను ఇచ్చింది. నా సంతోషం, అమ్మ నాన్నలని చూసినా ఇంటికి వస్తానని మారాం చెయ్యకపోవడం అమ్మకి సందేహం కలిగించి ఏడాదికే మళ్ళీ నన్ను ఇంటికి తీసుకొచ్చేసింది. అప్పటికే నేను టీనేజ్‌లోకి అడుగుపెట్టాను. బయట ప్రపంచం కాస్త అర్థమయ్యింది. అమ్మ తత్వం కాస్త తెలిసివచ్చింది. అందుకే ఇంటినుండి బయటికి వచ్చాక నేను గడిపే జీవితాన్ని గురించి, నా స్నేహితుల గురించి అమ్మకి తెలియకుండా జాగ్రత్తపడడం ఆనాడే నేర్చుకున్నాను. ఆనాటి నా రూమ్‌మేట్స్ ఈనాడు నాకు ప్రాణస్నేహితులనే నిజం అమ్మకి ఇప్పటికీ తెలియదు"




"మీ నాన్నగారు ఎప్పుడూ అమ్మని నీ పట్ల మరీ అంత కఠినంగా ఉండొద్దని వారించలేదా? " సుధ తనకి కావలసిన విషయాలు నేర్పుగా అడుగుతోంది.

పెదవి విరిచి తల అడ్డంగా ఊపింది మనస్వి. "ఆడపిల్ల తండ్రికి ఎక్కువ చేరువ అవుతుందిట. నాకా అదృష్టం లేదు" అని ఏదో గుర్తొచ్చినట్లు "అమ్మ నాలో ఆడా మగా మధ్య దూరాన్ని గురించి బాగా నూరిపోసేసింది. అది నాలో ఎంతగా నాటుకుందంటే నేను నలుగురి మధ్యగా వెళ్ళవలసి వచ్చినా ఉత్సవాలు, సినిమా, ప్రయాణాలు ఇలా... ఎక్కడికి వెళ్ళినా ఏ మగాడు నన్ను తాకుతాడో అని భయపడుతూ, నా చుట్టూ నలుగురు ఆడవాళ్ళు ఉండేలా జాగ్రత్తపడతాను. నాలోని ఈ విపరీత గుణమే ప్రేమ జాడ్యం నన్ను తాకకుండా దూరంగా ఉండడానికి కారణమై ఉంటుందని నాకనిపిస్తూ ఉంటుంది" చెప్పడం ముగించింది.

"మనస్వీ, ఏ మనిషి ఊరికినే అసహజంగా ప్రవర్తించరు. ప్రతి మనిషికి గత అనుభవం ప్రస్తుత ప్రవర్తనను శాసిస్తుంది. మీ అమ్మగారి జీవితంలో కూడా ఎదురైన ఏదో చేదు అనుభవం నీపట్ల ఆవిడ చూపే అతి జాగ్రత్తకు కారణమని నా మనస్తత్వ శాస్త్ర అవగాహన వల్ల అన్పిస్తోంది. అలాంటివి నీకేమైనా తెలుసా? "

కొద్దిక్షణాలు ఆలోచించి తల అడ్డంగా ఊపుతూ "ఊహూ! అంత అవకాశం ఎక్కడిది మేడమ్. మా మధ్య మాటలు తక్కువ. పోట్లాట ఎక్కువ. డాడీతో అయితే పరాయి వ్యక్తితో ఉన్నట్లే ఉంటుంది నా ప్రవర్తన. ఇంక బంధువులు, స్నేహితుల ద్వారా తెలియవచ్చు అంటే... వాళ్ళు ఎంతటి ఆత్మీయులైనా "హలో, నమస్తే" అని పలకరించి నా గదిలోకి వెళ్ళిపోవాలే కానీ మాట్లాడడానికి అవకాశం ఇవ్వదు. అందుకే వాళ్ళ పేర్లు కూడా నాకు సరిగ్గా తెలియవు. బంధువులు దేముడెరుగు. కనీసం మా పక్కిళ్ళు, ఎదురిళ్ళల్లోని వ్యక్తులు కూడా రోజూ చూసినా నాకు తెలియదు. అయినా అమ్మకి అనుమానమే. నిన్ననే మా పక్కింటి పిల్ల పలకరించిందని జవాబు చెప్పినందుకే అమ్మ ఊహాలెలా ఉన్నాయంటే ఆ పిల్లకో అన్నయ్య ఉన్నాడట. అతగాడు చెల్లిలితో నాకు ప్రేమ సందేశాలు

పంపుతున్నాడేమోనని నన్ను నిలదీసింది. అలాంటి మనిషితో సామరస్యంగా మాట్లాడడం ఎలా సాధ్యం మేడమ్" నిస్పృహగా అంది.

తనకి కావలసిన పాయింట్లు నోట్ చేసుకొని పెన్ను మూస్తూ "మనస్వీ! ఒక సైకాలజిస్టుగా నీది సమస్య కాదు అని నేను అనను. అలాగని తప్పంతా నీదో లేక మీ మమ్మీదోనని ఏ ఒక్కరిమీదో నెట్టేయను. మధ్యతరగతి మనుషుల్లో నూటికి తొంభై సమస్యలు వ్యక్తుల మధ్య అవగాహన లోపం వల్ల వస్తాయి. అది నీకు మీ అమ్మగారికి మధ్య ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తోంది. దానిని పోగొట్టాలంటే అమ్మ నీపట్ల చూపే అతిజాగ్రత్తకు కారణాలు తెలియాలి. అది తెలిస్తే మీ ఇద్దరికి కౌన్సిలింగ్ చేస్తే సరిపోతుందా? లేక సిట్టింగ్స్ జరపాలా అనేది నిర్ణయించవచ్చు కనుక ఎలాగైనా ప్రయత్నించి అమ్మ విపరీత ప్రవర్తనకు కారణాన్ని తెలుసుకో" సూచించింది సుధ.

"ఐ విల్ ట్రయ్ మై లెవల్ బెస్ట్ మేడమ్" హామీ ఇచ్చింది మనస్వి.

"ఓకే మరి మీ ఇద్దరిలో ఇప్పుడు ఎవరు చెబుతారు" హృది, సుమనలని అడిగింది

"నేను చెబుతాను మేడమ్" హృది బదులిచ్చింది.

"నీ స్నేహితురాలు చెప్పాక ధైర్యం వచ్చిందా? " చిరునవ్వుతో ప్రశ్నించింది.

"అదేంలేదు మేడమ్. మా బెరుకు ఎప్పుడో పోయింది. కాకపోతే మనస్వి సమస్యకు నాది పూర్తి వ్యతిరేకం. అంటే మితిమీరిన ఆంక్షలతో, అడుగడుగునా హద్దులతో అది సతమతమౌతుంటే, నేను అదుపు చేసే వాళ్ళు లేని అడ్డు- ఎరగని అతిస్వేచ్ఛతో విసిగిపోతున్నాను. అందుకే ఇప్పుడు నా సమస్య చెబితేనే మీకు ఒక అవగాహన వస్తుంది" హృది తనే ముందు చెబుతానన్న కారణాన్ని వివరించింది.

సుధ కళ్ళు ఎగరేసింది. "నువ్వు చెప్పడమే చాలా ఆసక్తిని రేపుతోంది. వివరంగా చెబుతావా? " కోరింది.

హృది గొంతు సవరించుకుంది.



ఇంచుమించు అదే సమయానికి చక్రధరం వచ్చిన అలికిడికి సుభద్ర తలుపులు తెరిచింది. కారుని షెడ్‌లో పార్క్ చేసి కోటు, బ్రీఫ్‌కేస్‌తో లోనికి వచ్చాడు చక్రధరం.

"ఈరోజు చాలా త్వరగా వచ్చారే? !" బ్రీఫ్‌కేస్ అందుకొంటూ ఆశ్చర్యాన్ని ప్రశ్నలా ధ్వనింపచేస్తూ అడిగింది సుభద్ర.

"ఈరోజు మీటింగ్‌లేవీ లేవు. దానికి తోడు కాస్త తల నొప్పిగా ఉంటేను" టై నాట్ లూజ్ చేసుకొని తీసేస్తూ సోఫాలో కూలబడి చెప్పాడు. సుభద్ర ఏదో అనబోయేంతలోనే తనే "మనూ! ఇంకా రాలేదా? " అని అడిగాడు.

"మీకూ, మీ కూతురికి నేనో రాక్షసిలా ఆనతాను కదా! తల్లిగా నా పొడే ఆవిడకి కిట్టదు. ఇవాళంటే ఒంట్లో బాగోలేదని వచ్చారు కానీ మీరు తొమ్మిది దాటితే కాని దర్శనమివ్వరు. ఆవిడగారికి తొమ్మిది అవుతుంటే కానీ ఇల్లు కనపడదు. ఎక్కడ ఏ రాచకార్యాలు వెలగబెడుతోందో? అప్పుడే ఎక్కడ వస్తుంది" మళ్ళీ తన పాత ధోరణిలోకి వచ్చేసింది.

కణతలు నొక్కుకున్నాడు చక్రధరం. "ఒకటి అడిగితే వంద చదువుతావు. నీతో వాదన పెట్టుకొనే ఓపిక నాకు లేదు. నీ సాధింపులు ఆపి కాస్త 'టీ' ఇస్తానంటే ఉంటాను. లేదంటే బైటికి పోయి నీ కోరిక ప్రకారం నేనూ తొమ్మిది దాటాకనే వస్తాను. అసలే నాకు తల పగిలిపోతోంది" విసుక్కున్నాడు.

ఘాటుగా బదిలివ్వబోయిన సుభద్రను రెండు విషయాలు ఆపాయి. స్వతహాగా శాంతచిత్తుడైన భర్త కోపంలో ఏదైనా అంటే ఖచ్చితంగా చేస్తాడని తెలియడంవల్ల, కూతురు రాకుండానే ఓ ముఖ్య విషయాన్ని అతనితో చర్చించాలని నిర్ణయించుకోవడం వల్ల మౌనంగా లోనికి వెళ్ళి 'టీ'తోపాటు తల నొప్పికి మాత్ర కూడా తెచ్చి ఇచ్చింది. మాత్ర వేసుకొని అతను 'టీ' తాగేదాకా ఆగి "గీజర్ వేశాను. వెళ్ళి స్నానం చెయ్యండి. ఈ లోగా వేడిగా టిఫిన్ చేస్తాను" చెప్పింది.

చక్రధరం రెట్టించలేదు. కప్పు భార్యకిచ్చి వెళ్ళి స్నానం చేసి వచ్చాడు.

సుభద్ర వేడివేడిగా వడ్డించిన ఇడ్లీలు తినే సరికి తలనొప్పి చాలావరకు తగ్గింది. బహుశా సుభద్రలో భార్యగా అన్నీ అమర్చి పెట్టే గుణంవల్లే ఆమె ధోరణి ఎంత విపరీతంగా ఉన్నా ద్వేషించలేకపోతున్నాను అని తరచు అనుకుంటాడు చక్రధరం.

వంటిల్లు సర్దుకొని ఒక ఫైల్ లాంటిది తీసుకొని టి.వి. చూస్తున్న భర్త ప్రక్కన కూర్చొని నిర్మొహమాటంగా టి.వి. కట్టేసింది.

"ఇండియా-పాకిస్తాన్ మేచ్ అది. ఎందుకు కట్టేశావు? " ఆశ్చర్యంగా అడిగాడు. "ఈ మేచ్‌కేం రేపు మళ్ళీ ఇస్తాడు. ముందు మీ కూతురు మేచ్ సంగతి చూడండి"తను తెచ్చిన కాగితాలు అతని చేతిలో పెట్టింది.

"ఏమిటివి? " అడుగుతూనే తెరచి చూశాడు. పత్రికల్లో పెళ్ళిపందిరి నుండి కత్తిరించిన వరుళ్ళ వివరాల ప్రకటనలు. వాటితో పాటు జాతకం, కుటుంబ ఆస్తిపాస్తుల వివరాలు, ఫోన్ నెంబర్లు నోట్ చేయబడిన అరడజను వ్యక్తుల వివరాలున్నాయి.

"ఇవన్నీ ఎవరికి? " ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం వేళాకోళమా? ఇంట్లో ఈడొచ్చిన పిల్లని పెట్టుకొని పెళ్ళి సంబంధాలు ఎవరికి అని అడుగుతున్నారు? " కోపంగా అడిగింది.

"మనూకా! అప్పుడే దానికి పెళ్ళేంటి. మొన్ననేగా ఇరవై వచ్చింది"

"ఆహా! ఇంకో నాలుగురోజుల్లో ఇరవై ఒకటి కూడా వస్తోంది. మీకూ, నాకూ అదెప్పుడూ చిన్నపిల్లే. కానీ ఆ వయసుకి నేను మూడేళ్ళ మనస్వికి తల్లినని మర్చిపోకండి" వెక్కిరింతగా అంది.

చిన్నగా నిట్టూర్చాడు. "అదే నా బాధ, పద్దెనిమిదేళ్ళకి నువ్వు, ఇరవై ఏళ్ళకి నేను పెళ్ళి అనే బంధంలో చిక్కుకుని ఎంత నరకాన్ని పడ్డామో నాకింకా గుర్తుంది. ఆ బాధ్యతల భారం మనూకి మాత్రం ఇప్పటి నుండి ఎందుకు చెప్పు. ఇంకో ఏడాది రెండేళ్ళు స్వేచ్ఛగా దానికి నచ్చిన జీవితాన్ని గడపనివ్వు" నచ్చచెబుతున్నట్లు అన్నాడు.

మాట పూర్తి కాకుండానే గయ్యిన అందుకొంది. "బావుంది. మీరు చెప్పేది. మీలాగే అందరి తల్లిదండ్రులు ఆలోచిస్తే ఈ జన్మకి తమ పిల్లలకి పెళ్ళిళ్లు చెయ్యలేరు. అయినా మన ఖర్మ దానికెందుకు పడుతుంది. మనం చేసుకున్నది స్వయంకృతం. అన్నింటికన్నా పెద్దల అండ కాదనుకొని నిర్ణయాలు తీసుకోవడం మన తప్పు. ఆ తప్పు నా కూతురు చెయ్యకూడదనే నా కూతురు పెళ్ళి నేను చెయ్యాలనుకొంటున్నాను".

చక్రధరం మరి వాదించలేదు. మౌనంగా పెళ్ళికొడుకుల వివరాలు చదువుతూ ఉండిపోయాడు. ఆ వివరాలన్నీ తిరగేసి "అన్నీ విదేశాలలో స్థిరపడ్డ కుర్రాళ్ళ వివరాలే ఉన్నాయి. ఆ సంబంధాలకు మనం తూగగలమా? మనూ పెళ్ళికని మనం దాచిన మొత్తాలన్నీ కలిపి ఐదారు లక్షలు మించవు. పెద్ద సంబంధం అంటే ఆ మొత్తం పెళ్ళి ఖర్చులకే చాలదు. ఇక కట్నాలు, పెట్టుపోతలు అన్నీ కలిపి మరో పది, పదిహేను లక్షలైనా ఉండాలి. అంత డబ్బు ఎక్కడినుండి తెస్తాం? " ఆర్థికంగా ఎదురయ్యే సమస్యల్ని వివరించాడు.

రెండు నిమిషాలు దీర్ఘంగా ఆలోచించి "సంబంధం మంచిదై, పిల్ల సుఖపడుతుందంటే డబ్బుకోసం ముఖం చూసుకుం

టామా? ఊళ్ళో నా పేర ఉన్న పదెకరాల్ని, మీకు మీ అన్నయ్య రైస్ మిల్లులో ఉన్న వాటాని అమ్మేద్దాం. సొంత ఇల్లుంది. మీకు ఇంకా పదిహేను సంవత్సరాల సర్వీసు ఉంది. బతకలేకపోముగా!"నిర్లక్ష్యంగా అంది.

కూతురు పెళ్ళి విషయంలో ఆమె ఒక స్థిర నిర్ణయానికి వచ్చిందని గ్రహించాడు. "ఈ సంబంధాలు ఏవీ నువ్వు మధ్యవర్తుల ద్వారా సేకరించినవి కావు. అవునా? " అడిగాడు.

"అవును. 'పెళ్ళిపందిరి'లో ఇచ్చిన ఫోన్ నెంబర్ల ఆధారంగా నేనే ఫోన్ చేసి కనుక్కొని పోస్టులో వివరాలు తెప్పించాను" చెప్పింది.

"అయితే వీళ్లలో ఎవరు మనూకి అనుకూలమైన వరుడో మనమే నిర్ణయించుకొని పెళ్ళి చూపులకి రమ్మని పిలవాలి" చేయవలసింది చెప్పాడు.

భార్యాభర్తలిద్దరూ ప్రతీ కుర్రాడి వివరాలు క్షుణ్ణంగా పరిశీలిస్తూ తమ కుమార్తెకు తగిన వరుడిని వెతకడంలో నిమగ్నమైపోయారు.




"ఊటీలోని ఖరీదైన కాన్వెంట్. అక్కడ ఏడాది వయసు పిల్లల నుండి అందరికీ అన్నిరకాల సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి. ఉదయాన్నే నిద్రలేపి మొహం కడిగి అందంగా తయారుచేసే ఆయాలు, రోజుకో వెరైటీ వంటకాన్ని వండిపెట్టే వంటవాళ్ళు, ఏడవడాన్ని కూడా ఇంగ్లీషులోనే నేర్పే మనభాష ఎరుగని టీచర్లు, ఆడుకోడానికి ఒకరికొకరు తోడుండే తమ ఈడు ఖరీదైన అనాధలు అంతా ఉంటారు. అయినా అక్కడ తాము ఏ పనిలో ఉన్నా, ప్రతిఒక్క చిన్నారి కళ్లు మాత్రం మెయిన్ గేటువైపే ఆశగా చూస్తుంటాయి. అడపా, దడపా వచ్చిపోయే ఖరీదైన కార్లలో తమని కన్నవాళ్లు ఒక్కరైనా వచ్చి దగ్గరకు తీసుకొని "ఎలా ఉన్నావమ్మా...? " అని పలకరిస్తారేమోనని వెర్రి ఆశతో అమాయకంగా ఎదురుచూస్తుంటారు. తానెవరో తన ఉనికి ఏమిటో తెలియని ఓ ఐదేళ్ల పాప కూడా వాళ్ళలో ఉంది. అదృష్టం. ఆరోజు ఆ పాప నిరీక్షణ ఫలించింది. హిందీ హీరోయిన్‌లా నడినెత్తిన కొప్పుతో స్లీవ్‌లెస్ జాకెట్, షిఫాన్ చీరతో మొహంలోని అసలు రంగును మరుగుపరిచే మేకప్‌తో కారులోంచి దిగిన పాతికేళ్లలోపు యువతిని తల్లిగా గుర్తించి "మమ్మీ...!" అంటూ తూనీగలా వెళ్లి కరుచుకుపోయినట్లుగా కరువుతీరా కౌగలించుకుంది. ఆమె ఏం తక్కువ తినలేదు. మొహమంతా ముద్దులు కురిపిస్తూ చాక్లెట్లు, బొమ్మలు, కొత్తబట్టలు అన్నిటితో ఆ పాపకి అభిషేకం చేసింది. కూతుర్ని ఎత్తుకొనే ప్రిన్స్‌పాల్‌ని కలిసి పిల్ల యోగక్షేమాలు, చదువు అన్ని వివరాలు తెలుసుకొని మురిసిపోతూ మరోసారి కూతుర్ని ముద్దులతో ముంచెత్తింది. రెప్ప మూసి తెరచినంత వేగంగా ఆ పాపకి కాలం కదలిపోయింది. మరో ఏడాదికి సరిపడా ఫీజులు కట్టి ఒకటికి పదిసార్లు ఆయాలకి పాప గురించి జాగ్రత్తలు చెప్పి..., మళ్ళీ త్వరలోనే వస్తాను చిన్నా! బాగా చదువుకో. అంటూ కూతురికి చివరి ముద్దిచ్చి ఆ పాప గోడు గోడుగా ఏడుస్తున్నా వినపడనట్లు వెళ్లిపోయింది ఆ యువతి" చెప్పడం ఆపింది సహృదయ.

ఇదీ అని చెప్పలేని విషాదం ఆ గదిలో అలుముకుంది. వింటున్న ముగ్గురి మనసుల ముందు ఆ దృశ్యం కదిలి హృదయం భారమయ్యింది. వయసు, అందుకు తగిన అనుభవం కలిగిన సుధ ముందుగా తేరుకుంది. "ఆ తర్వాత ఏం జరిగింది...? " ప్రశ్నించింది.

తడిబారిన కన్నులు అరచేతులతో అద్దుకుంటూ సర్దుకుని కూర్చుంది హృది.

## సైకాలజీ


విల్ హెల్మ్ ఊంట్

ఏ పనైనా మనం ఎందుకు చేస్తాం... పురాతన కాలం నుంచీ ఇది మనని వేధిస్తున్న ప్రశ్నే. దానికి సమాధానం కనుక్కునే ప్రయత్నంలో పుట్టిందే సైకాలజీ. సాంకేతిక పరిభాష జోలికి పోకుండా మన వాడుక భాషలో చెప్పాలంటే... మనుషుల, జంతువుల ప్రవర్తనకు సంబంధించిన ఈ శాస్త్రం ఇతర విజ్ఞాన శాస్త్రాలన్నిటిలోకీ వయసులో చాలా చిన్నది... అంటే ఇది పుట్టి నూటపాతిక యేళ్లే అయింది మరి. అయినా బయాలజీ నుంచి సోషియాలజీ వరకు అన్ని శాస్త్రాలనూ స్పృశిస్తూ సాగే ఈ శాస్త్రం సువిశాల పరిధిని కలిగి ఉంది.

1879లో ఒక సైన్సుగా సైకాలజీని గుర్తించారు. విల్ హెల్మ్ ఊంట్ తొలి సైకాలజీ లేబొరేటరీని జర్మనీలోని లీప్ జిగ్‌లో స్థాపించారు.

**కౌన్సెలింగ్ అంటే..**

కౌన్సెలింగ్ అంటే ఏమిటో అనుకుంటాం కానీ వాడుక భాషలో చెప్పాలంటే సలహాలివ్వడం... అంతే! మనం నిత్య జీవితంలో ఎదుర్కొనే వివిధ సమస్యలు, క్లిష్టపరిస్థితుల గురించి అవగాహన కల్పించే శిక్షణ పొందినవారు ఇతరులకు సలహాలివ్వగలిగే కౌన్సెలింగ్ చేస్తారు. వారి సలహాలు సూచనలతో మరో కోణం నుంచీ విషయాన్ని అర్థం చేసుకునే అవకాశం కలుగుతుంది.

సాధారణంగా మనం ఎదుర్కొంటున్న సమస్యను - అది మన వ్యక్తిత్వానికి సంబంధించింది కావచ్చు, మన బంధాలకో, బాధ్యతలకో సంబంధించింది కావచ్చు, చేస్తున్న ఉద్యోగానికి

"ఆ పాప నేనని, ఆ వచ్చింది మా అమ్మ జానకని మీకర్థమయ్యింది కదూ మేడమ్" అవునన్నట్లు తల ఊపింది సుధ.

"అమ్మ మాట ప్రకారం వస్తుంది అని ఆశ నిండిన కళ్ళతో మళ్ళీ నా ఎదురుచూపులు మొదలయ్యేవి. వేసవిలో వర్షంలా ఏదో ఓ రోజు వచ్చేది. కానీ నాలో అమ్మని చూసిన ఆనందం కొన్ని గంటలకే పరిమితం. ఎదిగే కొద్దీ నేనూ నీతో వస్తానని ఎంత మారాం చేసినా ఏదో ఒక సాకుతో తిరస్కరించేది. కాన్వెంట్ అయినా చాలామంది పిల్లలు సెలవులకు ఇళ్ళకి వెళ్ళేవారు. కానీ స్కూలు నాకు మాత్రం ఇంటికి వెళ్లేందుకు అనుమతినిచ్చేది కాదు. నీకు మ్యూజిక్ క్లాసులున్నాయి. నువ్వు ఇంగ్లీషు బాగా నేర్చుకోవాలి అంటూ ఏదో కారణాన్ని చూపి నన్ను మాత్రం అక్కడే ఉంచేసేవారు. మొదట్లో అవన్నీ తప్పనిసరి అని నమ్మినా వయసు. మనసు ఎదిగేకొద్దీ అవన్నీ మమ్మీ డబ్బు వెదజల్లి నన్ను ఇంటికి రానీయకుండా చేసిన ఏర్పాట్లని గ్రహించాను. ఓ రోజు తెగించి అమ్మ అడ్రస్ దొంగిలించి రహస్యంగా ముంబాయి పారిపోయి వచ్చేశాను. వచ్చినప్పుడల్లా అమ్మ పుష్కలంగా ఇచ్చే డబ్బు. పదేళ్ల వయసుకే పోష్‌గా నడవడిక నేర్పిన కాన్వెంట్ చదువు నన్ను క్షేమంగానే ఇంటికి చేర్చాయి.

"నేను వెళ్లేసరికి రాత్రి తొమ్మిది అయ్యుంటుంది. అమ్మ భవంతిలో ఏదో పండగ వాతావరణంలా చాలా సందడిగా ఉంది. ఆ సందడిలో నన్నెవరూ గమనించలేదు. మెల్లగా నేను లోనికి వెళ్ళాను. ఎవరెవరో తాగుతున్నారు. నాగరికత ముసుగులో అనాగరికంగా ప్రవర్తిస్తున్నారు. వాళ్ళలో అమ్మని వెతుక్కోవడానికి నేను - నా పసిమనసు చాలా అవస్థ

సంబంధించిందే కావచ్చు కొన్ని సంఘటనలను, కొందరు వ్యక్తులను అర్థంచేసుకోవడంలో కావచ్చు...ఆ సమస్యను మనం మన తరఫు నుంచే చూస్తాం. మన కోణం నుంచే ఆలోచిస్తాం. అదే ఇతరుల కోణం నుంచీ కూడా చూస్తే పరిష్కారం చాలా త్వరగా స్ఫురించవచ్చు. కౌన్సెలింగ్‌లో జరిగేది అదే.

కౌన్సెలింగ్‌లో చాలా పద్ధతులున్నాయి. ఒక పద్ధతిలో సహాయం కోరి వచ్చిన వారి సమస్య గురించి ఓపిగ్గా వింటారు. ఆయా సమస్యల మూలాల్నీ, ముందున్న పరిష్కారమార్గాలను విశ్లేషిస్తారు. దాంతో సమస్యను పరిష్కరించుకోవడం సులువవుతుంది. మరో పద్ధతిలో కేవలం విషయం వినడం వరకే కౌన్సెలర్ల బాధ్యత. మనసులోదంతా చెప్పుకొంటే భారం తగ్గి వాళ్లమనసు తేలికపడుతుందని అప్పుడు సమస్య గురించి మరో కోణంలో ఆలోచించే ధైర్యం వస్తుందని ఈ తరహా కౌన్సెలింగ్ చేసేవాళ్లంటారు. ఆత్మహత్య చేసుకోవాలన్న కోరిక కలిగేవారు కౌన్సెలింగ్‌కి వెళ్తే మళ్లీ ఆ ఆలోచన రాదు. ఎందుకంటే అలాంటి ఆలోచన సాధారణంగా కొద్దిని మిషాలు మాత్రమే ఉంటుంది. ఆ సమయంలో మనసు మళ్లించుకోగలిగితే చాలు. అందుకే చాలా దేశాల్లో ఇలాంటివాళ్ల కోసం హెల్ప్‌లైన్‌లు ఉంటాయి. వాళ్లకి ఫోనులోనే కౌన్సెలింగ్ చేస్తారు. దీర్ఘకాలం వ్యాధులతో బాధపడేవారు, అత్యాచార బాధితులు, వికలాంగులు, పరిస్థితులవల్ల ఒంటరి జీవితం గడుపుతున్న వారికి ఇటువంటి కౌన్సెలింగ్ ఎంతో అండగా ఉంటుంది.

**కౌన్సెలింగ్‌లో రకాలు**

అన్నిరకాల సమస్యలకూ ఒకరే కౌన్సెలింగ్ చేయరు. కుటుంబసమస్యలకు (ఫ్యామిలీ కౌన్సెలర్), వైవాహిక సమస్యలకు(మ్యారిటల్ కౌన్సెలింగ్), పిల్లల ప్రవర్తనకు (చైల్డ్ బిహేవియర్), విద్యావిషయాలకు (ఎడ్యుకేషనల్), ఉద్యోగవిషయాలకు (ఆర్గనైజేషనల్ సైకాలజిస్టు)..ఇలా వేర్వేరు అంశాల్లో విడివిడిగా శిక్షణ పొందినవారే ఆయా అంశాల్లో కౌన్సెలింగ్ చేస్తారు.

పడింది. నేనెప్పుడూ చూడని వికారమైన రూపంలో అమ్మని ఎలాగైతేనేం గుర్తుపట్టాను. వంటిమీద ఉండిలేనట్లున్న చిన్నచిన్న గుడ్డలు వేసుకొని, కళ్ళకి, పెదాలకి దట్టంగా పట్టించిన మేకప్‌తో ఓ చేతిలో వైన్‌గ్లాస్‌తో, మరో చేతిలో సిగరెట్‌తో ఎవరో మగాడిని పెనవేసుకొని నుంచుని, అవసరం లేకపోయినా పెద్దగా నవ్వుతూ అతగాడు ఎంగిలి చేసిన వైన్‌నే తను తాగుతూ..." చెబుతుండగానే హృది గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. రెండు చేతుల్లో మొహం దాచుకొని టేబుల్ మీదకి వాలిపోయింది. నిజానికి ఆమెకి తల్లి గురించి అలా చెప్పడం చాలా అవమానంగా, సిగ్గుగా అనిపిస్తోంది. కానీ ఎందుకో ఒకసారి చెప్పడం మొదలుపెట్టాక తన గుండె బరువంతా సుధ ముందు దించేసుకోవాలనే వెర్రి తపన క్షణక్షణానికి పెరిగిపోతోంది. చెబుతుంటే మళ్ళీ తనే ఆ బాధను తట్టుకోలేకపోయింది.

సుధకి ఆమె పరిస్థితి అర్థం అయింది. చెరోవైపు చేరి నీళ్ళు నిండిన కళ్ళతో ఓదారుస్తున్న స్నేహితురాళ్ళకి సైగ చేసింది. సుమన కళ్ళు తుడుచుకొని ఓ వార జగ్‌లో ఉన్న మంచినీళ్ళు తెచ్చి హృది చేత బలవంతంగా తాగించింది.

ఐదు నిమిషాల తర్వాత హృది బాగా తేరుకుంది. రుమాలుతో ఎర్రబడ్డ కళ్ళని, ముక్కుని తుడుచుకుని... "క్షమించండి మేడమ్. ఎన్నో ఏళ్ళుగా ఎవ్వరికీ చెప్పకుండా దాచుకున్న మనోవ్యథ బయటపడేసరికి తట్టుకోలేకపోయాను" సంజాయిషీగా చెప్పింది.

సుధ మృదువుగా నవ్వింది. "నేను అర్థం చేసుకోగలను నీ వ్యథ. నువ్వెంత స్వతంత్రంగా నీ బాధను వివరిస్తే దాని తీవ్రతను

బట్టి మనం సరైన పరిష్కారాన్ని కనుక్కో గలం. సరే, మీ మమ్మీని పార్టీలో చూసి నువ్వు చాలా షాక్ అయ్యావు. ఆ తర్వాత...? "

"మమ్మీని ఆ స్థితిలో చూశాక దగ్గరకి వెళ్ళి పలకరించాలని, నేనొచ్చానని చెప్పాలని నాక నిపించలేదు. మెల్లగా బయటకి వచ్చి ఏం చెయ్యాలో తెలియని అయోమయంలో లాన్‌లో పడిపోయాను. ఎవరో నౌకర్లు ఉదయం నన్ను గమనించి అమ్మకి చెప్పారు. రాత్రంతా మంచులో తడవడంవల్ల నాకు బాగా జ్వరం వచ్చింది. పది రోజులు అమ్మ నా పక్కనే ఉండి కంటిపాపలా కాసుకుంటూ చటర్జీ అంకుల్‌తో వైద్యం చేయించింది. నేను చూసిందంతా ఓ పీడకలగా మర్చిపోయి హాయిగా అమ్మ ఒడిలోనే ఉండిపోవచ్చనే ఆశలు నాలో రేగాయి. కానీ వాటన్నింటిని అడియాసలు చేస్తూ నేను కోలుకోగానే అమ్మ మళ్లీ నన్ను హాస్టల్‌కి పంపడానికి ఏర్పాట్లు చేసేసింది. అయితే ఈసారి ఊటీ కాదు. నేను పారిపోయి రావడానికి ఊటీ స్కూలు మేనేజ్‌మెంట్ అసమర్థతయే కారణంగా భావించి అమ్మ అక్కడ నుండి తీసుకొచ్చి నన్ను హైదరాబాద్ హాస్టల్లో వేసింది. ఇక్కడ ఇదిగో నా రెండు కళ్ళలాంటి వీళ్ళిద్దరూ పరి చయం అయ్యారు" మనూ, సుమ ఇద్దరి చేతుల్ని బిగించి పట్టుకొని మెరుస్తున్న కళ్ళతో చెప్పింది సహృదయ.

"మరి ఆ తర్వాత మీ మమ్మీని మళ్ళీ కల వలేదా...? "

"నేను ముంబాయి వెళ్ళలేదు. అమ్మ హాస్ట ల్‌కి వచ్చి చూసి వెళ్ళేది. టెన్త్ సెలవుల్లో మాత్రం మనూని ఇంట్లోంచి రానీయకుండా కట్టడి చేయడం, సుమ ఎవరో బంధువులిం టికి వెళ్ళడంవల్ల ఒక్కర్తిని ఉండలేక రెండో సారి నేనుగా ముంబాయి వెళ్ళాను. "ప్చ్ ఈసారీ నాకక్కడ మంచి అనుభవం ఎదుర వ్వలేదు" పెదవి విరిచి విరక్తిగా అంది.

ముగ్గురూ ఏం జరిగింది అని రెట్టించ లేదు. పదేళ్ళ గాఢమైన స్నేహంలో సహృ దయ జీవితంలోని తమకి తెలియని చీకటి కోణాన్ని ఆమె నోటివెంటే వింటూ లోలోపల విస్మయపడుతోంది మనస్వి. సుమనకి అప్ర యత్నంగా హృది సుధా మేడమ్ అపాయిం ట్‌మెంట్ కోసం వెళుతున్న సందర్భంగా తను అన్న మాటలకు ఆమె విసురుగా జవాబు ఇవ్వటం గుర్తొచ్చి 'వెర్రితల్లి ఎంత బాధను గుండెల్లో మోస్తోంది' జాలిగా అనుకుంది.

వాళ్ళ భావాలతో పనిలేనట్లు హృది తను చెప్పదలచుకొన్నది కొనసాగించింది. "నేను ఇంటికి చేరేసరికి



ఉదయం పదయ్యింది. అమ్మ ఎక్కడికో వెళ్ళిపోయింది.

"ఆశ చావక మా సంస్థలన్నిటికీ ఫోన్ చేసి చూశాను. రాలేదు అన్నారు. అమ్మ సెల్‌కి చేస్తే ఆఫ్ చేసి ఉంది. పనివాళ్ళు పెట్టింది తిని ఎలాగో అలా రాత్రిదాకా కాల క్షేపం చేశాను. మాగన్నుగా నిద్ర కూడా పట్టే సింది. అప్పుడు అమ్మ కారు హారన్ విని పించి నా మనసు సంతోషంతో తుళ్ళిపడు తుంటే హాల్లోకి వచ్చాను. అమ్మ పరిస్థితి నా కాళ్ళకి, ఆనందానికి బ్రేకులు వేసింది. ఒళ్ళు తెలియనంతగా తాగిన మత్తులో తూగిపో

తున్న అమ్మ ఎవరో నలభైఏళ్ళ వయసు మనిషి నడుం చుట్టూ చేతులు పెనవేసి వేలాడిపోతూ వస్తోంది. ఆ మనిషి అమ్మని సోఫాలో కూలేసి పక్కన కూలబడ్డాడు. అమ్మ గమనించకముందే అక్కడి నుండి తప్పుకోవాలనుకున్నాను. సాధ్యం కాలేదు. నన్ను చూస్తేనే అమ్మ విప్పారిన మొహంతో "చిన్నా! ఎప్పుడొచ్చావమ్మా? ఫోన్ చెయ్యకపోయావా? పరిగెత్తుకువచ్చేదాన్ని... నీకు తెలుసా ఈరోజు మనకి రేసుల్లో పది లక్షలు కలిసివచ్చింది. రోజంతా జాలీగా గడిపేశాను..." నేను మాట్లాడలేదు.



ఆవిడ మాటలు ఆగలేదు. నా కన్నతల్లి తీరు చూడలేక అక్కడినుండి పారిపోయిన నేను తెల్లారకుండానే అమ్మకి కూడా చెప్పకుండా హాస్టల్‌కి వచ్చేశాను" చెప్పింది హృది. ఇప్పుడామె గొంతులో విషాదం తప్ప భావం లేదు.

"మీ మమ్మీ మరీ అంత విశృంఖల జీవనానికి అలవాటు పడడానికి కారణమేమైనా నీకు తెలుసా? " సుధ ప్రశ్నించింది.

రెండు నిమిషాలు ఆలోచించి... "మేడమ్, మా మమ్మీ కోనసీమలోని ఊబలంకనే పల్లెటూరిలో సనాతన సాంప్రదాయ కుటుంబంలో జన్మించిందట. వాళ్ళ నాన్న చాలా చాదస్తం మనిషట. ఆడపిల్ల నలుగురిలో గట్టిగా మాట్లాడినా నవ్వినా కోపమేనట. అంతటి కఠిన నియమాల మధ్య పెరిగిన మనిషి ఏ కారణంగానో ఫ్యాషన్లకి స్వర్గం లాంటి ముంబాయి వచ్చిపడింది. సరదాకో, పొరపాటునో తీసుకున్న మత్తుపదార్థాలు వదులుకోలేని వ్యసనాలుగా మారాయి. అది భరించలేక మా డాడీ ఆవిడకి విడాకులిచ్చేసి ఉంటారు"

"ఉంటారు అంటున్నావు. అంటే ఇదంతా నీ ఊహ మాత్రమే. అవునా...? " అనుమానంగా అడిగింది సుధ.

"అవును మేడమ్" అంగీకరించింది.

"నువ్వు చెప్పేదంతా నీ తల్లితో నీ అనుభవాల గురించే సాగింది. మరి మీ డాడీ గురించి నీకేం తెలియదా...? "

"కనీసం మా డాడీ పేరు గురించి కూడా నాకు తెలియదంటే నమ్ముతారా మేడమ్. నాకు మూడేళ్ళ వయసప్పుడు వాళ్ళు విడాకులు తీసుకున్నారు. ఆడపిల్లని కావడంతో మా అమ్మకి నన్ను అప్పగించింది కోర్టు. నాతోపాటు లక్షల ఆస్తిని భరణంగా కూడా ఇచ్చింది. వ్యసనాల నిప్పుకి సంపద గాలి తోడవడంతో నన్ను హాస్టల్‌లో పారేసి తన సరదాలు తీర్చుకోవడంలో మునిగిపోయింది అమ్మ. అమ్మ మంచిగా ఉన్నప్పుడు డాడీ గురించి కూపీ లాగడానికి చాలా ప్రయత్నించాను. కానీ ప్రయోజనం లేకపోయింది. డాడీ ఊసెత్తితేనే మనిషి మారిపోతుంది. ఒక్కమాటైనా చెప్పకుండా గదిలోకెళ్ళి తలుపులు బిగించుకుని మళ్ళీ మత్తులో మునిగిపోతుంది. అమ్మ మేకప్ కిట్‌లో ఎప్పుడూ ఓ ఫోటో ఉంటుంది. అతనే డాడీ ఏమోనని అమ్మని ఒకసారి ఆ ఫోటో చూపించి అడిగాను. "ఇతనా! మోహన్. నాకు ముంబాయిని పరిచయం చేసిన వ్యక్తి" అంది.

"అంటే డాడీనా? " ఆశ తీరక అడిగాను.

అమ్మ గుక్క తిప్పుకోకుండా నవ్వింది. "వాడు... నీ డాడీనా? అయ్యేవాడేమో!

## బట్టతల బాబులూ... జాగ్రత్త




తలపై జుట్టు లేకపోవటం తెలివిని సూచిస్తుందని, బట్టతల పరిణతికి నిదర్శనమని బట్టతలల వారిని ఓదారుస్తుంటారు. కానీ బట్టతల అనారోగ్యానికి నాందీ ప్రస్తావన అంటున్నారు పరిశోధ కులు. తలపై జుట్టు ఊడుతూంటే, గుండెపై ఒత్తిడి పెరుగు తోందని గ్రహించాలట. అంతేకాదు జుట్టు ఊడటం, అదీ 30 ఏళ్ల వయసులో అయితే ఖచ్చితంగా అది ప్రోస్టేట్ కాన్సర్‌ని సూచిస్తుందంటున్నారు అమెరికన్ డాక్టర్లు. వ్యక్తిలో టెస్టోస్టిరాన్ అధికంగా ఉత్పత్తి అవుతూంటే జుట్టు రాలటం మొదలవుతుంది. టెస్టోస్టిరాన్ అధికంగా ఉత్పత్తి అవటం అంటే కొవ్వు పెరగటం, రక్తపోటు పెరగటం అన్నమాట. ఈ రెండూ గుండె నొప్పికి షార్ట్‌కట్‌లు. కాబట్టి జుట్టు ఊడటం, గుండెకు ప్రమాదం అని గ్రహించటం తప్పనిసరి. జుట్టు ఊడుతోంటే హెయిరాయిల్ కోసం కాదు రక్తపోటు, కొవ్వు పరీక్షల కోసం పరుగెత్తాలి. డాక్టరు సలహా పాటించాలి అంటున్నారు శాస్త్రవేత్తలు.

పాపం. వాడికా అదృష్టం లేదు" అని మళ్లీ మళ్లీ నవ్వింది. కానీ నా సందేహం మాత్రం అలాగే ఉండిపోయింది" అని... అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లు "ఆఁ! మేడమ్. ఇదంత ముఖ్య విషయం కాకపోవచ్చు. కానీ మా డాడీ గురించి ఈమధ్య ఎవరో నాకు చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లు అనిపిస్తోంది. ఎందుకంటే గత రెండు నెలలుగా శ్రీరామ్ అనే వ్యక్తి నుండి నా సెల్‌కి "చిట్టి తల్లీ! నిన్నొదిలి ఇరవై ఏళ్లు ఎలా ఉన్నానో నాకర్థం కావడం లేదు. 'లక్షల ఆస్తి, తల్లీతండ్రి ఉండి కూడా నువ్వు అనాథలా బతకవలసివస్తోంది. నేను నీకు ఏమీ చెయ్యలేని అసమర్థుడిని' ఇలా ఏవేవో సానుభూతి పలకరింపులతో ఎస్.ఎమ్.ఎస్.లు వస్తున్నాయి. నేను రెండు మూడుసార్లు ఆ నెంబర్‌కి వివరాలు చెప్పమని మెసేజ్ పంపాను. కానీ ఆ వ్యక్తి - కొన్ని మాటలు, బాధలు పెదవి దాటలేనంత బాధాకరమైనవి. ఇరవై ఏళ్లనాడే కన్నబిడ్డను పోగొట్టుకున్న నిర్భాగ్యుడిని' అంటూ వేదాంతాన్ని వల్లిస్తున్నాడు ఇంక అతని గోల అర్థం కాక మా ఫ్యామిలీ డాక్టర్ చటర్జీగారికి ఈ శ్రీరామ్ గురించి మెయిల్ చేసి ఆయనకేమైనా తెలుసేమో కనుక్కుందామని ప్రయత్నించాను. ఇంకా ఆయన నుండి బదులేమీ రాలేదు" నిరుత్సాహంగా అంది.

"నువ్వు చెప్పిన దానిని బట్టి మీ డాడీ ఎవరనేది నీకు తెలియని ప్రశ్న. ఓకే. ఇంక ఈమధ్య నువ్వు ముంబాయి వెళ్లలేదా?" అడిగింది.

"దాదాపు ఏడాది దాకా అప్పుడప్పుడు వెళ్లేదాన్ని. అసహ్యించుకున్నా అమ్మని వదులుకోలేనుగా మేడమ్. నాలో వయసు, వివేకం పెరుగుతున్నకొద్దీ అమ్మని మార్చుకోవాలనే తపన పెరిగి, వెళ్లినప్పుడల్లా అలిగి, బతిమాలి, తిట్టి... ఏరకంగానైనా అమ్మని మార్చాలని ప్రయత్నించాను. ప్రయోజనం శూన్యం. ఒక నవ్వుతో, చిన్న ముద్దుతో నా మాట కొట్టిపారేసేది. అందుకే దగ్గరుండి సాధించలేనిది ఏడాదిగా నా మొహం కూడా చూపకుండా సాధించాలని ప్రయత్నిస్తున్నాను. ఎందుకంటే అమ్మకి ఉన్న ఏకైక ఆధారం, ఆశ నేనే. నన్ను దగ్గరికి చేర్చుకోవడం కోసమైనా తన ప్రవర్తనను మార్చుకుంటుందని నా ఆశ"

చాలా సేపటి ఆలోచన తరవాత సుధ ఒక నిర్ణయానికి వచ్చింది.

'సహృదయా! పైకి చూడడానికి మీ మమ్మీ విపరీత ధోరణి సంపన్న కుటుంబాలలోని ఐశ్వర్య జాడ్యంలాగే కనిపిస్తోంది. కేవలం హాబీగా మొదలై వ్యసనం కావడమే ఆవిడ సమస్య అయితే దానిని మాన్పించడం పెద్ద కష్టం కాదు. ఇప్పుడు వ్యసనాలను మాన్పించేందుకు తగిన చికిత్సనందించే పునరావాస కేంద్రాలు, ప్రకృతి వైద్యశాలలు పట్టణాలలో చాలానే వచ్చాయి. దేనిలోనైనా చేర్పించి మామూలు మనిషిని చేయవచ్చు" చెప్పింది. హృది కళ్లు ఆనందంతో మెరిశాయి.

"అవునా మేడమ్? !" సంతోషం నిండిన గొంతుతో అంది హృది. ఆమె మొహం ఆనందంతో వెలిగిపోయింది. "అయితే ఎలాగైనా మీ దగ్గరకి తీసుకొస్తాను. మీకు తెలిసినచోట మమ్మీని చేర్పించి వైద్యం చేయించండి" ఉద్వేగంగా అడిగింది.

సుధ వెంటనే మాట్లాడలేదు "హృదీ! ఇందులో ఓ చిన్న ఇబ్బంది ఉంది. ముఖ్యంగా చికిత్స తీసుకొనే వ్యక్తి మనస్ఫూర్తిగా తన బలహీనత వదులుకోవడానికి సిద్ధపడి సహకరించాలి. అలా మీ అమ్మ మనకి సహకరించాలంటే అసలు ఆవిడ వ్యసనాలకి ఎందుకు అలవాటు పడ్డారనే కారణం స్పష్టంగా తెలియాలి.

స్నేహితులు ముగ్గురూ అయోమయంగా మొహాలు చూసుకున్నారు.

"మీకు అర్థం కాలేదు కదూ! కేవలం హాబీయే బలహీనతగా మారి ఉంటే నీ ప్రయత్నాలకి ఈపాటికే ఆవిడలో కొంతైనా మార్పు వచ్చి వుండాలి. కానీ కనీసం నీ తండ్రి పేరైనా నీకు తెలియనివ్వకుండా పెంచడం, మోహన్ ఎవరో చెప్పకపోవడం, సాంప్రదాయ సిద్ధంగా పెరిగిన వ్యక్తి వ్యసనపరురాలిగా మారడం ఇవన్నీ నాకు సందేహాలు కలిగిస్తున్నాయి. మీ మమ్మీ గతంలో నీకు తెలియని చేదు ఏదో ఉంది. దాన్ని వ్యసనాల మత్తులో జోకొట్టేందుకు ఆమె ప్రయత్నిస్తోంది. ముందు నువ్వు అదేమిటో తెలుసుకొని మానసికంగా ఓదార్పు అందిస్తేనే మనం ఆవిడకి వేరే ఏ రకమైన చికిత్స చేయించినా ఫలితం ఉంటుంది"వివరించింది.

అర్థమయ్యీ కానట్లున్న ఆ మాటలకు యథాలాపంగా తలూపింది సహృదయ. తృప్తిగా నిట్టూర్చింది సుధ. "సరే అయితే, ఈసారి నువ్వు అమ్మని మళ్లీ కలిసినపుడు ఎలాగైనా ఆవిడ గతాన్ని తెలుసుకొని రా! దానిని బట్టి ఆవిడకు ఏ రకం చికిత్స చేయించాలన్నది నిర్ణయిద్దాం" చెప్పి సుమన కేసి తిరిగి "ఓకే. సుమనా! ఇప్పుడు నీ వంతు. నీ సమస్య ఏమిటి? " ప్రశ్నించింది.

చిన్నగా నవ్వింది సుమన. "వీళ్లిద్దరి సమస్యలతో పోల్చుకుంటే నాదీ ఒక సమస్యేనా? చిన్న విషయాన్ని పెద్దదిగా ఊహించుకుని భయపడుతున్నట్లు మీకు అనిపించవచ్చు"

సుధ కూడా నవ్వేసింది. "నీది చిన్న సమస్యా, పెద్దదా అని తేల్చవలసింది నేను. నువ్వు ముందు చెప్పాల్సింది మొదలుపెట్టు"

తన ముందున్న గ్లాసులోని నీళ్లు కాసిన్ని తాగి గొంతు సవరించుకుంది సుమన.

8



ముంబాయి నగర శివార్లలో ఖండాలా దారిలో ఓ పెద్ద ఫార్మ్‌హౌస్‌లోని బంగ్లా ముందు ఆగింది డాక్టర్ చటర్జీ మెర్సిడెస్ కారు. వాచ్‌మేన్ సెల్యూట్ చేసి గేటు ఓపెన్ చేశాడు. తిన్నగా పోర్టికోలోకి దారితీసి ఆపి దిగాడు. దాదాపు ఏభై సంవత్సరాలు దాటిన చటర్జీకి కేర్‌టేకర్ పాతికేళ్ల షీలా ఎదురొచ్చి నమస్కరించి ఆయన చేతిలోని

మెడికల్ కిట్ అందుకుంది.

"మేడమ్ ఎక్కడున్నారు?" కోటు సర్దుకుంటూ లోనికి దారితీస్తూ అడిగాడు.

"పైన తన రూమ్‌లోనే ఉన్నారు" బదులిచ్చింది షీలా.

ఆమె చేతిలోని కిట్ తీసుకొని పైకి వెళ్లి దగ్గరగా ఉన్న డోర్ తట్టి...

"జానకీ! నేను చటర్జీని" అన్నారు.

"రండి" అనుమతిచ్చింది జానకి. ఆమె గొంతులో మత్తు లేకపోవడం గమనించి నిట్టూరుస్తూ లోనికి వెళ్లారు.

"రండి డాక్టర్, చెకప్‌కి వచ్చారా? కూర్చోండి" సోఫాలో కూర్చుని అకౌంట్ బుక్స్ చూస్తున్న జానకి కళ్లజోడు తీసి పక్కన పెడుతూ ఆహ్వానించింది.

పూర్తిగా నలభైఏళ్లు నిండకుండానే కళ్లకింద నల్లచారలతో, బుగ్గలు ఉబ్బిపోయి నలిగిపోయిన చీరలో, అక్కడక్కడ నెరిసిపోయి చెదిరిపోయిన జుట్టుతో చూస్తేనే ఏదో తెలియని వేదన కలిగించేలా ఉన్న ఆమెని చూస్తుంటే ఇరవై ఏళ్లక్రితం పసితనం వీడని మొహంతో, చేతిలో ఏడాది పసిబిడ్డతో బిక్కు బిక్కుమంటూ, నా అనే వాళ్లని ఎరగని, భాష కూడా తెలియని పదిహేడేళ్ల అమాయకపు పడుచుగా తొలిసారి ఆమెని చూసిన బేల రూపం గుర్తొచ్చింది.

కూర్చోవడం కూడా మర్చిపోయినట్లు తననే చూస్తున్న చటర్జీకి మంచినీళ్లు తెచ్చి ఇచ్చి "ఏమిటి ఆలోచన? కూర్చోండి. కాఫీ, టీ లేదా హాట్ డ్రింక్... అని ఓం మర్చిపోయాను. మీరు గాంధేయవాదులు కదా! చెడు అలవాట్లకి దూరం" అని నవ్వింది.

మంచినీళ్ల గ్లాసు టీపాయి పైనుంచి కూర్చుంటూ తానూ నవ్వేశారు చటర్జీ.

"ఒకసారి వచ్చి ఇలా కూర్చో చాలా రోజులుగా నీతో ముఖ్య విషయం మాట్లాడాలని ప్రయత్నిస్తుంటే,ఇదిగో ఈరోజు కుదిరింది" జానకిని పిలిచారు.

చటర్జీ ఎదురుగా కూర్చొని"చెప్పండి...?" చేతులు కట్టుకొని అడిగింది.

"నెల రోజుల క్రితం హృది నాకో మెయిల్ పంపింది. ఎవరో శ్రీరామ్ అనే వ్యక్తి సెల్ నుండి తరచుగా... నేను నిన్ను దూరం చేసుకున్న నిర్భాగ్యుడిని, నువ్వు నా ముద్దుల బిడ్డవు వంటి సంకేతాలు వస్తున్నాయట. అతని నెంబర్‌కి రింగ్ చేస్తే సరైన బదులు ఇవ్వకుండా వేదాంతం మాట్లాడుతున్నాడట. ఆ వ్యక్తి ఎవరో మీకు తెలుసా? అంకుల్ అంటూ నన్ను అడిగింది" చెప్పడం ఆపి జానకి మొహంలోకి చూశారు. మనిషి నిటారుగా అయ్యింది. కనుబొమలు ముడేసి చూస్తూ శ్రద్ధగా వింటోంది.

"మీరేం చెప్పారు...?" కాస్త ముందుకు వొంగి ఆత్రంగా అడిగింది.

భుజాలు ఎగరేసి... "ఇంకా ఏం చెప్పలేదు. నీతో సంప్రదించకుండా హృదికి నిజం చెప్పడం నాకిష్టం లేదు. అందుకే ఏమీ చెప్పలేదు" అన్నారు.

తల వెనక్కి ఆన్చి కళ్లు మూసుకొని... "ఇన్నాళ్లకి శ్రీరామ్‌కి భార్యగా నేనక్కరలేకపోయినా కూతురు కావాల్సి వచ్చిందన్నమాట. పోనీయండి డాక్టర్. ఇదీ మంచిదే. ఆడపిల్లగా సహృదయకు తండ్రి అండ చాలా అవసరం. హృదికి నిజం చెప్పేయండి. కనీసం ఇప్పుడైనా తండ్రిగా హృది బాధ్యత తీసుకుంటే నాకంతే చాలు" నిర్లిప్తంగా అంది.

"ఆ మనిషి ఎలాంటివాడో తెలిసీ అల్లారు ముద్దుగా పెంచుకున్న హృది భవిష్యత్తు అతని చేతుల్లో పెడతావా? ఇన్నాళ్లు లేనిది ఇప్పుడెందుకు అతనికి కూతురు మీద ప్రేమ పొంగిందో ఆలోచించావా...?" అడిగారు.

జానకి సర్దుక్కూర్చుంది. "ఆలోచించడానికి ఏముంది? శ్రీరామ్‌కి పిల్లలు లేరు. ఇప్పటికి కూతురు గుర్తొచ్చి మనసు కరిగి తన బిడ్డను తన దగ్గరికి చేర్చుకోవాలనే కోరిక కలిగి ఉంటుంది. అతను నన్ను కాదన్నా తండ్రిగా హృది మీద మమకారం ఉండే ఉంటుంది" తన ఊహకి కారణాన్ని వివరించింది.

"నువ్వు ఇంత అమాయకంగా ఆలోచిస్తావు కనుకే ఆనాడు నిన్ను పసిబిడ్డతో సహా గెంటేశాడు. ఈనాడు హృదిలోని తండ్రిపై ఉండే మమకారాన్ని వినియోగించుకుని నీ నుండి ఈ ఆస్తిపాస్తులతోపాటు నీ ఏకైక ఆధారమైన నీ కూతుర్ని కూడా లాక్కోవాలని చూస్తున్నాడు" లేచి పచార్లు చేస్తూ అసహనంగా అన్నాడు.

"డాక్టర్! మీరేం చెబుతున్నారో నాకర్థం కావడం లేదు" అయోమయంగా అంది.

"శ్రీరామ్‌కి పూనమ్ వల్ల పిల్లలు పుట్టరనే నిజం ఎప్పుడో పదిహేనేళ్ల క్రితమే తెలిసింది. కానీ ఇప్పటివరకు తనకో కూతురుంది అన్న నిజాన్నే అతను గుర్తించలేదు. మరి ఇప్పుడెందుకు కూతురు గుర్తొచ్చిందా? అని సందేహం కలిగి నా కొడుకు శరత్ చేత వివరాలు సేకరించాను. వాడు బి.ఎల్. పూర్తిచేసి లాయర్ శ్రీవాస్తవ దగ్గర జూనియర్‌గా చేస్తున్నాడు. శ్రీవాస్తవ ఈ శ్రీరామ్‌కి ఫ్యామిలీ లాయర్. ఆయనవల్ల శరత్ తెలుసుకున్నదేమిటంటే శ్రీరామ్ తండ్రి తన ఆస్తినంతా శ్రీరామ్ సంతానానికే చెందాలని, అలా కాకపోతే తిరుమల తిరుపతి దేవస్థానానికి చెందాలని విల్లు రాసి ఆరునెల్ల క్రితం చనిపోయాడట. అదీ అసలు కీలకం" ఆగారు చటర్జీ.

ఆ వార్త వింటూనే జానకి మొహం పాలిపోయింది. "మామయ్య చనిపోయాడా...?" ఆమె గొంతు పీలగా ధ్వనించింది.

"శ్రీరామ్ రక్తం పంచుకు పుట్టిన బిడ్డలనే తప్ప దత్తత తీసుకున్న సంతానాన్ని తాను శ్రీరామ్ సంతానంగా గుర్తించనని ఆయన విల్లులో రాశారట. దానితో శ్రీరామ్ పని కుడితిలో పడ్డ ఎలుకలా తయారయ్యి దిక్కుతోచక శ్రీవాస్తవ సలహా కోసం వచ్చాడు. ఎలాగో శ్రీవాస్తవ గిమ్మిక్స్ చేసి ఆరునెల్ల పాటు విల్లు క్లయిమ్ చేసుకోడానికి డిక్రీ తెచ్చాడు" తను తెలుసుకున్నది చెప్పారు.

జానకి పెదాలపై విషాదంతో కూడిన నవ్వు కదిలింది. "మామయ్యకి నేనంటే చాలా ఇష్టం. శ్రీరామ్ మోసం చేశాడని తెలిసి తరచు నీ బతుకు నేనే నాశనం చేశానమ్మా అని బాధపడేవారు. శ్రీరామ్‌తో సంబంధాన్ని వదులుకున్నా ఆయనకి శ్రీరామ్‌కి మరి పిల్లలు పుట్టలేదని తెలిసి ఉంటుంది. అందుకే హృదిని తండ్రి దగ్గరకు చేర్చాలనే ఉద్దేశంతోనే విల్లు అలా రాసి ఉంటారు"

**"మామయ్యకి నేనంటే చాలా ఇష్టం. శ్రీరామ్ మోసం చేశాడని తెలిసి తరచు నీ బతుకు నేనే నాశనం చేశానమ్మా అని బాధపడేవారు.**

"కానీ... శ్రీరామ్‌గాడి బుద్ధి మంచిది కాదుగా! అందుకే వెధవ ఆలోచనలు చేస్తున్నాడు" విసుక్కొన్నారు చటర్జీ.

"అంటే!?" అర్థం కానట్లు చూసింది.

"ఆరునెల్ల గడువు ఆస్తి క్లయిమ్ కోసం ఎందుకు కోరారనుకున్నావు? ఈ ఆరునెలల్లోనూ ఏదోరకంగా మాయచేసి హృదిని తనవైపు తిప్పుకోమని లాయర్ శ్రీవాస్తవ సలహా ఇచ్చాడట. కాకపోతే ఓ చిన్న అదృష్టం మనకి కలిసివచ్చింది. తండ్రిగా తన గురించి హృదికి నువ్వు ఎంతవరకు నిజాలు చెప్పావన్నది శ్రీరామ్‌కి తెలియని విషయం. అందుకే హృదికి పంపే సందేశాలన్నీ "తండ్రిగా నన్ను క్షమించు" లాంటి కప్పదాటు వ్యవహారాల్లా తనెవరో చెప్పీ చెప్పనట్లు చెబుతున్నాడు. ఒక్కసారి అతడు కనుక హృదికి తండ్రి గురించిన నిజం తెలియదు అని గ్రహిస్తే రెచ్చిపోతాడు. ఏదోరకంగా హృదిని మభ్యపెట్టి తనకి అనుకూలంగా మలచుకుంటాడు. అదే జరిగితే నువ్వు అనాధవైపోతావు" మళ్లీ కూర్చున్నారు.

"ఎలా...?" జానకి గొంతు బలహీనంగా ప్రశ్నించింది.

"హృది ఇప్పుడు మేజర్. శ్రీరామ్‌ని తండ్రిగా అంగీకరిస్తే మీ మామయ్య ఆస్తితోపాటు ఇన్నాళ్లు హృది పేరు మీద నువ్వు చేసే వ్యాపారాలు కూడా ఆమెకే చేర తాయి. బుజ్జగించి శ్రీరామ్ దానిని తన పేర రాయించుకోవచ్చు లేదా ఏ పనికిమాలినవా డికో ఇచ్చి హృదిని కట్టబెట్టి అంతా తన అదుపులోకి తెచ్చుకోవచ్చు అదే జరిగితే ఆస్తినే కాదు. నీ జీవనాధారమైన బిడ్డను కూడా నువ్వు కోల్పోవలసి వస్తుంది" హెచ్చరి కగా అన్నారు డాక్టర్ చటర్జీ.

"తన కన్నబిడ్డ పట్ల కూడా శ్రీరామ్ అంత క్రూరంగా ప్రవరిస్తాడంటారా డాక్టర్...?"

జాలిగా నవ్వారు చటర్జీ. "తన స్వార్థం కోసం కన్నవాళ్లని, కట్టుకున్న భార్యని, కళ్లు తెరవని పసిబిడ్డను గెంటేసిన మనిషికి మమ కారాలుంటాయా? జానకీ. ఇవన్నీ నా అను మానాలు, ఊహలు కాదు. శరత్ ద్వారా తెలుసుకున్న నిజానిజాలు. ఒక జూనియర్ లాయర్‌గా తన సీనియర్ క్లయింట్ తాలూకు రహస్యాలు చెప్పడం శరత్‌కి వృత్తి ద్రోహం. కానీ తండ్రిననే గౌరవంతో నీపై, హృదిపట్ల అభిమానంతో అన్నీ చెప్పాడు. శ్రీరామ్ ద్రోహ ప్రవృత్తి, వాడివల్ల నీకు జరిగిన అన్యాయం తెలిసిన వ్యక్తిగా నీ మేలుకోరి నీకు వివరంగా చెప్పాను" మృదు వుగా అన్నారు.

నిస్సహాయంగా చూసింది జానకి. "నేనేం చెయ్యను డాక్టర్, హృదిలో నేను చెప్పే నిజాలు వినే సహనం లేదు. నా గొంతు వింటేనే మాటలతో నన్ను హింసిస్తోంది"

చటర్జీ అంగీకారంగా తల ఊపారు. "నేనే ఏదో మార్గం ఆలోచిస్తాను. సాధ్యమైనంత వరకు త్వరలో హృదికి నిజం తెలియాలి. లేదంటే చాలా ప్రమాదం. సరే, నేను వెళ్తాను. వీలైతే నేను హృదికి నిజానిజాలు తెలియజేస్తాను. నువ్వేం కంగారుపడకు. నీ బిడ్డ నీకు దూరం కాకుండా నేను చూస్తాను" భరోసా ఇస్తున్నట్లు భుజం తట్టి వెళ్లిపో యారు చటర్జీ.

చాలాసేపు కర్తవ్య మూఢురాలిలా ప్రశ్నవ డినట్లు ఉండిపోయింది. ఆలోచనలతో తల పగిలి పోతున్నట్లుగా ఉండి విసురుగా లేచి ఆ గదిలో ఓ మూల ఉన్న లిక్కర్ కాబిన్ దగ్గరికి వెళ్లి ఎదురుగా ఉన్న బాటిల్ అందు కొని గటగటా తాగేసింది. మత్తు కొద్దికొద్దిగా మెదడుకు చేరుతుంటే మనసులోని అలజడి శాంతిస్తున్నట్లు అనిపించసాగింది. చేతిలోని సీసాని నేలకి విసిరికొట్టి కసిగా "శ్రీరామ్... నువ్వు మనిషివి కాదు" అని అరిచింది.




"నా సమస్య ఉదయం తొమ్మిదిదాకా, మళ్లీ సాయంత్రం ఆరు తరవాత మొదలౌతుంది. సెలవు రోజుల్లో రోజంతా తప్పదు. ఆరోజు నేను త్వరగా బయటికి పోవడానికి దార్లు వెతు క్కుంటాను" చేతిలో పెన్నును గాజు టేబుల్ మీద తిప్పి దానినే చూస్తూ చెప్పింది సుమన.

"కాస్త వివరంగా చెప్పగలవా...?"

సుధ కోరింది.

"నా సమస్యకు కారకులు అమ్మా, నాన్న. కారణం వాళ్ల మధ్య నిత్యం జరిగే అనవస రపు కలహం. అవడానికి వాళ్లది పెద్దలు చేసిన పెళ్లే. అయినా పెళ్లయిన కొత్తలో చాలా అన్యోన్యంగా ఉండేవారట. పెళ్లినాటికి కేవలం టెన్త్ మాత్రమే చదివిన అమ్మను ప్రోత్సహించి డిగ్రీ, స్టెనోకోర్సు చేయించి డాడీ తనే ఉద్యోగం వేయించారు. కలతలు ఎలా మొదలయ్యాయో కానీ నేను పుట్టాక అవీ

పెరిగాయని వాళ్ల మాటలవల్ల తెలిసింది. డాడీకి తాగుడు అలవాటయ్యింది. దాంతో సమస్య పెద్దదయ్యి పిల్లల ఎదురుగానే వాదు లాడుకొనే స్థాయికి వచ్చారు. ఆఖరికి ఆ వాద నకు కారణం కూడా బలంగా ఉండదు. ఇంటిపనిలో డాడీ సాయం చెయ్యడం లేదనో, రిసీవ్ చేసుకోడానికి టైమ్‌కి ఆఫీసు దగ్గరకు రావడంలేదనో, ఇంట్లోనే తాగుతున్నారనో... రోజూ ఓ కొత్త వంక వెతుక్కొని వీధిలోకి వినపడేలా అరుచుకుంటారు"

"అంటే... వాళ్ల గొడవల్లో వాళ్లుండి నిన్ను, మీ అన్నయ్యను నిర్లక్ష్యం చేస్తున్నారా? "

ఒక్క నిమిషం ఆలోచించి, తల అడ్డంగా ఊపి, "అదేం లేదు మేడమ్. వాళ్లు ఎంత పోట్లాడుకున్నా కన్నవాళ్లుగా మాకు లోటు చెయ్యలేదు. ఇంటిపని, వంటపని అమ్మే చూసు కుంటుంది. బట్టలు, ఫీజు లకి ఎంతడిగినా ఇస్తారు"

"మరి ఇంక మీ అమ్మానా న్నల వల్ల నీకున్న సమస్య ఏమిటి? " సుధ కావాలనే విస్మయాన్ని నటించింది.

అంతకు రెట్టింపు ఆశ్చర్యంగా చూసింది సుమన. "అదేమిటి మేడమ్! పిల్లలకి తిండి, బట్ట ఇచ్చి అవసరాలు తీరిస్తే అమ్మా నాన్నల బాధ్యత తీరిపోతుందా...? అదృష్ట వశాత్తూ నాకు తెలిసి అన్నయ్యకి ఏ దురల వాట్లు లేవు. అలాకాక వాడికేమైనా చెడు అల వాట్లు అయితే వాడిని మందలించే అర్హత నాన్నకి ఉందా...? నన్నెవరైనా పోకిరాళ్లు ఏడిపించినా, వెంటపడి వేధిస్తున్నా నేను నా కన్నవాళ్ల సహాయాన్ని ఆశించలేను. ఎందు కంటే వాళ్లకి పోట్లాడుకునే తీరికే కానీ నా గురించి పట్టించుకొనే తీరిక లేదు. నాకన్నా మనస్వే నయం. అనుక్షణం వాళ్లమ్మ దానిని వెయ్యికళ్లతో కాసుకుంటుంది. మా అమ్మ...! నేను ఇరవై నాలుగు గంటలు కనపడకపో యినా పెద్దగా కంగారుపడదు. అదే నాన్న అరగంట ఆలస్యంగా వస్తే చాలు ఎక్కడ తాగి పడిపోయారోనని కంగారుపడిపో తుంది. విచిత్రం ఏమిటంటే నాన్న అసలు బయట తాగనే తాగరు. ఇంట్లోనే. అదీ రాత్రి పడుకునే ముందు రెండు పెగ్గులు తాగుతారు. దానికి ఒకటే రాద్ధాంతం" బాధగా పెదవి నొక్కుకుంటూ ఆగిపోయింది.

"మీ వాళ్లది పెద్దలు కుదిర్చిన పెళ్లే కనుక బంధువులతో సంబంధాలు బాగానే ఉండాలి. మరి ఎవరైనా వచ్చినా, ఏ శుభకార్యాలకైనా వెళ్లినా వీళ్ల ప్రవర్తనలో మార్పు ఉండదా...? " సుధలోని సైకాలజిస్ట్ ప్రశ్నిం చింది.




సుమ పెదాలపై చిరునవ్వు కదిలింది. "ఊహూ! అది భలే తమాషాగా ఉంటుంది. పరిస్థితి పూర్తిగా మారిపో తుంది. అమ్మానాన్నలి ద్దరూ ఆదర్శ దంప తుల్లా కలిసి మర్యాదలు, సత్కారాలు చేసి సాగనంపుతారు. ఆ తరవాత చూడాలి అసలు తంతు. మీ వాళ్లు ఇలా ఉన్నారంటే, మీ వాళ్లు అలా అన్నా రంటూ వాదులాడుకొని అలిగి రోజుల తర బడి మాట్లాడుకోవడం మానేస్తారు. కొన్నా ళ్లకు మళ్లీ మామూలే. నాకైతే విసుగేస్తుంది. ఎందుకొచ్చిన నటనలు, ఆత్మవంచనలు. ఒక రికొకరు పడడంలేదు అనుకున్నప్పుడు హాయిగా విడాకులు తీసుకొని ఎవరి మానాన వాళ్లు బతకవచ్చుగా అనిపిస్తుంది. వీళ్ల ధోరణికి విసిగిపోయే నాలో పెళ్లి అంటే ఒక రకమైన వెగటు భావన పేరుకుపో యింది" మొహం చిట్లించి ఆ వెగటు తన గొంతులో ధ్వనిస్తుండగా అంది.

సుధ స్నేహంగా నవ్వింది. "ఎదిగిన పిల్ల లతో స్నేహంగా ఉండవలసిన తల్లిదండ్రులు వాళ్ల ధోరణే వాళ్లకి ముఖ్యం అన్నట్లు ఉండడం ఎంత బాధాకరమో నేను ఊహించ

# చతుర భాషితాలు

ఎన్నో ధర్మ సిద్ధాంతాలను చదివి మన సందేహాలను తీర్చుకోవచ్చును. అయితే చివరకు ఉపయోగపడేది క్రమబద్ధమైన జీవితమే కానీ మరేదీ కాదు.

**- తిరువళ్ళువర్**

గౌరవం శాసించి తెచ్చుకునేది కాదు, అది ఆర్జించి సంపాదించుకునేది

**-రామానంద్ ఛటర్జీ**

చెడు ఉద్దేశంతో చెప్పిన నిజం నీవు కొత్తగా కల్పించే అన్ని అబద్ధాలను ఓడిస్తుంది.

**-విలియం బ్లాక్**

ఒక శ్రేష్ఠమైన జాతిని నిర్మించేందుకు మార్గం - శ్రేష్ఠమైన వ్యక్తుల్ని తయారుచేయటమే.

**-ఎం. విశ్వేశ్వరయ్య**

తన వద్దలేని గుణాన్ని ప్రదర్శించే ప్రయత్నంలో దాదాపు ప్రతి వ్యక్తీ తన జీవితంలోని కొంత భాగాన్ని వ్యర్థం చేస్తుంటాడు.

**-శామ్యూల్ జాన్సన్**

అమితోత్సాహం, కౌశలం, అపజయాన్ని అంగీకరించని మనోబలం ఏ సాహసకార్యంలోనైనా విజయానికి దారిచూపే సుగుణాలని వివేకవంతులు అంటారు.

**-రామాయణం**

భగవంతునిపై విశ్వాసం, ఉత్తమ గ్రంథాల సాహచర్యం ఈ రెండూ కలవానిని మిత్రులు లేనివాడని అనకండి.

**- రస్సెల్**

తాము గొప్ప జాతిగా నిలబడాలని కోరుకునే ప్రజలు సామూహిక క్రమశిక్షణ కలిగి ఉండడం అత్యంత అవశ్యకమైన షరతు.

**- మహాత్మాగాంధీ**

స్వయం శిక్షణ, ఆత్మ సంయమనం లేకుండా ప్రపంచంలో నిజంగా విలువయినది పొందడం సాధ్యం కాదు.

**- నార్మన్ విన్సెంట్ పీలే**

అన్ని వస్తువుల్లోనూ అత్యంత చౌకైనది కనికరం. ఎంతమాత్రం ఖర్చు లేనిది, స్వార్థత్యాగం అవసరం లేనిది.

**- స్మైల్స్**

గలను. కానీ... ఇక్కడ నువ్వు, నీ వయసు పిల్లలు గమనించవలసిన విషయం ఏంటంటే ఇది నీ ఒక్కదాని సమస్యా కాదు' ' సుధ తన సీట్లోంచి పైకి లేచి చేతులు కట్టుకొని పచార్లు చేస్తూ చెప్పింది.

"ఉరుకుల పరుగుల జీవితం. బాధ్యతల కారణంగా పెరిగే ఆర్థిక అవసరాల వత్తిళ్లు. సమాజం మారినంత వేగంగా నిన్నటితరం దానికి అనుగుణంగా మారలేకపోవడం. ఇవన్నీ పెళ్లయిన కొత్తలో భార్యాభర్తలు ఒకరిపై ఒకరు కనపరిచే ప్రేమానురాగాలను అధిగమించడం వల్ల వాళ్ల మధ్య మానసిక- అంతరం పెరిగి అభద్రతా భావానికి దారితీసి సహజంగానే ఆలుమగల మధ్య నా భర్తకి నా కన్నా ఇతర వ్యాపకాలు ఎక్కువయ్యాయి. నాపై ప్రేమ తగ్గింది అనే భావన భార్యలోనూ, నా భార్యకి నేనంటే ఇష్టం తగ్గి మునపటిలా నన్ను పట్టించుకోవడంలేదనే ఉక్రోషాలకు లోనవుతారు. ఎవరికి వాళ్లు ఎదుటివాళ్లు మారాలి, నేను ఎప్పటిలాగే ఉన్నాననే మొండిపట్టుదల తోడై దూరం పెరుగుతుంది.

అలాంటి సమయాల్లో చిన్న చిన్న ఆనందాలను కలిసి పంచుకోవడం, సరదాగా విహారయాత్రలకు, వినోద కార్యక్రమాలకు జంటగా వెళ్లడం, పిల్లల భవిష్యత్తు, ఇంట్లో కొనే వస్తువుల గురించి ఒకరికొకరు సంప్రదించుకోవడం చేస్తే ఆ దూరం చెరిగిపోతుంది. దురదృష్టం, తొంభైశాతం సంసారాలలో అందుకు విరుద్ధంగా జరుగుతుంది. భర్త బయట తిరుగుళ్లకి, పేకాటా, తాగుడు లాంటి కొత్త అలవాట్లకి స్నేహాలకి తల ఒగ్గుతాడు. వాటి నుండి భర్తలను మరల్చలేని భార్యల భావాలను తప్పకుండా అవి గాయపరిచి ఆడవాళ్లకి ఆయుధాలైన సాధింపు, ఏడుపు, సణుగుళ్లతో తమ దారికి తెచ్చుకోవాలని చూస్తారు. ఫలితం రోజూ ఇంట్లో గొడవలు..., వాదాలు మధ్యలో నలిగిపోయేది పిల్లలు. ఈ సమస్య తొంభైశాతంమంది ఎదుర్కొంటున్నారు. దీనికున్న ఏకైక మార్గం తల్లిదండ్రులను, పిల్లలను సమావేశపరచి ఒకరికొకరు మనసు విప్పి మాట్లాడుకునేలా చెయ్యడం. అలా సాధ్యం కాదనుకుంటే విడివిడిగా కౌన్సిలింగ్ జరిపి సమస్యను చర్చించి పరిష్కరించాలి"

చెప్తుండగానే అలారం ఎనిమిది అయినట్లు మోగింది. సుధ వాళ్లకేసి తిరిగింది.

"మీకిచ్చిన సమయం ముగిసింది. కనుక ఈనాటి సమావేశాన్ని ఇక్కడతో ఆపుదాం. ఈరోజు మీ సమస్యలు చెప్పారు. మరోరోజు వాటి పరిష్కారానికి తీసుకోవలసిన చర్యలు చర్చిద్దాం. సరేనా...? "

"ఓకే. మేడమ్! మళ్లీ ఎప్పుడు కలవమంటారు? " హృది అడిగింది.

"రెండు క్షణాలు ఆలోచించి, ప్రతీ శనివారం ఆరు తరవాత వచ్చేముందు ఒక గంట ముందు ఫోన్ చేసి కలవవచ్చు" చెప్పింది.

ఆవిడకి కృతజ్ఞతలు చెప్పి తేటబడిన మొహాలతో ముగ్గురు బయటకి నడిచారు.




అధునాతనమైన బట్టలషాపు ముందు కారుని ఆపి మనస్వి సుభద్ర దిగాక "మీరు లోపలికి వెళ్ళి బట్టలు చూడండి. నేను కారు పార్కుచేసి వస్తాను" ట్రాఫిక్‌లో కారు పార్కు చేసే స్థలాన్ని వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు చక్రధరం.

సుభద్ర తిన్నగా చుడీదార్స్ విభాగంలోకి నడిచింది. నిజానికి సన్నగా, పొడుగ్గా ఉండే మనస్వికి మిడ్డీస్, జీన్స్ టీషర్ట్సు చాలా బాగా

నప్పుతాయి. కానీ సుభద్ర దృష్టిలో అవి విచ్చలవిడికి నిదర్శనాలు కనుక నిషిద్ధాలు కూడా. రావడమే కానీ బట్టల ఎంపికలో కూడా మనస్వి ప్రమేయం ఉండదు. అన్నీ ఆవిడ నిర్ణయాలే అవుతాయి.

సేల్స్‌గర్ల్ చూపించిన లేటెస్ట్ వెరైటీలలో తనకి నచ్చినవి తీసి మనస్వి మెడ దగ్గర పెట్టి చూసి రేట్ల వివరాలు కనుక్కొని పక్కన పెడుతోంది. కానీ మాటవరస్సకైనా "నీకేది నచ్చిందా?" అని అడగలేదు. మరీ బొమ్మలా నుంచోవడం ఇబ్బందిగా అనిపించి తల్లి పక్కన పెట్టిన వాటిని తడుముతూ చుట్టూ ఉన్న దుస్తులను, వ్యక్తులను గమనిస్తున్న ఆమె దృష్టి అటుగా వస్తున్న మనోజ్ మీద పడి ఉలిక్కిపడింది. సుమ అన్నయ్య చూస్తే పలకరిస్తాడేమో? ఆడపిల్లతో మాట్లాడితేనే అమ్మ ఊహలు ఎక్కడికో వెళ్ళిపోయాయి. ఇంక మగాడు పలకరిస్తే నా పని కోర్టు మార్షలే. ముందు అతని కంటపడకుండా తప్పుకోవాలి అనుకుంటూ

మనస్వితో మాట్లాడినంతసేపు ఆమె కళ్ళలో, మొహంలో కదిలిన హావభావాలు అతనిలో ఇదీ అని చెప్పలేని సంతోషం కలిగించాయి.

"అమ్మా, ఇప్పుడే వస్తాను" తల్లి పిలుపును లెక్కచేయకుండా వడివడిగా అక్కడి నుండి తప్పుకొని బయటకి వస్తుంటే ఆమె భయపడినట్లు మనోజ్ ఎదురుపడి పలకరించనే పలకరించాడు.

"హలో! మీరు మనస్వి కదూ! నన్ను గుర్తుపట్టారా? సుమ అన్నయ్యను. నా పేరు మనోజ్" తనని తాను పరిచయం చేసుకున్నాడు.

"హలో! ఆ! తెలుసు" ఇబ్బందిగా బుర్రూపుతూ చున్నీ సర్దుకుంటున్నట్లు భుజాల మీదగా వెనక్కి చూసింది. తల్లి అటు తిరిగి సేల్స్‌గర్ల్‌తో బేరాలాడడంలో మునిగి ఉంది. పైగా ఒక బొమ్మ ఉన్న షోకేస్ ఈ పక్కవారు కనపడకుండా అడ్డుపడుతోంది. మరి కాస్త దాని చాటుకి జరిగి నిశ్చింతగా ఊపిరి పీల్చుకుంది.

అతను మను పరిస్థితి, ఆలోచనలు పట్టించుకోలేదు. "కుక్కపిల్లల గురించి ఈ-మెయిల్ చేసింది మీరేనని సుమ చెప్పింది. చాలా థాంక్స్"

"వాటిని బ్లూక్రాస్ వాళ్ళు తీసుకెళ్ళారా...?" సంతోషంగా అడిగింది.

"ఆ! ఆరోజే తీసుకెళ్ళారు. నేను ఫోన్ చేసి కనుక్కున్నాను. సరే, ఈరోజు సుమని కలిశారా?" మాటల్ని పొడిగించాలన్నట్లు అడిగాడు.

"ఉదయం కాలేజీలో కలిశాను. అమ్మతో బజారు పని ఉందని చెప్పాను"

"ఓ...? మీ అమ్మగారు కూడా వచ్చారా? మరి పరిచయం చెయ్యరా?" చొరవగా అడిగాడు.

పక్కనే బాంబు పడినట్లు బెదురుగా చూసింది. "ఇదేం కోరిక ఇతగాడికి?" ఎరక్కపోయి మాట్లాడాను. మనసులో గొణుక్కుంటూ పైకి మాత్రం "అమ్మ లోపలెక్కడో ఉంది. మరోసారి ఎప్పుడైనా..." అంటూనే తల్లి చేతిలో ప్యాకెట్లతో తనని వెతుక్కుంటూ రావడం గమనించి... "వెళ్తాను" హడావిడిగా వీడ్కోలు తీసుకొని గబగబా తల్లికి ఎదురెళ్ళింది.

ఆమె వెళ్ళిన వైపే చూస్తుండిపోయాడు మనోజ్. మనస్వితో మాట్లాడినంతసేపు ఆమె కళ్ళలో, మొహంలో కదిలిన హావభావాలు అతనిలో ఇదీ అని చెప్పలేని సంతోషం కలిగించాయి.

"ఎక్కడికి పోయావు...? ఇటునుండి వస్తున్నావేమిటి?" గద్దిస్తున్నట్లు అడిగింది తల్లి.

"అదీ...!" ఏం చెప్పాలా అని తడుముకుంటుంటే "నేనే మనూని పిలిచాను" వెనక నుండి తండ్రి గొంతు వినబడి తుళ్ళిపడింది.

"మనోజ్‌తో మాట్లాడడం డాడీ చూశారా?"

మనసులోనే గాభరా పడింది.

"మీరు పిలిచారా? ఎందుకు? " సుభద్ర అడిగింది.

"బయట షోకేస్‌లో ఓ డ్రస్ ఉంది. చూద్దాం రమ్మంటే, అమ్మని పిలుస్తాను డాడీ అంటూ నీ కోసం వచ్చింది" చెబుతూనే బయటికి దారి తీశాడు చక్రధరం.

"పిస్తా గ్రీన్ కలర్‌కి మెరూన్ కలర్ దారంతో కుందన్స్, అద్దాలు, పూసలతో నిండుగా ఎంబ్రాయిడరీ చేయబడి చూడగానే సొంతం చేసుకోవాలి అనిపించేలాగ ఉంది. ఆ డ్రస్ మనస్వికి కూడా బాగా నచ్చింది.

"చాలా బాగుంది కదమ్మా!" మెరుస్తున్న కళ్లతో అంది.

"ఖరీదెంతో కనుక్కున్నారా? "భర్తనడిగింది.

"ఆc! ఏడువేలు"

సుభద్ర కళ్లు విచ్చుకున్నాయి. "మరీ అంత ఖరీదా? "

"పోన్లే, డ్రస్ బాగుంది. మనూకి నచ్చింది తీసుకో" కళ్లు తిప్పుకోలేనట్లు దానినే చూస్తున్న కూతుర్ని గమనించి అన్నాడు.

"చాలా నచ్చింది. తీసుకోమ్మా" పసిపిల్లలా ఆశగా అడిగింది.

"చాల్లే నోరుముయ్యి, అది ఏడొందలు కాదు, ఏడు వేలు. అంటే ఓ నెల మనింటి ఖర్చు. చూసిన ప్రతీది ఆశపడటానికి చిన్నపిల్లవు కాదు" మనూని కసిరి "దాని మాటలకేం కానీ ఇదిగో బిల్లు. మీరు కట్టిరండి. మేము కారు దగ్గరుంటాం" బిల్లు భర్త చేతిలో పెట్టి మనస్వి చెయ్యి పట్టుకొని విసురుగా కదలింది సుభద్ర. తల్లి ఆగ్రహానికి జడిసి దానిమీంచి చూపులు మరల్చుకుంటున్న మనస్వి గుమ్మం దగ్గర నిలబడి తమనే గమనిస్తున్న మనోజ్‌ని చూడగానే సిగ్గుతో ముడుచుకుపోయింది. తల్లి మాటలు అతను విని ఉంటాడని గ్రహించి అవమానంగా తల వంచుకొని తల్లి చేయి విదిలించుకొని గబగబా కారు దగ్గరకి వెళ్లి వెనక తలుపు తీసి లోపల కూర్చుని విసురుగా మూసి తలొంచుకొని దోసిలిలో మొహం దాచుకుని కూర్చుండిపోయింది. మనస్వి ప్రవర్తనను డ్రస్ కొనలేదనే ఆలకగా భావించి పట్టించుకోలేదు సుభద్ర.

* * *

"రేపు నీ పుట్టిన రోజుకి మాకేం ట్రీట్ ఇస్తావు? " స్కూటీ పార్క్ చేస్తూ అడిగింది హృది.

"రేపు స్పెషల్ క్లాసులున్నాయని అమ్మకి సోప్ రాశాను. అది ఫలిస్తే తప్పకుండా ఇస్తాను" తన బుక్స్ అందుకుంటూ చెప్పింది మనస్వి.

"నువ్విచ్చే ట్రీట్ ఉదయం అయితే మంచిది. సాయంత్రం మళ్లీ నేను డ్వాక్రా స్టాల్ దగ్గరకి వెళ్లాలి" సుమ సైబర్ కేఫ్‌లోకి నడుస్తూ చెప్పింది.

"మనూ! మన కంప్యూటర్ పేరయ్య నా మొగుణ్ణి వెతికారేమో చూద్దామా!" సహృదయ కొంటెగా అడిగింది.

"మొగుణ్ణి వెతకడం ఏమిటి? " ఆశ్చర్యంగా అడిగింది సుమన.

మనూ, హృదీ చెరోపక్క చేరి రసవత్తరంగా మాట్రిమోనియల్ డాట్ కాంతో ఆడిన ఆటని వర్ణించి చెప్పారు. సుమకి కూడా ఇదేదో సరదాగా అనిపించింది. ముగ్గురూ తిన్నగా మనూకి కేటాయించిన కంప్యూటర్ దగ్గరకి వెళ్లి కుర్చీలు లాక్కొని దాని చుట్టూ మూగి కూర్చున్నారు. హృది, మాట్రిమోనియల్ డాట్ కాం ఓపెన్ చేసి తనకి కావలసిన వివరాలు ఫీడ్ చేసి పాస్‌వర్డ్ ఇచ్చింది.

కొన్ని సెకండ్ల తర్వాత మానిటర్ మీద "కంగ్రాట్యులేషన్స్ మేడమ్. మీరు కోరిన వివరాలతో ఉన్న వరుడిని మేము సేకరించగలిగామని తెలియచెయ్యడానికి సంతోషిస్తున్నాము" అన్న అక్షరాలను చూసి తమ కళ్లని తామే నమ్మలేనట్లు "ఏమిటీ దొరికాడా...? " ఆశ్చర్యంగా అనుకున్నారు.

కొన్ని క్షణాలలో... పేరు: ఆనంద్.

వయసు: ఇరవై ఐదు సంవత్సరాలు

ఊరు : రాయవరం

(ఆంధ్రప్రదేశ్‌లో ఓ కుగ్రామం)

వృత్తి: అదే ఊరిలో డ్రిల్లు మాస్టరు.

తల్లిదండ్రులు: వృద్ధులు, తండ్రికి చూపు ఆనదు. తల్లికి అనారోగ్యం.

తోడబుట్టిన వాళ్లు: ఎవ్వరూ లేరు.

ఆస్తిపాస్తులు: సొంత ఇల్లు, రెండు ఎకరాల పొలం, పాడిపశువులు.

హాబీలు: సంగీతం వినడం, కవిత్వం రాయడం.

చదువుతున్న సుమన "ఇదేమిటే, అదేదో జానపద కథలా నీ అక్షరాలు ప్రాణం పోసుకొని వచ్చినట్లుంది...? నమ్మలేనట్లు అంది.

"ఎవరైనా మన ప్రకటన చదివి ఆట పట్టించడానికి ఇలా చేస్తున్నారేమో? " మనస్వి సందేహంగా అంది.

"నాకూ అదే అనిపిస్తోంది. లేకపోతే మరీ ఇంత మక్కీకి మక్కీ నేనడిగిన వివరాలు కేవలం నాలుగు రోజుల్లో సంపాదించడం అసాధ్యం. అసలు ఈ ఆనంద్ అనే వ్యక్తే ఉండి ఉండడు" హృది ఆమెతో ఏకీభవించింది.

"అదే నిజం" అంటూ ఇది చూడు! ఆ వ్యక్తిని ఎక్కడ కలవాలనుకుంటున్నామో చెబితే పెళ్లిచూపులు ఏర్పాటు చేస్తార"ట. సుమన చదివింది.

"వచ్చే ఆదివారం ట్యాంక్‌బండ్ దగ్గర యోగి వేమన విగ్రహం దగ్గరకి సాయంత్రం ఐదుగంటలకు రమ్మని చెబుతాను" మనస్వి చొరవగా అంది.

"ఏమే మనూ! నేనేదో సరదాగా ఇచ్చిన ప్రకటనకి వచ్చిన పిచ్చి సమాధానం ఇది. దీనినెందుకు పెద్ద విషయం చేస్తున్నారు? " కంగారుగా అంది హృది.

"దీనికే భయమెందుకే? నిజంగా ఆనంద్ అనే వ్యక్తి ఉన్నాడా? లేక ఎవరైనా మనని కావాలని ఏడిపిస్తున్నారా? అన్నదైనా తెలియాలిగా" సుమ వారించింది.

"ఒకవేళ ఆనంద్ అనే వ్యక్తి నిజంగా ఉన్నా నువ్వేం చేసుకోవుగా! ఎవరైనా ఆటపట్టించడానికే చేసినట్లయితే తగిన శాస్తి చేద్దాం" మనస్వి సూచించింది. 'మనూకి, సుమకి ధైర్యం ఉన్నప్పుడు పోయిందేముంది? ' హృది తేలిగ్గా అనుకుంది. "డీల్ ఓకే." అన్న సందేశాన్ని చూసి ముగ్గురూ సంతోషంగా చేతులు చరుచుకున్నారు.




లేత గులాబీరంగు దుస్తుల్లో, వదులుగా అల్లిన రెండు జడలతో మొహానికి ఏ మేకప్ లేకపోయినా మరోసారి చూడాలి అనిపించేంత ముద్దుగా ఉంది మనస్వి. పచ్చని గులాబీలను కానుకగా ఇచ్చి చెరో బుగ్గను ముద్దాడి శుభాకాంక్షలు చెప్పారు ఆమె ప్రియ నేస్తాలు. దగ్గరలోని పెద్ద హోటల్‌కి దారితీసింది మనస్వి. "ఎంత ట్రీట్ ఇమ్మన్నా కానీ... మరీ గులాబ్‌జామ్, ఐస్‌క్రీమ్‌తో సరి పెట్టేస్తావా? " నిష్ఠూరంగా అంది సహృదయ.

"ఇది నా పుట్టిన రోజు ట్రీట్. నేనేదిస్తే మీరు దానినే తీసుకోవాలి" ఖచ్చితంగా చెబుతూ అనుకోకుండా అక్కడికి వచ్చిన మనోజ్‌ని చూసి గతుక్కుమంది.

పక్క కుర్చీని దగ్గరకి లాక్కొని కూర్చుంటూ "ఏమిటీ పుట్టిన రోజు పాపాయిని పార్టీ కోసం వేధిస్తున్నారా? " చనువుగా అడిగాడు.

మనస్వి అతని ఉనికికి ఇబ్బందిపడుతూ, కూర్చుంటూ ఆశ్చర్యంగా చూసింది. ఆమె ఆశ్చర్యం సుమ నోటి వెంట పలికింది. "ఈరోజు మను పుట్టిన రోజని నీకెలా తెలుసు? నేనేం చెప్పలేదే? " అన్నగారిని అడిగింది.

"ప్రతీది నువ్వు చెప్తేనే తెలుస్తుంది అనుక

న్నావా? అయినా పుట్టిన రోజునాడు అమ్మాయిలు ప్రత్యేకంగా ఉండి చూడగానే తెలుస్తారు" పరిశీలనగా మనూనే చూస్తూ, "ఓ పని చేద్దాం. ఎవరి పుట్టిన రోజుకి వాళ్లే ట్రీట్ ఇవ్వడం పాత పద్ధతి. ఈసారి మనూకి మనం పార్టీ ఇద్దాం. అంటే ఇప్పుడయ్యే బిల్లు నేను చెల్లిస్తాను. నా పుట్టిన రోజుకి మీరు ముగ్గురూ కలిసి ఇవ్వండి. సరేనా? " ఉత్సాహంగా అడిగాడు. మనస్వి కనుబొమలు ముడుచుకున్నాయి.

"నువ్వు ఆడాళ్ల మధ్య దూరి చాలా అల్లరి చేస్తున్నావు? "సుమ వ్యంగ్యంగా అంది.

ఒక్కక్షణం సుమకేసి తీక్షణంగా చూసి, "పైన మా ఏనియేషన్స్ మీటింగ్ జరుగుతోంది. ప్రస్తుతం భోజన విరామం. భోజనానికి కిందకి వస్తే మీరు కనిపించారు. విషయం తెలిసి మీరు నాకు పరాయివాళ్లు కారు కనుక అన్నాను. ఇందులో అల్లరేం ఉంది" సూటిగా అడిగాడు.

ఏం బదులివ్వాలో తోచనట్లు ఉండిపోయారు ముగ్గురూ! వాళ్ల మౌనాన్ని అంగీకారంగా తీసుకుని చెయ్యెత్తి "వెయిటర్" పిలిచాడు. గభాలున ఆ చేతిని కిందికి దించేసి "ఇది బర్త్‌డే ట్రీట్. నాకెంత వీలైతే అంతే ఖర్చుపెడతాను. నా గురించి ఎవరూ నిర్ణయాలు తీసుకోవడం నాకిష్టం లేదు" ఖచ్చితంగా చెప్పింది మనస్వి.

మనోజ్ రెట్టించలేదు. ఎర్రబడిన ఆమె మొహాన్నే చూస్తుండిపోయాడు. వెయిటర్ జామూన్స్ తెచ్చిపెట్టాడు. ఓ కప్పు అతని వైపు జరిపి "తీసుకోండి" మర్యాదగా అంది. మనోజ్ తీసుకోలేదు. పైకి లేచి వాజ్ లోంచి ఎర్రగులాబీ తీసి ఆమెకిచ్చి "పుట్టిన రోజు శుభాకాంక్షలు" చెప్పి ఆమె అందుకోగానే వడివడిగా వెళ్లిపోయాడు.

"మనోజ్ బాధపడినట్లున్నాడు" సహృదయ సానుభూతిగా అంది.

"నష్టం లేదు. ఇప్పుడైనా ఎదుటివాళ్ల స్వవిషయాల్లో కలగజేసుకోకూడదని తెలుస్తుంది" చెమ్చాతో జామూన్స్‌ని గుచ్చుతూ నిర్లక్ష్యంగా అంది సుమ.

అతనిచ్చిన పువ్వు కూడా పుస్తకాల్లో పెట్టి "త్వరగా కానీయండి. ఆలశ్యం చేస్తే హోటల్ వాడు బాధపడతాడు" అంది మనస్వి.

నవ్వులతో ముగ్గురూ మామూలుగా అయ్యారు.

* * *

ఆ సాయంత్రం ఒంటరిగా ఇంటికి బయలుదేరింది మనస్వి. సుమన మధ్యాహ్నం క్లాసులు దుమ్మాకొట్టి మరీ డ్వాక్రా స్టాల్స్‌కి వెళ్ళిపోయింది. హృది స్కూటీ క్లచ్‌వైరు తెగిపోవడంతో మెకానిక్ దగ్గరకు తోసుకుపోయింది. జానకి సినిమా ప్రోగ్రాం పెట్టడంతో త్వరగా వెళ్ళాలని గల్లీలో నుండి బస్‌స్టాప్‌కి బయలుదేరింది. ఆ దారిలో నీళ్ళపైపు పగిలిపోవడంతో రోడ్డంతా బురదగా, చీదరగా రొచ్చుతో నిండి ఉంది. పదిలంగా అడుగులు ఎత్తెత్తి వేస్తూ నడుస్తూంటే పక్కనుండి విసురుగా వెళ్ళిన ఒక టయోటా ఎంత తప్పించుకున్నా ఒళ్ళంతా బురద చిమ్మిపోయింది. అసలే లేతరంగు దుస్తులేమో ఆ బురదకి మరీ మరకలైపోయింది.

'దేముడా! ఇప్పుడింటికి వెళ్ళడం ఎలా...? ' తనని తాను వికారంగా చూసుకొంటూ పర్స్ తెరచి చూసుకొంది. హోటల్ ఖర్చులు పోను పది రూపాయలుంది. ఈలోగా మరో స్కూటరు మరికాస్త బురద జల్లిపోయింది. ఆటో ఎక్కి ఇంటి దగ్గర డబ్బులు చెల్లిద్దామా అనుకుంది. కానీ అన్ని డబ్బులు ఎందుకు అయిపోయాయి. అని వాళ్లమ్మ రోడ్డు మీదే పంచాయతీ పెట్టేస్తుందని భయపడి తెగించి అటుగా పోయే ఆటోని ఆపి సుమన ఇంటికి పోనియ్యమంది. 'నీళ్ళతో శుభ్రం చేసుకొంటే బస్సులోనే వెళ్ళొచ్చు లేదా దానినే ఓ యాభై అడిగి తీసుకోవచ్చు' అనుకుంది. పర్స్‌లో మిగిలిన డబ్బులు ఆటో ఫెయిర్‌కి సరిపోయాయి.

తలుపు తట్టగానే తెరిచిన మనోజ్‌ని చూసి 'ఇతని మీటింగ్ అప్పుడే అయిపోయిందా? '

ఆశ్చర్యంగా అనుకుంది.

"ఏమిటీ వేషం? పుట్టినరోజు స్పెషల్ మేకప్పా? " నవ్వుతూ అడిగాడు.

"సారీ! కాలేజీ దారిలో నీళ్ళపైపు పగిలి రోడ్డు బురదైపోయింది. ఓ కారు పక్కనుండి వెళ్ళడంతో ఇలా..." తనని తాను వెగటుగా చూసుకుంటూ చెప్పింది. సరేలే. పైకి వెళ్ళి స్నానంచేసి బట్టలు మార్చుకో. పొయ్యిమీద పాలు పెట్టాను. నేను కాఫీ కలిపి తెస్తాను." చెప్పి వంటింట్లోకి నడిచాడు.

"సుమ ఇంకా రాలేదా...? " మెట్లెక్కుతూ అడిగింది.

"గదిలో ఉందేమో చూసుకో" వంట గది లోంచే బదులిచ్చాడు.

సుమ గది తాళం వేసి ఉండడంతో రాలేదని గ్రహించి మనోజ్‌ని డబ్బులు అడగడానికి బిడియపడి ఏం చెయ్యాలో తోచనట్లు నిలబడిపోయింది.

చెరో చేత్తో వేడి వేడి కాఫీ కప్పులతో వచ్చిన మనోజ్ "ఏమయ్యింది? " అడిగాడు.

"తలుపు తాళం వేసి ఉంది" ఇబ్బందిగా చెప్పింది.

"అబ్బా! సుమదంతా చాదస్తం. ఏదో నిధులున్నట్లు తాళాలేసేస్తుంది. సర్లే నా గదిలో చేద్దువుగాని రా!" మామూలుగా అంటూ తన గదిలోకి దారితీశాడు. అతని ఏకవచనాన్ని గమనించి కాస్త సంకోచంగా ఆగిపోయింది.

"కాఫీ తాగి నువ్వెళ్ళి స్నానం చేసి రా! ఈలోగా నేను వేడి వేడిగా టమాటాబాత్ చేస్తాను. సుమ కన్నా నేనే బాగా వంట చేస్తాను" గొప్పగా చెప్పాడు.

"అదేం వద్దు. నేను మొహం కడుక్కొని వెళ్ళిపోతాను". అంది మనస్వి.

"ఏంటీ...? " మొహం చిట్లించి "ఎదురుగా ఉన్న అద్దంలో ఓసారి నీ వాలకం చూసుకో. ఏమీ అనుకోకు. నీ నుండి కొద్దిగా దుర్వాసన కూడా వస్తోంది" తల పక్కకి తిప్పుకొని అన్నాడు.

మనస్వి అప్రయత్నంగా అద్దంలో చూసుకుంది. బట్టలు మొత్తం బురద మరకలతో పాటు మెడమీద, చేతులమీద, ఆఖరికి నుదురుమీద కూడా మురికి చిమ్మి తన రూపం తనకే రోతగా తోచి కప్పు కింద పెట్టి "అది కాదు, స్నానానికి నా దగ్గర వేరే డ్రస్ లేదు' తన సమస్య చెప్పింది.

"ఒక్క నిమిషం!" అంటూ తన కప్పు పక్కన పెట్టి వెళ్ళి బీరువాలోంచి ఒక దుస్తుల కవరు తెచ్చి అమెకిచ్చి "ఇది కట్టుకో" అన్నాడు.

అర్థం కానట్లు అయోమయంగా దాన్ని తెరచి చూసింది. అందులో బట్టలషాపు షోకేసులో చూసి ముచ్చటపడిన పిస్తా గ్రీన్ కలర్ డ్రస్. "ఇదీ... ఇదీ...? " మాటలు రానట్లు తడబడుతూ ముట్టుకోబోయింది.

గభాలున లాక్కొన్నాడు మనోజ్ "ఏయ్! చేతులు చూడు. ఎంత మురిగ్గా ఉన్నాయో? ఇదిగో దీనిని ఇక్కడే మంచంమీద పెడతాను. స్నానం చేసి వచ్చి వేసుకో" అంటూ మంచం మీదపెట్టి కప్పులతో వెళ్ళబోయాడు.

"నా దగ్గర డబ్బులు లేవు? " దిగులుగా అంది. వెళ్ళబోతూ ఆగి "అవునా? " అప్పుడే తెలుసుకున్నట్లు అని "నాకూ డబ్బులు అక్కరలేదు. నీ పుట్టినరోజు బహుమానంగా ఉంచుకో" ఉపాయం చెప్పాడు.

"అమ్మ చంపేస్తుంది" తల అడ్డంగా ఊపింది.

"నా మొదటి జీతంతో సుమకి బట్టలు కొందామని వస్తే నువ్వు, నీకు నచ్చిన ఈ డ్రస్ నా కంటపడ్డాయి. సుమతోపాటు నీకనే కొన్నాను. ఈరోజు నీ పుట్టినరోజు అని తెలిసి నీకు ఎలా ఇవ్వాలా అని ఆలోచిస్తుంటే దేముడే నీ దుస్తులు పాడుచేసి నాకు మార్గాన్ని చూపించాడు. ఇవ్వడంతో నా బాధ్యత తీరిపోయింది. ఇప్పుడు ఈ బట్టలు వేసుకోవడం నీ అవసరం. ఇంట్లో ఏం చెప్పుకుంటావన్నది నీ సమస్య" చెప్పి తలుపు తీసుకుని వెళ్ళిపోయాడు.

కాసేపు తీసుకోనా, వద్దా అని డైలామాలో

పడి 'ఏదో ఒక అబద్ధంతో అమ్మని నమ్మించ వచ్చు. లేకపోతే ఈ అవతారాన్ని చూసి బస్సు కూడా ఎక్కనీయరు' తనలో తాను అనుకుంటూ గది తలుపు బిగించి స్నానాల గదిలోకి దూరింది.

స్నానం చేసి వచ్చేసరికి పింగాణి పాత్రలు, ప్లేటులు ఉన్న ట్రేతో లోనికి వచ్చాడు మనోజ్. అతను తన డ్రస్‌ని యథాలాపంగా నైనా చూడకపోవడం ఆమెని నిరాశ పరిచింది. మౌనంగా వెళ్ళి తలకున్న తువ్వాలు తీసేసి అద్దం ముందు కూర్చుని చిక్కు తీసుకోవ డంలో నిమగ్నమయ్యింది.

"డ్రయ్యర్ ఉంది. తల ఆరబెట్టుకోపోయావా? " అంటూ తనే ప్లగ్‌లో పెట్టి ఆమె జుట్టును పాయలు పాయలుగా విడదీసి ఆరబెట్టి చిక్కు తీస్తుంటే ఆశ్చర్యంగా గమనించసాగింది.




"ఏమిటీ? వీడు ఇలాంటి పనులు కూడా చేస్తాడా? అను కుంటున్నావా? "

"లేదు. అబ్బాయిగారికి మంగలిషాపులో పని చేసిన అనుభవం బాగానే ఉంది. అను కుంటున్నాను" వెక్కిరించింది.

జుట్టు పట్టి బలంగా గుంజాడు.

"అబ్బా" బాధగా అంటూ కుదుళ్ళ దగ్గర బిగించి పట్టుకుంది. "నీ జుట్టు నా చేతిలో ఉందని మర్చిపోయి వాగకు. నేను మంచి మేకప్ మేన్‌ని. మా కాలేజీలో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనే వారికి నేనే మేకప్ చేసేవాడిని. ఇంత అందమైన దుస్తులకి నప్పేలా ఈరోజు నేను నీకు మేకప్ చేస్తాను చూడు" అంటూ ఆరీఆరని జుట్టుతో ఫ్రెంచ్ నాట్ వేసి మెలిపెట్టి చివర హెయిర్ బేండ్ పెట్టి దీనికి మువ్వలతో, చిన్ని చిన్ని క్లిప్పులతో అలంకరిస్తే బావుంటుంది" అన్నాడు.

మనోజ్ ప్రవర్తన ఆమెలో ఏదో తెలియని పరవశాన్ని కలిగిస్తోంది. అద్దంలో తన రూపం, వంటి మీద అతనిచ్చిన దుస్తులు, అల్లిన జడతో కొత్తగా కనిపిస్తుంటే మెల్లగా పరవశం స్థానంలో కలవరం చోటు చేసుకుం టోంది. 'ఈ అలంకారాలు ఎవరు చేశారు? నీకు ఈ డ్రస్ ఎక్కడిదని? అమ్మ నిలదీస్తే ఏం చెప్పాలి. అమ్మకు నిజం తెలిస్తే సుమతో స్నేహానికే ముప్పు వచ్చే ఈ మనోజ్‌తో పరి చయం ఎక్కడికి పోతుంది? అన్నీ జవాబు లేని ప్రశ్నల్లాగే అనిపిస్తూంటే గభాలున తన బేగ్, పుస్తకాలు తీసుకుని వెళ్ళడానికి సిద్ధమ య్యింది. తలుపు తెరవబోతుంటే మనోజ్ వచ్చి అడ్డుగా నిలబడ్డాడు.

"నేను వెళ్ళాలి. ఇప్పటికే లేటయ్యింది" తలొంచుకుని గొణిగినట్లు అంది.

"నేనేమీ కట్టిపడేయ నులే నిన్ను. కొంచెం సేపు కూర్చో" అన్నాడు.

"ఉహూ. నా మీద అమ్మ కంట్రోల్ ఎంతో మీరు ఆ రోజే చూశారు. ఇంకా నేనీ డ్రస్‌కే అమ్మ దగ్గర సంజాయిషీ వెతుక్కోవాలి. మన ఈ కొత్త పరిచయం సుమతో నా స్నేహానికి ముప్పు తేవడం నాకిష్టం లేదు" స్పష్టంగా చెప్పింది.

కొద్ది నిమిషాల ఆలోచన తర్వాత ఓ నిర్ణ యానికి వచ్చినట్లు " సరేలే టిఫిన్ నీ కోసం చేశాను. కొంచెం రుచి చూసి వెళ్ళు." అభ్యర్థ నగా అన్నాడు. కాదనలేకపోయింది. వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చుని పుస్తకాలు ఒళ్లో పెట్టుకుంది. ప్లేటులో వడ్డించి ఇచ్చాడు. ఒక చెమ్చా తిని చూసి "చాలా బాగుంది" మనస్ఫూర్తిగా మెచ్చుకుంది. మనోజ్ కళ్ళు సంతోషంగా మెరిశాయి.

ఆమెకి కాస్త దగ్గరగా వచ్చి "నా ప్రవర్తనతో నిన్ను ఇబ్బంది పెట్టానా....? " అడిగాడు.

"ఆహా! అలాని కాదు. కానీ ఏదో తెలియని ఇబ్బంది వేధిస్తోంది"



మనోజ్ ఆమె ఎదురుగా మోకాళ్ళమీద కూర్చుండిపోయాడు. ఆమె వారిస్తున్నా వినకుండా "నాకు తెలుసు. నా ప్రవర్తన మరీ టీనేజ్ కుర్రాడి ప్రవర్తనలా ఉందని, కానీ మనూ! నిజం చెప్తున్నాను. నేనేదీ కావాలని చెయ్యడం లేదు. ఈమధ్య తరచుగా నిన్ను చూస్తుంటే నువ్వు నా దానివి అనే భావన నాలో మైకంలా కమ్మేసి నీ సమక్షంలో నా మనసు వెర్రెత్తినట్లు ప్రవర్తిస్తోంది. మనూ! నీకు తెలుస్తోందా నా భావన. ఐ లవ్ యూ వెరీమచ్."చెబుతూనే కొద్దిగా పైకి లేచి ఆమె నడుం చుట్టూ చేతులు పెనవేశాడు. మనస్వి ఒళ్ళో పుస్తకాలు కిందకి జారిపోయాయి. చేతిలో పళ్ళెం ఎప్పుడో పడిపోయింది.

గోడ గడియారం ఆరు కొట్టడంతో ఒక్కసారి తుళ్ళిపడి మనోజ్‌ని విసురుగా నెట్టేసి గభాలున లేచి తన బ్యాగ్ పుస్తకాలు అందుకుని అతడు పిలుస్తున్నా వినకుండా పరుగులాంటి నడకతో బయటకి వెళ్ళిపోయింది. మనోజ్ తన తొందరపాటుకు తనని తాను తిట్టుకున్నాడు.

* * *

మెదడంతా ఆలోచనా శూన్యంగా, స్తబ్దంగా మారిపోగా బస్సు దిగి అలవాటైన మార్గంలో కాళ్ళు నడిపించిన దారిలో ఇంటికి చేరిన మనస్విని గుమ్మంలోనే నిలేసింది సుభద్ర. "ఇంతసేపు ఏమై పోయావు? " అడుగుతూనే మనస్వి వంటిమీద డ్రస్ గుర్తు పట్టి "ఇది ఏడువేల రూపాయల డ్రస్ కదూ! నీకెక్కడిది? " ఆశ్చర్యంగా ప్రశ్నించింది. మనస్వి బదులివ్వలేనట్లు నిర్లిప్తంగా తలొంచుకుని నిలబడిపోయింది. ఆమెను రక్షిస్తూ సమాధానం చక్రధరం నుండి వచ్చింది.

"సుభద్రా! గుమ్మంలో నిలబడి ఏమిటా అరుపులు? ఉదయం డబ్బిచ్చి నేనే కొనుక్కోమన్నాను. వచ్చేప్పుడు నేను కొత్త డ్రస్ వేసుకొచ్చి సాయంత్రం అమ్మని ఆశ్చర్యపరుస్తాను. మీరు చెప్పొద్దు డాడీ అంటే ఆ సరదాని నువ్వూ మాతో పంచుకుంటావనుకుని నేను

చెప్పలేదు. నీలో అంత సున్నితత్వం ఎక్కడిది? " విసుక్కొన్నట్లు అని, "మనూ! నీ సరదాలు మీ అమ్మతో తీరవు కానీ నువ్వు లోపలికి వెళ్ళు" హెచ్చరికగా అన్నారు.

తండ్రి తనని ఎందుకు రక్షించాడో ఆలోచించే ఓపిక కూడా లేక మారుమాట లేకుండా లోనికి వెళ్ళిపోయింది.

"నేనొద్దన్నా దాని ఇష్టమే ఎక్కువయ్యిందా మీకు? " భర్తని నిలదీసింది.

"మూర్ఖంగా మాట్లాడకు. మనకేం పది మంది పిల్లలు లేరు. అందరికి ఇంత ఖరీదు పెట్టి కొనగలమా అనుకోవడానికి. నాది గుమాస్తా ఉద్యోగం కాదు. నెలకి పాతిక వేలు సంపాదించే తండ్రిగా ఒక్కగానొక్క కూతురికి ఏడువేల డ్రస్ కొనడం నాకేం భారం కాదు. ఈ విషయంలో నువ్వు మనూని ఏమీ అనడానికి వీల్లేదు" ఖరాఖండిగా చెప్పి లోనికి నడిచాడు.

భర్త ఆగ్రహానికి బదులు చెప్పలేక "మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి" అంటూ విసవిసా వెళ్లిపోయింది సుభద్ర.

ఆ రాత్రి... సుభద్ర వంటింట్లో ఉండగా చూసి కూతురి గదికెళ్లి డబ్బులిచ్చి "ఈ డబ్బు ఆ అబ్బాయికి ఇచ్చేయ్" గంభీరంగా చెప్పారు.

అప్పటికే చాలా తేరుకున్న మనస్వి... "డాడీ! ఆ డ్రస్ నా స్నేహితురాలికి వాళ్ల అన్నయ్య కొనిచ్చాడు. ఉదయం నా బట్టల మీద బురద చిమ్మితే ఆ అమ్మాయి ఇది కొత్తది. డబ్బులిచ్చేద్దువుగానీ తీసుకో అంటే తీసుకున్నాను" డబ్బు అందుకొంటూ "ఆ అబ్బాయి ఎవరు? నీకెలా తెలుసు? " అని ప్రశ్నించకుండా సంజాయిషీ చెప్పింది.

మనూ సమాధానంతో తృప్తిపడ్డ చక్రధరం "ఓకే. గుడ్‌నైట్" అని చెప్పి వెళ్లిపోయాడు. నిశ్చింతగా గాలి పీల్చుకొని డబ్బులు బ్యాగ్‌లో పెట్టి వెళ్లి పడుకుంది. రాత్రంతా మనోజ్ రూపం, స్పర్శ ఆమెను వెంటాడుతూనే ఉన్నాయి. అతన్ని తలచుకొంటేనే తనలో రేగే కలవరానికి కారణం తన వయసు ప్రభావమో, ప్రేమ అనే ఆకర్షణ మహిమో! తేల్చుకోలేక తల్లి ఆంక్షల సంకెళ్లను దాటి మనోజ్‌ని చేరుకోవడం ఎంతవరకు సాధ్యమో, అతనిపట్ల తనలో కలిగే భావాల స్వరూపం తనకే తెలియని అయోమయంలో ఆ రాత్రి ఆమెకి కలవరమే కలత నిదురయ్యింది.

* * *

మర్నాడు సుమనతో తన బట్టల మీద బురద చిమ్మితే వాళ్లింటికెళ్లి మనోజ్ ఇచ్చిన కొత్త డ్రస్ వేసుకుని వెళ్లడం మాత్రమే చెప్పి "ఆ డ్రస్ నీ కోసమే కొన్నానని మనోజ్ చెప్పాడు. అందుకే ఆ డబ్బులు నీకే ఇచ్చేస్తున్నాను తీసుకో" అంటూ రాత్రి తండ్రి ఇచ్చిన డబ్బులు సుమనకి అందించింది.

వెంటనే తిరస్కరించింది సుమన. "సారీ మనూ! అన్నయ్య నాకు తెచ్చిన డ్రస్ నా వంటిమీదే ఉంది. అవి ఎవరికి, ఎందుకు కొన్నాడో నాకు తెలియదు. మీరే తేల్చుకోండి" సున్నితంగా తప్పించుకుంది.

తప్పనిసరై డబ్బులతో మరోసారి అతని రూమ్‌లోకి అడుగు పెట్టింది. మనోజ్ సీరియస్‌గా తన పనిలో నిమగ్నమై ఉన్నాడు. తను వచ్చినట్లు గొంతు సవరించుకుని అరచేతిలో నోట్లతో చేతిని చాచి "నిన్న మీరిచ్చిన బట్టలకి నాన్నగారు డబ్బులిచ్చేయమన్నారు. తీసుకోండి" చెప్పింది.

చేస్తున్న పనిని పాజ్‌లో ఉంచి ఆమెని, డబ్బుని మార్చి మార్చి చూస్తూ "నేను ప్రేమగా ఇచ్చిన కానుకకి వెల కట్టడం నన్ను అవమానించడం అవుతుంది" అన్నాడు. తల అడ్డంగా ఊపింది. "ప్రేమను పొందే అర్హత ఎదుటివాళ్లకు లేనప్పుడు, అది మీకు అవమానాన్ని కలిగించేప్పుడు కొన్ని ప్రేమలను మొదట్లో తుంచివెయ్యడమే మంచిది" ఆ మాటల్లోనే తన పరిస్థితిని తెలియజేసింది మనస్వి.

"నీపట్ల నా ప్రేమ నావైపు నుండి అయితే నీ ఇష్టప్రకారమే నేను డబ్బు తీసుకొని మన పరిచయాన్ని మర్చిపోతాను. అలాకాక

నీలోనూ నాపట్ల అనురాగం కలిగితే మాత్రం డబ్బు ప్రసక్తి మనమధ్య తేకు. నీ నోటితో నువ్వు చెప్పనవసరం లేకుండానే మా అమ్మా నాన్నలను పంపించి మనపెళ్ళికి మీ వాళ్లని ఒప్పిస్తాను. నా మీద నమ్మకం ఉందా? " పూర్తిగా ఆమె వైపుకి తిరిగి అడిగాడు.

తొలిసారి తొలివలపు పరిచయం చేసిన మనోజ్ అంటే ఇష్టం లేదని చెప్పలేకపోయింది. అసాధ్యం అనిపిస్తున్నా, ఏమూలో అతని వాగ్దానం చిన్న ఆశను కలిగించడంతో డబ్బును వెనక్కి తీసుకొని సిగ్గుగా ఆ గది లోంచి పారిపోయి వచ్చేసింది. ఎంత ప్రాణ స్నేహితులైనా తన నేస్తాల దగ్గర మాత్రం ఈ విషయాన్ని గుట్టుగానే దాచేసింది.




కంప్యూటర్ పెళ్లికొడుకును కలిసేందుకు నిర్ణయించిన తేదీ రానే వచ్చింది. సహృదయ ఏమాత్రం ఆసక్తి చూపకపోయినా, వెళ్లేది ఉత్తుత్తి పెళ్లి చూపులైనా మనస్వి, సుమన వదల్లేదు. పట్టు బట్టలు కట్టించి నగలతో అలంకరించి అద్దం ముందు నిలబెడితే హృదికి తన రూపం బదులు ఎప్పుడో చూసిన తల్లి పెళ్లి ముందు ఫోటో గుర్తొచ్చి 'అచ్చం అమ్మలా ఉన్నాను!' తనకి తనే మురిపెంగా అనుకుంది.

"మరి బయలుదేరదామా? " సుమన అడిగింది.

అప్పుడే తన రూమ్‌లోకి వెళ్తున్న మనోజ్‌ని గమనించి "ముగ్గురెళితే పని ముక్కలౌతుంది అంటారు. అదీకాక ముక్కు మొహం తెలియని మగాడిని కలవడానికి వెళుతున్నాం. మనతో మనోజ్ కూడా ఉంటే మంచిదేమో!" మనస్వి గడుసుగా అడిగింది. సుమనకి కూడా నిజమే అనిపించింది.

"వాడో తిక్కమనిషి. వస్తాడో రాడో? అడిగి చూస్తాను" అంటూ మనోజ్ గదికి దారితీసింది. హృది వీళ్ల సంభాషణలో జోక్యం చేసుకోలేదు. కంటినిండుగా అద్దంలోని తన ప్రతి బింబంలో తల్లి రూపాన్ని చూసుకొని మురిసిపోతోంది.

"అన్నయ్యా! మాతో టాంక్‌బండ్‌కి వస్తావా? " సుమన అడిగింది.

నీళ్లు తాగుతున్న మనోజ్ కళ్లు చిట్లించాడు "ఎందుకు? "

"ఎందుకో! నువ్వేం చెయ్యనక్కరలేదు. మాతో ఉంటే చాలు" పెంకిగా అంది.

"ఆడపిల్లల వెంట తిరగడం తప్ప నాకేం పనిలేదనుకున్నావా? " విసుక్కున్నాడు.

"నువ్విలా అంటావని నాకు తెలుసు. మనూనే ముగ్గురెళ్లకూడదు. మగతోడు ఉండాలి అని ముసలమ్మ కబుర్లు చెప్పి నిన్ను అడగమంది. నువ్వేం రానక్కరలేదు" గయ్యిమంది. షూలేస్ విప్పుకుంటున్నవాడల్లా బిగించి కట్టుకొని 'మనూ రమ్మందా? ' అని మనసులోనే అనుకుని "అన్నింటికీ కోపమైతే ఎలా సుమా? " చెల్లెలిని ముద్దుగా విసుక్కొంటూ బయలుదేరాడు. హృదిని చూసి "అరే ! ఈ అమ్మాయి ఎవరు? ఎప్పుడూ చూడలేదు" ఆశ్చర్యంగా అడిగాడు. "మన హృది, మేకప్ మేమే చేశాం బాగుందా? " హృది భుజంపై తలానించి మురిపెంగా అడిగింది సుమ.

"చాలా బాగుంది. ఇన్నాళ్లకి హృదిలో కూడా ఓ అందాలబొమ్మ దాగుందని తెలుస్తోంది"అన్నాడు చిరునవ్వుతో మెచ్చుకుంటూ-

"ఇంతకీ ఎవరిమీద దాడి చేయడానికి ఈ ఏర్పాట్లు" తనిచ్చిన డ్రస్‌లో ప్రత్యేకంగా మెరిసిపోతున్న మనస్విని చూస్తూ సందేహంగా అడిగాడు. ముగ్గురూ మొహాలు చూసుకుని నవ్వుకున్నారు.

"సారీ! వివరాలు చెప్పబడవు. ఇష్టమైతేనే రావచ్చు" సుమన వెక్కిరించింది.

"ఒప్పుకున్నాక తప్పదుగా! ఇంతకీ వెళ్లడం బళ్ల మీదే కదా!" అడిగాడు.

"ఊc! హృదీ, మనూ స్కూటీ మీద వస్తారు. నేను నీ బైక్ మీద వస్తాను" సుమ అంది.

"నువ్వా? నా వల్ల కాదు. దారి పొడవునా వేగంగా నడపకు, బ్రేకు లెయ్యకూ అంటూ బుర్ర తింటావు. నీకన్నా హృదినో, మనూనో తీసుకెళ్లడం సుఖం" మనస్వి పక్కగా మెట్లు దిగుతూ చెప్పాడు.

"నాకు స్కూటీ నడపడం రాదు. హృది ఉండాలి. ఐతే మనూని తీసుకెళ్లు" చేసేదిలేక మనస్విని అన్నగారితో పంపేందుకు సిద్ధపడింది.

మెల్లగా చేయి జరిపి మనూ ఎడం చెయ్యి నొక్కి మెల్లగా "సాధించాను" అన్నాడు.

"అమ్మో! నేనా? , నేను ఎప్పుడూ బైక్ ఎక్కలేదు" భయం నటించింది.

బైక్ స్టాండ్ తీస్తూ ఎక్కడ సుమ నిర్ణయం మారిపోయి ఆటోలో వస్తాం అంటుందోనని కంగారు పడుతూ మనూ వంక గుర్రుగా చూశాడు.

"ఫరవాలేదు మనూ! మెల్లగానే పోనిస్తాడు' ' ధైర్యం చెప్పి ఎక్కించింది. కావాలనే వేగంగా పోనిచ్చాడు మనోజ్. అతని వెనకే హృది, సుమ బయలుదేరారు.

* * *

"ఇక్కడే ఆపండి" యోగి వేమన విగ్రహం దగ్గర బైక్ ఆపించింది మనస్వి.

"నాకేం అర్థం కావడం లేదు. ఇక్కడికి ఎందుకొచ్చాం? అసలేం జరుగుతోంది? " బైక్ స్టాండ్ వేసి కాస్త నీడగా ఉన్నచోట కూర్చుంటూ అడిగాడు మనోజ్.

"ఐదింటికి మేము ఒకళ్లని కలుసుకోడానికి మాట ఇచ్చాం" పక్కన కూర్చుంటూ చెప్పింది మనస్వి.

"ఎవరో వారు? " ఆమెకి దగ్గరగా జరిగి దీర్ఘం తీస్తూ వ్యంగ్యంగా అడిగాడు.

"సారీ! వివరాలు చెప్పబడవు" అతనికి కాస్త ఎడంగా జరిగి కొంటెగా అంది. చేతులు రెండూ పైకెత్తి ఒళ్లు విరుచుకుంటున్నట్లు నటిస్తూ భుజం చుట్టూ చెయ్యేసి దగ్గరకి లాక్కున్నాడు.

"వదలండి. ఇది నడిరోడ్డు" ముడుచుకుపోతూ వేడుకుంది. "ఇలా అల్లరి చేస్తే నేను వెళ్లిపోతాను" కోపం నటించింది. మనోజ్ ఆమె కోపాన్ని లెక్క చేయలేదు. పైగా, "నీ ఇష్టం, పని మీది. సుమ అడిగితే మీ స్నేహితురాలు అలిగి వెళ్లిపోయిందని చెబుతాను" వెక్కిరించాడు.

'ఛ! ఎంతకీ రారేం వీళ్లు. ఆమె కోపం స్నేహితుల మీదకి మళ్లింది.

సరిగ్గా అప్పుడే,

గళ్ల చొక్కా, నీలం రంగు ప్యాంటుతో చామనఛాయలో సాదాసీదాగా ఉన్న కుర్రాడు "ఏమండీ. నన్ను ఇక్కడ కలిసేందుకు పెళ్లిళ్ల సంస్థ వాళ్లు ఎవరో వస్తారని చెప్పారు. వాళ్ళలో అమ్మాయి పేరు..." గుర్తు తెచ్చుకుంటున్నట్లు ఆగాడు.

"సహృదయ" ఆత్రంగా అందించింది మనస్వి.

"ఆc! అవునండి. మీరేనా సహృదయ? " అతను మర్యాదగా అడిగాడు.

"ఆహ! నేను కాదు. మా స్నేహితురాలు. మరి మీరు? " సందేహంగా ఆగిపోయింది.

"నా పేరు ఆనంద్. రాయవరం నుండి వచ్చాను" పరిచయం చేసుకున్నాడు. ఉన్న చోట నుండి లేవకుండా ఇద్దరి సంభాషణ వింటున్న మనోజ్‌ని పిలిచి ఆనంద్‌కి, "ఈయన మనోజ్. సహృదయ అన్నయ్య" పరిచయం చేసింది. మనోజ్ కాదనలేదు. చిరునవ్వుతో చేతులు కలిపాడు.

"హలో! నేను ఆనంద్. రాయవరం స్కూల్లో డ్రిల్లు టీచర్‌గా చేస్తున్నాను"

"నేను ఏనిమేషన్స్ మేకింగ్ కోర్సులో పి.జి. చేసి గ్లోబల్ ఏనిమేషన్స్ సంస్థలో పనిచేస్తున్నాను" ఇద్దరూ వివరాలు చెప్పుకున్నారు.

ఆనంద్‌నే పరిశీలనగా చూస్తోంది మనస్వి.

పాపిడి తీసి దువ్విన జుట్టు, పొట్టి చేతులతో పైకి వదిలేసిన చొక్కా, లెదర్ చెప్పులు మనకి తరచు ఎదురయ్యే మామూలు మనిషి. కానీ కళ్ళలో చురుకుదనం, చెప్పేది వినడంలో కన పరిచే ఆసక్తి, పెదాలపై చిరునవ్వు ఆకట్టుకు నేలా ఉన్నాయి. "ఊహూ! ఇతను హృదిని ఆటపట్టించేందుకు వచ్చిన ఆకతాయి కాదు" తనలో తాను అనుకుంటూ ఓ నిర్ణయానికి వచ్చింది. మను ఆనంద్‌ని దీక్షగా చూడడం మనోజ్‌లో ఈర్ష్య రేపింది.

"అదిగో సుమ, హృదీ వస్తున్నారు..." ఆమె దృష్టిని మళ్ళిస్తూ అన్నాడు.

ఆనంద్ గమనించకుండా బొటనవేలు పైకెత్తి "హీ ఈజ్ ఓ.కే" అన్నట్లు సైగ చేసింది. ఏదో తెలియని ఉద్వేగంతో సుమన చెయ్యి బిగించి పట్టుకుంది సహృదయ. ఎంత కాలక్షేపం ఆట అనుకున్నా జరుగు తున్న తతంగం ఆమెలో తెలియని కలవ రాన్ని కలిగిస్తోంది.

"గాభరాపడకు హృదీ! మేమంతా ఉన్నాం కదా!" భరోసాగా అంది సుమన. పరిచ యాలు, నమస్కారాలు అయ్యాకా అంతా కాస్త ఏకాంత ప్రదేశంలో కూర్చున్నారు.

హృదికి చెరోపక్కా సుమన, మనస్వి ఆమె పక్కన మనోజ్ కూర్చున్నారు. వీళ్ళకి కాస్త ఎడంగా ఆనంద్ కూర్చుని హృదినే పరిశీల నగా చూస్తున్నాడు. హృది చెరో చేత్తో స్నేహితులను బిగించి పట్టుకొని నేల చూపులు చూస్తోంది.

ఏదోరకంగా సంభాషణ ప్రారంభించాలని మనస్వి ఆనంద్‌ని కదిపింది "మేమంటే- సిటీలో ఉన్నాం కనుక మా స్నేహితురాలికి కావలసిన వరుడి వివరాలను ఇంటర్‌నెట్ ద్వారా ఆరా తీశాం. మరి రాయవరం చిన్న పల్లెటూరు అన్నారు. ఇంటర్‌నెట్ సౌకర్యం మీక్కూడా ఉందా? మా వివరాలు మీ దాకా ఎలా చేరాయి"

చిన్నగా నవ్వేశాడు ఆనంద్. "ఈ ఇంటర్ నెట్, వెబ్‌సైట్ల గొడవ నాకేం తెలియదండీ. మా మేనత్త ఒకరు ఇక్కడ పెళ్ళి సంబం ధాలు కుదిర్చే సంస్థ నడుపుతుంటే ఓసారి అమ్మ నా వివరాలు ఇచ్చి సంబంధం చూడ మంది. ఆవిడకి మీరనే ఇంటర్‌నెట్ సంస్థకు గల సంబంధం వల్ల మీ వివరాలు ఆవిడ ద్వారా నాకు, నా వివరాలు మీకు చేరాయి" తెర వెనక సంగతులు వివరించాడు. "అయితే మీకు నిజంగా సొంత ఇల్లు, పాడి పశువులు ఉన్నాయాండీ? " సుమ అడిగింది.

"అవే కాదు. మీ ఫ్రెండ్ కోరినట్లు ఊపిరి తిత్తుల సమస్య వల్ల ఖళ్ళు ఖళ్ళున దగ్గే అమ్మా, రేచీకటి వల్ల కంటికి చెయ్యాన్చుకొని చూసే నాన్నా కూడా ఉన్నారు"

అతను చెప్పిన తీరుకి ఇబ్బందిగా కది లారు ముగ్గురూ! ఘటికుడే అనుకుంది మనస్వి. "ఏం చదువుకున్నారు? " మనస్వి ప్రశ్నించింది.

"బి.ఎ. ఎకనామిక్స్"

"డిగ్రీ చదివి మీ ఊళ్ళోనే డ్రిల్లు మాస్టా రిగా ఎందుకు చేస్తున్నారు? " సుమ సందేహ పడింది. "అమ్మా, నాన్న పెద్ద వాళ్ళు. కాస్తో కూస్తో ఊర్లో ఆస్తి ఉంది. ఇవన్నీ నేనొక్కడినే చూసుకోవాలంటే, అదే ఊళ్ళో బదిలీలు లేని ఉద్యోగం అవ్వడంతో దీనిలో చేరిపోయాను. నేను కబడ్డీలో జాతీ యస్థాయిలో విజేతను కావడంతో స్పోర్ట్స్ కోటాలో వచ్చిందీ ఉద్యోగం."

అంతా ఆసక్తిగా విన్నారు. అతని మాటల్లో నిజాయితీ వాళ్ళని ఆకట్టుకుంది వాళ్ల సంభా షణను బట్టి మనోజ్‌కి విషయం అర్థమ యింది. వాళ్లని ఏడిపించాలనిపించి కొంచెం ముందుకు జరిగి "వచ్చిన దగ్గరనుండి చూస్తు న్నాను. అన్నీ మీరే అడుగుతారు. ఒంటరిగా వచ్చారనా? ఆయనకి మాట్లాడే అవకాశం ఇవ్వరా? ఆనంద్... హృది వివరాలు మీరూ అడగండి" అతన్ని ప్రోత్సహించాడు. ముగ్గు రికి పక్కనుండి మిసైల్ దూసుకుపోయిన భావన కలిగింది. ఏమీ చెయ్యలేక మనోజ్ వంక చూశారు. మనోజ్ తల పక్కకి తిప్పి




## సంసారం ఆరోగ్య సోపానం

'తాళి, స్వేచ్ఛ స్వతంత్రాలకు ఎగతాళి' అని భావిస్తూ విడాకులు 'స్వేచ్ఛ చేవ్రాలు'గా అధికులు భావిస్తున్న ఈ కాలంలో సంతోషంగా సంసారం చేయటం అందమైన ఆరోగ్యానికి సులభ సోపానం అంటున్నారు శాస్త్రవేత్తలు. 65 ఏళ్ళు దాటి ఆరోగ్యంగా ఉన్నవారిలో తొంభై శాతం మంది దంపతులేనట. వీళ్లంతా ఒకరిపై ఒకరు మానసిక స్వస్థత కోసం ఆధారపడి బతుకుతూ, ఆరోగ్యంగా ఉంటున్నారట. సంసార బంధం గట్టిగా ఉన్నచోట్ల 'తీపి వ్యాధి' (డయాబిటిస్) ఆలస్యంగా వస్తుందట. వచ్చినా, వారిని ఎక్కువగా బాధించదట. ఎందుకంటే తమ భాగస్వామి కోసం మరింత కాలం జీవించాలనే ఆలోచనవారు ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడు కోవటానికి ఊపునిస్తుందంటున్నారు. అలాగే సుఖసంసారంలో హాయిగా ఉన్నవారు తాగుడు, డ్రగ్స్ వంటి వాటి జోలికి వెళ్లరంటున్నారు డాక్టర్లు. ఎందుకంటే గట్టిగా ఉన్న బంధంలో భార్యాభర్తలకు తాగుడు మత్తు, డ్రగ్స్ వంటి ఆనందాలన్నీ 'సెక్స్'లోంచే వస్తాయట. అందుకే మనవారు భార్యాభర్తల శృంగారానికి 'కామసూత్రాల' సిమెంట్ తయారుచేసి మరీ రెడీగా ఉంచారు. ఇంకా విడాకులకు విడాకులిచ్చి బంధనంలోని మాధుర్యాన్ని అనుభవిస్తూ నిండు నూరేళ్ళు బతికేందుకు సిద్ధమవ్వాలి జంటలు అంటున్నారు పాశ్చాత్య శాస్త్రవేత్తలు.

నవ్వుకోసాగాడు. ఆనంద్ మాత్రం తేలిగ్గా నవ్వేశాడు. "నేను ప్రత్యేకంగా అడిగేవి ఏమున్నాయి? ఆవిడ వివరాలన్నీ బయోడేటాలో చూసినవేగా!" అని ఒక్కక్షణం ఆగి "తను రాసిన కవిత ఏదైనా చెప్పమనండి" అన్నాడు.

అర్జంటుగా అక్కడినుండి పారిపోవాలనే కోరిక అదుపు చేసుకుంటూ బలవంతంగా నవ్వారు. "మొదటిసారి కదా! చాలా ఇబ్బంది పడుతోంది. తను మన పరిచయం కొంచెం పెరిగితే అప్పుడు హృది అలవాట్లు ముచ్చటిద్దాం" సుమన తెలివిగా సర్దిచెప్పింది.

మనోజ్‌కి ఈ ఆట బాగా నచ్చింది. "సుమా, మనూ...! మీరిద్దరే అన్నీ మీరే అడుగుతున్నారు. ముఖ్యమైన వ్యక్తి పెదవి విప్పదా?" హృదిని ఇరికించాడు. మనస్వికి కూడా ఒకసారి హృది, ఆనంద్ ముఖాముఖీగా మాట్లాడుకోవడమే మంచిది అనిపించి సుమకి చెయ్యిచ్చి లేపుతూ "మనం అలా కాసేపు తిరిగొద్దాం" చెప్పింది.

"నన్నూ లేపొచ్చుగా!" తనంతట తానుగా లేస్తూ నిష్టూరంగా అన్నాడు మనోజ్. "మనూ! నేనూ వస్తాను" నన్నొదిలి వెళ్లొద్దు అన్నట్లు అంది హృది.

"హృదీ! కంగారుపడకు. నీకిష్టం లేనిది ఏదీ జరగదు. మనమీద సందేహం రాకుండా ఆనంద్‌కి చిన్న మస్కా అంతే. ఐదు నిమిషాల్లో వచ్చేస్తాం" లోగొంతులో ధైర్యం చెప్పి సుమ, మనోజ్‌లతో దూరంగా వెళ్లిపోయింది.

వాళ్లు కాస్త దూరమయ్యేదాకా ఆగి "ఓ మాట అడగనా?" ఆనంద్ ప్రశ్నించాడు. చేతిలోని గడ్డి పరకను శోధించడం ఆపి ఏమిటన్నట్లు చూసింది. "పెళ్లికొడుకుగా నా అర్హతలు చూసి అయినవాళ్లే నాకు పిల్లనిచ్చేందుకు ముందుకు రాలేదు. సిటీలో పెరిగిన మీకెలా

నచ్చాయి? "

"నాకర్థం కాలేదు మీ ప్రశ్న" తొలిసారి సూటిగా బదులిచ్చింది.

"నాతో కలిసి ఆ గొడ్డు పల్లెటూర్లో నా ముసలి తల్లితండ్రులకు, పశువులకు చాకిరీ చేస్తూ బతకడం మావల్ల కాదని చాలామంది ఆడపిల్లలు నాతో పెళ్లికి తిరస్కరించారు. మీరేమో కోరికోరి పల్లెటూరి వరుడిని ఎందుకు కోరుకున్నారు? " తను అడగదలచు కున్న దానిని స్పష్టంగా అడిగాడు.

కంప్యూటర్ ప్రకటనలో తానిచ్చిన వివరాలన్నీ సరదా ఆటలోని అంశాలని చెప్పలేక తలతిప్పి పూలమొక్కల అందాలు చూస్తూ మౌనంగా ఉండిపోయింది. ఆమెకి చెప్పడం ఇష్టంలేదు కాబోలు అనుకుని, "మరో సందేహం. మీ వివరాల్లో మీరు అనాథ అన్నారు. కానీ మనోజ్‌ని మీ అన్నయ్య అని పరిచయం చేశారేమిటి? " దీన్నికైనా సమాధానం చెబుతుందో లేదోనన్నట్లు చూస్తూ అడిగాడు. నిర్లిప్తంగా నవ్వింది.

"అనాథను కదా! అభిమానం చూపేవాళ్లంతా అయినవాళ్లే అవుతారు. సుమ అక్కవుతుంది. మనోజ్ అన్నవుతాడు."

మనస్వి "వదినవుతుందా? " ఆమె మాటల్ని ఆనంద్ పూరిస్తూ ప్రశ్నించాడు. హృది కనుబొమలు ముడేసింది. "మాలో ఎవరికీ ఇంకా పెళ్లి కాలేదు. నాకు తెలిసి సుమ, మనూల మధ్య బంధుత్వం లేదు. మనోజ్ సుమకే సొంత అన్న" చెప్పింది.

"నేను గమనించిన దానిని బట్టి మీ మనస్వి, మనోజ్ ఇద్దరూ ఒకరికొకరు సొంతం కావాలనుకుంటున్నారు" అని నవ్వి మీకన్నా ఓ పావుగంట ముందే టాంక్‌బండ్ మీదికొచ్చి నన్ను కలిసే వ్యక్తుల కోసం కాస్త దూరంగా నిలబడి ఎదురుచూశాను. అప్పుడే వాళ్లిద్దరి మధ్యా చనువుని, వాళ్లు ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లు ఉన్న తీరుని గమనించి దగ్గరకి వెళ్లి పలకరించాను. అప్పటి వాళ్ల ప్రవర్తనబట్టి నాకు విషయం అర్థమయ్యింది. బహుశా మీ సుమకి కూడా వాళ్ల మధ్య ఉన్న ప్రేమ గురించి తెలుసు. కాకపోతే లోతైన మనిషి కదా! పైకి తేలదు" కలిసి మాట్లాడిన అరగంటలోనే అందరి మనస్తత్వాలను పుస్తకం చదివినట్లు విడమరిచి చెబుతున్న అతని ధోరణికి విస్తుపోయి చూస్తూండిపోయింది సహృదయ. ఆమె తననే కళ్ళు విప్పార్చుకుని చూస్తుండటంతో కాస్త ఇబ్బందిగా కదిలి "సరే! మన విషయానికి వద్దాం. నాకైతే మీరు బాగా నచ్చారు. మీకూ నేను నచ్చినట్లయితే వీలైనంత త్వరలో ముహూర్తాలు పెట్టించేస్తాను" మనిషికి ముక్కుసూటి గుణం ఎక్కువలాగుంది సూటిగా మనుసులో మాట చెప్పేశాడు.

ఏం బదులివ్వాలో తెలియనట్టు బిగుసుకుపోయింది హృది. తాము సరదాగా ఆట అనుకున్నది బెడిసికొట్టి ఆనంద్ అమాయకపు పెళ్లికొడుకై కూర్చున్నాడు. పైగా ముహూర్తాల దాకా వెళ్లిపోయాడు. ఏం చెప్పగలదు? ఆమెను రక్షించడానికి అన్నట్లు బ్యాగ్‌లోని సెల్ మోగింది. తీసి నెంబర్ చూసింది. ముంబాయి నుండి జానకి. ఆఫ్ చేద్దామా అనుకుని, మళ్ళీ ఆనంద్ నుండి తప్పించుకోడానికి మంచి అవకాశం అనుకొని "ఒక్క నిమిషం" చెప్పి సెల్ చెవి దగ్గర పెట్టుకొని "హలో" అంటూ దూరంగా నడిచింది.

"ఏం చేస్తున్నావు చిన్నా? " జానకి మృదువుగా పలకరించింది.

"నువ్వు నన్ను అభినందించాలమ్మా! నేను మన వ్యసనాల రొంపిలో మరో మెట్టు కిందకి దిగాను" గొంతులో ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూ అంది.

"చిన్నా! ఏమంటున్నావు? " జానకి గొంతు భయాన్ని ధ్వనించింది.

"ఇప్పుడు నేను ఏభై ఏళ్ళ బోండంతో డేటింగ్‌లో ఉన్నానని" ఏవో అవాకులు, చెవాకులు చెబుతుంటే, ఎప్పుడొచ్చిందో మనస్వి విసురుగా ఆమె చేతిలోంచి సెల్ లాక్కుని తన చెవి దగ్గర పెట్టుకొని "ఆంటీ! నేను మన

స్విని. హృది ఫ్రెండ్‌ని, దాని మాటలు నమ్మొద్దు. మేము పబ్లిక్ పార్కులో ఉన్నాం" ఊరడింపుగా చెప్పింది.

"థాంక్సమ్మా! హృదికి చెప్పు. నన్ను మాటలతో చంపొద్దని" జానకి గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

సెల్ ఆఫ్ చేసి చేతులు కట్టుకొని దిగంతాలలోకి చూస్తున్న హృది నుద్దేశించి "మరీ... ఇంత శాడిస్టులా తయారౌతున్నావేమిటి? అమ్మతో మాట్లాడే మాటలేనా? మొన్ననేగా చటర్జీగారు నీ ధోరణి మార్చుకోమన్నారు. సుధా మేడమ్‌కి కూడా అమ్మని మార్చుకుంటానని చెప్పి ఏమిటి నువ్వు చేసింది? " కోపంగా కేకలేసింది.




"అవును, అమ్మతో మాట్లాడే మాటలు కాదు. ఏం చెప్పమంటావు. నా మొగుణ్ణి నేనే ఎన్నుకున్నాను. అతగాడు ముహుర్తాలతో సిద్ధంగా ఉన్నాడు. నువ్వొచ్చి నీకు ఎన్నో మొగుడో తెలియని మగాడితో కలిసి కన్యాదానం చేసి నా పెళ్లి చెయ్యి అని చెప్పనా? " కళ్ళలోంచి నీళ్ళు జలజలా రాలుతుంటే అంతకన్నా గట్టిగా అడిగింది. గభాలున ఆమె తల గుండెలకి హత్తుకుంది మనస్వి. సుమ ఓదార్పుగా భుజం తట్టింది. ఇద్దరి కళ్ళూ కూడా నీటితో నిండాయి.

ఆనంద్, మనోజ్ మాట్లాడుకుంటూ వీళ్ల వైపే రావడం గమనించి "మనూ, హృదీ...! ఆనంద్, మనోజ్ వస్తున్నారు" రుమాలుతో కళ్ళు వత్తుకుంటూ హెచ్చరించింది సుమ. మను, హృదిని వదిలేసింది. ఇద్దరు పక్కకి తిరిగి కళ్ళు తుడుచుకున్నారు. ముసురుకున్న చీకట్లలో నియాన్ లైటుకాంతి వీళ్ళ మొహంలోని భావాలను చూపలేకపోతోంది.

"ఏడు దాటుతోంది. బయలుదేరుదామా? " మనోజ్ అడిగాడు.

"ఒక్క నిమిషం. నేనింకా ఇక్కడ రెండు రోజులుంటాను. మీకు ఇష్టమైతే ఈ రెండు రోజుల్లో సాయంత్రం ఎవరైనా నన్ను ఇక్కడికి వచ్చి కలవవచ్చు. ఒకవేళ మీలో ఎవరూ రాకపోతే మీకిష్టం లేదని నేను అర్థం చేసుకుంటాను. ఇది ఎవ్వరికి ఇబ్బంది కలిగించని పద్ధతని నేను అనుకుంటున్నాను" ఆనంద్ సూచించాడు. "నిజంగానే ఈ పద్ధతి బాగుంది. హృదికి ఓ.కే. అయితే మాలో ఎవరో ఒకరం వచ్చి మీకు తెలియజేస్తాం" మనోజ్ సమర్థించాడు.

హృది అది తన సమస్య కాదన్నట్లు నిర్లిప్తంగా ఉండిపోయింది. ఆనంద్ వాళ్ళ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

మనస్వి కూడా బయలుదేరుతూ "హృదీ! ఇంకా కాసేపు నీతోనే ఉండాలని ఉంది. కానీ నా పరిస్థితి తెలుసుగా!" వేదనగా అంది.

'మనూ! నువ్వెళ్ళు. హృది ఇవాళ నాతోనే ఉంటుంది' భరోసాగా చెప్పి "అన్నయ్యా! నువ్వు మనూని దింపేసి వచ్చేయి. నేను, హృది ఇంటికి వెళ్ళిపోతాం" సుమన మనోజ్‌కి చెప్పింది.

తనూ, ఆనంద్ వచ్చేసరికి వాళ్ళ మధ్య ఏదో జరిగిందని గ్రహించిన మనోజ్ చెల్లెలి మాటని అంగీకరించి మనస్విని తీసుకు వెళ్ళిపోయాడు.

"సుమా! నిన్ను దింపి నేను హాస్టల్‌కి వెళ్ళిపోతాను. ఇప్పుడు నేను బాగానే ఉన్నాను." స్కూటీ స్టార్ట్ చేస్తూ అంది.

"మీ మమ్మీ విషయం కాదు. ఆనంద్ విషయం మాట్లాడేందుకే నిన్ను ఇంటికి తీసుకెళ్తున్నాను" వెనక కూర్చుంటూ చెప్పింది.

"ఆనంద్ విషయానికి ఏముంది? ఈ రెండురోజులు ఎవరూ అతన్ని కలవకపోతే అతనే వెళ్ళిపోతాడు" కాలు నేలకి ఆన్చి వెనక్కి తిరిగి సీరియస్‌గా అంది.

"ముందు పద. నేను అన్నీ చెబుతాను" సుమ తొందర చేసింది. మౌనంగా బండి ముందుకు పోనిచ్చింది హృది.



## బుడతసాహసం

పిల్లిని, ఎలుకను, బొద్దింకను, బల్లిని చూసి భయపడిపోయే వారి సంఖ్య అసంఖ్యాకం ఈ భూమ్మీద. అంతకంటే పెద్దవైన క్రూర మృగాల్ని చూస్తే ఇక చెప్పేదేముంది. ఎవరైనా పులిని, సింహాన్ని చూస్తే జడుసుకుని గజగజ వణికిపోక తప్పదు. అలాంటిది ఒక బుడతడు సింహాన్ని ఎదురించి నిలిచాడంటే నమ్మబుద్ధేయదు కదూ. కానీ ఇది నిజంగా నిజం. ఎదురించడమే కాదు - దానిచేత పలాయన మంత్రం కూడా జపింపచేశాడు. లాటిన్ అమెరికన్ దేశం చిలీలోని ఆంటోఫగస్టాలో ఈ బుడతడు తన రెండేళ్ళ చెల్లి అన్యారాతో కలిసి ఒక సర్కస్‌కు వెళ్ళాడు. అక్కడ సింహరాజం ఉన్న బోను పక్కనుంచి నడచి వెళుతుండగా హఠాత్తుగా బోను తలుపు తెరుచుకుంది. ఆ మృగరాజం ఆ చిన్నపిల్లను అంది పుచ్చుకుని నోట కరచుకోబోయింది. అంతే, ఆ బుడత హీరో ఒక్కుదుటున సింహం మీదకి లంఘించి, తన చెల్లెల్ని వదిలేదాకా దాని ముందుకాళ్ల మీద బుల్లి చేతులతోనే అయినా బలంగా గుద్దడం మొదలుపెట్టాడు. ఆ గుద్దులకు తాళలేక సింహంగారు అన్యారాను వదిలేసి బోనులోకి జారుకుని గుర్రు గుర్రుగా చూసిందట. అన్యారాకు చికిత్స చేసిన వైద్యులు ప్రాణభయం లేదని హామీ ఇచ్చారు. ఇంతకీ ఆ బుడత హీరో జాన్ ఎస్కోవెడో వయసు ఎనిమిదేళ్లే!

---

## బద్ధకానికి బహు పెద్ద శిక్ష



ప్రతి పనినీ వాయిదా వేస్తూ బద్ధకించే బడుద్ధాయిల్ని చూస్తే మా చెడ్డ చిరాకుగానే ఉంటుంది. ఆ బద్ధకం మనకెక్కడ అంటిస్తారో అని వాళ్ళకు బహు దూరంగా పారిపోతుంటాం. అయినా ఆ బద్ధకపు బ్రహ్మల్లో ఈషణ్మాత్రం మార్పుండదు. అలాంటివాడే ఆ ఇటాలియన్ పోస్ట్‌మాన్. అతగాడికి చేస్తున్న ఉద్యోగమ్మీద ఏమాత్రం గౌరవం లేదంటే నమ్మండి. కర్తవ్య నిర్వహణను గాలికొదిలేసి, ఉత్తరాలన్నిటినీ ఇంట్లో కుక్కేసి కాలుమీద కాలేసుకుని గడప దాటకుండా గడిపేస్తున్నాడట. అదీ ఒక రోజా, రెండు రోజులా... నెలల తరబడి! బట్వాడాకు నోచుకోని తోకలేని పిట్టలన్నీ అతనింట్లో గుట్టలుగా పడి ఉన్నాయి. ఇంట్లోని ప్రతి గది, కారు, తోటలోని షెడ్డు నిండా ఎటు చూస్తే అటు- అడుగువేయ సందు లేనంత నిండుగా ఉత్తరాల కుప్పలేనట. అతగాడి బద్ధకం వల్ల స్థానికులు మౌలిక సదుపాయాలకు కూడా దూరమై అల్లాడిపోవలసి వచ్చింది. ఏ బిల్లులూ అందక చెల్లింపులు జరపకపోవడంతో అధికారులు ఆ సదుపాయాలకు కత్తెర వేశారు. చివరకు ఆ బద్ధకపు మారాజు కటకటాల వెనక్కి చేరుకోక తప్పలేదు. అతగాడి తీరుకు మా చిరాకు పడ్డ జడ్జిగారు ఏకంగా పదేళ్ళ శిక్ష వేసి నీ తిక్క కుదిర్చాను పో అన్నారట.

## షాక్

## ఈగలా మజాకా

మిడతలదండు ధాటికి పచ్చటి పొలాలు క్షణాల్లో సర్వనాశనమైన బీభత్సాల గురించి ఎన్నోసార్లు విన్నాం కానీ ఈగల తాకిడికి ఊరు ఊరంతా ఖాళీ అయిన సంగతి ఇప్పుడే వినవలసివస్తోంది. వందో, రెండువందలో... పోనీ ఏ పదివేలో కాదు ఏకంగా కోట్లాది ఈగలు ముసురు కుంటుంటే ఊపిరాడడం కూడా కష్టమైపోతుంది కదా. అందుకే రష్యాలోని ఆ గ్రామస్తులంతా బతుకుజీవుడా అనుకుంటూ అక్కడినుంచి తాత్కాలికంగా బిచాణా ఎత్తేశారు. రష్యాలోనే అత్యంత సుందరమైన స్వెర్డ్‌లోవ్‌స్కీ ప్రాంతంలోని పోలెవోయ్ గ్రామంలో తిష్టవేసిన కోట్లాది ఈగలు చేసే భీకర శబ్దం చెవులు చిల్లులు పడిపోయి చెవుడొచ్చేసేటంత భయం కరంగా ఉందట. ఊళ్లో ఒక్క అంగుళం ఖాళీ ప్రదేశం కూడా కన్పించనంత దట్టంగా ఈగలు కమ్మేసుకుని ఉన్నాయట. తలుపు తీసిన మరుక్షణం ఇల్లంతా వాటితో నిండిపోతోందట. ఇంతకీ ఇంత భయోత్పాతం సృష్టించిన ఈగలు అంత భారీ సంఖ్యలో అభివృద్ధి చెందడానికి కారణం కోడి ఎరువు. ఒకరైతు తన పొలంలో వినియోగించుకోవడానికి అనేక టన్నుల కోడి ఎరువును దిగుమతి చేసుకున్నాడు. వర్షాలు పడడంతో ఈగల జననం ఊపందుకుంది. అతగాడు గ్రామస్తులకు క్షమాపణ చెప్పుకుంటూ వర్షాలు తగ్గగానే భూములు దున్ని ఆ ఎరువును వాడేసుకుంటాం కనుక త్వరలోనే ఈగలబెడద తప్పిపోవచ్చు అని వినయంగా సెలవిస్తున్నాడట.

---




మతిమరపురాయుళ్లు, పరధ్యానపు పరబ్రహ్మాలు ఎప్పుడేది ఎందుకు మరచిపోతారో, ఎప్పుడెలా పరధ్యానంలో కూరుకు పోతారో తెలిసి చావదు. అలాంటి ఒక 'మగా'నుభావుడు ఏకంగా భార్యనే మరిచిపోయాడు. అదీ ఒక పెట్రోలు బంకులో. అతగాడికి ఆ విషయం తెలిసొచ్చేసరికి మరో దేశం మధ్యలో ఉన్నాడు. జుబోమిర్ ఇవనోవ్ అనే ఆ వ్యక్తి భార్యతో సహా సెలవులు గడపడానికి జర్మనీకి బయలుదేరాడు. దారిలో ఇటలీలోని పెసారోలో ఒక పెట్రోలు బంకులో పెట్రోలు నింపుకున్నాడు. తర్వాత ఆరుగంటల పాటు ప్రయాణించి ఇటలీ దాటేసి జర్మనీలో ప్రవేశించి కొంతదూరం వెళ్లిపోయాడు. అప్పుడే సెల్ ఫోన్ మోగింది. అయ్యా! మీ ఆవిడను మీరు పెట్రోలు బంకు వద్ద మరిచిపోయి వెళ్లిపోయారు. ఆవిడింకా అక్కడే మీకోసం ఎదురు చూస్తోందని పోలీసులు చల్లగా చెప్పడంతో ఒక్కసారి ఖంగుతిన్నాడు. మా ఆవిడ ఎప్పుడూ వెనక సీట్లో కూర్చుంటుంది. పెట్రోలు కొట్టించుకుని బయలుదేరేముందు అలాగే కూర్చుని ఉందనుకున్నాను. ఆవిడగారు దిగిన విషయాన్ని గమనించలేదు. దూర ప్రయాణంతో అలసిపోయి ఉండడం వల్ల సరిగ్గా ఆలోచించలేకపోవడమే దీనికి కారణమని చెప్పి మళ్లీ వెనక్కి పెసారో వచ్చి ఆమెకు బోలెడన్ని క్షమాపణలు చెప్పుకుని వెంట బెట్టుకుపోయాడట.

ఆమె భుజం మీద చేతులేసి గాలికి మాటలు చెదిరిపోకుండా కాస్త దగ్గరకి వంగి, "నువ్వు, ఆనంద్ మాట్లాడుకుంటుంటే నేను, మనూ, అన్నయ్య ఏం చెయ్యాలి అన్నది చర్చించాం. మాకు ఆనంద్, అతని నిజాయితీ నచ్చాయి. మనోజ్ ఎవరో ఫ్రెండ్ ద్వారా ఆనంద్ చెప్పిన వాటిలో నిజానిజాలు తెలుసుకుంటానన్నాడు. ఒకవేళ అతను చెప్పినవన్నీ సరైనవే అయితే" చెప్పడం ఆపింది సుమ.

బండిని ఓ పక్కగా తీసుకెళ్ళి ఆపి "అయితే" వెనక్కి తిరిగి అడిగింది హృది.

"అబ్బా! అడుగడుక్కీ ఆగుతావెందుకు? నేను చెబుతున్నాగా! నువ్వు పద" కసిరింది.

"ముందు నువ్వు సగంలో ఆపేసిన 'అయితే' సంగతి తేలనీ" మొండికేసింది. హృది.

సుమ గాఢంగా నిట్టూర్చింది. "ఆనంద్ వివరాలన్నీ నిజాలే అయితే నువ్వు అతన్ని ఓకే చేస్తే బాగుంటుందని మేము అనుకున్నాం" చెప్పదలచుకున్నది పూర్తి చేసింది.

హృది క్రిందకి దిగి కాలికి తగిలిన రాయిని తన్నుతూ ఆవేశంగా ఏదో అనబోతుంటే-

ఆమె మనసు అర్థం చేసుకున్నట్లుగా "హృదీ! మా ఆలోచన విను. ఆనంద్ కాకపోతే మరో వ్యక్తిని ఎప్పటికైనా నువ్వు నీ జీవితంలోకి ఆహ్వానించకపోతే ఒంటరితనపు వేదన నుండి తప్పించుకోలేవు. బహుశా రేపు నాకూ, మనూకి పెళ్ళిళ్ళయి వెళ్ళిపోతే నిన్ను మేం ఏ రకంగానూ ఓదార్చలేం. అదే ఆనంద్ అయితే ఈ ఆధునిక జీవితంలో నిన్ను వెంటాడే ఒంటరితనం నుండి నా అనే ఆత్మీయుల మధ్యకి వెళ్ళగలవు. రెండు; నీ వివరాలన్నీ అబద్ధాలు కావు. నీకు ఉపయోగించని డిగ్రీలు, నీవి కాని ఆస్తులు, నీ వాళ్ళు అని చెప్పుకోలేని అయినవాళ్ళు ఇవేవి అబద్ధాలు కావు. ఇంక మనసుకున్న పెద్ద భయం మీ మమ్మీ ప్రవర్తన. చూద్దాం. ఈసారి కలిసినప్పుడు నీ గతాన్ని చూచాయగా చెప్పి కదిపి చూద్దాం. అతని ప్రతిస్పందన మనకి వ్యతిరేకంగా ఉంటే ఇక్కడితో ఆనంద్ అనే వ్యక్తిని కలిశామన్న విషయాన్నే మర్చిపోదాం" మృదువుగా అంది.

"కానీ సుమా!" మరో అభ్యంతరం చెప్పబోయింది హృది.

"హృదీ ప్లీజ్! మనకింకా చాలా సమయం ఉంది. తాపీగా అన్ని కోణాలనుండి ఆలోచించి నిర్ణయం తీసుకుందాం. సరేనా? పద వెళదాం"

ఒక్క క్షణం సుమ మొహంలో తన మేలు కోరే ఆప్తురాలి ఆరాటాన్ని గమనించి తనలో రేగే లక్షల సంకోచాలను తనలోనే అణుచుకొని స్కూటీని ముందుకు పోనిచ్చింది హృది.




మనస్వి ఇంట్లో అడుగు పెట్టీపెట్టగానే మండిపడింది సుభద్ర. "ఈమధ్య సాయంత్రమైతే చాలు సెల్ గొంతు నొక్కేస్తున్నావు. అసలు కంప్యూటర్ క్లాసులకైనా వెళ్తున్నావా, లేక ఆ వంకతో తిరుగుతున్నావా అని నాకు అనుమానంగా ఉంది"

"అమ్మా! క్లాసు మధ్యలో సెల్ మోగితే బయటికి పంపేస్తారు. వేలకి వేలు ఫీజు కట్టి మధ్యలో వచ్చేయనా? కావాలంటే ఈరోజు చేసిన వర్కు చూడు. ఈరోజు తేదీ కూడా ఉంటుంది" రోషంగా అంటూ ముందురోజే జాగ్రత్తపడిన కాగితాలను టీపాయ్ మీద పారేసింది.

వాటిని చూడనైనా చూడకుండా "ప్రతీదానికి సంజాయిషీ సిద్ధంగా ఉంటుంది. సర్లే! త్వరగా తెమిలి, అన్నం తిని తొందరగా

పడుకో. రేపు నిన్ను చూసుకోడానికి పెళ్ళి వారు వస్తున్నారు." అవన్నీ మళ్ళీ మనస్వి బేగ్‌లో సర్ది లోపల పెడుతూ విసుక్కుంది.

"పెళ్ళి చూపులా? !" చల్లని మంచుగడ్డ తగిలినట్లు ఉలిక్కిపడింది.

"ఏం? బుల్లి పాపాయిననుకున్నావా? ఇరవై దాటాయి" వ్యంగ్యంగా అంది సుభద్ర.

"అదే... డిగ్రీ పూర్తవ్వలేదు. కంప్యూటర్ సగంలో ఉంది. అప్పుడే పెళ్ళేంటి? "

"మరేం నష్టం లేదు. కుర్రాడు కాలిఫోర్నియాలో కంప్యూటర్ ఇంజనీర్. అతను ఒప్పుకుంటే ఈ చదువేదో అప్పుడే చదువుకోవచ్చు"

"అంత దూరమా? మిమ్మల్ని వదిలుండడం నావల్ల కాదు" తిరస్కారంగా అంది.

"వెధవ కబుర్లు చెప్పకు. ఆడపిల్లకి మూడు ముళ్ళు పడి పుట్టినిల్లు దాటి నా మొగుడు, నా పిల్లలనే జంఝాటంలో పడితే కన్నవాళ్ళే కాదు ఎవ్వరూ గుర్తుండరు"

"ఇల్లు దాటింది మొదలు అస్తమాను ఫోన్ చేసి ఎక్కడుంది కనుక్కొంటావు. రావడం కాస్త ఆలస్యం అయితే మాట వినడం లేదంటూ యాగీ చేస్తావు. డాడీతోనే నన్ను ఒంటరిగా పంపవు. మరీ ముక్కు, మొహం తెలియని మనిషితో దేశాలు దాటించి పంపేస్తావా? " కోపంగా నిలదీసింది.

సోఫా కవర్లు మారుస్తున్న సుభద్ర ఒకసారి కూతురు మొహంలోకి చూసి

"నేను మంచి కూతుర్ని కాలేకపోయాను. ఒకరకంగా మంచి భార్యను కాలేకపోయాను. కనీసం నీ విషయంలో అయినా ఏ పొరపాట్లు జరగకుండా పెంచి పెళ్ళి చేసి పంపి మంచి తల్లిని అనిపించుకోవాలని నా కోరిక. అదే ధ్యాసతో ఈ ఇరవైఏళ్ళు తపించాను. నీ పెళ్ళితోనైనా నిశ్చింతగా ఉండాలనేది నా తపన" ఆ మాట అంటుంటే సుభద్ర గొంతు వణికింది. కన్నీళ్లతో మసకమారిన కళ్ళు కొంగుతో వత్తుకుంది.

"ఏమయ్యిందీ? " అప్పుడే లోనికి వచ్చిన చక్రధరం ప్రశ్నించాడు.

"మీ ముద్దుల కూతురు పెళ్ళి వద్దని మొరాయిస్తోంది. మీరే చెప్పుకోండి" దిళ్ళు సోఫాలో సర్దేసి గలేబులు వాషింగ్‌మిషన్ దగ్గర బుట్టలో పారేయడానికి వెళ్ళిపోయింది.

ఎన్నోసార్లు తల్లి నుండి తనని రక్షించిన తండ్రికి మనోజ్ విషయం చెబితే తనకి అండగా ఉంటాడనే ఆశతో "డాడీ!" అంటూ చెప్పబోయింది.

ఆమెని మాట్లాడొద్దన్నట్లు చెయ్యెత్తి వారించాడు. "మనూ...! నువ్వేం కారణాలు చెప్పినా ఈ విషయంలో మీ అమ్మదే తుది నిర్ణయం. ఒక భర్తగా అమ్మకి సంతృప్తికరమైన జీవితాన్ని ఇవ్వలేకపోయాను. అందుకే తను తన ఆశలన్నీ నీ చుట్టూ అల్లుకొని పెంచుకుంది. ఇప్పుడు నీ వయసు దురుసుతో అమ్మ మనసు నొప్పిస్తానంటే నేనొప్పుకోను. వెళ్ళి అమ్మ చెప్పినట్లు విను" ఖచ్చితమైన స్వరంతో నువ్వేం చెప్పినా నేను వినను అన్నట్లు చెప్పారు.

తండ్రి మాటల్లో కఠినత్వానికి బ్రమాన్పడినట్లు నిలబడిపోయిన మనస్వి వాళ్ళు తను చెప్పేది ఏదీ వినరని గ్రహించి, నిద్రలో నడిచే మనిషిలా గదిలో దూరి తలుపులు బిగించుకుంది. భోజనానికి ఎన్నిసార్లు పిలిచినా మనస్వి బదులు పలకకపోవడంతో "ఈ రాత్రికి వదిలేయ్. ఉదయానికి అదే తేరుకుంటుంది. నువ్వు బతిమాలితే అది ఇంకా మొండికేస్తుంది" భర్త హెచ్చరికతో మిన్నకుండిపోయింది సుభద్ర.

మనస్వికి మనోజ్ గుర్తుకొస్తున్నాడు. రేపొక్కరోజు గడిపేస్తే ఎల్లుండి సుమన మనోజ్‌లని కలిసి ఏదో మార్గాన్ని చూడొచ్చు అనే ఊహ ఆమెకి ఊరటనిస్తోంది. అందుకే పెళ్ళి చూపుల గురించి కాక ఆనంద్, హృదిల జోడిని గురించి ఆలోచిస్తూ పడుకుంది.

* * *

రాత్రంతా సుమ హితబోధలతో ఎటూ తేల్చుకోలేని సందిగ్ధస్థితిలో ఎప్పటికో నిద్ర ఒడి చేరిన హృదికి ఉదయం ఎనిమిది గంటలకు మెలకువ వచ్చి ఉదయాన్నే ముడులు అల్లేస్తున్న సుమనని చూసి "గుడ్‌మార్నింగ్"

అని పలకరించింది. తిరిగి విష్ చెయ్యకుండా "ఏం నిర్ణయించుకున్నావు? " అనడిగింది సుమ. దేని గురించి అని అడగబోయి విషయం గుర్తొచ్చి "ఉదయాన్నే అదే గోలా? " విసుక్కొంది హృది.

మనోజ్ తలుపు తట్టి"ఎనిమిది దాటింది? ఇంకా తెల్లారలేదా? " అరవ డంతో దుప్పట్లు మెడదాకా లాక్కుని "లేచాం" అరిచి చెప్పింది సుమన.

లోపలికి వస్తూనే "మీకో శుభవార్త. రాత్రి మా ఫ్రెండ్‌కి ఆనంద్ విషయం చెప్పి అతని వివరాలలో నిజాలు సేకరించమన్నాను. ఉద యానికి ఫ్యాక్స్ వచ్చేసింది. ఆనంద్ చెప్పిన విషయాలన్నీ నిజాలే" చేతిలో కాగితాలు సుమనకి అందిస్తూ చెప్పాడు.

సుమన వాటిని పరిశీలించింది. ఆనంద్ కుటుంబం ఎన్ని తరాలుగా రాయవరంలో ఉంటున్నారు, వాళ్ళ ఆస్తిపాస్తులు, ఆనంద్ జాతకం, ఆరోగ్య వివరాలు, చదువు ఉద్యోగ విషయాలతో సహా ఉన్నాయి.

"అద్భుతంరా అన్నయ్యా! నిజంగా మెచ్చుకో తగ్గది నీ కంప్యూటర్ పరిజ్ఞానం" సంతో షంగా పొగిడింది సుమన.

కాలర్ ఎగరేశాడు మనోజ్.

"కంగ్రాట్స్ హృదీ! ఒక అనుమానం తీరి పోయింది. మనం ధైర్యంగా ముందడుగు వెయ్యొచ్చు" సంతోషంగా అంటూ చేతిని హృది వైపు జాపింది.

ఆ చేతిని ఫట్‌మని కొట్టి పెదాలు సాగ దీసి "ముందు పళ్ళు తోముదాం" వెక్కిరిం చింది హృది. "ఓ.కే. మీ నిర్ణయాలు తేలాక, మనూ వచ్చాక కబురు చేస్తే సాయంత్రం ఆనంద్ దగ్గరకి వెళదాం" కాగితాలు తిరిగి తీసుకుని వెళుతూ అన్నాడు.

"అవునవును. మనూ రాకపోతే ఈయనగా రికి తీరికుండదు" దెప్పింది సుమన. అరే! నీకెలా తెలుసు? ఆశ్చర్యం నటిస్తూ అని నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. అప్పటికే ఓ నిర్ణయానికి వచ్చిన హృది మంచం దిగి "సుమా! నేను హాస్టల్‌కి వెళ్లి సాయంత్రం వస్తాను. మనూ వచ్చాక ఏం చెయ్యాలో నిర్ణ యిద్దాం సరేనా? " చెప్పి బాత్‌రూమ్‌లోకి వెళ్ళి పోయింది.

ఆమె మాటల్లో తమ నిర్ణయం పట్ల వ్యతి రేకత లేకపోవడంతో మళ్ళీ తన అల్లికలో మునిగిపోయింది సుమన.




మనోజ్‌ని కలిసి నిర్ణయం తీసుకునేదాకా ఎలాంటి రాద్ధాంతం చేయదలచుకోలేదు కనుక మనస్వి బుద్ధిగా తల్లి కోరిక ప్రకారం అలంకరించుకుని వచ్చి పెళ్ళి చూపుల్లో కూర్చుంది. తండ్రి మగ పెళ్ళి వారిని పరి చయం చేశాడు.

ఖరీదైన సూటూ బూటుతో ఉన్న కుర్రా డిని చూపించి "ఇతను శశికాంత్, కాలిఫోర్ని యాలో ఇంజనీరు. వీరు అబ్బాయి తల్లిదం డ్రులు రాజారావుగారు, శాంతమ్మ అని ఇద్దరు వృద్ధ దంపతుల్ని, ఈ అమ్మాయి వారి కుమార్తె సుమతి, ఆమె భర్త కుమార్ అంటూ నలభై ఏళ్ళలోపున్న మరో జంటని పరిచయం చేశాడు.

అందరికి వినయంగా నమస్కరించింది మ నస్వి. వారడిగిన ప్రశ్నలకు ఒద్దికగా బదులి చ్చింది. ముందురోజు రాత్రి కూతురి హడాన్ని చూసి వారి ముందు ఎలా ప్రవర్తిస్తోందోనని బెదురుతున్న చక్రధరం దంపతులు నిశ్చిం తగా ఊపిరి పీల్చుకున్నారు.

రాజారావుకి పరిశీలనా గుణం ఎక్కువ. పెళ్ళిచూపులు తల్లీ, తండ్రి పెళ్ళి కూతురుతో క్లుప్తంగా జరగడం గమనించి "ఏం బావ

గారూ? ఎక్కడా. బంధువుల, స్నేహితుల సందడి లేదు. ఎవర్నీ పిలవలేదా? " ప్రశ్నించాడు. ఇబ్బందిగా కదిలాడు చక్రధరం. "మా బంధువులు దూరంగా ఉన్నారు. ఏకంగా పెళ్ళికే పిలవవచ్చని ఊరుకున్నాం. ఇరుగుపొరుగు అంటే ఇక్కడంతా ఎవరి పనుల్లో వాళ్ళు బిజీగా ఉంటారు. వాళ్ళని ఇబ్బంది పెట్టడం ఎందుకని" మాటని సగంలోనే ఆపి బలవంతాన నవ్వాడు.

"నిశ్చితార్థానికి అందర్నీ పిలుస్తాం అన్నయ్యగారూ" సుభద్ర చెప్పింది. "అవునవును అప్పుడు కూడా ముందు నాకు పరిచయం చేస్తారు. ఈవిడ నీ పిన్ని, ఇతను నీ బాబాయి, ఈయన మీ తాతయ్యా అంటూ" మనసులో గొణుక్కుంది మనస్వి. భళ్ళున నవ్వాడు రాజారావు. "నిశ్చితార్థమా? అబ్బే! పిల్లా పిల్లాడికి నచ్చితే మళ్ళీ ఇరవై రోజుల్లో మా వాడు వెళ్ళిపోవాలి కనుక ఏకంగా పెళ్ళే చేసెయ్యాలి".

"పదిహేను రోజుల్లో అన్ని ఏర్పాట్లు పూర్తి చేయగలమా? " మొహాలు చూసుకున్నారు చక్రధరం, సుభద్ర.

"ఏరా? ఏమంటావు. పిల్ల నచ్చిందా? " రాజారావు కొడుకుని అడిగాడు. "నాకు ఓ. కే. మిగతావి నువ్వే మాట్లాడు" అంటూ సెల్ మోగడంతో లేచి బయటికి వెళ్ళిపోయాడు శశికాంత్.

"ఏమిటో బావగారు పూర్వం మధ్యవర్తి అంటూ ఒకడు ఉండేవాడు కనుక ఇలాంటి ఇబ్బంది తెలిసేది కాదు. ఇప్పుడన్నీ ముఖాముఖీ అవ్వడంతో కాస్త ఇబ్బందిగానే ఉంది." కోరికల చిట్టా విప్పడానికి ముందు ఉపోద్ఘాతంగా అన్నాడు రాజారావు.

కూతురు అక్కడ ఉండడం అనవసరం అని గ్రహించి "మనూ! నువ్వు లోపలికి పద' ' అని కూతుర్ని గదిలోకి పంపి తలుపులు దగ్గరగా వేసి వచ్చింది సుభద్ర.

మనస్వికి కూడా అక్కడ ఉండి వాళ్ళ సంభాషణ వినాలనే కోరిక లేకపోవడం వల్ల గదిలోకి రాగానే అలంకారాలు తీసేసి పట్టు చీర మార్చుకొని మంచం మీద వాలిపోయింది. మనసులో ఏ మూలో ఈ సంబంధాన్ని తల్లిదండ్రులు స్థిరపరిస్తే ఎలా వ్యతిరేకించాలో తెలియని భయం వెంటాడుతున్నా, రేపు మనోజ్‌ని కలిస్తే అతనే మార్గాన్ని చూపుతాడనే ధీమాతో మనోజ్ తో గడిపిన సంఘటనలను నెమరు వేసుకుంటూ పిరికి ఆలోచనలు దూరం చేసేందుకు ప్రయత్నించ సాగింది.

* * *

ఉదయం జరిగిన పెళ్ళిచూపులతో తనకి సంబంధం లేనట్లు రాసుకుంటున్న మనస్వి దగ్గరికి వచ్చి నోట్లో మిఠాయి కుక్కి సంతోషంగా చెప్పింది సుభద్ర. "మనూ! వాళ్లకి మన సంబంధం నచ్చింది. నాన్నగారు అన్నీ మాట్లాడేశారు. ఇంకో పది రోజుల్లో నీ పెళ్లి. ఇది కాస్తా సవ్యంగా జరిగిపోతే నా బాధ్యత తీరిపోతుంది" నేను గుడికి వెళ్తున్నాను. నువ్వూ వస్తావా? " అడిగింది.

రాను అన్నట్లు తల అడ్డంగా ఊపింది.

"సరే, నీ ఇష్టం. డాడీ ఇంట్లోనే ఉన్నారు. నేను త్వరగా వచ్చేస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది. ఒక్కసారిగా చెప్పలేని నీరసం ఆవరించింది మనస్వికి. 'ఏ రకంగానూ వీళ్లకి నా మనసులో మాట చెప్పలేనా? ' టేబుల్ పైన తలాన్చి వేదనగా అనుకుంది. హఠాత్తుగా సుధా మేడమ్ 'మీ అమ్మగారు నీ పట్ల చూపే మితిమీరిన సంరక్షణకి కారణం తెలుసుకో' అన్న సలహా గుర్తొచ్చి లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని లేచి హాల్లోకి వచ్చింది.

తండ్రి ఏవో కాగితాలు ముందేసుకొని లెక్కలు కడుతున్నాడు.

"డాడీ! నేను మీతో మాట్లాడాలి" దగ్గరికి వెళ్ళి చెప్పింది.

"నీకు డ్రస్ ఇచ్చిన కుర్రాడి గురించి తప్ప మరేదైనా మాట్లాడవచ్చు తల ఎత్తకుండా బదులిచ్చాడు.

మనస్వికి విషాదంతో నవ్వొచ్చింది. డాడీకి నా మనసు తెలుసు. అయినా కావాలని నా నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నారు. అనుకొని పైకి

"ఊహూ! అతని గురించి కాదు" చెప్పింది.

"అయితే ఇలా వచ్చి కూర్చో" సోఫాలో తన ప్రక్కన కూర్చోమన్నట్లు సైగ చేశాడు. వెళ్ళి కూర్చుని గోళ్లని పరిశీలించుకోసాగింది.

"ఊఁ! చెప్పు. ఏం మాట్లాడాలి? " కళ్లజోడు టీపాయి మీద పెడుతూ అడిగాడు.

"నా పెళ్ళి కుదిరిందట కదా డాడీ. బహుశా ఒక నెలలో అమెరికా కూడా వెళ్ళి పోతాను. అమ్మ అన్నట్లు కొంగు ముడితో ఒకసారి ఈ గడప దాటి సంసారం అనే గోలలో పడితే, మళ్ళీ మిమ్మల్ని కలవగలనో లేదో? !" ఆమె గొంతులో విషాదం కదిలింది.

చక్రధరం మౌనంగా ఆమె తల నిమిరాడు.

మనూ కాస్త తెప్పరిల్లింది. "నిన్న మీరు, అమ్మా ఇద్దరూ భార్యాభర్తలుగా సరైన న్యాయం చెయ్యలేదు అన్నారు. అది అలా ఉంచండి. పెళ్ళికి వచ్చే బంధువులని ముందు నాకు పరిచయం చెయ్యాలి. ఈవిడ మీ బామ్మా, ఈయన మీ మామయ్యా అంటూ కదు డాడీ" నవ్వింది. చక్రధరం మాట్లాడ లేదు. మళ్ళీ మనస్వే అడిగింది.

"పిల్లలపట్ల కన్నవాళ్లకి జాగ్రత్త ఉండొచ్చు కానీ అయిన వాళ్లని కూడా దూరంగా ఉంచే టంత; మీరు అమ్మ తప్ప మరో వ్యక్తి నాకు ఏ రకంగానూ చేరువ కాకూడదనేంత జాగ్రత్త అవసరమా డాడీ!చాలా సార్లు అమ్మ ముందు నా తప్పుల్ని కాశారు. కానీ ఒక్కసారి కూడా అమ్మ నాపై రుద్దే అతి జాగ్రత్తను మీరు వ్యతిరేకించలేదు. ఎందు కని? నా ఈ సందేహాలకి మీరు జవాబు చెప్పకపోతే నేను అమెరికా కాదు అంతరిక్షా నికి వెళ్ళినా నాకు మనశ్శాంతి ఉండదు" ఎన్నాళ్ళనుండో గుండెల్లో దాచుకున్న సందే హాలను తండ్రి ముందుంచింది.

"మనూ! నువ్వు సరైన సమయంలో అడి గావు. త్వరలో మరొకరికి ఇల్లాలు కాబోయే నువ్వు, నాకు మీ అమ్మకు మధ్య పెరిగిన మానసిక అంతరానికి కారణం తెలుసుకోవడం ఎంతైనా అవసరం. నేనూ, సుభద్ర ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం. డిగ్రీ చదువుతూ రికా మీగా తిరిగే నేను ప్రతీ సోమవారం శివాల యానికి ప్రదక్షిణాలకు వచ్చే సుభద్రను తొలి చూపులోనే వలచి వలపించుకుని పెద్దలని ఎదిరించి అన్నవరంలో పెళ్ళి చేసుకొని కాపురం పెట్టాను. మనూ! బాధ్యతెరుగని వయసులో అమ్మ కడుపు నిండా పెట్టి, నాన్న ఖర్చులకు డబ్బులిస్తూంటే జల్సాగా బతకడం వేరు. సరైన చదువు, ఉద్యోగం లేకుండా నా పొట్టనే పోషించుకోలేని నాకు మీ అమ్మని, నిన్ను పోషించడం తలకి మించిన భారము య్యింది. దొరికిన చోటల్లా అప్పులు చేసి వాళ్ళ వత్తిడి తట్టుకోలేక బతుకంటే భయపడే స్థితిలో మా అమ్మా, అక్కా వచ్చి ఇంటికి రమ్మని బలవంతం చేశారు. కాదనే ధైర్యం లేక అమ్మ ఇచ్చిన డబ్బులతో అప్పులు తీర్చేసి ఇంటికి వెళ్ళిపోయాం. నాన్న నన్ను కూడా అన్నయ్యతో ఉండి బియ్యం మిల్లు చూసుకో మన్నారు. అప్పటికి నా వాళ్ళు నన్ను మళ్ళీ చేరదీయడమే గొప్ప భాగ్యంగా సంతోషిం చాను. అప్పుడే సుభద్ర తండ్రి చనిపోయా డని, తల్లి అనారోగ్యంతో మంచం పట్టిందని తెలిసి వెళ్ళి చూసిరమ్మంటే మీ అమ్మ ఒప్పు కోలేదు" చెబుతున్న చక్రధరం గుమ్మం దగ్గర అలికిడి కావడంతో తేరుకొని చెప్పడం ఆపేశారు. "ఇదేమిటి? తీరిగ్గా కబుర్లు చెప్పు కుంటున్నారు. మీరు సిద్ధాంతిగారిని కలవా లన్నారు. ఇంకా వెళ్ళలేదా? " లోపలికి వస్తూ కాస్త ఆశ్చర్యంగా అడిగింది సుభద్ర.

"నాన్న మీ కథనే చెబుతున్నారమ్మా!" చెప్పింది మనస్వి.

"అదేం కథలా చెప్పుకునేంత గొప్పదికాదు" ఇద్దరికి ప్రసాదం పెడుతూ అంది.

"అలా అనొద్దమ్మా! మీ అనుభవాలు మాకు పాఠాలు. మీరు చేసిన తప్పులు మేము చెయ్యకుండా ఉంటే జీవితంలో సగం విజయం సాధించినట్లే" మనస్వి అంది.

"మాటలు బాగా నేర్చావంటూ" పూల సజ్జ లోపల పెట్టి పెరట్లో కోసిన పువ్వులను, దారాన్ని తెచ్చుకొని మనస్వికి ఎదురుగా కూర్చుంది. చక్రధరం కాగితాలు సర్దుకొని,

బట్టలు మార్చుకొని సిద్దాంతిగారి కోసం వెళ్ళి పోయాడు.

"డాడీ ఆపేసిన దగ్గర నుండి నువ్వు చెప్పు మీనాన్న చనిపోయారని తెలిసీ మీ ఇంటికి నువ్వెందుకు వెళ్ళలేదు? " అడిగింది మనస్వి.

"నేను లేచిపోయి తన పరువు తీశానని నాన్న తన ప్రాణాలు తీసుకున్నారు. మళ్ళీ వెళ్ళి అమ్మ ప్రాణాలు కూడా తీసిన దానిని అవుతానని భయపడి వెళ్ళలేదు. కానీ మీ పెద్ద అత్త పుణ్యమాని చాలా తొందరగా, నేను పుట్టింటికి వెళ్ళే పరిస్థితి వచ్చింది. మీ నాన్నతో నన్ను మనిషినైతే ఇంటికి రానిచ్చారు. కానీ కేవలం చాకిరి చేసే పనిమనిషిగానే తప్ప ఆ ఇంటి కోడలి స్థానం నా అత్తింట్లో నాకు దక్కలేదు. ఆ బాధను ఎలాగో ఓర్చుకున్నాను. పూర్తిగా నన్ను మీ నాన్న భార్య స్థానం నుండి తప్పించి తన కూతురు జయని నా స్థానంలో ఉంచాలని మీ అత్త పథకం వేసింది. విషయం విన్న నేను ఆగలేక మీ నాన్నని నిలదీశాను. ఆయన "నాకేం తెలియదు" అన్నారు. లోక జ్ఞానం లేని వయసు. అక్క, అమ్మ మాట కాదనలేక నాకు అన్యాయం చేస్తారేమోననే నా ఆక్రోశం. ఆ మాటల్ని నమ్మలేదు. పెద్ద పోట్లాట పెట్టుకొని అలిగి పుట్టింటికి వెళ్ళిపోయాను" విషాదంగా నవ్వింది.

"అది నా జీవితంలో నేను చేసిన రెండో తప్పు. చెడి పుట్టింటికి చేరకూడదు అనే సామెత నా పట్ల నిజమయ్యింది. అన్నయ్య, వదినల దగ్గర చాకిరీకి తోడు నా వల్లే నాన్న చనిపోయారని నాకు తీరువ లేకపోవడం వల్లే మీ నాన్న నన్ను వదిలేశారనీ, నానా మాటలు అనేవారు. అక్కడినుండి కూడా పోవడానికి మరో దారి లేక మౌనంగా భరించేదాన్ని. ఇన్ని బాధల్లోనూ ఒకటే ఊరట. మీ నాన్న జయని చేసుకోలేదని రైసుమిల్లు చాకిరి భరించలేక తిరిగి హైదరాబాద్ వెళ్ళి పోయారని తెలిసిన వార్త. నువ్వు పుట్టావు. మీ డాడీ తనకి మంచి ఉద్యోగం దొరికిందనే ఉత్తరంతో పాటు రైలు టిక్కెట్ పంపారు. నేను ప్రయాణానికి సిద్ధమయ్యాను. వదినలు మళ్ళీ అడ్డుపుల్ల వెయ్యాలని చూశారు. నీ మొగుడిని నమ్మి వెళితే మళ్ళా నాశనమైపోతావు అని శపించారు. నేను లెక్క చెయ్యలేదు. మన వాళ్ళే మనకి శత్రువులైతే ఎంత నరకమో తెలుసుకున్న నేను డాడీనే నమ్ముకొని వచ్చేశాను.

**నా వల్లే మా నాన్న చనిపోయారని నాకు తీరువ లేకపోవడం వల్లే మీ నాన్న నన్ను వదిలేశారనీ, నానా మాటలు అనేవారు.**

నా ఇల్లు, నా భర్త అన్న ఆనందం సంపూర్ణంగా పొందక ముందే మళ్ళీ మీ బామ్మా, అత్తయ్యా వచ్చేశారు. ఈ సారి మీ డాడీ వాళ్ళ వెంట వెళ్ళడానికి ఒప్పుకోలేదు. వాళ్ళ దృష్టి నీ మీద పడింది. మీ డాడీ ఎదురుగా ప్రేమ కురిపించి ఆయన గుమ్మం దాటగానే, ఇది మా తమ్ముడి రక్తం. నీ పాలు తాగడానికి నీ ఒళ్ళో పెరగడానికి వీల్లేదంటూ పాలు తాగే పసిబిడ్డను లాగేసుకునేవారు. బంధువుల దాష్టీకంతో విసిగిపోయిన నేను మీ నాన్న చేత మనం ఆయనకి కావాలంటే నీ పెంపకం బాధ్యత నాదేనని, ఎలా పెంచినా అడ్డు చెప్పనని ప్రమాణం చేయించుకున్నాను. ఆనాటి నుండి నేటిదాకా మీ డాడీ ఆ మాట మీద నిలబడ్డారు. నోటితో దారాన్ని తెంపుతూ చెప్పడం ఆపింది.

ఎదురు ప్రశ్నించకుండా శ్రద్ధగా వింటోంది మనస్వి.

"మీ డాడీ ప్రమాణం చేసినా, నాలో మిమ్మల్ని ఎవరో దూరం చేస్తారనే భయం పోలేదు. నువ్వు స్కూలు నుండి పదినిమిషాలు లేటుగా వచ్చినా, డాడీ అరగంట ఆలశ్యంగా వచ్చినా అనవసరపు ఊహలతో, భయాలతో నరకాన్ని చూసేదాన్ని. అందుకే నీకు అతిగా అనిపించినా నీ చుట్టూ స్నేహి

తులు, బంధువులు చేరకుండా నాదైన రక్షణ వలయాన్ని ఆంక్షల గిరిలా గీసి పెంచాను. నేను చేసింది సరైన పని కాకపోవచ్చు కానీ అయినవాళ్ళచేతనే భర్తని, బిడ్డను దూరం చేసుకొనే దుర్భరస్థితిని అనుభవించిన నాకు నా పరిస్థితికి అదే సరైన పద్ధతి అనిపించింది. మనూ! తల్లిగా నీ స్వేచ్ఛను నేను హరించాననిపిస్తే ఈ అమ్మను క్షమించు" మనస్వి తలలో పూలు పెడుతూ వేదనగా అంది.

మనస్వి మనసు కరిగిపోయింది 'లేదమ్మా! నా గురించి మీరు పడ్డ తపన విన్నాక జన్మంటూ ఉంటే మళ్ళీ నీకే పుట్టాలని ఉంది' తల్లి చేతుల్ని ముద్దాడుతూ అంది. సుభద్ర చిరునవ్వుతో మనస్వి నుదుటన చుంబించింది. ఫోన్ మోగడంతో వెళ్ళి మాట్లాడి వచ్చింది. తండ్రినుండి అయి ఉంటుందని మౌనంగా ఉండిపోయిన మనస్విని ఉద్దేశించి చెప్పింది.

"మనూ! శశికాంత్ ఫోన్ చేశాడు. రేపు ఉదయానికి వాళ్ళ బంధువుల ఇంటికి వెళ్ళాలట. నిన్ను ఉదయం తొమ్మిదికల్లా రడీగా ఉండమన్నాడు. వచ్చి తీసుకువెళతాడుట"

"నేను? అతనితో ఒంటరిగా వెళ్ళాలా?" నమ్మలేనట్లు అడిగింది.

"కాబోయే భర్తేగా ఫరవాలేదు" తేలిగ్గా తేల్చేసింది సుభద్ర.

ఐదు నిమిషాల ముందు తల్లి మీద కలిగిన ప్రేమ కోపంగా మారుతుండగా, విసురుగా లేచి "నా వల్లకాదు" అరచినట్లు చెప్పి తన గదికేసి నడిచింది. సుభద్ర లెక్కచేయలేదు. "చుట్టాలింటికి కదా! చీర కట్టుకుని వెళ్ళు" వెనక నుండి సలహా ఇచ్చింది.

తల్లి ధోరణిలో మార్పు రాదని గ్రహించి తన ఆగ్రహాన్ని తలుపుల మీద చూపిస్తూ ధడేలున మూసుకుంది.

## 15

హృదికి ఎంత వద్దన్నా ఆనంద్ రూపం, మాటలు గుర్తొస్తున్నాయి.

"అంత స్వచ్ఛమైన మనసున్న మనిషిని నా స్వార్థంతో అబద్ధాలు చెప్పి మోసగించడం అన్యాయం" పదే పదే అనుకోసాగింది. ఎక్కడో ఏ మూలో మనసు అతన్ని కలిసి నిజాలు చెబితే అర్థం చేసుకుంటాడేమోనవి ఆశపడుతోంది. అంతలోనే మరోవైపు అతను అసహ్యించుకుని తిరస్కరిస్తే ఆ కళ్ళలో ద్వేషాన్ని నేను చూడలేను. వద్దు వద్దు, అతన్ని మళ్ళీ కలవనే వద్దు. ఈరోజు, రేపు వెళ్ళకపోతే అతనే వెళ్ళిపోతాడు. మరో మంచి అమ్మాయిని చేసుకుంటాడు. అవును వెళ్ళకూడదు. కానీ ఎలా? ముందు మనూ, సుమా వదలడం లేదు. బాగా ఆలోచించి ముందు సెల్ ఆఫ్ చేసేసింది. ఒకవేళ వాళ్ళు హాస్టల్‌కే వచ్చేస్తే? మళ్ళీ బెదురు కలిగి ఎలా తప్పించుకోవాలా అని ఆలోచిస్తూ పచార్లు చేసింది.

ఎంతకీ ఏం చేయాలో తోచలేదు. 'అనవసరంగా మాట్రిమోనియల్ సైట్‌కి వెళ్ళి లేనిపోని తలకొరివి తెచ్చిపెట్టుకున్నాను.' అనుకుంటూ తనని తాను తిట్టుకుంది. మంచం మీద వాలి ఆలోచనలకు బ్రేకు వేయాలని ప్రయత్నించింది. లాభం లేకపోయింది. 'ఇలా కాదు' అనుకుంటూ డ్రెస్ మార్చుకుని హ్యాండ్‌బ్యాగ్ తీసుకొని హాస్టల్



నుంచి బయట పడింది. దాదాపు అరకిలో మీటరు దూరం అలా నడుచుకుంటూ వెళ్లింది. హఠాత్తుగా ఏదైనా సినిమాకు వెళితే అన్పించింది. వెంటనే ఖాళీగా పోతున్న ఆటోని పిలిచి ఐమాక్స్ థియేటర్ పోనివ్వమంది. ఏం సినిమా ఆడుతోందో కూడా చూడకుండా టికెట్ కొనుక్కుని లోపలికి వెళ్లింది. ఏదో ఇంగ్లీష్ సినిమా. అరగంట కూడ చూడలేక బయటకు వచ్చేసి ఎన్టీఆర్ పార్క్‌కు వెళ్లింది. టైమయ్యేదాక అటూ ఇటూ పిచ్చిగా తిరిగింది. కుర్రాళ్లు కొంతమంది ఆసక్తిగా, అదోలా చూడడం గమనించి తనలోతాను నవ్వుకుంది. ఆకలనిపించడంతో క్యాంటీన్‌లో సాండ్‌విచెస్ తిని కూల్‌డ్రింక్ తాగింది. టైమయిపోవడంతో బయటకు వచ్చి నెక్లెస్‌రోడ్‌లో నడుచుకుంటూ వెళ్లి ట్రాఫిక్ ఐలాండ్ సమీపంలో లాన్‌లో కూర్చుని హుస్సేన్‌సాగర్‌ను, అటువైపు ట్యాంక్ బండ్ మీద లైట్లనీ, నీళ్లలో ఆ లైట్ల వెలుగుల్ని చూస్తూండిపోయింది. హఠాత్తుగా ఆనంద్ వచ్చి ఎదురు చూసి చూసి నిరాశగా వెళ్లిపోయుంటాడేమో అని అనుకుంది. మనస్సంతా శూన్యంగా మారిపోయింది. అచేతనంగా అలాగే చాలా సేపు కూర్చుండిపోయింది.

"హృదీ? మీరేనా?" అన్న పిలుపుకి ఉలిక్కిపడింది. ఇంత రాత్రి ఇక్కడ నన్ను పలకరించేదెవరు అనుకుంటూ చూసింది. ఆ వ్యక్తి చీకటి నీడలోంచి లైటు వెలుగులోకి ముందుకు వచ్చిన ఆ వ్యక్తి- ఎవరి కంట పడకూడదని ఒంటిరిగా గడుపుతోందో ఆ ఆనంద్.

"హృదీ! మీరేనా? ఈ జీన్స్, టీ షర్టులో చూసి మీరు కాదేమోనని సందేహపడ్డాను. మీ స్నేహితులు, మనోజ్ ఎవరూ లేరు. ఒంటరిగా వచ్చారా?" దగ్గరగా కూర్చుంటూ అడిగిన అతన్ని కళ్ళు విప్పార్చుకుని చూసింది. "సాయంత్రం మీరు ఎవరో ఒకరు వస్తారని చాలా సేపు నిన్న మనం వెళ్లిన పార్కులో చూసి చూసి వచ్చేశాను. నేను దిగిన హోటల్‌కెళ్లినా ఏంతోచక మనసంతా అదోలా, నిరాశగా అన్పించి కాస్త టైంపాస్ అయినా అవుతుందేమోనన్పించి ఇటువచ్చాను. పదకొండు దాటినా ఇక్కడ ఇంకా ఇంత రష్‌గానే ఉంది" అన్నాడు.

హృది అతణ్ణే చూస్తూండిపోయింది తప్ప బదులివ్వలేదు. "ఎలాగైతేనేం మనం మళ్ళీ కలిశాం. మా హోటల్ దగ్గరే. వెళదాం రండి. నాలాగే మీరు కూడా



ఒంటరితనం ఫీలవుతున్నట్లున్నారు. కొంచెం సేపు కూర్చుని మాట్లాడుకోవచ్చు". అని చొరవగా చేయి పట్టి లేపాడు.

వద్దన్నా వెంటపడే బంధాన్ని వదిలించుకోవడం ఎలాగో అర్థంకానట్లు తల విదిలిస్తూ అతడికేం చెప్పాలో, వెళ్లాలో వద్దో నిర్ణయించుకోలేకపోయింది.

ఆమె మనసులోని సందిగ్ధతను గ్రహించినట్లు "నేను మిమ్మల్ని మింగేయనులే రండి. నేనంటే మీకిష్టం లేకపోయినా పర్వాలేదు. ఇద్దరం ఒంటరితనాన్ని అనుభవిస్తున్నాం. ఆ విధంగా మనం స్నేహితులం రండి". అంటూ ముందుకు నడిచాడు.

ఆ మాటలకు అతణ్ణి నొప్పించానేమోననుకున్న హృది మనసు ఎందుకో చివుక్కుమంది. బొమ్మలా అతణ్ణి అనుసరించింది. హోటల్ రూమ్‌కి చేరుకున్నాక "ఏమైనా తింటారా" అని అడిగాడు. వద్దన్నట్లు తల అడ్డంగా ఊపింది.

"ఇంత రాత్రివేళ ఒక్కరే అక్కడ అలా కూర్చున్నారేమిటి? ఏదైనా ప్రాబ్లమా" అడిగాడు ఆనంద్.

ఆ ప్రశ్నకు ఆమెలో హఠాత్తుగా అసహనం రేగింది. 'నువ్వే ప్రాబ్లమ్' అని మనసులో అనుకుని "మీ దగ్గరకు రాకుండా తప్పించుకోవటం కోసమే మా వాళ్లకి కూడ కనబడకుండా తిరుగుతున్నాను. అయినా నా ఖర్మ మీరక్కడికి వచ్చారు." ఉక్రోషంగా అంది.

ఆనంద్ కనుబొమలు ముడిపడ్డాయి "నా నుండి తప్పించుకోవడం ఎందుకు? " అన్నాడు. హృది రెండు నిమిషాలు అతడిని తదేకంగా చూసింది.

ఆనంద్ ముఖంలో కనిపించే అమాయకత్వాన్ని చూస్తుంటే హృదికి ఇంకా అతడి దగ్గర నిజం దాచాలి అనిపించలేదు. అలాచేస్తే నేను మూర్ఖురాలినే అవుతాను అనుకుంది. " ఆనంద్ మీరు నా గురించి ఏమనుకున్నా మీకో నిజం చెప్పాలి" అంది.

మంచినీళ్లకోసం వెళ్లబోయిన వాడల్లా "ఏంటా నిజం" అనడిగి గ్లాసులోకి జగ్గులోని నీళ్ళు వంపుకుని వచ్చి మంచం మీద కూర్చున్నాడు.

హృది అతడి కళ్లలోకి చూడలేక తలదించుకుంది. మాటలు కూడదీసుకుంటూ తమ కంప్యూటర్ ఆట గురించి చెప్పింది.

"అంటే మీ ఉద్దేశ్యం ఇదంతా అర్థంలేని వ్యవహారమేనా? మరి నన్ను కలవడానికి ఎందుకొచ్చారు? " ఆనంద్. గొంతులో ఆగ్రహం తొంగిచూసింది.

"సారీ... కంప్యూటర్‌లో మీ వివరాలు చూసినా మేము కోరిన అర్హతలు గల వ్యక్తి నిజంగా ఉన్నాడని మాకు నమ్మకం కలగలేదు. ఏ ఆకతాయో మా ఏడ్‌కి సరదాగా బదులు ఇచ్చి ఉంటాడు. అతన్ని కలిసి ఏడిపించాలని వచ్చాం" మెల్లగా చెప్పింది.

"ఓ! అంటే నీ ఆటలో పావు కాస్తా ఎదురుతిరిగి నీ వెంటే పడుతోందని భయపడి తప్పించుకుని తిరుగుతున్నావా? " అని ఏహ్యభావంతో ఏకవచనంలో మాట్లాడుతూ వ్యంగ్యంగా నవ్వాడు. "ఏమైనా నీ పట్నం తెలివికి నా జోహార్లు. నీకన్నా... మొహం మీదే నన్ను కాదన్న ఆడపిల్లలు ఎంతో నయం. వాళ్లెవరూ నీలా నాలో ఆశలు రేపి నా ఫీలింగ్స్‌తో ఆడుకోలేదు"

అతని గొంతులో అణుచుకున్న వేదన కనిపించింది హృదికి. బదులు చెప్పలేనట్లు ఉండిపోయింది.

"ఇంకెందుకూ? నువ్వు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు భయపడకు. నేనంటే ఇష్టం లేని మనిషిని వేధించే మృగాన్ని కాదు" గుమ్మం వైపు చేయి చూపిస్తూ అన్నాడు.

గుమ్మం వైపుగా రెండడుగులు వేసి మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చుని "ఓ పెద్ద నిజాన్ని తెలుసుకున్నారుగా! ఎలాగూ ఈ రాత్రికి మీకు నిద్ర ఉండదు. టైమ్‌పాస్‌కి నా కథ చెబుతాను వినండి" విషాదంగా నవ్వింది. "చెప్పడానికి ఇంకేం మిగిలిందని? ... మంచం మీద కూలబడ్డాడు.

"నేను మీకు ఎదురుపడకుండా, మావాళ్లని తప్పించుకుని తిరుగుతున్నది మీకు అబద్ధాలు చెప్పలేకే కానీ మీరంటే అయిష్టంతో కాదు.

అది నిజం. నేను డిగ్రీ చదువుతున్నాను. కానీ అది కేవలం హాస్టల్లో సీటు కోసమే కనుక దాని విలువ పదోక్లాసుకి మించదు అన్నది నిజం. మూడో నిజం నేను అనాథను కాను. అమ్మా, నాన్నా ఉన్నారు. కానీ నా తండ్రి పేరైనా నాకు తెలియదు. నా తల్లికి వ్యసనాలపై ఉన్న మక్కువ కూతురుపై లేదు. అందుకే నేను అనాథను. నాకు ఆస్తి పాస్తులున్నాయి. ఎక్కడ, ఎంతెంత ఉన్నాయో కూడా లెక్క తెలియదు. కానీ నా సంతోషానికి ఒక్క పైసా కూడా వాడుకోలేను. అందుకే నాకేం లేవు. నేను చెప్పేది మీకు అర్థం అవుతోందా? " చెప్పడం ఆపి ప్రశ్నించింది.

"అర్థం అయ్యింది! నీకు తిక్క ఉంది. అందుకే పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావు. నేనంటే ఇష్టమేనంటావు. అయినా అది ఆటంటావు. డబ్బుంది అని చెప్పి లేదు అంటావు. డిగ్రీ చదువు టెన్త్‌తో సమానమంటావు. అమ్మా నాన్న ఉండి అనాథనంటావు. ఒకటి చెప్పు, నా కన్నా పిచ్చి మాలోకం నీకెవరూ దొరకలేదా? " చిరాగ్గా మొహం పెట్టి అడిగాడు.

ఫక్కున నవ్వింది. "నిజంగానే దొరకలేదు. అందుకే నా స్నేహితులంతా మిమ్మల్ని అంగీకరించమని నన్ను వత్తిడి చేశారు. మీరే చెప్పండి. నూరేళ్ళ వివాహ జీవితాన్ని అబద్ధాల పునాదులపై ఎలా నిలపమంటారు? ఓ పని చెయ్యనా? నా గురించి మొత్తం చెబుతాను. ఎలాగూ తెల్లారిపోతుంది. మీ అభిప్రాయం నోటితో చెప్పనక్కరలేదు. తలుపులు తీసేస్తే నేనే వెళ్ళిపోతాను" అని అతనికి దగ్గరగా కుర్చీ లాక్కుని ఒక్కొక్కటిగా హాస్టల్ ఒంటరి జీవితం, తల్లి వ్యసనాల మైకం, పేరైనా తెలియని తండ్రి పంచిన ప్రేమరాహిత్యం, వరంలా దొరికిన మనూ, హృదిల స్నేహం అన్నీ వివరంగా చెప్పింది". మౌనంగా విన్నాడు ఆనంద్.

"నిన్నటి వరకు నా ధ్యేయం మా అమ్మని వ్యసనాల ఊబిలోంచి లాగడం ఒక్కటే. నిన్నటి మీ పరిచయం నాకన్నా నా స్నేహితుల్ని ఎక్కువగా ఆకట్టుకుంది. మీ సాహచర్యంలో అయితే నేను నా ఒంటరితనాన్ని మర్చిపోయి సంతోషంగా ఉంటానని వాళ్ళ నమ్మకం. నాకే ధైర్యంగా మీరు ఎదురుపడి నిజాలను చెప్పలేక, ఒకవేళ చెప్పినా నా గతాన్ని విని నన్ను మీ భార్యగా చేసుకుంటారని నమ్మకం లేక పాపం వాళ్ళకి మాట మాత్రమైనా చెప్పకుండా వచ్చేశాను. ఎక్కడ ఏ రుణముందో మళ్ళీ మీకు ఎదురుపడక తప్పలేదు. ఇదంతా నన్ను నేను సమర్థించుకోవడానికి చెప్పలేదు. మేము మిమ్మల్ని మోసం చేశామనే మనోవేదనతో మీరు వెళ్ళిపోకూడదని చెప్పాను" మనసులో భారాన్ని దింపేసుకొని ప్రశాంతంగా నిట్టూర్చింది.

ఆనంద్ ఒళ్ళు విరుచుకుని టైమ్ చూసుకున్నాడు. మూడు కావొస్తోంది. "చెప్పడం అయిపోతే కొంచెం లైట్ ఆర్పేస్తే నేను పడుకుంటాను. నిద్ర వస్తోంది" దిండు సర్దుకొని ఒత్తిగిల్లి పడుకుంటూ అన్నాడు.

అతని అభిప్రాయం అర్థం కాక "నేను వెళ్ళిపోనా? " బలహీనంగా అడిగింది. " ఇప్పుడు మూడు దాటింది. ఒక్కదానివే ఎలా వెళతావు. అయినా నాతో ఉండడం ఇష్టం లేకపోతే వెళ్ళిపోవచ్చు" అన్నాడు. ఆ మాటలకు హృదిమరింత అయోమయానికి గురై అలాగే కూర్చుండిపోయింది.

"నడుం లాగడం లేదా? లైటార్పి పడుకోవచ్చుగా? " విసుక్కొన్నాడు.

లైటార్పి వచ్చి ఆ మసక కాంతిలో ఎక్కడ పడుకోవాలో తోచనట్లు ఉండిపోయింది. "కింద చల్లగా ఉంది. మంచంపైన పడుకో" చెప్పాడు.

మెల్లగా వచ్చి అతని కాళ్లవైపు కూర్చుంది. ఎలా పడుకోవాలో తెల్చుకోలేక "అబ్బబ్బా! నీతో అన్నీ తంటాలే. ఏ నిర్ణయం త్వరగా తీసుకోవు. జీవితాంతం నీతో ఎలా వేగాలో? నీ కాళ్లు నా మొహం మీద పెడతావా? " కసిరినట్లు అంటూ లేచి దిండు, దుప్పటి తీసుకుని "నేను కింద పడుకుంటా" అని నడుం వాల్చాడు.

అతని మాటల సారాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తూ మెల్లగా పడుకుంది.

ఉదయాన్నే బోయ్ తలుపులు తట్టడంతో ఆనంద్‌కి మెలకువ వచ్చింది. కాఫీ తాగి స్నానం కానిచ్చి తల దువ్వుకుంటూ హృదిని లేపాడు.

ఆమె రెండు నిమిషాలపాటు బద్ధకం తీర్చుకుని బ్యాగ్‌లోంచి బట్టలు తీస్తుంటే సెల్ బయట పడింది. "ప్చ్! నిన్నటి నుండి ఆఫ్‌లోనే ఉంచేశాను. మనూ, సుమ కంగారు పడుతున్నారేమో అనుకుంటూ ఆన్ చేసింది. చాలా సార్లు ప్రయత్నించిన ట్లున్న ముంబాయి నెంబర్‌ని చూసి అను మానంగా కనుబొమలు ముడిపడ్డాయి. ఎస్.ఎమ్.ఎస్. చూసింది. డాక్టర్ చటర్జీ పంపిన మెసేజ్ కూడా ఉంది. "జానకి కమిటెడ్ టు సూసైడ్ ఎటమ్ప్ట్"

'జానకి ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. పరిస్థితి విషమంగా ఉంది. వెంటనే రావాలి' అన్న ఆ సందేశం అర్థం కాగానే ఆమె ప్రమేయం లేకుండానే మొహంలోకి భయం, నోటి నుండి 'అమ్మా' అన్న ఆర్తనాదం వెలువడ్డాయి.

## 16



హైదరాబాద్‌లో ముఖ్య రహదారులు, జాతీయ మార్గాలు బాగానే ఉంటాయి కానీ గల్లీలలోనూ, శివార్లలోని పల్లెటూర్లకి వెళ్ళే మార్గాలు మాత్రం దారుణం. వాటిమీద సుతారమైన విదేశీ కారులు గలవారు చాలా ఇబ్బంది పడతారు. ఎక్కడో మేడ్చల్ అవతల చిన్న పల్లెటూరులో ఉన్న మేనత్తకి మనస్విని చూపించాలని బావగారి కారులో బయలుదేరాడు శశికాంత్.

గతుకుల రోడ్లల్లో కుదుపులకు గురౌతూ, అవస్థ పడుతూ నడుస్తోంది కారు. దారి పొడవునా తను ఎలా స్వశక్తితో చదివి అమెరికా వెళ్ళి ఉద్యోగాన్ని సంపాదించింది ఓ కథలా చెప్పుకొచ్చాడు శశికాంత్.

"మన పెళ్ళయ్యాకా, త్వరలో నిన్ను అమెరికా రప్పించి ఏదో ఉద్యోగంలో చేర్పిస్తాను. ఇద్దరికీ ఉద్యోగాలుంటే గ్రీన్ కార్డు త్వరగా వస్తుంది" అన్నాడు.

"అక్కడ మీకు నచ్చిన అమ్మాయి ఎవరూ దొరకలేదా...? " మనస్వి అడిగింది. భుజాలు ఎగరేశాడు శశికాంత్. "చాలా మందే ఉన్నారు. కొందరు తెలుగు వాళ్ళు పిల్లనిస్తా మన్నారు. కానీ నాకు మన దేశంలో పుట్టి పెరిగిన పిల్లే ఇష్టం. ఎందుకంటే ఆ దేశ జీవన విధానం చాలా వేగవంతం. పెళ్ళికి ముందే ఆడా, మగా కొన్నాళ్ళు కలిసి గడపడం, నచ్చకపోతే విడిపోవడం వంటివి ఎక్కువ. ఆడవాళ్ళలో తొందరపాటు నిర్ణయాలు, విడాకులు, నా సంపాదన, నా ఇష్టం అనే పొగరు ఎక్కువ. చాలా మంది మనవాళ్ళ పిల్లలు కూడా అక్కడి తత్వానికి అలవాటు పడిపోయారు. నాకు అనుకూలవతి అయిన భార్య కావాలి. అందుకే కాస్త ఖర్చయినా ఇక్కడికి వచ్చి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను"

అతనెంతగా మాటలు పేర్చినా అసలు సంగతి మనస్వి గ్రహించింది. అమెరికా సంస్కృతిలో పెరిగిన అమ్మాయి పతియే దైవం అనే ధోరణిలో తన సంపాదన మొత్తం అతని చేతిలో పోసి భర్త ఆధిపత్యాన్ని, అహంకారాన్ని భరించదు. కానీ ఇంకా ఈ దేశపు ఆడపిల్లలు ఎంత 'మాది నూతన తరం' అని ఎగిరినా తరతరాల సాంప్రదాయాలకు తల వంచుతూనే ఉన్నారు" ప్చ్ ఈ తరం అమ్మాయిలు ఆధునికత పేర వెర్రి మొర్రి ఫ్యాషన్ల వెనక పడతారే కానీ ప్రాణాంతకం, పీడాకరమైన వరకట్న సమస్యని మాత్రం ఆత్మాభిమానంతో గెలవలేరని మనసులోనే వాపోయింది. కానీ అంతలోనే మనసు వెక్కిరించింది. 'వెధవ కబుర్లు చెప్పకు. ఎవరి

దాకానో ఎందుకు నువ్వు నీ కన్నవాళ్ళ నిర్ణయాన్ని కాదని ఈ పెళ్ళిని ఎదిరించగలవా?' నిలదీసింది.

హఠాత్తుగా కారు ఆగిపోయి, "వెధవ రోడ్లు, వెధవ కార్లు" అని శశికాంత్ తిట్టుకుంటూ దిగడంతో ఆమె ఆలోచనలకు అడ్డుకట్ట. తిట్టుకుంటూనే వెళ్ళి బానెట్ తెరచి చూశాడు. ఎక్కడ ఏది పోయిందో కానీ గుప్పుమని పొగ, ఆవిరి ఎగజిమ్మాయి. గత నాలుగేళ్ళుగా చలిదేశంలో ఉండడం వల్ల శీతాకాలం ఎండైనా దాని తీక్షణత, కారు నుంచి వచ్చే వేడి ఉక్కపోతని కలిగిస్తుంటే కోటు తీసి లోపల పారేసి మళ్ళీ స్టీరింగ్ ముందు కూర్చుని "ఇప్పుడెలా? " స్వగతంగానే పైకి అనుకున్నాడు.

"ఏముంది. చుట్టుపక్కల ఎక్కడైనా బాగు చేసే పుణ్యాత్ముడుంటే వెళ్ళి తీసుకురావాలి." అడగకపోయినా సలహా ఇచ్చింది మనస్వి.

"నీకు తెలిసిన మెకానిక్ ఉన్నారా? ఫోన్ చేసి పిలుద్దాం" సెల్ బయటికి తీశాడు. భుజాలు ఎగరేసి, పెదవి విరిచి "నాకెవరూ తెలియరు" అని తల అడ్డంగా ఊపింది.

"అబ్బా! ఛా, ఛా" అసహనంగా స్టీరింగ్ గుద్దాడు శశికాంత్.

"దానికీ రోగం వస్తే మీ సమస్య రెట్టింపు అవుతుంది" సానుభూతి నటిస్తూ అంది. శశికాంత్ కోపంగా ఏదో అనేలోగా, సుమ గొంతు "అన్నయ్యా! మనూ!" అనడం వినిపించి వాళ్ళ దృష్టి తమ కారుని చూసి వెనక్కి వచ్చిన బైక్ మీద పడింది.

సుమ దిగి కారులోకి తొంగిచూస్తూ "ఏయ్ మనూ! ఏమిటీ నువ్విక్కడా? " ఆశ్చర్యంగా అడిగింది. మనూ మొహంలో భావాలు మారిపోయాయి. తప్పనిసరి అన్నట్లు కిందకి దిగి శశికాంత్‌ని చూపిస్తూ "ఈయన శశికాంత్. వీళ్ళ బంధువులింటికి వెళుతుంటే కారు పాడయింది" క్లుప్తంగా శశికాంత్‌ని పరిచయం చేసి, "ఈమె సుమన నా స్నేహితురాలు. ఇతను సుమ అన్నయ్య మనోజ్" శశికాంత్‌కి చెప్పింది.

మనోజ్, శశికాంత్ కళ్ళతోనే ఒకరినొకరు అంచనా వేసుకుంటూ కరచాలనం చేసుకున్నారు.

"మీరిలా ఎక్కడికి బయలుదేరారు" సుమనని అడిగింది.

"ఈ దగ్గరలోని ఊళ్లో మా డ్వాక్రా మేడమ్ కొందరిని సభ్యులుగా చేర్పిస్తే వాళ్ళు అప్పులు తీసుకుని, డబ్బులు కట్టలేదట. నన్ను వసూలు చేసుకు రమ్మంది. అన్నయ్యని బతిమాలుకుని ఒప్పించి తీసుకెళ్తున్నాను" సుమన అంది. మళ్ళీ తనే, "మనూ! ఈ ఎండలో ఒంటరిగా ఎంతసేపు ఉంటావు. నువ్వు మాతో వచ్చెయ్. శశికాంత్ కారు రిపేరు చేయించుకొని వెనకాల వస్తారు" సూచించింది.

శశికాంత్ గతుక్కుమన్నాడు 'ఈ పిల్ల మనస్విని తనతో లాక్కుని పోతే నేను ఒక్కడిని మెకానిక్‌ని ఈ ఊరు, పేరు తెలియని చోట ఎక్కడని వెతకాలి? ' అనుకున్నాడు. అతని భావాలను గమనించి తల అడ్డంగా ఊపింది మనస్వి. "వద్దు, మనోజ్ బైక్ మీద మెకానిక్‌ని తీసుకొస్తే ఓ అరగంటలో వెళ్ళిపోవచ్చు" సలహా ఇచ్చింది.

శశికాంత్‌కి ఆ సలహా నచ్చింది. "అవును మనోజ్ మనం మెకానిక్ తీసుకువద్దాం. అప్పటి వరకు వీళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు". హుషారుగా అన్నాడు.

"సారీ! నావల్ల కాదు. ఓసారి మెకానిక్ కోసం, మరోసారి డ్వాక్రా డబ్బుల కోసం ఈ ఎండలో తిరగడం నావల్ల కాదు. కావాలంటే ఇదిగో బైక్ తాళాలు. మా సుమని తీసుకెళ్ళండి. దాని పని చూసుకునేలోగా మీరు మెకానిక్‌ను వెతుక్కోండి. అప్పటి వరకు మీ కారుకి నేను కాపలా ఉంటాను. తాళాలు శశికాంత్ మీదకి విసిరేసి కారుని ఆనుకొని చేతులు కట్టుకొని నుంచున్నాడు.

అతనంత ఖచ్చితంగా తిరస్కరించడంతో ఏమనాలో తెలియనట్లు ఉండిపోయారు.

ముందుగా తేరుకున్న సుమ ఉక్రోషంగా శశికేసి తిరిగి "రండి. మనం వెళదాం. తను



లేకపోతే మన పని అవదనుకుంటున్నాడు" అంటూ అన్నగారిని దెప్పింది. మరోదారి లేక ఆమెని ఎక్కిం చుకుని మెకానిక్ కోసం జనావాసాల్ని వెతుక్కుంటూ బయలుదేరాడు శశికాంత్. వాళ్ళు కనుమరుగయ్యేదాకా చూసి మనస్విని "ఎండ చాలా తీక్షణంగా ఉంది. ఆ మామిడి తోపులో కూర్చుందామా? "అనడిగాడు మ నోజ్. ఇద్దరూ అటుకేసి నడిచారు. "ఎవరీ శశి కాంత్? " సూటిగా అడిగాడు.

"పక్కింటికి కూడా పంపని అమ్మ, ఇంతదూరం పరాయి మగాడితో ఒంటరిగా పంపిందంటే అర్థం కాలేదా? నాకు కాబోయే భర్త. కాలిఫోర్నియాలో కంప్యూటర్ ఇంజనీరు. ఇంకో పదిరోజుల్లో పెళ్ళి. నెలలో అమెరికా ప్రయాణం" మనోజ్ తనకి అత్యంత ఆత్మీయుడైన స్నేహితుడన్నట్లు మామూలుగా చెప్పింది. నడుస్తున్న మనోజ్ ఒక్కక్షణం ఆగి ఆమె మనోభావాలని చదవాలని ప్రయత్నించాడు. నిర్లి ప్తంగా ఉన్న ఆమె మొహంలో ఏ భావం కనపడ లేదు. కుడిచేయి అందుకొని నొక్కి "కంగ్రాట్స్" చెప్పాడు. అప్పుడు మాత్రం ఆమె కళ్ళలో చిన్న ఆశ్చ ర్యకర భావన మెరిసింది. "థాంక్స్" గొణిగినట్లు అంటూ చేయి విడిపించుకుంది.

ఇద్దరూ, గుబురుగా, నీడగా ఉన్న చెట్టుకింద ఆకుల తుక్కు కాలితో పక్కకి జరుపుకొని కూర్చున్నారు.

"చీర కట్టుకొని, ఒక జడ వేసుకుంటే బాగున్నావు" ఆమెనే పరిశీలనగా చూస్తూ ప్రశంసించాడు. మనూ సంతోషించలేదు. చిరాగ్గా మొహం తిప్పుకుంది.

"పెళ్ళికొడుకు బాగున్నాడు. నీకు నచ్చాడా? " మళ్ళీ మనోజే అడిగాడు.

"ఆ ప్రశ్న నా కన్నవాళ్ళే అడగలేదు. నువ్వు తెలుసు కొని ఏం లాభం? " నిర్లిప్తంగా అడిగింది. "వాళ్లకి నీ సమాధానం అనవసరం కావొచ్చు కానీ... నాకు చాలా అవసరం"

"నా ఇష్టాఇష్టాలు నచ్చడం, నచ్చకపోవడం అన్నీ అనవసరం. అమ్మా నాన్నలు అతడిని వరుడిగా నిర్ణ యించారు. ఇరవై ఏళ్ళుగా వాళ్ళు నన్ను కని పెంచేం దుకు పడ్డ సంఘర్షణ తెలిశాక వాళ్ళ మాటని వ్యతిరే కించి నొప్పించే శక్తి నాకు లేకపోయింది"

మనోజ్ మొహంలో ఆగ్రహం చోటుచేసుకుంది. మనస్వి భుజాన్ని బిగించి పట్టుకొని విసురుగా తన వైపు తిప్పుకొని "అమ్మానాన్నల మాటే వేదం అనుకు

నేదానివి నాలో ఆశలు ఎందుకు రేపావు. మన సంగతి చెప్పే ధైర్యం నీకు లేకపోతే మొన్న హృది పెళ్ళిచూపులనాడే నాకు సంబంధాలు చూస్తున్నారు. నువ్వు వచ్చి మాట్లాడు అని చెబితే ఆ తంటాలేవో నేనే పడేవాడినిగా!" నిలదీశాడు.

మనూలో ఒకరకమైన అసహనం రేగింది. మనోజ్ చెయ్యి వదిలించుకొని "అంటే నీ ఉద్దేశ్యం? నాకన్నీ తెలిసి కావాలని నీ నుండి దాచాననా? నువ్వు నమ్మినా నమ్మకపో యినా ఇదంతా నా ప్రమేయం లేకుండా నిన్న ఒక్కరోజులో జరిగిపోయిన ప్రక్రియ. ముహూర్తాల దాకా వచ్చాక వాళ్ళకి ఎదురు తిరిగి మానసికంగా గాయపరచడం ఇష్టంలేక నా స్థితితో నేను రాజీపడుతున్నాను. ఇందు వల్ల నష్టపోయింది కేవలం నేను మాత్రమే. మన పరిచయం నువ్వు మరవలేనంత గాఢ మైనదేం కాదు. హాయిగా నీకు నచ్చిన మరో మనిషిని నువ్వు వెతుక్కోవచ్చు" రోషంగా బదులిచ్చింది.

మనోజ్‌కి ఉక్రోషంతో ఎర్రబడ్డ ఆమె మొహాన్ని చూస్తుంటే నవ్వు వచ్చింది. "నీ కోపమే బావుంది. 'నువ్వు' అనే సంబోధన నన్ను నీకు మరింత దగ్గరకి చేస్తోంది. నువ్వు నా సొంతమనే భావాన్ని బలపరు స్తోంది" అంటూ ఆమె భుజాన్ని మరికాస్త ఒడిసిపట్టి దగ్గరగా లాక్కున్నాడు.

"వదులు మనోజ్. నీకు దగ్గరగా రావా లంటే ఇదే భయం" వదిలించుకోవడానికి ప్రయత్నిస్తూ విసుక్కొంది.

"నన్ను వదిలి ఏకంగా దేశాలే దాటి వెళ్ళి పోవడానికి సిద్ధపడ్డావుగా! నా చేతుల్లోంచి తప్పించుకో" ఛాలెంజ్ చేస్తున్నట్లు అంటూ తన పట్టు బిగించాడు.

"మనోజ్ నువ్వు కూడా నా చేతకానితనాన్ని వెక్కిరిస్తున్నావా? " బేలగా అడిగింది.

మనోజ్ ఆగ్రహం కరిగిపోయింది. ఆమె తలని కొద్దిగా పైకెత్తి నుదురు చుంబించి "మనూ నా టీనేజ్ నుండి అందం, తెలివి ఉన్న ఆడపిల్లల్ని చాలా మందినే చూశాను. ఏ ఒక్కరూ నీ అంత గాఢంగా నా మన సులో స్థానం పొందలేదు. మొదట్లో నిన్ను కేవలం సుమ ఫ్రెండ్‌గానే చూసినా నోరులేని మూగ జీవాలపట్ల నీ సానుభూతి, అమ్మా నాన్నల ఆధిపత్యానికి తలొంచలేని, తిరగబడ లేని నీ సహనగుణం, నీలోని స్త్రీత్వపు ముగ్ధ మోహన సౌందర్యం, ఆత్మాభిమానం నాలో నీ పట్ల మమకారం పెరగడానికి కారణమ య్యాయి. ఐ ప్రామిస్ యు. ఇప్పటికే శశి కాంత్‌తో పెళ్ళి కుదిరి ఏదో అనర్థం జరిగిపో యిందని నేను అనుకోవడంలేదు. నీలో నా పట్ల ప్రేమ సజీవంగా ఉందంటే, అతను నీ మెడలో మూడోముడి వేసే ఆఖరి క్షణంలో కూడా నిన్ను నా భార్యగా మార్చుకుంటాను. చెప్పు నేనంటే నీకిష్టం లేదూ? " మనోజ్ గొంతులోని మార్థవం, ప్రశ్నలోని నిజాయితీ మనస్వి మనసు లోతులను స్పృశించాయి. మారు పలుకకుండా అతని మెడచుట్టూ చేతులు పెనవేసిగుండెల్లో ఒదిగి పోయింది.

మనోజ్ మనసు సంతోషంతో నిండిపో యింది. పరవశంతో కళ్ళు మూసుకొని మనస్వి మెడవొంపులో చుంబిస్తూ "థాంక్యూ, థాంక్యూ వెరీమచ్" మెల్లగా గొణిగాడు. వ్యక్తం చేయలేని ఆనందంలో మునిగిన ఇద్దరూ సుమన, శశికాంత్ వాళ్లని వెతు క్కుంటూ వచ్చి వారిద్దరిని ఆ స్థితిలో చూసి షాక్‌తో వెనుదిరిగిపోవడం గమనించలేదు.




మల్టీ స్పెషాలిటీ హాస్పిటల్ ముందు టాక్సీ దిగి లోపలికి పరిగెత్తింది సహృదయ. టాక్సీ ఫేర్ చెల్లించి ఆమెను అనుసరించాడు ఆనంద్.

ముంబాయి వచ్చేముందు సుమన, మనస్వి లను కాంటాక్ట్ చేయటానికి ప్రయత్నించినా వాళ్లు అందుబాటులో లేక విషయం చెప్పకుండానే ఫ్లైయిట్‌కి టైం అవుతుందనే హడావుడితో, ఆదుర్దాతో బయలుదేరిన హృదితో కలిసి తాను తోడుగా వచ్చాడు ఆనంద్.

రిసెప్షెన్‌లో చటర్జీ ఉన్న ఎమర్జన్సీ వార్డ్ గురించి ఎంక్వయిరీ చేసి వేగంగా లిఫ్ట్‌లో పైకి చేరుకున్నారు. కాస్త దూరంలో కేర్‌టేకర్ సీమ, మేనేజర్ భట్టాచార్య, ఇద్దరు ముగ్గురు హృది ఎంటర్‌ప్రయిజెస్ గ్రూప్ సంస్థల సభ్యులు కారిడార్‌లో వెయిట్‌చేస్తూ కనిపించారు. హృదిని గమనించి సీమ పరుగున దగ్గరికి వచ్చింది.

"నిన్నటి నుండి మీ కోసం ట్రయ్ చేస్తున్నాం. మేడమ్ కండీషన్ కాస్త క్రిటికల్‌గా ఉంది. ఇంకా స్పృహలోకి రాలేదు" హడావిడిగా చెప్పింది.

"చటర్జీ అంకుల్ ఎక్కడ? " ఆతృతగా ప్రశ్నించింది హృది.

అప్పుడే చటర్జీ ఐ.సి.యు లోంచి యాప్రాన్ లూజ్ చేసుకొంటూ వచ్చారు.

"అంకుల్" కళ్ళనిండా నీళ్లతో దగ్గరికి వెళ్లి ఆత్రంగా పిలిచింది. ఆమె గొంతులో ఆయన నుండి ఎలాంటి సమాధానం వినాల్సి వస్తుందోననే భయం ధ్వనించింది. చటర్జీ ఒక్క క్షణం ఆమె కళ్లలోకి చూసి చిన్నగా నిట్టూర్చారు. "నిన్ను చాలాసార్లు హెచ్చరించాను. జానకి కండిషన్ చాలా నాజూకుగా ఉంది. ఆమెతో సీరియస్ గేమ్‌లు ఆడొద్దు అని. నువ్వు వినలేదు. టు బి ఫ్రాంక్. ఆవిడ ప్రాణాలు నిలపడానికి మేము చేసే ప్రయత్నాలు ఎంతవరకు ఫలిస్తాయో చెప్పలేను. జానకి కోమాలోకి జారిపోనంత వరకు మనకి ఆశ ఉంది"

సహృదయ మొహం పాలిపోయింది. ఆయన్ని తప్పించుకుని ఐ.సి.యు. గాజు తలుపుల్లోంచి మసకబారిన కళ్ళను తుడుచుకుంటూ, అచేతనంగా ఉండుండి ఉలిక్కి పడినట్లు కదిలే శరీరంతో ప్రాణం ఉంది అని తెలుస్తున్నట్లు ఉన్న తల్లిని చూస్తూ 'ఐయాం సారీ అమ్మా! నేనూ నీలా తప్పు దారిలో నడుస్తున్నాను అంటే నా కోసం నీ పద్ధతి మార్చుకుంటావని అతి తెలివిగా ఆలోచించాను. కానీ నా ప్రవర్తన నిన్ను ఎంత రంపపు కోతకి గురిచేసి ఉంటుందో ఊహించలేకపోయాను. ప్లీజ్ అమ్మా! నా కోసం ఒక్కసారి కళ్ళు తెరు. ప్లీజ్ అమ్మా!' తనలో తాను గొణుక్కొంటున్నట్లు వేడుకొంటూ కళ్ళనీళ్ళు ధారాపాతంగా కారిపోతుండగా అలాగే కిందకి జారిపోయింది. ఆనంద్ గభాలున దగ్గరికి వచ్చి ఆమెను పొదివి పట్టుకున్నాడు. తీవ్రమైన మానసిక వత్తిడితో హృది స్పృహ కోల్పోయింది. "డాక్టర్" చటర్జీని ఆందోళనగా పిలిచాడు.

ఆమెని బెడ్ మీదకి చేర్చి న్యూరోబియాన్ ఇంజెక్షన్స్ చేశాడు. ఆమె మొహంలో ఆందోళన కొద్దిగా తగ్గుముఖం పట్టింది.

"మిస్టర్ ఆనంద్. జానకి కండిషన్ చాలా సెన్సిటివ్‌గా ఉంది. హృది అదృష్టంకొద్దీ జానకికి ఒక్కసారి స్పృహ వచ్చినా, కన్నతల్లితో మాట్లాడే చివరి అవకాశం లభిస్తుంది. అందుకే ఎంత బాధనైనా హృది భరించి తీరాలి. ఓ.కే. నేనొకసారి రౌండ్స్‌కు వెళ్ళివస్తాను. హృదికి మెలకువ వస్తే వేడిగా ఏదైనా తాగించండి" నర్స్‌కి చేయవలసిన ఏర్పాట్లు చెప్పి వెళ్ళిపోయాడు చటర్జీ.

అప్పటికే మెలకువ వచ్చిన హృది నిస్సహాయంగా మరోసారి కళ్ళనీళ్ళు నింపుకుంది. హార్లిక్స్ కలిపి తెచ్చింది నర్స్. ఆమె చేతిలో నుండి గ్లాసు తీసుకొని తాగించబోతే "నో ఆనంద్ నాకేం వద్దు" అయిష్టంగా మొహం తిప్పుకుంది.

"ప్లీజ్ హృదీ! మీ అమ్మకి ఏ క్షణానైనా స్పృహ వస్తుందని డాక్టర్ చెప్పారు. నువ్విలా ఏమీ తీసుకోనంటే తీరా ఆవిడకి మెలకువ వచ్చేసరికి నీకు మైకం వచ్చేస్తుంది. ఆలోచించు" బుజ్జగింపుగా చెప్పాడు.

మౌనంగా, అతని మాటల్ని అర్థం చేసుకున్నట్లు పాలను రెండుసార్లు సిప్ చేసి "అమ్మ,



# ఈ బుల్లి పిట్టకెంత తెలివో

మన పిచ్చుకను పోలిన ఈ బుల్లి పిట్ట కట్టుకునే గూడు కూడ పిచ్చుక గూడునే పోలి ఉంటుంది. అయితే దాని ఇంజనీరింగ్ నైపుణ్యం కాస్త ఎక్కువే! కెన్యాలో కనిపించే ఈ వీవర్ బర్డ్ చిన్న చిన్న రెమ్మల్ని, కాడల్ని ఏరి సంక్లిష్టమైన రీతిలో వాటిని అనేక ముడులు వేస్తూ గూడు నిర్మించుకుంటుంది. అది ముడులు వేసే విధానం దిగువ చిత్రంలో చూడొచ్చు.



అమ్మ ఒక్కసారైనా నాతో మాట్లాడుతుందం టారా ఆనంద్" అడుగుతుంటే ఆమె గొంతు పూడుకుపోయింది.

సమాధానం ఆనంద్‌కన్నా ముందు గుమ్మం వైపునుండి వచ్చింది "తప్పకుండా వస్తుందమ్మా. ఈ నిర్భాగ్యపు తండ్రిని నీకు పరిచయం చేసేందుకైనా నా జానకికి మెల కువ వస్తుంది. మాట్లాడుతుంది" అపరిమిత మైన అభిమానాన్ని గొంతులో వ్యక్తం చేస్తూ అన్నాడు ఆ వ్యక్తి.

అతనెవరో అర్థం కానట్లు ఆయోమయంగా చూశారు సహృదయ, ఆనంద్. దాదాపు ఏభై ఏళ్ళ వయసుతో, కొద్దిగా కనిపించే బట్టత లతో, కళ్ళకి స్పెక్ట్స్, వైట్ కోట్ చేతిలో స్టెత్‌తో మొహంలో విషాదాన్ని పలికిస్తూ వచ్చి ఒక కుర్చీని ఆమె దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు. సగం కూడా తాగని పాలను పక్కన పెట్టేశాడు ఆనంద్.

అతను వెళ్ళబోతుంటే అతని చేతిని బిగించి పట్టుకొంది హృది. కొద్దిగా సర్దుకొని ఆమె పక్కనే కూర్చున్నాడు ఆనంద్.

**ఇరవై ఏళ్ళ కూతురుకి నేను నీ తండ్రిని అని పరిచయం చేసుకొనే ఖర్మ ఏ తండ్రికీ రాకూడదు. కానీ ఆ ఖర్మ నాకు పట్టింది.**

"మీరెవరో నాకు తెలియదు. ఎప్పుడూ చూసిన గుర్తు కూడా లేదు" హృది అడిగింది. కళ్ళజోడు తీసి రాని కన్నీళ్ళు క ర్చీఫ్‌తో వత్తుకున్నాడు అపరిచిత వ్యక్తి. "అదే నమ్మా నా దురదృష్టం. ఇరవై ఏళ్ళ కూతు రుకి నేను నీ తండ్రిని అని పరిచయం చేసు కొనే ఖర్మ ఏ తండ్రికీ రాకూడదు. కానీ జానకి మూర్ఖపు ప్రవర్తన కారణంగా ఆ ఖర్మ నాకు పట్టింది. ఎన్నో ఏళ్ళుగా నిన్ను కలవా లని తపించిపోయాను. కానీ నీకు నేరుగా ఎదురుపడే ధైర్యం లేక, నీ మీద మమకా రాన్ని చంపుకోలేక ఇన్నాళ్ళు నిన్ను ఎస్.ఎమ్. ఎస్‌ల ద్వారానే పలకరించాను" అంటూ ఆగాడు.

'మీ ఆస్తి మీకు చేరకుండా సహృదయను మీకు దూరంగా ఉంచగల వ్యక్తి మీ మాజీ భార్య జానకి. ఎందుకంటే ఆమెను మీరు ఎందుకు వదిలేశారనే కారణాన్ని, నిజాల్ని చెప్పగలిగేది జానకి మాత్రమే. ఇప్పుడు ఆమే చనిపోతే సహృదయ అనాథ కాకుండా ఆదు కోగలిగే వ్యక్తి తండ్రిగా మీరే. కాసిన్ని కన్నీళ్ళు కురిపించి కొన్ని ఓదార్పు కబుర్లు చెప్పి తండ్రి ప్రేమ చూపిస్తే చాలు మీ అమ్మాయి మీరె క్కడ పెట్టమంటే సంతకం అక్కడ గుడ్డిగా పెడుతుంది. దటీజ్ 'పేరెంటల్ సెంటిమెంట్' లాయర్ శ్రీవాస్తవ చెప్పిన మాటలు మదిలో మెదిలి అతడు మనసులోనే నవ్వుకున్నాడు.

"అంటే మీరు శ్రీరామ్ గారా? మీరు మీరు నా తండ్రా? " ఆశ్చర్యంగా అడిగింది. "అవున మ్మా హృదీ. నేనే మీ డాడీని. ఏనాటికైనా ఈ నిజం మీ మమ్మీ ద్వారా నీకు తెలియా లని ఓపిక పట్టాను. కానీ జానకి నాకు ఆ అవకాశం లేకుండా చేసింది. ఇప్పటికైనా నేను ఎవరో నీకు చెప్పలేక పోతే తండ్రి ఉండి కూడా నువ్వు అనాథవై పోతావనే భయంతోనే నీ ముందు నాకు నేనుగా బయటపడ్డాను. భయపడకు తల్లీ! నువ్వు అనాథవు కాదు. నీకు ఎప్పటికీ ఈ తండ్రి ఉన్నాడు" కాస్త ముందుకు వంగి సహృదయ తల నిమిరాడు.

ఎలా రియాక్ట్ అవ్వాలో అర్థం కానట్లు అయోమయంగా చూసింది సహృదయ.

నర్స్ ద్వారా శ్రీరామ్ సహృదయతో మంత నాలు జరుపుతున్న విషయాన్ని విన్న చటర్జీ హడావిడిగా వచ్చాడు. అప్పటికే ఒక ప్రతిభ గల నటుడిలా అద్భుతంగా కూతుర్ని దూరం చేసుకున్న తండ్రి పాత్రలో నటించేస్తున్నాడు శ్రీరామ్. చటర్జీని చూస్తూనే శ్రీరామ్ మొహంలో రంగులు మారాయి.

"నేను వస్తానమ్మా! ఎవరు ఏం చెప్పినా మన తండ్రీబిడ్డల బంధం విడదీయలేనిది. నువ్వు ధైర్యంగా ఉండు. నీకు ఈ డాడీ ఉన్నారు" చటర్జీని కోరగా చూస్తూ చెప్పి

సహృదయ భుజం తట్టి వెళ్లిపోయాడు శ్రీరామ్.

"చాలా ప్రేమ కురిపించేస్తున్నాడు. ఏం మాట్లాడావేమిటి?" సహృదయను అడిగాడు "మాటలేమిటి అంకుల్. అన్నీ ఆయనే చెప్పాడు. ఆయన మా డాడీ అట, పేరు శ్రీరామ్ అట అంకుల్. మీకు తెలుసా?" హృది అడిగింది. శ్రీరామ్ మాటలకి తాత్కాలికంగా ఆమెకు బాధ స్థానంలో ఏదో తెలియని అయోమయం చోటు చేసుకుంది.

తెలుసన్నట్లు తల పంకించాడు చటర్జీ. "తెలుసు. శ్రీరామ్ ఎంత దౌర్భాగ్యుడో కూడా తెలుసు. ఈనాటి జానకి మృత్యు సంఘర్షణకు కారణం కూడా అతనేనని తెలుసు. కానీ హృదీ 'ఇప్పుడు నేనేం చెప్పినా నీలో నీ తండ్రిని దూరం చేసిన ఫీలింగ్‌కి కారణమౌతాను. అందుకే జానకి తేరుకోవాలని తీవ్రంగా కృషి చేస్తున్నాను. నిజానిజాలు నీ తల్లి నోటి వెంట వినడమే నీకు మంచిది" గంభీరంగా చెప్పి వెళ్లబోయి కోటులో తగులుతున్న కవర్ని గమనించి దానిని పైకి తీసి, దగ్గరకి వచ్చి "పోలీసులు సూసైడ్ కేసు కింద మీ మమ్మీ రూమ్‌ని సీజ్ చేశారు. అక్కడ వాళ్ళకి ఈ కవర్ దొరికిందట. ఇన్‌స్పెక్టర్ నీకు అందచేయమని నాకు పంపాడు. తీసుకో" సహృదయకి అందజేసి వెళ్ళిపోయాడు.

సహృదయ కవర్ మీద చూసింది "చిన్నాకి అమ్మ" అని రాసి ఉంది. ఆనంద్ మొహంలోకి అర్థం కానట్లు చూసింది. "నేను కిందకి వెళ్ళి ఏవైనా పళ్లు తెస్తాను" అంటూ ఆనంద్ లేచాడు. గభాలున చెయ్యి పట్టి ఆపింది. "ప్లీజ్ ఆనంద్. ప్రస్తుతం మీరే నాకు అండ, ఆధారం. నేనేంటో నిన్ననే మీకు పూర్తిగా చెప్పాను. మీ నుండి దాచుకొనే రహస్యాలు ఏవీ నాకు లేవు. నన్నొదలి ఒంటరిదాన్ని చేసి మీరు కూడా దూరం కావద్దు" వేడుకొంటున్నట్లు అడిగింది. ఆనంద్ తిరిగి కూర్చుని కవరు తెరిచి ఇద్దరికీ కనిపించేలా హృది కళ్ళ ముందు పెట్టాడు. ఇద్దరి కళ్లూ అక్షరాల వెంట పరుగుతీశాయి.

18



"మీ స్నేహితురాలు చాలా అమాయకురాలు అనుకున్నాను. ఊహూ! చాలా తెలివి కలది" వ్యంగ్యంగా అన్నాడు శశికాంత్.

అప్పటికే వాళ్ళ ప్రవర్తన ద్వారా విషయాన్ని గ్రహించిన సుమన వాళ్లని అంత దగ్గరగా చూసి పెద్దగా ఆశ్చర్యపోలేదు. అందుకే శశికాంత్ మాటలకి బదులివ్వలేదు. శశికాంత్‌కి మాత్రం ఇది ఊహించని షాక్ అయ్యింది. భారతీయ అమ్మాయిలు తల్లి చాటు పిల్లలని ఆశపడి వచ్చిన అతనికి మనస్వి దృశ్యం మింగుడుపడటం లేదు. చేతిలో సిగరెట్ అతని మనసులా మండుతోంది. దూరంగా, చచ్చీచెడి లాక్కొచ్చిన మెకానిక్ కారు బాగు చేస్తున్నాడు. కారు దగ్గర మనోజ్, మనస్వి కనపడక వాళ్లని వెతుక్కుంటూ వెళ్లిన వారికి మనోజ్, మనూల ఏకాంత సమాగమం కంటపడింది.

"నేనేదో అనుకున్నాను. కానీ ఈ దేశపు ఆడపిల్లలు కూడా చెడిపోయారు. పెళ్లికి ముందే నచ్చిన వాడితో అన్నీ కానిచ్చేసి ఆఖరిగా నాలాంటి బకరాగాడిని చూసుకుని బుద్ధిమంతుల్లా పెళ్ళాడి విదేశాలకు వెళ్లిపోతారు. బ్లడీ ఇండియన్ గర్ల్స్" కసిగా సిగరెట్ నేలకేసి కొట్టి తిట్టాడు.

చురుక్కుమన్నట్లు చూసింది సుమన. "మిస్టర్! మీరు కొంచెం నోరు అదుపులో పెట్టుకుంటే బావుంటుంది. ఇండియన్ గర్ల్స్ ప్రవర్తనని, స్వభావాల్ని నిర్ణయించే అధికారం మీకు లేదు. ఆ మాటకొస్తే నేనూ ఇక్కడ పుట్టినదాన్నే. అలాగని నాకెవరూ బాయ్ ఫ్రెండ్స్ లేరు. కానీ మీతో వచ్చానని నాకూ

నీతి లేదన్నట్లు, బజారుదాన్ని అన్నట్లు మాట్లాడతారా...? " నిలేసింది.

శశికాంత్ ఇబ్బందిగా చూశాడు. "సారీ! మిమ్మల్ని నొప్పించాలని నా ఉద్దేశం కాదు"

"మీకు మనూని మాత్రం నిందించే అధికారం ఎక్కడిది. మనోజ్‌తో అది ఏ అనుబంధం పెంచుకుందో మనకేం తెలుసు. దాని అభిప్రాయం ఏమిటో తెలుసుకోడానికి మీరు ప్రయత్నించాల్సింది" సుమన అతని పొరపాటు ఎత్తి చూపింది.

"అంటే, మనసులో ఒకరిని ఉంచుకుని పైకి మరొకరితో తాళి కట్టించుకోడానికి సిద్ధమైన మీ స్నేహితురాలిది తప్పులేదు. కానీ నమ్మి పెళ్ళాడడానికి సిద్ధపడిన నాది తప్పంటారు? అంతేనా? " రోషంగా అడిగాడు. సుమన చిన్నగా నిట్టూర్చి, బైక్‌ని ఆనుకొని నుంచుని అతన్నే చూస్తూ తల అడ్డంగా ఊపి చెప్పింది. "ఊహూ! నా ఉద్దేశ్యం.. చాలా సార్లు వ్యక్తి నిర్ణయాలను సవాలు చేసే పరిస్థితి ఎదురౌతుంది. అప్పుడు నేరం వ్యక్తిగతం కాదు. పరిస్థితుల ప్రభావం అవుతుంది. అర్థం చేసుకోమంటున్నాను"

శశికాంత్ నిజంగానే అర్థం కానట్లు చూశాడు. మెకానిక్ వచ్చి తాళాలు ఇచ్చి డబ్బులు తీసుకొని అతను వచ్చిన మోపెడ్ మీద తిరిగి వెళ్ళిపోయాడు. చాలా సేపు చేతిలో తాళాలు ఎగరేసి ఆడుతూ ఆలోచనలలో మునిగిన శశికాంత్ చివరికి ఒక నిర్ణయానికి వచ్చినట్లు తాళాలు గుప్పెట్లో బిగించి పట్టుకొని తల అడ్డంగా ఊపాడు.

"మీ స్నేహితురాలి ప్రవర్తనకు కారణం వ్యక్తిగతమా లేక పరిస్థితుల ప్రభావమా అన్నది నాకు అనవసరం. కానీ ఆమెని పెళ్ళి చేసుకుని రోజూ నా భార్య కౌగిట్లో నన్ను కాక పరాయి మగాడిని ఊహించుకునే దరిద్రపు పరిస్థితి నాకక్కర లేదు. కనీసం ఆమెను మీ అన్నయ్య పట్లనైనా నిజాయితీగా ఉండమని చెప్పండి. గుడ్ బై ఫరెవర్" సెల్యూట్ కొట్టినట్లు అని వడివడిగా కారుకేసి నడిచాడు.

సుమన పెదాలపై చిరునవ్వు నిలిచింది. "ఆల్ ది బెస్ట్ శశికాంత్!" బొటనవేలు పైకెత్తి గుప్పిడి మూసి అభినందించింది. ఆమె వైపు కోరగా చూస్తూ వెళ్ళిపోయాడు.

కారు స్టార్ట్ అయిన శబ్దానికి వేగంగా పరిగెత్తుకు వచ్చిన మనస్వికి దుమ్ముతెరల మధ్య కనుమరుగవుతున్న శశికాంత్ కారు కనిపించింది.

"ఆ కార్లో వెళ్తున్నది ఎవరు సుమా? " ఆత్రంగా అడిగింది.

"ఇంకెవరూ! నిన్ను చేసుకోవాలని అమెరికా నుండి ఆశగా వచ్చాడే ఆ శశికాంత్"

"అదేమిటి? నన్నొదిలి ఎక్కడికి వెళ్ళిపోయాడు? " గాభరాగా అడిగింది.

సుమనకి ఒళ్ళు మండింది. "ఏక్ దూజే కేలియే అన్నట్లున్న మిమ్మల్నిద్దర్ని చూసి తట్టుకోలేక ఇంటికి వెళ్ళిపోయాడు. సంతోషమా? " వెక్కిరింతగా అడిగింది.

మనస్వి చేష్టలుడిగినట్లు నిలబడిపోయింది. "అతను మమ్మల్ని చూశాడా? ఇప్పుడు ఇంటికెళ్ళి ఏం గొడవ చేస్తాడో? " గొణిగినట్లు అనుకుంది.

మనోజ్ ఆమె మాటల్ని, భయాన్ని పట్టించుకోలేదు. "నీ డ్వాక్రా సొమ్ము పని అయ్యిందా? మనం మాత్రం ఎందుకిక్కడ? హాయిగా ఇంటికిపోయి తరవాత ఏం చెయ్యాలో ఆలోచిద్దాం" బైక్ మీద కూర్చుని తాళం తీస్తూ అన్నాడు.

"ఏంటలా మాట్లాడతావు. దాని పరిస్థితి చూశావా? భయంతో బిగుసుకుపోయిన మనూని అలా వదిలేసి వెళ్ళిపోదామా? " గయ్యిమంది సుమన.

"మనూని వదిలేసి కాదు, మనం ముగ్గురం వెళదామని అంటున్నాను."

"అంటే, మను సమస్య గురించి పట్టించుకోవలసిన అవసరం లేదా? " నిలదీసింది.

"సుమా! నీకు బుర్ర పనిచెయ్యడం మానేసింది...! సమస్యను వదిలేద్దామని నేను అనడం లేదు. నడిరోడ్డు మీద పంచాయతీ అనవసరం అంటున్నాను" మనోజ్ గొంతులో ఆగ్రహం పలికింది.

మనస్వి ఆ అన్నా చెల్లెళ్ళ వాదాన్ని పట్టించుకోలేదు. ఏం జరుగుతోందో తెలియని అయోమయంతో వెళ్ళి ఓ వారగా వత్తుగా పెరిగిన గడ్డిలో కూర్చుని మోకాలిపై తల వాల్చుకుంది. అది చూసి సుమ కంగారుపడింది. మనస్వి ఏడుస్తోందేమోనని. దగ్గరకి వెళ్ళి ఓ కాలు ముడుచుకొని కూర్చుని "మనూ" లాలనగా పిలిచింది.

మను తలెత్తలేదు. మనోజ్ కాస్త ముందుకు వెళ్ళి హేండిల్ బార్‌మీద చేతులు ఆన్చి వాళ్ళిద్దర్ని మౌనంగా గమనించసాగాడు.

"నాకు ఆడపిల్లతో స్నేహమంటేనే అమ్మ ఒప్పుకోదు. అటువంటిది మనోజ్‌తో పెరిగిన దగ్గరతనం కారణంగా శశికాంత్ సంబంధం బెడిసిపోయిందని తెలిస్తే అమ్మ మొండితనం ఏ తీవ్ర పరిణామాలకు దారితీస్తుందో నాకర్థం కావడం లేదు" నూతిలోంచి వచ్చినట్లు పలికింది మనస్వి గొంతు.

ఎలా రియాక్ట్ అవ్వాలో అర్థం కానట్లు బేలగా చూసింది సుమన మనోజ్‌వైపు.

మనోజ్ గట్టిగా గాలి పీల్చి వదిలి బైక్ దిగి వస్తూ "మొత్తానికి ఆడపిల్లలనిపించారు" అని మనస్వి పక్కన మోకాలిపై కూర్చొని ఆమె తలని బలవంతాన పైకి ఎత్తాడు. ఆ కళ్ళలో నీళ్ళు లేవు. ఏదో తెలియని నిస్పృహాయత కనిపిస్తోంది.

"మనూ, అతన్ని చేసుకోవడం నీకు ఇష్టం లేనప్పుడు, ఈ సంబంధం తప్పిపోయిందని సంతోషించాలి కానీ బాధ, భయం ఎందుకు? " మృదువుగా అడిగాడు.

"మనోజ్ అమ్మా, నాన్న సర్వస్వం నేనే. ఈ పెళ్ళికి నేను అంగీకరించడానికి కారణం కూడా అదే. నేనేదో తప్పుడు పని చేశానని భావించి వాళ్ళు ప్రాణాల మీదకి తెచ్చుకోవడం నాకిష్టం లేదు" నా మనసు తెలుసుకో అన్నట్లు అంది.

"అవునన్నయ్యా! ఈ మేచ్ తప్పిపోయినంత మాత్రాన మను పేరెంట్స్ నిన్ను ఓ.కే చేస్తారన్న నమ్మకం లేదు. కానీ ఇతనెళ్ళి మను ఇంట్లో గొడవ చేస్తే వాళ్ళు తొందరపాటు నిర్ణయాలు తీసుకోవడం గ్యారంటీ" సుమ సమస్యను విశ్లేషించింది. మనోజ్ వాళ్ళతో ఏకీభవించాడు.

"శశికాంత్ కాదన్నంత మాత్రాన మా పెళ్ళికి లైన్ క్లియర్ అయ్యిందని నేనూ అనుకోవడంలేదు. కానీ తాత్కాలికంగా మరో సంబంధం కుదిరేవరకైనా మనకి టైమ్ దొరుకుతుంది. మమ్మీ డాడీలతో చెప్పి నేను మనస్వి పేరెంట్స్‌ని ఒప్పిస్తాను. ఇకపోతే మనకున్న ప్రస్తుత సమస్య శశికాంత్ గొడవకి మనూ పేరెంట్స్ రియాక్షన్. నేచురల్‌గానే అది నెగిటివ్‌గానే ఉంటుంది. శశి కన్నా ముందు మనమే వెళ్ళి వాళ్ళకి అసలు విషయం చెప్పేద్దాం. సరేనా? " మనస్వి భుజం చుట్టూ చెయ్యేసి అడిగాడు.

**ఇంటిదగ్గర బాగా గొడవపెట్టి ఆ విషయం నాకు చెప్పడానికి చేశాడా...? అనుకుంటూ "చెప్పండి" అంది.**

అప్పటికే మనస్విలో ఏదో మొండి ధైర్యం పేరుకుంది. "నీ ఇష్టం మనోజ్, మనమే ముందు చెప్పేద్దాం. మా పేరెంట్స్‌కి నా మీద ప్రేమ ఉంది అనే నమ్మకం నాకు ఉంది. నిజం చెబితే అంగీకరిస్తారనే నా ఆశ"

మనోజ్ కళ్ళు మెరిశాయి. "దట్స్ గుడ్" అంటూ మనోజ్ తను లేచి మనస్వికి చెయ్యి ఇచ్చి లేపాడు.

ముగ్గురూ బైక్ దగ్గరకి వస్తుండగా మనస్వి సెల్ మోగింది. ఎవరా అన్నట్లు నంబరు చూసి అర్థంకాక హలో అంది.

"హలో మనస్వి, నేను శశికాంత్‌ని" అటు నుండి శశికాంత్ గొంతు విని అదిరిపడింది మనస్వి. 'ఇంటిదగ్గర బాగా గొడవపెట్టి ఆ విషయం నాకు చెప్పడానికి చేశాడా...? ' అనుకుంటూ "చెప్పండి" అంది. అటునుండి శశికాంత్ నవ్వు వినిపించింది.




చిన్నా...!

దాదాపు ఇరవైఏళ్ళనాటి సంగతులివి. చదవడానికి విసుగొచ్చినా చింపేయకు. ఒకవేళ నువ్వు చించేస్తే మీ అమ్మ ఎప్పటికీ తన నిస్సహాయతను, నిజాయితీని కన్నబిడ్డ ముందు కూడా ప్రదర్శించుకోలేని కళంకినిగానే మిగిలిపోతుంది. జాగ్రత్త.

అందాలకు నెలవైన ఆంధ్రా కోనసీమలో సనాతన నియోగి బ్రాహ్మణుల ఇంటి గారాల ఆడపడుచు ఈ జానకి. ఇంట్లో కట్టెలు కూడా కడిగి వండేంత ఆచారం. అడుగడుగునా అయినవాళ్ళ అండదండల్లో పదిలంగా పెరిగిన ప్రాయం. ఇలాంటి వాతావరణంలో పెరిగిన నీ తల్లి ఇంతగా ఎలా నాశనమయ్యిందో నీ ఊహకి అందడం లేదా? నీకేమిటి వెనక్కి తిరిగి నా గతాన్ని తరచి చూసుకుంటే నాకే అర్థంకాదు.

నువ్వు చాలాసార్లు అడిగావు. "డాడీ ఎవరమ్మా? పేరైనా చెప్పమ్మా" అని. కానీ, నా జీవితం అన్నిరకాలుగా నాశనమవ్వడానికి కారణమైన ఆ వ్యక్తి పేరు కూడా నీ నోటి వెంట పలకడం ఇష్టం లేక చాలాసార్లు మాట తప్పించాను. చటర్జీ అంకుల్ చెప్పారు. నీకు నా గురించి నిజాలు తెలియవలసిన సమయం వచ్చిందని. అందుకే అయిష్టంగానే చెప్తున్నాను. నీ తండ్రి పేరు శ్రీరామ్. ముంబాయిలో పెద్ద కార్డియాలజిస్ట్..."

చదువుతున్న హృది ఒక్కసారి దీర్ఘంగా శ్వాస తీసి వదిలి ఆనంద్ కళ్ళలోకి చూసింది. ఇద్దరి మనసుల్లో కొద్దిసేపటి ముందు మాట్లాడి వెళ్ళిన డాక్టర్ శ్రీరామ్ రూపం మెదిలింది. మళ్ళీ దృష్టి చదువుతున్న ఉత్తరం మీదకి మరల్చారు.

"శ్రీరామ్ నా సొంత మేనమామ కొడుకు. నేను పుట్టినప్పుడే రాముడి పెళ్లాం జానకి అని పేరుతోనే పెళ్లినీ నిర్ణయించేశారు. నాకు పదహారేళ్ళు రాగానే మెడిసిన్ పూర్తిచేసి నాకన్నా ఎనిమిదేళ్ళు పెద్దయిన బావతో పెళ్లి చేసేశారు. బావ మొదటి నుండి కాకినాడలో పెరిగి చదువుకున్నాడు. అతని పట్నం చదువుకి నా పల్లెటూరి పెంపకం నచ్చలేదు. ఏం మాట్లాడినా, ఎలా ఉన్నా విసుక్కొనేవాడు. ఆరునెల్ల పెళ్లి ముచ్చట తీరకముందే ఎఫ్.ఆర్.సి. సీటొచ్చిందంటూ లండన్ వెళ్లిపోయాడు.

అమ్మా, నాన్న నన్ను ఇంటికి తీసుకొచ్చేశారు. నువ్వు కడుపున పడ్డావు. నేను ప్రపంచాన్ని గెలిచినంత సంబరపడి బావకీ విషయం లెటర్ రాశాను. రిప్లై రాలేదు. పని వత్తిడని లోకానికి సర్దిచెప్పాం. నువ్వు పుట్టావు. చూడడానికీ రాలేదు. కానీ దురదృష్టం మరోవైపుగా వచ్చింది. అమ్మా, నాన్నలు లాంచి తిరగబడి జలసమాధి అయ్యారు. నీకు ఏడాది నిండింది. బావ నన్ను వదిలేశాడనే అపవాదు తీవ్రమయ్యింది. ఇంట్లో, బయటా అంతా నాపై సానుభూతి చూపించేవారు. దానికన్నా నిన్ను పుట్టుకతోనే తండ్రిని, అయినవాళ్లని దూరం చేసుకున్న నష్టజాతకురాలివని నిందించడం బాధాకరంగా ఉండేది. అలాంటి స్థితిలో శ్రీరామ్ ఇండియా వచ్చేసి ముంబాయిలో ఉద్యోగం చేస్తున్నాడని తెలిసింది. నాలో మళ్ళీ ఆశ తలెత్తింది. ఏడాదిన్నర బిడ్డవైన నిన్ను తీసుకుని శ్రీరామ్ తండ్రి, నాకు మేనమామ అయిన సుబ్బారావు మామయ్యతో ముంబాయి వచ్చాను.

అతికష్టం మీద శ్రీరామ్ హాస్పటల్ కనుక్కున్నాం. మామయ్య, "జానకికి అన్యాయం చెయ్యకురా!" అంటూ బావ కాళ్లా వేళ్లా పడ్డాడు. బిడియం, అభిమానం పక్కనపెట్టి నిన్ను అతని కాళ్లముందు పెట్టి కన్నీళ్లతో వేడుకున్నాను. ప్రయోజనం కనపడలేదు.

నిర్దాక్షిణ్యంగా గెంటించివేశాడు. అలాంటి స్థితిలో నా బ్యాగ్‌లోనువ్వు చూసిన ఫోటో లోని మోహన్ పరిచయం అయ్యాడు.

మోహన్ బతకనేర్చినవాడు. మాటలతో మభ్యపెట్టి ఎదుటివాళ్లని లొంగదీసుకుని తన గుప్పెట్లో ఉంచుకోగల నేర్పున్నవాడు. "నేను శ్రీరామ్ మిత్రుడిని. మీకు చాలా అన్యాయం చేసి మరో డబ్బున్న అమ్మాయిని చేసుకున్నాడు. ఇదంతా నువ్వు ఏమీ తెలియనట్లు అమాయకంగా ఉండడంవల్లే జరిగింది. నువ్వు నాగరికత నేర్చుకొంటే నీ భర్త నీ దగ్గరకే వస్తాడని" నాలోని ఆశల్ని రెచ్చగొట్టాడు. మామయ్య అనుభవం "ఈ గొడవలేవీ వద్దు. ఇంటికెళ్లి పోదాం. నిన్ను, సహృదయను ఏలోటు రాకుండా నేను చూసుకుంటాను" అని వారించింది. కానీ తండ్రిని కోల్పోయిన నష్టజాతకురాలు అంటూ లోకం నీపై వేసిన నింద ఆ మాటల్ని విననివ్వలేదు. అందుకే మామయ్యతో "మామయ్యా! మీరు ఇంటికెళ్లి పోండి. నేను వస్తే బావతోనే వస్తానని" ఖరాఖండిగా చెప్పి పంపేశాను. బాధ్యతలతో సతమతమయ్యే ఆయన నాకు సమృద్ధిగా డబ్బు ఇచ్చి వెళ్లిపోయారు.

మోహన్ సహకారంతో ఓ ఇల్లు తీసుకొని ట్యూటర్స్‌ని పెట్టుకుని ఇంగ్లీషు, హిందీ చదవడం, మాట్లాడటం, నవ్వడం, నడవడం ఫేషన్స్ అన్నీ నేర్చుకున్నాను. నీకు రెండేళ్లు వచ్చాయి. నాలో మీ డాడీ కోరిన లక్షణాలు అలవడ్డాయి. మోహన్‌ని మాట్లాడమని పంపాను. అతనేం చెప్పాడో కానీ మీ డాడీ విడాకులకు నోటీసు పంపాడు. మా పెళ్లి శుభలేఖ, ఫోటోల సాక్ష్యంతో భరణం కోసం అర్జీ పెట్టమని, నష్టపరిహారం కోరమని మోహన్ సలహా ఇచ్చాడు. నేను ఇంట్రెస్ట్ చూపించలేదు. నా ధ్యేయం డబ్బు కాదు. నీకు తండ్రిని తేవడం. అది కుదరదని అర్థమవ్వగానే నేను ఆంధ్రా వచ్చేయడానికి సిద్ధపడ్డాను. ప్చ్ దురదృష్టం మరోసారి అడ్డుపడింది.

లాన్‌లో ఆడుకుంటున్న నిన్ను ఎవరో కిడ్నాప్ చేశారు. అది శ్రీరామ్ పనే అని, నన్ను వదిలించుకోవడానికి నిన్ను పావులా వాడుకుంటున్నాడని మోహన్ రెచ్చగొట్టాడు. నేను నమ్మి మీ డాడీమీద కేసు పెట్టాను. చిత్రంగా మర్నాడే నువ్వెలా మాయమయ్యావో అలాగే హఠాత్తుగా ప్రత్యక్షమయ్యావు. కేసు పెట్టినందువల్ల భయపడి నిన్ను అప్పగించేశాడని మోహన్ నమ్మించాడు. నాకు శ్రీరామ్ మీద ఏమూలో ఉన్న భర్త అనే మమకారం చెరిగిపోయింది. నాతో చట్టబద్ధంగా పెళ్లి జరిగి నా అనుమతి లేకుండా రెండోపెళ్లి చేసుకున్నాడని ఆరోపిస్తూ శ్రీరామ్ మీద కేసు పెట్టాను. కోర్టు పదిలక్షల నష్టపరిహారం ఇప్పించింది. పీడా పోయిందని మీ డాడీ డబ్బిచ్చి చేతులు దులిపేసుకున్నాడు. నా చుట్టూనే ఉచ్చు బిగిసింది. అంతకుముందు డబ్బు కావాలంటే మామయ్య, అన్నయ్యలు పంపిందే ఆధారం. ఇప్పుడు నా దగ్గరే కావలసినంత చేరింది. ఎక్కడ నేను చెయ్యిజారిపోతానో అని మోహన్ తన ప్రేమను పాచికగా వాడాడు. హాస్టల్స్‌లో పెరిగితే శ్రీరామ్ ఎత్తుకుపోతాడనే భయం ఉండదు అంటూ నిన్ను ఊటీలో చేర్చాడు. మాటలతో, నటనతో నా మనసు తనవైపు తిప్పుకుని పెళ్లికి నాచేత 'ఊ' అనిపించాడు. ఇంకా ఏమూలో అదృష్టం నీడ మిగిలి ఉంది. అదే నాకు డాక్టర్ చటర్జీ రూపంలో పరిచయం అయ్యి మోహన్ నిజరూపాన్ని తెలుసుకొనేలా చేసింది. మోహన్‌కి పెళ్లయ్యి ఇద్దరు పిల్లలున్నారనేది చేదు నిజం.

మోహన్‌తో పెళ్ళికి రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్తుంటే కారు ఏక్సిడెంటై చటర్జీ హాస్పిటల్లో చేర్చారు. నేను మోహన్ గురించి ఆందోళన పడుతుంటే అతని గురించి బాగా తెలిసిన ఆయనే అసలు విషయాన్ని చెప్పారు. ఆ తర్వాత నా ఎంక్వాయిరీలో మోహన్ చాలా పెద్ద ప్లాన్‌లో ఉన్నాడని తెలిసింది. నన్ను పెళ్ళి చేసుకుని తరవాత నేర్పుగా మనల్నిద్దరినీ చంపేసి మన ఆస్తిని అనుభవిస్తూ సుఖంగా ఉండాలని ఎత్తు వేశాడని అర్థమయింది.



లోకాన్ని, లోకుల్ని చదివే స్థితికి ఎదిగిన నేను మోహన్ మళ్ళీ మంచం దిగలేని పరిస్థితికి నెట్టి అతన్ని పరామర్శించడానికి వెళ్ళి రెండు లక్షలిచ్చి చెప్పాను. 'ఈ డబ్బు అమాయకమైన నాకు ఈ లోకంలో బతకడం నేర్పినందుకు. ఇక ఈ నీ బెడ్‌రెస్ట్ నన్ను నా బిడ్డను చంపి నా ఆస్తితో నువ్వు ఎంజాయ్ చెయ్యాలనుకున్నందుకు నేను ఇస్తున్న బహుమానాలు' మోహన్ మొహం మాడిపోయింది. నా జీవితంలో అతని చాప్టర్ ముగిసిపోయింది. కానీ శ్రీరామ్, మోహన్ మొగాళ్ళుగా నాపై వదిలిన బ్యాడ్ ఇంప్రెషన్... నాలో ఫ్రస్ట్రేషన్‌ని, భరించలేని డిప్రెషన్‌నీ కలిగించి నన్ను వ్యసనాలకి ప్రోత్సహించాయి. నువ్వు ఎదుగుతున్న కొద్దీ నాలో నా నీడ కూడా నీ మీద పడకూడదనే పిచ్చి భావన పెరిగిపోయింది. అందుకే నువ్వు నాకెంత దగ్గర కావాలని చూస్తే అంత దూరం నెట్టేసేదాన్ని. నన్ను చూస్తేనే నీలో అసహ్యం రేగాలని, నా నుండి నువ్వు వెళ్ళి పోవాలనే నీ ముందు ఒక తల్లిగా ప్రవర్తించకూడనంత వల్గర్‌గా ప్రవర్తించేదాన్ని. నన్ను క్షమించగలవా... చిన్నా!"

హృది కళ్ళు మసకబారి చెంపలపై నీళ్ళు ధారలు కట్టాయి. వచ్చే వెక్కిళ్ళు ఆపుకుంటూ ఆనంద్ భుజంమీద తల ఆన్చుకుంది. "కంట్రోల్ యువర్ సెల్ఫ్" భుజం తడుతూ ఓదార్చాడు ఆనంద్. పది నిమిషాలకి కాస్త తేరుకుని కళ్ళు తుడుచుకుని మళ్ళీ లెటర్‌లోకి చూసింది.

"నీ మాటల్లో నువ్వు ఎదుర్కొనే ప్రేమరాహిత్యం, కన్నవాళ్ళ కోసం నువ్వు పడే తపన నాకర్థమైనా తల్లిగా నేను నీకు అనర్హురాలిని అనుకునేదానిని. ఎలాగైనా నిన్ను శ్రీరామ్ దగ్గరికి చేరిస్తే ఒక తండ్రిగా ఆడపిల్లవైన నీ భవిష్యత్తు బాగుపడుతుందనే ఆశలు నాలో మొదలయ్యాయి. అది ఆచరించకముందే నీ ధోరణిలో మార్పు వచ్చింది. నేను ఫోన్ చేస్తే నన్ను వేధిస్తున్నట్లు మాట్లాడడం, నువ్వు నాలా చెడు వ్యసనాలను అలవాటు చేసుకుంటున్నాననడం నన్ను రంపపు కోతకి గురిచేసేవి. ఏ నీడైతే నీపై పడకూడదని తపించానో అదే దారిని నన్ను సాధించడానికి నువ్వు సాధనంగా వాడుకుంటున్నావనే భావనే నన్ను ఒణికించేది. ఇక శ్రీరామ్ కాళ్ళమీద పడైనా నీ బాధ్యత అతనికి అప్పగించడం తప్ప మరో మార్గం

లేదనిపించి అందుకు సిద్ధపడుతుంటే ఒక పిడుగులాంటి వార్తతో ఆ ఆశా అణిగిపోయింది.

మా మామయ్య చనిపోతూ ఆస్తి అంతా శ్రీరామ్‌కి, నాకు పుట్టిన సంతానమైన నీకు చెందాలని వ్రాసి రిజిస్టర్ చేసి చనిపోయా రట. శ్రీరామ్ తరఫు లాయర్ నీకు దూర మైన తండ్రి ప్రేమను రుచి చూపి నిన్ను తనవైపు తిప్పుకొని ఆస్తి తిరగరా యించుకోమని సలహా ఇచ్చాడట. ఇది విని నేనూ సంతోషించాను. నా ప్రమేయం లేకుండానే నువ్వు నీ తండ్రికి దగ్గరౌతావని. కానీ ఆ ఆశా ఎక్కువసేపు నిలవలేదు. ఇదంతా కేవలం శ్రీరామ్ తన తండ్రి ఆస్తి, నాకు భరణంగా ఇవ్వగా నేను పెంచిన నీ ఆస్తిని తన సొంతం చేసుకోవడానికే తప్ప నా కూతురు అన్న మమకారంతో చేరదీయ డని తెలుసు. అలాంటప్పుడు ఆస్తి కోసం శ్రీరామ్ నీకు తగని వాడికిచ్చి పెళ్ళిచేసి నీ బతుకు నాశనం చేసినా, లేక చంపాలని చూసినా ఆశ్చర్యం లేదు. అందుకే అతని విషపు ఉచ్చు నీ మీద పడకుండా హెచ్చరిం చాలని నీకు ఫోన్ చేశాను. నువ్వేమో నాతో కాక నా ఎమోషన్స్‌తోనూ దారుణంగా ఆడు కున్నావు. నీ ఫ్రెండ్... ఎవరూ మనస్వి కదూ! అబద్ధం అంది. కనుక నా గుండె ఈ నిజాలన్నీ నీకు చెప్పేందుకైనా మిగిలి ఉంది. లేకపోతే ఎప్పుడో ఆగిపోయేది.

హృదీ, అబద్ధమనుకున్నా నాలో ఏదో ఓ రోజు నాపైన కక్షతో ఈ అబద్ధాలను నిజం చేస్తావనే భయం పెరిగిపోతోంది. నీ తండ్రి దగ్గర చేర్చాలనే ఒక్క ఆశ కూడా అడుగంటి పోయింది. నేనింక పోరాడలేనురా! శ్రీరామ్ ఇప్పటికే నీకు సెల్ మెసేజ్‌లతో దగ్గరౌతు న్నాడట. తండ్రిని నువ్వు కాదనవు. కానీ నీకు నేను చెప్పే నిజాలు వినే తీరిక ఉండదు. నువ్వు మోసపోయి బాధపడడం నా కళ్ళతో చూడలేను. అందుకే చివరి ప్రయత్నంగా ఈ లెటర్ రాసి నేను ఈ లోకం నుండి వీడ్కోలు తీసుకుంటున్నాను.

చిన్నా! ఇకపై నువ్వు ఒంటరివే. అమ్మ చేసిన తప్పులు చెయ్యకు. నీకు నీ స్నేహితుల అండ ఉంది. ఆలోచించి నిర్ణయాలు తీసుకో. ప్చ్! చాలా రాయాలని, ఇరవై ఏళ్ళుగా చెప్పాలని ఆశపడి చెప్పలేని ఎన్నో విషయాలు రాయాలని ఉంది. పెన్ను ఒణు కుతోంది. మత్తు పెరుగుతోంది. ఆఖరిసా రైనా నీ రూపాన్ని కళ్ళారా చూడాలని ఉంది. నువ్వొచ్చేసరికి నా ప్రాణం పోకపోతే ఒక్కసారి నిన్ను చూసేలా ఊపిరి నిలప మని అంకుల్‌కి చెప్పు. ఆс! డాడీ దగ్గరకి వెళ్ళాలని ఉంటే వెళ్ళు నీ ఇష్టం.

ఇంక ఓపిక చాలడం లేదు

అమ్మ

గుండెలు పిండే బాధంటే అర్థం తెలు స్తోంది సహృదయకి. తన అతితెలివి వల్ల తల్లిని ఎంత నరకానికి గురి చేసిందో తెలిసివ చ్చింది. గుండె లోతుల్లోంచి దుఃఖం ఎగద న్నుకొని వస్తోంది. ఆనంద్ ఆమెను వారించ లేదు. కొందరికి కొన్ని శిక్షలు పడాలి. హృదికి ఆమె కన్నతల్లి కడుపుతీపి రుచిలోని వేదన కన్నీళ్ళతో కరిగిపోవాలి అనుకుంటూ తడిబా రిన కళ్ళని వత్తుకుని పేపర్లు మడిచి కవర్లో పెట్టాడు. ఇంకా హృది మోకాళ్ళమీద తల ఆన్చుకుని కుమిలిపోతూనే ఉంది. గ్లాసులో నీళ్ళు పోసుకొని తను తాగి మళ్ళీ పోసి సహృదయను లేపి తాగిస్తోంటే అతని దృష్టి వేగంగా వస్తున్న చటర్జీ మీద పడింది.

"హృదీ, డాక్టర్ అంకుల్ వస్తున్నారు" హెచ్చరించాడు. బలవంతాన నీళ్ళు గుటకలే స్తున్న హృది కళ్ళు వత్తుకుంటూ ఆత్రంగా ఆయన మొహంలోకి చూసింది. ఆయన మొహంలో గాంభీర్యం తొణికిసలాడుతోంది.

## 20

"ఏమిటీ...? మీ ఇంటికెళ్ళి అల్లరి చేస్తు న్నాననుకుంటున్నావా? " శశికాంత్ అడిగాడు. మనస్వి ఊపిరి బిగబట్టింది.

"ముందు అలాగే అనుకున్నాను. కానీ ఒంటరిగా వెళితే సపోర్టు చాలదని ఇంటికి

వచ్చి డాడీకి, మా బావకి విషయం చెప్పాను. వాళ్ళూ నాకో విషయం చెప్పారు. ఆలోచించి చూస్తే నాకు అదే బెటర్ అనిపించింది. ఇంతకీ "ఏమిటా విషయం? అని అడగవేం? " కవ్విస్తున్నట్లు అడిగాడు.

"ఏమిటా విషయం? " గొంతు పెగల్చుకొని అడిగింది.

"నువ్వేమో ఇరవై రోజుల్లో మళ్ళీ వెళ్ళిపోవా లంటున్నావు. మనం చూసిన వాళ్ళలో మనస్వి తండ్రే మన మడిగిన కట్నం, లాంఛనాలు అన్నింటికీ ఒప్పుకొని పదిరో జుల్లో పెళ్ళికి సిద్ధపడ్డాడు. దాన్ని వదులుకో వడం ఇష్టం లేదు. ఒకసారి నీతో పెళ్ళయ్యి అమెరికాలో అడుగుపెడితే ఆ అమ్మాయికి లవ్వర్ కాదు, అసలు పేరెంట్సే గుర్తుండరు. మూడు ముళ్ళుపడి మూడు రాత్రులు గడిస్తే అంతా మర్చిపోతుందన్నారు. ఆలో చిస్తుంటే వాళ్ళు అన్న మాటల్లో కూడా పాయింట్ ఉంది అనిపించింది.

"ఇంతకీ మీరు చెప్పదలచుకున్నది ఏమిటి? " ఎర్రబడిన మొహంతో కాస్త తీవ్ర స్వరంతో అడిగింది.

"ఏమయింది...? " సుమన దగ్గరగా వచ్చి సెల్‌కి చెవి ఆన్చింది. "మనస్వి...! ఎందు కంత కోపం? నేను నీకెంత ఉపకారం చేస్తు న్నానో నీకు అర్థం కావడం లేదు. అదే నేను తిన్నగా మీ ఇంటికెళ్ళి మీ అమ్మాయి ప్రవ ర్తన మంచిది కాదు. నా కళ్ళముందే పరాయి మగాడి కౌగిలిలో నలిగిపోవడం చూశాను అని చెప్పి పెళ్ళి కాన్సిల్ చేయించి ఉంటే ఈపాటికి పరువుపోయి మీ అమ్మానాన్న ఆత్మహత్య చేసుకునేవారు. పెళ్ళి చెడిపోయిన ఆడపిల్ల జీవితం మీద మచ్చపడడం చాలా సహజం. అప్పుడు నువ్వు ఆత్మహత్య చేసు కోవాలి. మరి ఈ ప్రమాదాలని తప్పించి నేను నీకు ఉపకారం చేశానా? లేదా? " అతని గొంతులో ఇదీ అని చెప్పలేని శాడిజం పలుకుతోంది.

"చాలా ఉపకారం చేశారు. ఇంతకీ నన్నేం చెయ్యమంటారు? " అతని మాట తీరుతో విసిగిపోయిన మనస్వి అరిచినట్లు అడిగింది.

"మరేంలేదు. నువ్వు చాలా మంచి అమ్మా యిలా నీ బాయ్‌ఫ్రెండ్‌ని వదిలి ఇంటికి వెళ్ళి మన ప్రయాణం బాగా జరిగిందని చెప్పు. సాయంత్రం మా నాన్న, బావవాళ్ళు పెళ్ళికి అవసరమైన నగలని కొనడానికి వస్తున్నారు. మీ నాన్నని అన్ని బ్యాంకు కార్డులతోనూ సిద్ధంగా ఉండమని చెప్పు. మా వాళ్ళు కోరిన వాటికన్నిటికి లేదు, కాదు... అనకుండా ఏర్పాటు చేయమని చెప్పు" శశికాంత్ ఇంకా ఏదో చెబుతుండగానే పట్టలేని అసహనంతో సెల్ ఆపేసింది మనస్వి. మనోజ్ దగ్గరకి వస్తూ అడిగాడు "ఏమంటాడు...? "

మనస్వికి ఆగ్రహంతో పెదాలు ఒణుకుతు న్నాయి. "మనోజ్ మనం వెంటనే మా అమ్మా నాన్నలని కలవాలి. శశికాంత్ మన విషయాన్ని అడ్డుపెట్టుకొని నన్ను బెదిరించి నాన్నని పాపర్ చెయ్యాలని చూస్తున్నాడు. నా తప్పుకి వాళ్ళని శిక్షించడం నాకిష్టం లేదు. మంచో, చెడో వాళ్ళ నిర్ణయాన్ని నేను భరిస్తాను. పద" అంది. మనోజ్ సుమన కేసి చూశాడు. కళ్ళతోనే ఆగమన్నట్లు అన్న గారికి సైగ చేసింది.

"మనూ! నువ్వు ఆవేశంలో తొందరపడుతు న్నావనిపిస్తోంది. నాకైతే శశికాంత్ మాటల్లో తప్పేం కనబడడం లేదు. అతనన్నట్లు నిజం చెప్పి మీ ఇంట్లో యాగీ చేస్తే ప్రాణాలే పోయేవి. ఆ రకంగా నీకు ఉపకారమే చేశాడు. ఇకపోతే వాళ్ళు కోరినవన్నీ ఇవ్వడా నికి సిద్ధపడే మీ అమ్మా నాన్న ఈ పెళ్ళి కుదిర్చారు. ఇందులో అతను నిన్ను వాడు కొనేది ఏముంది? అతనికి మీ వాళ్ళు ఏమిచ్చినా నీ సుఖం కోసం నీ భర్తకిచ్చే వేగా! మీ డాడీని పాపర్ చేసేదేముంది? " ఓ కాలు మడిచి చెట్టుకు ఆన్చి నిలబడి తాపీగా అడిగింది సుమన.

గిర్రున తిరిగింది మనస్వి. సుమన మాటల్ని శోధిస్తున్నట్లు తీక్షణంగా చూసింది.

"ఐయాం యువర్ ఫ్రెండ్. కనుక లైఫ్‌లో నువ్వు సరైన నిర్ణయాన్ని తీసుకొనేలా

చూడడం నా బాధ్యత. అందుకే అమెరికా సంబంధం వదులుకుని అయ్యో తొందరపడ్డానే అని రేపు నువ్వు బాధపడకూడదని చెప్తున్నాను. పెళ్ళాం పక్కమొగాడికేసి చూస్తేనే అనుమానించే మగాళ్ళున్న ఈ రోజుల్లో, కాబోయే భార్యను ప్రియుడి కౌగిలిలో చూసి కూడా చేసుకుంటాననే వాళ్ళు ఎవరే? " అడిగింది.

"అది పెళ్ళాం మీద ప్రేమ కాదు. ఈ వంకతో ఇంకో లక్ష ఎక్కువ లాగొచ్చనే స్వార్థం" వ్యంగ్యంగా అంది మనస్వి.

"స్వార్థంలో మాత్రం తప్పేం ఉందే. ఎన్ని లక్షలు లాగినా పెళ్ళయితే తినేది నువ్వు, నీ పిల్లలేగా! అయినా త్యాగం పేరుతో విలువైన జీవితాన్ని కోల్పోవడంకన్నా ఆ మాత్రం స్వార్థం ప్రతి మనిషికి అవసరం" బోధిస్తున్నట్లు అంది.




సుమన ధోరణి అర్థం కావడంలేదు మనోజ్‌కి. "ఇది ఆఖరికి మను మనసు ఆ అమెరికా వాడివైపు మళ్ళించి నా కొంపముంచేలా ఉంది" అనుకున్నాడు.

అంతసేపు సుమననే గమనిస్తున్న మనస్వి, "రైట్ సుమా! నువ్వన్నదే కరెక్ట్. కాస్త స్వార్థం ప్రతి మనిషికి ఉండాలి. అందుకే నేనూ నా స్వార్థం కోసం శశికాంత్‌ని వదులుకుంటున్నాను సరేనా? " అంది

కొద్ది క్షణాలు మౌనం రాజ్యం చేసింది. తర్వాత మనస్వి మళ్ళీ అంది. "భార్యాభర్తల మధ్య మంచి అవగాహన ఉండాలి. నేను శశికాంత్‌ని చేసుకుంటే మా మ్యారేజ్ లైఫ్ మొదటే అపనమ్మకం పునాదిపై ఏర్పడుతుంది. తప్పు చేశానేమోననే అనుమానంతో అతను, గిల్టీతో నేను ఎంతకాలం కలిసి ఉండగలం. అందుకే అతనికోసం నా విలువైన జీవితాన్ని స్ట్రగుల్‌గా మార్చేసుకోలేని స్వార్థంలో శశికాంత్‌ని వద్దనుకుంటున్నాను. ఇంకా" ఆగింది.

"ఇంకా? " ఈసారి మనోజ్ ఆసక్తిగా అడిగాడు.

"మనోజ్. నాది అనే దేని కోసం ధైర్యం చెయ్యలేని పిరికితనాన్ని నాలో పోగొట్టి నీకోసం ఏదైనా చెయ్యాలి అనిపించే అనురాగాన్ని పంచావు. తొలి వలపును పరిచయం చేశావు. నీ ప్రేమ వదులుకోలేకపోవడం నిజంగా నాలోని బలమైన స్వార్థం" అతడి కళ్ళలోకి ప్రేమగా చూస్తూ చెప్పింది.

"అయ్యాయా! నీ స్వార్థాల లెక్కలు, ఇంకా ఉన్నాయా? " వెక్కిరించింది సుమన.

"లాభం లేదు. మన పెళ్ళితోపాటు దీనికి పెళ్ళి చేసి పంపేయకపోతే, మన హనీమూన్‌లో కూడా అడ్డుపడిపోతుందిది" పైకి లేస్తూ చెల్లెల్ని విసుక్కొన్నాడు.

ఫక్కున నవ్వింది మనస్వి. చేయి చాపి సుమనని అందుకొంటూ "నిన్నూ, హృదినీ వదులుకోలేకపోవడం నాకున్న పెద్ద స్వార్థం" ప్రేమగా చెప్పింది.

సుమన కొద్దిగా తలొంచి చెప్పింది. "మై ప్లెజర్"

మనోజ్ బైక్ స్టార్ట్ చేసి హారన్ మోగించాడు. "రావాలి. రెండు దాటింది. ఆకలి దంచుతోంది" పిలిచాడు ఇద్దరిని.

మనస్వి సుమన చెయ్యి పట్టుకొని లేచింది. ఆమె చేతిలో సెల్ తీసుకొని చెయ్యి విడిపించుకుంటూ "మనూ! నువ్వు, అన్నయ్యా వెళ్ళండి. నేనేదైనా ఆటోలో వెళ్లి డ్వాక్రా ఆంటీ డబ్బులు ఇచ్చేసి వస్తాను. సెల్ కూడా నీకు ఈవినింగ్ ఇస్తాను" చెప్పింది.

"మళ్ళీ ఈ ప్రోగ్రాం ఛేంజ్ ఏమిటి? " కాస్త ఆశ్చర్యంగా అడిగింది మనస్వి.

"సారీ మనూ! ఆవిడకి రెండింటికల్లా డబ్బు అందజేస్తానని చెప్పాను. ఇక్కడే టూ థర్టీ అయ్యింది. మీతో వస్తే ఇంకా లేటవుతుంది. ప్లీజ్" రిక్వెస్ట్‌గా అంది.

"పోన్లే కాసేపైనా మనల్ని ప్రశాంతంగా ఉండనిస్తోంది. నువ్వు రా!" పిలిచాడు మనోజ్.

"అన్నయ్యా, బీ కేర్‌ఫుల్. చాలా సున్నితమైన మేటర్. తొందరపాటు ప్రదర్శించవద్దు. నీవల్ల డీల్ కాదనుకుంటే డాడీకి ఫోన్‌చేసి పిలువు. మనూ, సాధ్యమైనంత వరకు నొప్పించకుండా ఒప్పించడానికి ట్రయ్ చేయండి. దారిలో ఏదైనా తిని వెళ్ళండి" ఇద్దరికీ ఆరిందాలా సలహా ఇచ్చింది.

ఆమె చెప్పిన అన్నింటికీ అంగీకారంగా ఊకొట్టి వెళ్ళిపోయారిద్దరూ.

వాళ్ళు కనుమరుగయ్యేదాకా చూసి మనస్వి సెల్‌లో శశికాంత్ నెంబర్ చూసి దానికి రింగ్ చేసింది సుమ.

"హలో" శశికాంత్ గొంతు వినిపించింది.

"నేను మనస్వి ఫ్రెండ్ సుమనని మాట్లాడుతున్నాను. మీతో కొంచెం అర్జంటుగా మాట్లాడాలి. నన్నొకసారి కలవగలరా?" మర్యాదగా అడిగింది.

శశికాంత్ గొంతులో విస్మయం పలికింది. "మీరు నాతో మాట్లాడేదేముంది?"

సుమన నవ్వింది. "అది చెప్పడానికే కలవమంటున్నాను"

రెండు క్షణాల మౌనం తర్వాత వినిపించింది. "ఓకె. ఎక్కడ కలుద్దామంటారు" ఒక్క క్షణం ఆలోచించి "మీరు భోజనం చేశారా?" అని అడిగింది.

"ఇంకా లేదు... ఏం?"

"దెన్ ఓ.కే. మనం తాజ్ ఇంటర్నేషనల్‌లో కలుద్దాం. నాకు చాలా ఆకలిగా ఉంది. మీరు త్వరగా వచ్చేయండి" అతని మరో ప్రశ్నకి అవకాశం ఇవ్వకుండా అటుగా పోతున్న ఆటోని ఆపి "తాజ్ ఇంటర్నేషనల్‌కి పోనీయ్" చెప్పి ఎక్కి కూర్చుంది.

ఆటోకన్నా వేగంగా దూసుకుపోతున్న మనసుతో శశికాంత్‌తో మాట్లాడవలసిన విషయాలను మననం చేసుకొంటూ, బ్యాగ్‌లోంచి కూలింగ్ గ్లాసెస్ తీసి పెట్టుకొని సీటు వెనక్కివాలి కళ్ళు మూసుకుంది సుమన.




సహృదయ వేగంగా లేచివచ్చి చటర్జీ కాళ్ళను చుట్టుకుపోయింది.

"హృదీ! ఏమిటమ్మా ఇది లే" కంగారుగా లేపారు చటర్జీ.

"అంకుల్ ప్లీజ్ ఏదైనా చెయ్యండి. నా కోసం మమ్మీని ఒక్కసారి కళ్ళు తెరిపించండి. ఆవిడ నాతో ఏం మాట్లాడనక్కరలేదు. నేను చెప్పేది వింటే చాలు. నన్ను చివరిసారి కళ్ళారా చూసుకొంటే చాలు. ప్లీజ్ అంకుల్. ఆయన చేతుల్ని ఒడిసిపట్టుకొని కరిగి కన్నీరైపోతూ వేడుకుంది.

చటర్జీ పెదాలమీద నీరస హాసం విరిసింది. "నిన్ను కళ్ళారా చూసుకోవాలని జానకి ఎంతగా తపించిపోయిందో దగ్గరుండి ప్రత్యక్షంగా చూసిన నాకు తెలుసు. నిన్ను చూడాలనే కోరిక బలమే ఆమెలో ఇంకా ఊపిరి నిలిపిందని నా నమ్మకం. నీకు అది చెప్పడానికే వచ్చాను. జానకికి స్పృహ వచ్చే లక్షణాలు కనిపిస్తున్నాయి. ఎంతసేపు మనలో ఉంటుందో తెలియదు కానీ, నువ్వు కోరినట్లు నిన్ను మాత్రం ఒక్కసారి కళ్ళారా చూసుకోగలదు. త్వరగా రా! నేనొకసారి రిపోర్ట్స్ కనుక్కొని వస్తాను. నువ్వు ఐ.సి.యు.కి వెళ్ళు" భుజం తట్టి వెళ్ళిపోయారు.

హృది మొహం సంతోషంతో వెలిగిపోయింది. ఆనంద్ చెయ్యి బిగించి పట్టుకుంది. వాళ్ళు గుమ్మందాటి నాలుగు అడుగులు వేయగానే ఓ వైపు బెంచ్ మీద కూర్చున్న శ్రీరామ్ గబగబాలేచి వచ్చి "అమ్మకి ఎలా ఉందమ్మా" ఆత్రంగా అడిగాడు.

"స్పృహ వచ్చిందిట" అతని మొహంలో

ఫీలింగ్స్ గమనిస్తూ చెప్పింది.

ఒక్కక్షణం వెలవెల బోయి అంతలోనే "చాలా సంతోషమమ్మా! మీ అమ్మ నీకు దక్కింది. మొహానికి సంతోషాన్ని, నవ్వుని పులుముకున్నాడు.

హృది అసహనంగా తల విదిల్చి "సార్! ఈ ప్రపంచంలో మనం నిత్యం ఏదో ఒక అవసరంతో నటించవలసిరావడం మన దుర దృష్టం. ఇప్పుడు మీరే చూడండి. మనసులో లేని ప్రేమని నటించడానికి ఎంత కష్టపడవ లసివస్తోందో, ఎందుకు సార్? ఈ ముసు గులో గుద్దులాట. మీక్కావలసింది మీ డాడీ నా పేర రాసిన ఆస్తి మీ పేర తిరగ రాయడ మేగా! పేపర్లు తెచ్చుకోండి. ఎక్కడ కావా లంటే అక్కడ సైన్‌చేసి ఇస్తాను" కటువుగా చెప్పింది.

శ్రీరామ్ మొహం తెల్లగా పాలిపోయింది. "బేబీ నేను నీ తండ్రిని" గుర్తుచేశాడు.

హృది అసహనంగా చూసింది. "సో వాట్? ఏం చెయ్యమంటారు. ఏడాది బిడ్డలా మీ భుజం మీద నిద్రపొమ్మంటారా? ఐదేళ్ళ పిల్లలా మీ వీపుమీద గుర్రం ఆడి స్తారా, పన్నెండేళ్ళ పాపకి కొన్నట్లు తొలిసారి పట్టుపావడా కొనివ్వగలరా?, పదిహేడేళ్ళ వయసులో ర్యాగింగ్‌కు భయపడే కాలేజీ ఫియర్‌ని బుజ్జగించి పోగొట్టగలరా? ఇరవై ఏళ్ళ వయసులో టెన్నిస్‌లో కాలేజి ఫస్టు కొద్దిలో కోల్పోయిన వేదనను ధైర్యం చెప్పి ప్రోత్సహించి, ఓదార్చగలరా? ఎట్‌లీస్ట్ పెళ్ళీడు కూతురు ఎంచుకున్న లైఫ్‌పార్టనర్ ఎలాంటివాడో ఎంక్వయిరీ చేసి తండ్రిగా మీ బాధ్యతని నెరవేర్చగలరా? ఊహూ! మీ వల్ల కాదు" హృది పెదాలపై వేదనతో కూడిన నవ్వు కదిలింది. "ఇవన్నీ ఒక ఆడపిల్ల తన జీవితకాలంలో నాకూ తండ్రి ఉంటే బాగుం డును అని తపించే కొన్ని మధుర క్షణాలు. ఈ ఇరవై ఏళ్ళలో నేనూ నా తండ్రికోసం అలాగే అనుక్షణం తపించాను. కానీ ఆనాడు మీకు ఒక కూతురు ఉందన్న సంగతి గుర్తు రాలేదు. ఇప్పుడు తండ్రిగా మిమ్మల్ని గుర్తిం చాల్సిన అవసరం నాకు లేదు. గుడ్‌బై" ఎన్నో ఏళ్ళుగా గుండెలమాటున అదుముకొన్న వేదన మాటల తూటాల్లా వచ్చి శ్రీరామ్‌ని సూటిగా తాకాయి. ఆనంద్ ఆమె ఆవేశాన్ని చూసి వర్రీ అయ్యాడు. "హృదీ ఏమిటీ ఆవేశం. ఓ ప్రక్క మీ అమ్మ పరిస్థితి బాగో లేదు. ఇప్పుడు ఈయనతో డిస్కషన్ అవస రమా. నువ్వు పద" భుజం చుట్టూ చెయ్యేసి వార్డ్‌వైపు తిప్పుతూ మృదువుగా అన్నాడు.

హృది తిరగలేదు. "మిస్టర్ శ్రీరామ్. మీరెందుకు నాకు అక్కరలేదన్నానో అర్థమ య్యిందా? హి ఈజ్ ఆనంద్. మై ఉడ్‌బి హజ్‌బెండ్. నా లైఫ్‌లో తండ్రి ఆదరణను ఆశించే బాల్యం మీ జోక్యం లేకుండానే ముగి సిపోయింది. ఇకపై మీకు బిడ్డల ఆసరా కావాలేమో కానీ మాకు కన్నవాళ్ళ అవసరం లేదు" అని "ఓఁ! మీకు పిల్లలు లేరట కదా! అందుకే పిల్లల్ని కన్నవాళ్ళ మమకారం ఏమిటో మీకు తెలియదు. ఎవరైనా పిల్లా పాపా ఉన్నవాళ్ళని అడగండి" హేళనగా అంది. అప్పటికే డాక్టర్ శ్రీరామ్ మొహం అవమానంతో నల్లగా మాడిపోయి భూమి లోకి వొంగిపోయింది.

"ఇక చాలు... పద" ఆనంద్ మళ్ళీ ఫోర్స్ చేశాడు. అతనితో రెండడుగులు వేసి మళ్ళీ ఆగి తిరిగి-

"మిస్టర్ శ్రీరామ్. మీరు మీ డాడీ నా పేర రాసిన ఆస్తితో పాటు, అమ్మ ఆస్తి కూడా మీకే చెందేలా నన్ను ఇంప్రెస్ చెయ్యాలని కోరుకుంటున్నారట కదా! ఓ పని చెయ్యండి. రేపు మీ డాక్యుమెంట్స్‌తో పాటు, నాపేర ఆస్తులన్నీ మీ పేరిట చెందేలా మరో డాక్యు మెంట్స్ కూడా చేయించి తెండి. సైన్ చేసి ఇస్తాను. పాపం మీకు పిల్లలు లేరు కదా! ఆ ఆస్తి ఉంటే రేపు ఎవరైనా అనామకుడు మీకు తలకొరివి పెట్టడానికైనా ముందుకొస్తాడు. వెళ్ళండి. నాకోసం, మమ్మీకోసం మీ కాలాన్ని, కన్నీళ్ళని వృధా చేసుకోనక్కరలేదు" అనేసి విసవిసా ముందుకు నడిచింది.




గేటు తీసిన చప్పుడవడంతో మనస్వి, శశికాంత్‌లు వచ్చి ఉంటారనుకొంటూ తొంగి చూసిన సుభద్ర కూతురు మరెవరో కుర్రాడితో లోనికి రావడం చూసి అర్థం కానట్లు నిలబడిపోయింది. సోఫాలో కూర్చుని మనస్వి పెళ్ళికి కావలసిన వస్తువుల లిస్ట్ తయారుచేస్తున్న చక్రధరం తలెత్తి చూసి "అమ్మాయి వచ్చిందా?" అడిగాడు. అప్పుడే మనస్వి, మనోజ్ లోపలికి అడుగుపెట్టారు.

మనిస్వి ఒక్క క్షణం గుండెల నిండా ఊపిరి పీల్చుకొని "డాడీ! ఇతను మీకు తెలుసు. నా ఫ్రెండ్ సుమన అన్నగారు. మీతో మాట్లాడేటందుకు వచ్చాడు" పరిచయం చేసింది.

"నమస్తే అంకుల్, నమస్తే ఆంటీ" ఇద్దరికి వినయంగా చేతులు జోడించాడు. అయోమయంగా భర్త వంక చూసింది సుభద్ర.

విషయాన్ని గ్రహించిన చక్రధరం "వీధి తలుపు మూసి పిల్లలకి తాగడానికి ఏదైనా తీసుకురా సుభద్రా!" గంభీరంగా భార్యకి ఆర్డర్ వేసి ఎదుటి సోఫాని చూపించి మనోజ్‌ని కూర్చోమని సైగ చేశాడు. ఆ మాత్రానికే ఒక పెద్ద గండాన్ని దాటినంత సంతోషించారు ఇద్దరూ. వాళ్ళవంక కోపంగా చూస్తూ తలుపులు మూసి వంటింట్లోకి వెళ్ళిపోయింది సుభద్ర. "మనూ, అంకుల్‌తో నేను మాట్లాడతాను" తన వెనక నుంచున్న మనస్వికి చెప్పి ఒకసారి పరిశీలనగా చూస్తున్న చక్రధరం కేసి చూసి చేతిలో బైక్ కీ తిప్పుతూ "నా పేరు మనోజ్..." అంటూ తన వివరాలు, తల్లిదండ్రుల వివరాలు చెప్పాడు. "నా వివరాలు మీరు కావాలంటే ఎంక్వయిరీ చేసుకోవచ్చు" అన్నాడు.

చక్రధరం కనుబొమలు ఎగరేశాడు. "నీ బయోడేటా చాలా ఆకర్షణీయంగా ఉంది. ఏ ఆడపిల్ల తండ్రికైనా తప్పక నచ్చుతావు. కానీ, నాకు చెప్పి ఏం లాభం. నాకు ఒక్కర్తే కూతురు. దానికీ పెళ్ళి సెటిల్ అయ్యింది. పదిరోజుల్లో పెళ్ళి. కుర్రాడి పేరు శశికాంత్. కాలిఫోర్నియాలో కంప్యూటర్ ఇంజనీర్. ఈ వివరాలు నిన్ను ఇంతదూరం తీసుకొచ్చిన నీ స్నేహితురాలు చెప్పలేదా?" మనస్విని, మనోజ్‌ని మార్చిమార్చి చూస్తూ ప్రశ్నించాడు.

ఇద్దరూ మొహాలు చూసుకొని తలొంచుకున్నారు.

సుభద్ర కాఫీ తెచ్చి మనోజ్‌కి, చక్రధరానికి ఇచ్చింది.

"శశికాంత్‌ని నేను కలిశాను. అతనికి మా గురించి తెలుసు" అంటూ ఉదయం జరిగిన సంఘటన క్లుప్తంగా చెప్పి "మమ్మల్నిద్దర్ని దగ్గరగా చూసి అతనికి కోపం వచ్చి వెళ్ళిపోయాడు" స్పూన్ సాసర్లో పెట్టి కాఫీ సిప్ చేస్తూచెప్పాడు. వింటున్న చక్రధరం దంపతులు ప్రక్కనే బాంబు పేలినట్లు అదిరిపడ్డారు. సుభద్రకైతే మనస్వి చెంపలు వాయగొట్టాలనేంత ఆవేశం వచ్చింది. చక్రధరం మెల్లగా చెయ్యి నొక్కడంతో తన ఆవేశాన్ని అదుపు చేసుకుంది. తాగకుండానే కప్పు ట్రేలో పెట్టేసి, "అతను ఛీకొట్టి వెళ్ళిపోయాడు కనుక నువ్వు నా కూతుర్ని పెళ్ళి చేసుకొని ఉద్ధరిద్దామని వచ్చావా?" ఆగ్రహంగా అడిగాడు. మనోజ్ చిన్నగా నవ్వాడు. "ఇక్కడ ట్విస్ట్ ఏంటంటే అతను ఈ పెళ్ళి కేన్సిల్ చెయ్యాలేదు. మనూకి ఫోన్ చేసి నీ లవ్ మీద నాకు నమ్మకం లేదు. ఈ పెళ్ళికి నాకేం అభ్యంతరం లేదని చెప్పాడు"

వింటున్న చక్రధరం దంపతులకి ప్రాణం లేచొచ్చింది. "అమెరికాలో ఉంటున్నా ఎంత సంస్కారవంతుడు శశికాంత్" మెచ్చుకోలుగా అంది సుభద్ర. అంగీకారంగా తల ఊపాడు చక్రధరం. కానీ పెళ్ళి కేన్సిల్ కాలేదని తెలిసీ

మనోజ్ ఎందుకొచ్చాడో అర్థం కాలేదు. అదే ప్రశ్నించాడు.

మనోజ్ ఏదో చెప్పేలోగా మనస్వి అతన్ని అడ్డుకుంది. "ఈ ప్రశ్నకి సమాధానం నేను చెప్తాను. నాకు శశికాంత్‌ని చేసుకోవడం ఇష్టం లేదు. నిన్న మీ కోసం జరిగే తతంగానికి తలవంచినా ఈరోజు మనోజ్‌ని కలిశాక, మా గురించి శశికాంత్‌కి విషయం తెలిశాక ఏమీ జరగనట్లు పీటల మీద తలొంచుకుని తాళి కట్టించుకోవడం నా వల్ల కాదు. అందుకే నేనే మనోజ్‌ని తీసుకొచ్చాను" స్పష్టంగా చెప్పింది. "మనూ, పెద్దవాళ్ళ నిర్ణయాన్ని కాదని సొంత నిర్ణయాలు తీసుకొనేటంత పెద్ద దానివైపోయావా? " తీవ్రంగా అడిగింది సుభద్ర.

"తప్పు లేదమ్మా? భార్యాభర్తల బంధానికి నమ్మకం పునాది అంటారు. శశికాంత్‌తో పెళ్ళి అంటే బీటలువారిన ఇంట్లో బతకడమే. నావల్ల కాదు"

సుభద్ర మళ్ళీ ఏదో అనబోతే చక్రధరం ఆమెను వారించి "మనుకి మేము నిర్ణయించిన కుర్రాడితోనే పెళ్ళి జరపాలన్నది మా ఫైనల్ డెసిషన్. ఇందులో మార్పుండదు. కనుక నువ్వు వెళ్ళవచ్చు" గుమ్మం కేసి చెయ్యి చూపిస్తూ చెప్పాడు.

మనోజ్ హర్ట్ కాలేదు. పైకి లేవలేదు. పైగా చెయ్యి వెనక్కి చాపి మనస్వి చేయి అందుకొని ముందుకు లాగి పక్కన కూర్చోపెట్టుకున్నాడు. మనస్వి ఇబ్బందిగా, భయంగా చూసింది తల్లిదండ్రుల కేసి. సుభద్ర మింగేసేలా, చక్రధరం ఏమిటీ సాహసం అన్నట్లు తీక్షణంగా చూశారు.

"అంకుల్ జాగ్రత్తగా చూడండి. నా పక్కనుంటే మనూ మొహంలో ఓ సంతోషం, సంతృప్తి ఉంటాయి. దానిని ఎన్ని లక్షలు పోసి కొన్నా శశికాంత్ పక్కన ఆమెలో మీరు చూడలేరు. ఇక నా విషయానికి వస్తే నాకు మంచి జాబ్ ఉంది. పేరెంట్స్ అండ ఉంది. మీ నిర్ణయానికి వ్యతిరేకంగా కూడా నేను మనస్విని సుఖపెట్టగలను" అని ఒకసారి మనస్వికేసి చూసి, "కానీ సంతోషపెట్టలేను. కారణం కేవలం తను నా మీద ప్రేమతో ఈ పెళ్లి కాదు అనడం లేదు. పెళ్లి పేరుతో మీకు వేల మైళ్ల దూరమైతే కన్నవాళ్ళు, స్నేహితులు ఎవరూ లేని అనాథనౌతాను అనే భయంతో శశికాంత్‌తో పెళ్లి తిరస్కరిస్తోంది. ఇప్పుడు మీ నిర్ణయానికి వ్యతిరేకంగా నేను, మనూ పెళ్లి చేసుకున్నా తన పరిస్థితి అంతే. తన వాళ్లంతా దగ్గరుండి కూడా అనాథ అయిపోతుంది. అది నాకు ఇష్టం లేదు" చెప్పి మనస్వి చెయ్యివదిలి పైకి లేచాడు వెళ్లడానికన్నట్లు

చక్రధరం మౌనంగా నీళ్లు నిండుతున్న మనస్వి ముఖాన్ని, గంభీరాన్ని పులుముకున్న మనోజ్ ముఖాన్ని పరిశీలనగా చూస్తూ కూర్చున్నాడు.

అంతలో కాలింగ్ బజర్ మోగడంతో సుభద్ర వెళ్లి తలుపుతీసింది. "చక్రధరంగారి ఇల్లు ఇదేనాండీ" అడుగుతున్న నందన్‌రావు మనోజ్‌ని గమనించి వెనక్కి తిరిగి "యశోదా... ఇల్లు ఇదే. మన మనోజ్ ఉన్నాడు లోపలికి రా" పిలిచాడు.

మనోజ్ తన తల్లిదండ్రుల్ని చక్రధరంకి పరిచయం చేసి "మీతో మాట్లడానికే వాళ్ళని రమ్మని ఫోన్ చేశాను. నా ఇష్టాన్ని మమ్మీ డాడీ కాదనరు. అయినా మీరింకా కన్విన్స్ కాకపోతే మీ ఇష్టం వచ్చినట్లే శశికాంత్ తో మనూ పెళ్ళి చేయండి" అన్నారు.

అతడి మాటలకు మనస్వి అదిరిపడింది - ఇంతా చేసి చివరికి ఆ మాట ఏంటి అనుకుంటూ. ఒక్కుదుటున లేచివెళ్ళి "అంకుల్"అంటూ నందనరావు చేయి తన రెండు చేతులతో చుట్టేసి పట్టుకుని 'నన్నాదుకోండి' అన్నట్లు విజ్ఞప్తి పూర్వకంగా చూసింది.

నందన్‌రావు భరోసాగా మనస్వి తల నిమిరాడు అభిమానంగా! కళ్లలో నీళ్లు చెంపలపైకి జారకుండా తల పక్కకి తిప్పుకుని కళ్లు భుజాలకి ఒత్తుకుంది మనస్వి.

"చక్రధరం గారూ" అంటూ నందన్‌రావు ఏదో చెప్పబోయాడు. చక్రధరం పైకి లేచి

"క్షమించండి. వచ్చినప్పటి నుండీ నిలబడే మాట్లాడుతున్నారు. ఇలా వచ్చి కూర్చోండి" సోఫా చూపించాడు.

ఆ మాత్రానికే సంతోషిస్తున్నట్లు మొహాలు చూసుకొన్నారు అంతా. మనస్వి ఇంకా తన చేయి పట్టుకొని ఉండడంతో "ఫరవాలేదు" లా లనగా అన్నాడు నందన్‌రావు.

అది గమనించి "మనూ! పెద్దవాళ్ళనలా ఇబ్బంది పెట్టడం తప్పు కదూ! వెళ్ళి అందరికి తాగడానికి ఏమైనా తీసుకురా! "మందలిస్తున్నట్లు ఆర్డర్ వేశాడు చక్రధరం. ఒక్కసారి నందన్‌రావు కళ్ళలోకి చూసి మెల్లగా వంటింట్లోకి నడిచింది మనస్వి.

"ఒక్క నిమిషం అమ్మా!" ఆపారు నందన్‌రావు. "దీనికి బదులు చెప్పి వెళ్ళు. ఒకవేళ మీ పేరెంట్స్ ఇష్టానికి వ్యతిరేకమైనా మనోజ్‌తో నీ పెళ్ళి మేము చేస్తామంటే నువ్వు మాతో వచ్చేస్తావా? " అడిగాడు.

తల్లిని, తండ్రిని ఒకసారి చూసి అంగీకారంగా తలూపింది.

"మనూ... తొందరపాటు నిర్ణయాలు తీసుకోకు" మనోజ్ వారించాడు.

"లేదు. నేనేం తొందరపడడం లేదు. ఆలోచించే చెప్తున్నాను. శశికాంత్‌ను పెళ్ళాడి అమ్మా, నాన్నల చూపుకు కూడా అందనంత దూరం వెళ్ళడం కన్నా, వాళ్ళని నొప్పించినా ఉన్న ఊళ్ళోనే కనుక రోజుకి, వారానికి ఒకసారైనా చూసుకోగలిగే ఆనందమే నాకు ముఖ్యం" మనస్వి మనసులో మాట చెప్పింది.

"విన్నారుగా చక్రధరంగారు మీ అమ్మాయి మాట. అమ్మాయిని మాతో తీసుకెళ్ళమంటారో, వద్దో మీరే తేల్చి చెప్పండి"

చక్రధరం రెండు క్షణాలు అందరి వంక పరిశీలనగా చూశాడు. పరిస్థితి ఇంతదాకా వచ్చాక ఇంకా తాము మొండికేస్తే మనస్వి సుఖాన్ని చిదిమేసినట్లే అవుతుందని అతడి వివేకం హెచ్చరించింది.

ఆ తర్వాత చిన్నగా నవ్వుతూ "అదెలా కుదురుతుంది బావగారూ! మాకున్నది ఒక్కగానొక్క ఆడపిల్ల. ఇలా కట్టుబట్టలతో ఎలా పంపేస్తాం? అనుకున్న ముహూర్తానికి అంగరంగ వైభోగంగా పెళ్ళి చేసి అత్తారింటికి సాగనంపుతాం. ఈ పది రోజులు ఓపిక పట్టండి" నందన్‌రావును తీసుకొచ్చి సోఫాలో కూర్చోపెడుతూ అన్నాడు.

తమ చెవుల్ని తామే నమ్మలేనట్లు చూస్తూ గభాలున అతనికి దగ్గరగా వచ్చారు మనస్వి, మనోజ్.

"నిజంగా!" ఆశ్చర్యంగా, అపనమ్మకంగా చూస్తూ ఒకేసారి అడిగారు.

"పిల్లలు తప్పు చేస్తారేమోననే భయంతో వారిస్తాం కానీ, మీలో కన్నవారిని గురించి కూడా ఆలోచించే మెచూరిటీ వచ్చిందని తెలిశాకా కూడా గుడ్డిగా ఎలా వ్యతిరేకించగలను" మీ పెళ్ళికి మేము మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాం" చెప్పాడు.

ఏం జరుగుతుందో అర్థం కానట్లు చూస్తున్న తల్లిని గమనించి "కానీ డాడీ... అమ్మకి ఇష్టం లేదుగా!" కళ్ళు వాల్చుకొని దిగులుగా అడిగింది.

చక్రధరం ప్రేమగా కూతురి తల నిమిరాడు. "నేనైనా, అమ్మయినా ఎప్పుడూ కోరేది నీ సుఖ సంతోషాలేనమ్మా. ఏం సుభద్రా? " భార్యని అడిగాడు. సుభద్ర బలహీనంగా నవ్వించి. ఆమెకి శశికాంత్ అమెరికా సంబంధం వదులుకోవడం ఇష్టం లేదు. కానీ కూతురు ఇంట్లోంచి వెళ్ళిపోవడానికి సిద్ధపడడం, భర్త మనోజ్ తల్లిదండ్రుల ముందు అంగీకారం తెలపడంతో తప్పనిసరిగా తలను అంగీకారంగా ఊపింది. "మరి శశికాంత్‌తో ఏం చెప్పాలి? " పీలగా అడిగింది భర్తను.

"మనూయే చేసుకోనప్పుడు మనం మాత్రం ఏం చెయ్యగలం? అదే చెబుదాం. వాళ్ళతో నేను మాట్లాడతాను నందన్‌రావు గారు వాళ్ళు వచ్చినప్పటినుంచి నిలువు కాళ్ళమీద వున్నారు. వాళ్ళ మర్యాదల సంగతి చూడు" అన్నాడు.

అప్పుడే సెల్ రింగవడంతో మనోజ్ బయటకి వెళ్ళి మాట్లాడి హడావిడిగా లోపలికి



వచ్చి మనస్వి దగ్గరకి వెళ్ళి "మనూ! ముంబాయి నుండి ఆనంద్ ఫోన్ చేశాడు. హృది మదర్ సూసైడ్ ఎటెమ్ట్ చేసిందట. కండీషన్ చాలా సీరియస్‌గా ఉందట. హృది బాగా ఏడుస్తోందట. వీలైతే నిన్నూ, సుమని రమ్మన్నాడు. నీ సెల్‌కి రింగ్ చేస్తే అది ఆఫ్‌లో ఉండడంతో నా నెంబర్‌కి చేశానని చెప్పాడు" గబగబ చెప్పాడు.

చక్రధరం దంపతులకి మనోజ్ చెప్పేది ఏమిటో అర్థం కాలేదు. మనస్వి మతిపోయి నదానిలా నిలబడిపోయింది. "అయ్యో పాపం" అంటూ సానుభూతి చూపించారు నందన్‌రావు దంపతులు.

"మనూ, మనూ..." భుజాలు పట్టి కుది పాడు మనోజ్. తెప్పరిల్లినట్లు చూసి అతని కాలర్‌ని గుప్పెట్లో బిగించి పట్టుకొని, "హృదికి ఎవరూ లేరు మనోజ్. పాపం ఇంతకష్టం ఎలా తట్టుకుంటోందో. మనం వెంటనే వెళదాం" కళ్ళల్లో నీళ్ళు పేరుకుంటుండగా రిక్వెస్ట్‌గా అడిగింది.

సుభద్ర కోపంతో రుసరుసలాడింది. మనస్వి తనకి తెలియకుండా ఇన్నాళ్ళు ఆడిన నాటకాలు ఒక్కొక్కటిగా బయటపడుతున్న భావన కలిగింది. పైగా ఎవరో ఊరు పేరు లేని మనిషికోసం ముంబాయి దాకా పోతుందా. విసుగ్గా అనుకుంటూ "మనూ ఏమిటీ వెర్రి. ఒక్కర్తివి ఇప్పుడు ముంబాయి పోతావా? చాల్లే ఊరుకో" కసిరింది.

చిత్రంగా మనస్వి తల్లి అదిలింపుకి బెదర లేదు. "ఒక్కర్తిని కాదమ్మా, నాతో మనోజ్, సుమన కూడా వస్తున్నారు. హృదికి ఇప్పుడు మా అవసరం చాలా ఉంది" మనోజ్‌ని వదిలి తల్లికేసి తిరిగి చెప్పింది.

సుభద్ర కళ్ళతోనే చక్రధరానికి ఒప్పుకోవద్ద న్నట్లు సైగ చేసింది. కానీ ఆయనకి ఆ అవ కాశం రానివ్వలేదు నందన్‌రావు. "అవును. మనోజ్, సుమ ఉండగా భయం ఏముంది. తప్పకుండా వెళ్ళండి. మనిషి సుఖంలో

స్నేహితుల అండ లేకపోయినా నష్టంలేదు. కానీ ఫ్రెండ్ ఆపదలో ఉన్నప్పుడు, ఆసరా కోరినప్పుడు తోడుగా ఉండకపోతే ఫ్రెండ్‌షిప్‌కి అర్థమే లేదు. ఏం బావగారూ! ఏమంటారు? " సంప్రదిస్తున్నట్లు అడిగాడు నందన్‌రావుని - చుట్టరికం కలుపుతూ

భార్య కళ్ళలో ఆగ్రహాన్ని గమనించి ఇబ్బందిగా, బలవంతంగా నవ్వాడు చక్రధరం. మనస్వి నిర్ణయాలు తమ కంట్రోల్‌ని దాటిపోయాయని గ్రహించి విసురుగా లోనికి వెళ్ళిపోయింది సుభద్ర.

సుమన కోసం సెల్‌కి రింగ్ చేసి ఆఫ్‌చేసి ఉన్నట్లు రావడంతో "ఛ, ఏం మనిషి. ఇప్పుడే వస్తానని రెండు గంటల క్రితం వెళ్ళింది. కనీసం మెసేజ్ చెబుదామంటే సెల్ ఆఫ్ చేసి ఉంది. ఎక్కడికెళ్ళిందో తెలియదు ఎలా? " కాస్త విసుగ్గా అన్నాడు మనోజ్.

"నువ్వు, మనస్వి రెడీ అయి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళండి. మేము ఇంటికి వెళ్తాం. ఒకవేళ అక్కడికి వస్తే విషయం చెప్పి పంపిస్తాం" యశోద సజెస్ట్ చేసింది. భర్త పిలుపుతో వచ్చిన సుభద్ర పెదాలకు నవ్వు అతికించుకొని బొట్టుపెట్టి వారిని సాగనంపింది.

చేతికి దొరికిన డ్రస్‌లను ఒక బ్యాగ్‌లో కుక్కుకొని వచ్చి వెళదామా? " మనోజ్‌ని తొందరచేసింది మనస్వి.

తనకు మాటైనా చెప్పకుండా మనోజ్ వెనక వెళ్ళిపోయిన కూతుర్ని బ్రమాన్పడినట్లు చూస్తుండిపోయింది సుభద్ర. మనస్వి పెద్దదైపోయిందనే చేదునిజం తొలిసారి అర్థమైనట్లు కళ్ళప్పగించి మనోజ్‌తో వెళ్ళిపోతున్న కూతుర్నే చూస్తూ నిలబడిపోయింది.

భార్య ఫీలింగ్స్ అర్థంచేసుకొని "మనూ, ఇంకా పసిపిల్ల కాదు. స్వయంగా నిర్ణయాలు తీసుకొనే మెచూరిటీకి ఎదిగింది. వ్యతిరేకించి మనం సాధించేది ఏదీ లేనపుడు మౌనంగా ఊరుకోవడమే మన పెద్దరికం బాధ్యత" ఓదార్పుగా అన్నాడు. ఆ మాటల్లోని నిజాన్ని అర్థం చేసుకుంటున్నట్లు మౌనంగా ఉండిపోయింది సుభద్ర.




సుమన హోటల్ ముందు ఆటో దిగి మరోసారి శశికాంత్ నెంబర్‌కి రింగ్ చెయ్యబోయి, గేటులోంచి లోనికి వస్తున్న అతని కారుని గుర్తించి డిస్టర్బ్ లేకుండా సెల్ ఆఫ్ చేసి బ్యాగ్‌లో పారేసి పైమెట్టు మీద నిలబడి చేతులు కట్టుకొని చూడసాగింది. కారు పార్కింగ్ బాధ్యత వాచ్‌మెన్‌కి అప్పగించి కోటు సర్దుకుంటూ వచ్చాడు శశికాంత్. "లేటయిందా? " మర్యాదకి అడిగాడు.

సుమన మాట్లాడలేదు. లోపలికి వెళ్లి ఇద్దరూ కాస్త ఏకాంతంగా ఉన్న టేబుల్ దగ్గర కూర్చున్నారు. "నాకు చాలా ఆకలిగా ఉంది. లంచ్ ఆర్డర్ ఇస్తాను" సుమన చెప్పింది. మెనూ కార్డు అందుకుంటూ,

"ఒక్క నిమిషం. మనీ మేటర్స్‌లో నేను చాలా ప్రిన్స్‌పల్డ్‌గా ఉంటాను. స్టార్ హోటల్‌లో లంచ్ అంటే త్రీహండ్రెడ్‌కి తక్కువుండదు. ముఖపరిచయం ఉన్న మనిషికి అంత కాస్ట్‌లీ లంచ్ ఇప్పించాలనే కోరిక నాకు లేదు. పైగా ఇక్కడికి నేను మీ ఇన్విటేషన్ మీద వచ్చాను" మొహమాటం లేకుండా చెప్పాడు శశికాంత్.

సుమన పెదాలపై చిరునవ్వు మెదిలింది "ఒ.కె. నేను రమ్మని పిలిచాను కనుక బిల్లు నేనే పే చేస్తాను" బ్యాగ్‌లోంచి రెండు ఐదొందల నోట్లు మెనూ కార్డులో పెట్టి బేరర్‌ని పిలిచి లంచ్ ఆర్డర్ చేసింది. అతను ఆర్డర్ తీసుకెళ్ళేదాకా ఆగి, "నన్ను ఇక్కడికి రమ్మని పిలిచిన కారణమేమిటి? మీ ఫ్రెండ్ ఏమైనా చెప్పమందా? " శశికాంత్ అడిగాడు.

తల అడ్డంగా ఊపింది సుమన. "మనూకి

అసలు నేను మిమ్మల్ని కలిసే సంగతే తెలియదు"అని అతడికి కళ్లలోకి సూటిగా చూస్తూ " మనోజ్‌తో మనస్విని అంత దగ్గరగా చూసి కూడా మీరు మనూని చేసుకోవడానికి ఎందుకు ఒప్పుకున్నారు" తిన్నగా విషయంలోకి వస్తూ అడిగింది.

"ఇందాక రాగానే పరిచయం లేని మనిషికి లంచ్ బిల్లు చెల్లించనన్నారు చూశారా? అంత నిజాయితీగా నిజాన్ని చెప్పండి" అంది. శశికాంత్ కళ్ళతోనే సుమని అంచనా వేస్తున్నట్లు చూసి అంగీకారంగా తల ఊపాడు.

"సరే, వినండి. నేను అమెరికా వెళ్ళిన నాలుగేళ్ళకి కష్టం మీద రెండు నెలల సెలవు దొరికింది. నేను ఇండియా రావడానికి కారణం సాధ్యమైనంత త్వరలో నచ్చిన అమ్మాయిని పెళ్ళిచేసుకొని తీసుకెళ్ళాలని. ఎందుకంటే ఒంటరిగా రోజూ అన్నీ సిద్ధం చేసుకొని డ్యూటీకి వెళ్ళడం కష్టంగా ఉంది. అదీకాక ఒకసారి వెళితే మళ్ళీ ఇంకో నాలుగేళ్ళ దాకా ఇండియా రాలేను. దానికి తోడు లక్షలు ఖర్చుచేసి ఇంత దూరం వచ్చినందుకు డబ్బూ వృథా!" బేరర్ భోజనం తెచ్చి బల్ల మీద సర్ది వెళ్ళే దాకా ఆగి చెప్పాడు. సుమన ఇద్దరికి కొద్దికొద్దిగా వడ్డించింది.

"దురదృష్టకరం ఏమిటంటే దాదాపు నెల్లాళ్లు నాకు అమ్మాయి నచ్చక, మా వాళ్ళకి వాళ్ళిచ్చే లాంఛనాలు నచ్చక వేస్టు అయ్యింది. ఇప్పుడు మనస్వి నాకు, మా ఇంట్లో వాళ్ళకి బాగా నచ్చింది. అలాంటప్పుడు ఏదో పిచ్చికారణంతో పెళ్ళి కేన్సిల్ చేస్తే నాకున్న ఈ తక్కువ సమయంలో మరో అమ్మాయిని కుదుర్చుకోవడం కష్టమైన పని. అందుకే ఓ సారి పెళ్ళి అయ్యి నాతో నా భార్యగా అమెరికాలో అడుగుపెడితే మీ అన్నయ్య నీడ కూడా ఆమెపై పడకుండా జాగ్రత్త పడగలననే నమ్మకంతో ఈ పెళ్ళికి అంగీకరించాను" సూటిగా మనస్వినే పెళ్ళాడడానికి గల అసలు కారణాన్ని వివరించాడు.

"మీ నిజాయితీని నిజంగా అభినందిస్తున్నాను. ఇది చెప్పండి. ఇంచుమించు మనస్వికున్న అర్హతలతోనే వాళ్ళ పెద్దవాళ్ళు ఇచ్చే కట్నకానుకలంతే ఇస్తూ..., మరో అమ్మాయి మీతో పెళ్ళికి సిద్ధమైతే మీకు ఇష్టమేనా? " ఫ్రైడ్‌రైస్ వడ్డించుకుంటూ అడిగింది.

"మీ ఉద్దేశ్యం నాకర్థం కాలేదు" కనుబొమలు ముడివేశాడు శశికాంత్.

"నా ఉద్దేశ్యం ఏమిటంటే, నన్ను పెళ్ళి చేసుకుంటారా? అని అడుగుతున్నాను" గొంతులో ఎలాంటి తడబాటు లేకుండా ప్రశ్నిస్తున్నట్లు చెప్పింది.

"ఏం వేళాకోళంగా ఉందా? " తుళ్ళిపడిన శశికాంత్ సీరియస్‌గా అడిగాడు.

"పెళ్ళి చేసుకోమని అడగడంలో వేళాకోళం ఏముంది? " కళ్ళు ఎగరేసింది.

హేళనగా నవ్వాడు. "ఓ! మీ అన్నగారిని, స్నేహితురాలిని ఒకటి చేసేందుకు చేసే త్యాగమా? "

ఒక్క క్షణం సూటిగా చూసి... "అమెరికాలో స్థిరపడిన కంప్యూటర్ ఇంజనీర్‌ని, ఏ లోపాలు లేని వ్యక్తిని స్నేహితురాలికి తప్పించి సొంతం చేసుకోవాలనుకోవడం త్యాగం కాక స్వార్థమంటారేమో కదా!" నేరుగా అడిగింది.

చురుకుమన్నట్లు చూశాడు శశికాంత్.

"శశికాంత్ గారూ! కాస్త నన్ను పరిశీలనగా చూడండి. కాస్తో కూస్తో అందంగానే ఉంటాను. మనూ లాగే ఒక్కర్తినే కూతుర్ని కనుక మా అమ్మానాన్నలు మీరు కోరిన కట్నకానుకలు ఇస్తారు. డిగ్రీ చదివాను. ఇంక మీకు అభ్యంతరం ఏముంది...? "

"అవన్నీ ఓ.కే. కానీ మనస్వికి మీకు లేని ఒక ప్లస్‌పాయింట్ ఉంది. ఆమెకి కంప్యూటర్ పరిజ్ఞానం, డిగ్రీ కూడా ఉన్నాయి. మీ పెద్దవాళ్ళు ఇచ్చే కట్నకానుకలన్నీ మా అమ్మా, నాన్నలు తీసుకుంటారు. మరి జీవితాంతం మిమ్మల్ని అమెరికా లాంటి ఖరీదైన దేశంలో పోషించాలంటే నా ఒక్కడి జీతం చాలదు. మీ మామూలు డిగ్రీకి ఇండియాలోనే ఉద్యోగం దొరకదు. ఇంక అమెరికా వచ్చి ఏం చేస్తారు" వెక్కిరించాడు.

"మీ భార్య కేవలం వండిపెట్టే మనిషిగానే కాకుండా మీ ఆర్థిక, సాంఘిక హోదాని పెంచే మనిషి కూడా అయ్యుండాలి అంటారు అంతేగా! మనస్వికి మీరు చూపించే ఉద్యోగంలో నెలకి వెయ్యి డాలర్లు జీతం వస్తుంది అనుకుంటే, ఊ! నేను ఇల్లు కదలకుండా నెలకి దాదాపు ఐదారు వేల డాలర్లు సంపాదించగలను" జీడిపప్పులు ఏరుకుని ప్లేటులో వడ్డించుకుంటూ అంది.

శశికాంత్ ఆమె వేళాకోళానికి అందో, నిజంగా అంటోందో అర్థం కాక "ఎలా...? !" కాస్త ఆశ్చర్యంగా అడిగాడు.

చిన్నగా నవ్వింది. "నాకు చదువుకి మించి మరో ఇష్టమైన వ్యాపకం ఉంది. అది చేతిపనులతో రకరకాల అల్లికలు, కుట్లు వంటివాటితో అందమైన, వినియోగకరమైన వస్తువులకు తయారుచేయడం. సరిగ్గా వినియోగించుకుంటే అది చాలా మంచి బిజినెస్‌గా..." చెబుతున్న సుమ; శశికాంత్ అది హోటల్ అన్న విషయాన్ని మర్చిపోయి గట్టిగా నవ్వడంతో ఆపేసింది. నవ్వు కాస్త ఆగాక "నా జీవితంలో ఇంత పెద్ద జోక్ ఎక్కడా ఎప్పుడూ వినలేదు" హేళనగా అన్నాడు.

సుమ వెంటనే బదులివ్వలేదు. ప్లేటులోని జీడిపప్పు నోట్లో పెట్టుకుంటూ చాలా మామూలు స్వరంతో అడిగింది. "మీ టై పిన్ చాలా బాగుంది? ఎక్కడ కొన్నారు? " శశికాంత్ తల వంచి ఎరుపు, నీలం మెరుపురాళ్ళతో హృదయం ఆకారంలో చేయబడి ఒక బకిల్‌కి అతికించి టై పిన్‌లా చేసి తన కోటుపై మెరుస్తున్న దానిని గమనించి "కిందటి వేసవిలో తానావాళ్ళు భారతీయ సాంప్రదాయ వస్తువులతో ఎగ్జిబిషన్ పెట్టారు. అక్కడ కొన్నాను. చాలా చీప్, కేవలం ఇరవై డాలర్లు అంతే" తన ఎంపికకి తానే మురుస్తూ గర్వంగా అన్నాడు.

సుమ తల ఎగరేసింది. "నిజమే! చాలా చవక. ఆ రంగురాళ్ళకి, మిగిలిన వస్తువులు కొనడానికి, తయారీకి అయన ఖర్చు దానిని మార్కెటింగ్ చేసేందుకు కట్టే పన్నులు, విదేశాల్లో అమ్మేందుకు తెచ్చుకొనే అనుమతికీ... అన్నీ కలిపి ఒకోదాని ఖరీదు ఓ నూట ఏభై రూపాయలు వేసుకోవచ్చు అంటే దాదాపు నాలుగు డాలర్లు. మీరేమో దానిని ఇరవై డాలర్లు పెట్టి కొన్నారు. అంటే ఓ చిన్న టై పిన్‌కే ఎనభై శాతం లాభం అంటే అదే పెద్ద వస్తువులైతే నలభై నుండి ఏభై శాతం ఎంత లేదన్నా ఉంటుంది కదండీ? " మొహాన్ని అమాయకంగా పెట్టి అడిగింది.

తింటున్న స్వీటు గొంతుకు అడ్డుపడినట్లు ఉలిక్కిపడ్డాడు. ఖాళీ ప్లేటు ప్రక్కకి పెట్టి చేతులు కడుక్కొంటూ ఏ సంస్థలతో సంబంధం లేకుండా మనమే బిజినెస్ చేసుకుంటే మరింత లాభం గడించవచ్చు" అని క్షణమాగి "సర్లెండి మీకిష్టం లేకపోతే వద్దు" రుమాలుతో పెదాలు వత్తుకుంటూ లేచింది.

శశికాంత్ కళ్ళముందు తానా ఎగ్జిబిషన్‌లో ఇండియన్ ప్రోడక్ట్సుని ఎగబడికొన్న ఫారినర్స్ మెదిలారు. సుమన చెప్పిందాంట్లో కూడా పాయింట్ ఉన్నట్లు అనిపిస్తుంటే "జస్ట్ మినిట్" ఆమెను హడావుడిగా ఆపాడు.

తన బ్యాగ్ భుజానికి తగిలించుకుంటూ చెప్పమన్నట్లు చూసింది. "నాకు ఆలోచించుకోడానికి కొద్దిగా టైమ్ కావాలి"

సుమన చిరునవ్వు చిందిస్తూ తిరిగి కూర్చుంది. "నో ప్రాబ్లమ్. టేక్ యువర్ ఓన్ టైమ్. మీ లంచ్ అయ్యేదాకా ఉన్న టైమ్ సరిపోతుంది కదా! లేకపోతే హోటల్‌వాడు ఫీల్ అవుతాడు" ఛాన్స్ ఇస్తున్నట్లు అంది.

శశికాంత్ బదులు పలకలేదు. సుమన టైమ్‌పాస్‌కి సెల్ ఆన్ చేసి ఒకసారి చెక్ చేసుకుంటుంటే మనస్వి నుండి రింగ్ వచ్చింది. "ఎక్స్‌క్యూజ్ మీ" అని కాస్త పక్కకి వెళ్ళి విండోలోంచి రోడ్డుమీద ట్రాఫిక్‌ని గమనిస్తూ "చెప్పు మనూ" అంది.

"ఎక్కడున్నావ్, సెల్ ఎందుకు ఆఫ్ చేశావు? నీ గురించి ఎప్పటినుండి ట్రయ్ చేస్తున్నామో తెలుసా? " అరిచినట్లు అడిగింది మనస్వి.

కనుబొమలు ముడేసింది సుమన. "ఏసీ

ప్రాబ్లమ్? " అనుమానంగా అడిగింది. "హృది వాళ్ళ మమ్మీ ఆత్మహత్యకు ప్రయత్నించిందట. పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉందట. హృది బాగా అప్‌సెట్ అయ్యిందట. మనిద్దరిని వెంటనే బయలుదేరి రమ్మని ఆనంద్ ఫోన్ చేశాడు. నా సెల్‌కి చేస్తే దాన్ని నువ్వు ఆఫ్ చేసి పెట్టావని మళ్ళీ మనోజ్ సెల్‌కి రింగ్ చేసి చెప్పాడు. నేనూ, మనోజ్ ఎయిర్‌పోర్ట్‌లో ఉన్నాం. ఇంకో నలభై నిమిషాల్లో ఫ్లయిట్ ఉంది. ఎక్కడున్నా నువ్వు తిన్నగా ఎయిర్‌పోర్ట్‌కి వచ్చేయి" వివరంగా చెప్పింది.

సుమన కళ్ళలో కొద్దిగా ఆందోళన తొంగి చూసింది. మనస్వి చెప్పింది వింటూ దూరంగా హేండ్‌వాష్ చేసుకుంటున్న శశికాంత్‌ని గమనించి, "నేను ఒక అరగంటలో మీ దగ్గర ఉంటాను" చెప్పి సెల్ ఆఫ్ చేసి తమ టేబుల్ దగ్గరకి వెళ్ళి,"మీ ఆలోచన తెలిందా? నేను అర్జంటుగా వెళ్ళాలి" అడిగింది.

ఒక్కసారి గాఢంగా నిట్టూర్చి "నాకు మీ ప్రపోజల్ అంగీకారమే" చెప్పాడు.

సుమన కళ్ళు మెరిశాయి. "థ్యాంక్యూ... మీ పేరెంట్స్ ఈ మార్పుకి ఒప్పుకుంటారా? " శశికాంత్ నిర్లక్ష్యంగా భుజాలు ఎగరేశాడు. "ఆడపిల్ల అయ్యుండి మీరే ధైర్యంగా సొంత నిర్ణయం తీసుకునేటపుడు, మగాడిని నాకేంటి? "

"దట్స్ గుడ్. ఐ లైక్ యువర్ స్పిరిట్. బట్, నాదో కండీషన్. అందుకు మీరు అంగీకరిస్తేనే మన పెళ్ళి జరుగుతుంది" సుమన హెచ్చరికగా అంది.

మళ్ళీ ఏమొచ్చిందీ పిల్లకి అనుకుంటూ పైకి మాత్రం "ఏమిటది? " అడిగాడు.

"మనస్వితో పెళ్ళి కేన్సిల్ చేసుకోవడం అనే మీ చర్య మర్యాదపూర్వకంగా జరగాలి కానీ, మనోజ్‌తో ఎఫైర్‌ని రచ్చకీడ్చి మనూ ఫేమిలీని అవమానపరచడానికి వీల్లేదు. ఇందుకు వ్యతిరేకంగా మీ ప్రవర్తన ఉంటే మీకు అటు మనస్వి, ఇటు సుమన ఇద్దరూ దక్కరు" వార్నింగ్ ఇస్తున్నట్లు ఖచ్చితంగా చెప్పింది.

గతుక్కుమన్నట్లు చూశాడు శశికాంత్. నింద మనస్వి మీదకి నెట్టేస్తే చాలా ఈజీగా పెళ్ళి కేన్సిల్ అయిపోతుంది. కానీ సుమన చెప్పినట్లు మర్యాదగా వద్దనడం అంటే అతనికి ప్రాబ్లమ్ ముందు ఇంట్లో నుండే మొదలౌతుంది. ఏమీ అనలేక బలవంతాన నవ్వుమొహం పెట్టి అంగీకారంగా తల ఊపాడు.

"దట్స్ వెరీ గుడ్. మరి నేను వెళతాను. అర్జంటుగా ముంబాయి వెళ్ళాలి. రాగానే మా పేరెంట్స్, మీ పేరెంట్స్ కలిసే ఏర్పాట్లు చేస్తాను" అంటూ వెళ్ళబోతూ ఆగి మెనూ కార్డులో పెట్టిన నోట్లు తీసేసుకొని, "ఇప్పుడు నేను మీ కాబోయే భార్యను. మరి మీ ఉడ్‌బికిచ్చిన ఫస్ట్ లంచ్‌కి తననే బిల్ పే చెయ్యమనడం బాగోదు కదా! మీరే బిల్ సెటిల్‌చేసి రండి. ఉంటాను గుడ్‌బై" తియ్యగా నవ్వుతూ చెప్పి డబ్బులు బ్యాగ్‌లో పెట్టుకుంటూ వెళ్ళిపోయింది.

సుమనని పెళ్ళి చేసుకుంటే ఒబీడియంట్ ఇండియన్ వైఫ్‌ని పొందాలనే తన కోరిక ఎంతవరకు నెరవేరుతుందో అంచనా వేసుకుంటూ కూర్చుండిపోయాడు శశికాంత్.




జానకికి స్పృహ వస్తోంది. కానీ నిలకడగా ఉండడంలేదు. రెండు మూడు నిమిషాల్లోనే మళ్ళీ ట్రాన్స్‌లోకి జారిపోతోంది. చటర్జీ పిలుపుకు రెస్పాండ్ అయినట్లే కనిపిస్తోంది అంత

లోనే మైకంలో మునిగిపోతోంది. దాదాపు అరగంటసేపు ఆమెకు కలిగే మెలకువ నిలకడగా ఉంచడానికి ప్రయత్నించి సాధ్యంకాక ఐ.సి.యు. బైట నుండి తల్లినే ఆత్రంగా గమనిస్తున్న హృదికి సైగ చేసి లోనికి పిలిచారు. ఆత్రంగా వచ్చారు హృదీ, ఆనంద్.

"హృదీ! ఎంత ప్రయత్నించినా జానకిని మెలకువగా ఉంచడం సాధ్యం కావడంలేదు మమ్మీ నీతో మాట్లాడడం కాదు కదా, నువ్వు చెప్పేది వినేలా చెయ్యడమే అసాధ్యమనిపిస్తోంది. అందుకే హృదీ! నువ్విక్కడే అమ్మ పక్కన కూర్చుని తరచు పిలుస్తూ ఉండు. కనీసం ప్రాణం పోయేలోగా నిన్ను కళ్ళారా చూసుకోవాలనే జానకి తుది కోర్కైనా తీరుతుంది" మెల్లగా చెప్పి ఆమె భుజాన్ని సుతారంగా తట్టి "మిస్టర్ ఆనంద్ ఐ.సి.యు.లో ఇతరులు ఉండకూడదు. మీరు నాతో రండి" అంటూ ఆనంద్‌కి సైగ చేసి తీసుకుపోయాడు చటర్జీ.

సన్నగా శబ్దం చేస్తూ పని చేస్తున్న ఆక్సీజన్ మిషన్, జానకి హార్ట్‌బీట్‌ను తెలియజేస్తున్న మినీ కంప్యూటరైజ్డ్ లైఫ్‌లైన్ మిషన్ ఇతర ఎక్విప్‌మెంట్స్ మధ్య మెలకువ, నిద్ర కానట్లు అవస్థ పడుతున్న జానకి కుడిచెయ్యికున్న సెలైన్ నీడిల్స్‌ని చూస్తూ ఆ చెయ్యి బిగించి పట్టుకొని కూర్చుంది హృది. పదినిమిషాలు గడిచాయి. ఆమె మనసు కన్నతల్లి దురవస్థకు కన్నీళ్ళు కారుస్తూ ఉండిపోయింది. హఠాత్తుగా ఒక స్ప్లిట్ సెకండ్‌లో జానకి కొద్దిగా కళ్ళు తెరిచి తనని చూసి నవ్వాలని ప్రయత్నించినట్లు అనిపించింది. హృదిలో ఏదో ఉత్సాహం ప్రవేశించింది. ఆమె నోటి నుండి మాటలు మృదువుగా, మెల్లగా జానకి మనసును సుతారంగా చేరేలా ఒక్కొక్కటిగా వెలికి రావడం మొదలు పెట్టాయి.

"అమ్మా! నేను హృదిని, నీ చిన్నాని వచ్చాను. నీతోటే ఉన్నాను. నువ్వు నాకు రాసిన లెటర్ చదివాను. నిజం చెప్తున్నా నమ్మా. నువ్వంటే నాకు ఎప్పుడూ ద్వేషం లేదు. నేనంటే నీకెంత ఇష్టమో నాకు తెలుసు. నా కోసమైనా నువ్వు మారతావనే గుడ్డి భ్రమలో అలా ప్రవర్తించాను కానీ నిజంగా, ఒట్టు, నీమీద కోపంతోనో, ద్వేషంతోనో కాదమ్మా. నాకు డాడీ అనే ఆ వ్యక్తి, ఆ ఆస్తి ఏమీ అక్కరలేదమ్మా. నువ్వుంటే నాకు అన్నీ ఉన్నట్లే. నాకు నా స్నేహితుల అండ ఉంది. ఆనంద్ ఇచ్చే తోడు ఉంది. నీకు ఆనంద్ గురించి చెప్పలేదు కదూ! అదిగో ఐ.సి.యు. బైట గోడకి ఆనుకొని నుంచొని నన్నే గమనిస్తున్నాడే అతనే ఆనంద్. అతనితో నా పరిచయం పూర్తిగా వారమైనా కాలేదు. కానీ నాకోసం రెండు రోజులుగా నాతోపాటు ఈ హాస్పిటల్లో నిద్రాహారాలు మాని నన్ను కంటికి రెప్పలా చూసుకుంటున్నాడు. నాకోసం ఊపిరి నిలుపుకో అమ్మా! మారిన మనిషిలా కలలు, సంతోషాలు నిండిన జానకిలా నిన్ను నేను మార్చుకుంటాను. నువ్వు కోల్పోయిన మాతృత్వపు మమకారాన్ని, నీకు దూరమైన నా పసితనపు ముద్దుముచ్చట్లను నా పాపగా చేసి నీకందిస్తాను. నువ్వన్నావుగా. బతుకంతా సమస్యలతో, పరిస్థితులతో, వ్యక్తులతో పోరాడి అలసిపోయావు. ఒక్కసారి ప్రాణాన్ని పోగేసుకో అమ్మా. నీకు నచ్చినట్లు నీ జీవితాన్ని నువ్వు అనుభవించడంలోని ఆనందాన్ని నీకు రుచి చూపిస్తాను" తల్లి చేతిని పట్టుకొని పలవరిస్తున్నట్లు చెప్పుకుపోతున్న సహృదయ జానకి చేతి వేళ్ళు తన చేతిని బిగించిపట్టుకున్నట్లయ్యి తుళ్ళిపడి మొహంలోకి చూసింది. తేలిపోతున్న కళ్ళతో బలహీనంగా నవ్వడానికి ప్రయత్నిస్తూ సహృదయ చెప్పే మాటల్ని విని నమ్మడానికి, అర్థం చేసుకోడానికి అవస్థపడుతున్నట్లు కూతురు చేతిని బిగించి పట్టుకొంటోంది జానకి. తల్లి పెదాలపై కదలాడే చిరునవ్వు జాడ సహృదయలో సంబరాన్ని నింపింది. ఆక్సిజన్ మాస్క్ సరిచేసి "అమ్మా... అమ్మా..." అంటూ ఆత్రంగా పిలిచింది. "డాక్టర్‌ని పిలుస్తానమ్మా" చెయ్యి విడిపించుకోబోయింది. జానకి పట్టువిడవలేదు. బయట నుంచుని సహృదయనే గమ

నిస్తున్న ఆనంద్‌కి హృది మొహంలో కదలాడే కంగారు, భయం ఏదో అనుమానాన్ని కలిగించడంతో ఐ.సి.యు. దగ్గరగా వచ్చి చూసి, "డాక్టర్, డాక్టర్..." అరుస్తూ చటర్జీ రూమ్‌కి పరిగెత్తి రెండు నిమిషాల్లో ఆయన్ని వెంటబెట్టుకుని వచ్చాడు.

జానకిని అన్ని రకాలుగా పరీక్షించిన చటర్జీ మొహంలో విస్మయం కదలాడింది. "హృదీ ఏం చేశావు? ఏం చెప్పావు జానకికి? " ఆశ్చర్యంగా అడిగారు.

"నథింగ్ అంకుల్. నాకు మమ్మీ అంటే కోపం లేదని, నేను హాపీగా ఉన్నానని చెప్పాను. మమ్మీని జాగ్రత్తగా చూసుకుంటానని చెప్పాను. అంతే..." తల్లి పొజిషన్ ఏంటో అర్థంకాక అయోమయంగా చెప్పింది. ఆయన హృది భుజం మీద చెయ్యేసి బయటికి తీసుకొచ్చారు. "హృదీ! ఒక రకంగా చెప్పాలంటే జానకి విషయంలో మిరాకిల్ జరుగుతోంది. మా మందులు, ఎక్విప్‌మెంట్లు నిలపలేని కాన్‌సెస్‌ని నీ మాటలు నిలిపాయి. హృదీ... నువ్విలాగే మమ్మీకి మానసిక స్వాంతన అందిస్తుంటే ఆమె ప్రాణాలతో నీకు దక్కుతుందనే చిన్న ఆశ నాలో కలుగుతోంది" సంతోషంగా అన్నారు. హృది కళ్ళు సంబరంగా మెరిశాయి. "అమ్మ...అమ్మ...ప్రాణాలు నిలబడతాయా అంకుల్" పసిపిల్లలా అడిగింది.

"ఐ హోప్ సో, గాడ్ ఈజ్ గ్రేట్, నీకు అన్యాయం చెయ్యడనే ఆశిద్దాం" ఓదార్పుగా భుజం తట్టారు.

అప్పుడే హృదిని వెతుక్కొంటూ మనస్వి, సుమన,మనోజ్‌లు కూడా అక్కడికి వచ్చారు. వాళ్లను చూసి ఎదురువెళ్లి నీళ్లు నిండిన కళ్ళతో ఒక్కసారిగా వాళ్లను వాటేసుకుని "అమ్మ బతుకుతుందట" అంది.

"తప్పకుండా బతుకుతుంది హృదీ! మనమంతా ఉన్నాంగా. అమ్మని బతికించుకుందాం" మనూ,సుమా భరోసాగా అన్నారు. వాళ్ళ మాటలు, ఉనికి తనని రక్షణకవచంలా కాసుకుంటున్న ఫీలింగ్ కలిగి దాదాపు నలభై ఎనిమిది గంటల తరువాత సహృదయ పెదాలపై ఆనందం నిండిన చిరునవ్వు పరుచుకుంది.

అన్నేళ్లుగా జానకిని, హృదిని వేధించిన ఒంటరితనం ఒక్కసారిగా తనని చుట్టుముట్టిన ఫీలింగ్ కలుగుతుంటే కన్నతండ్రి అయినా హృదికి ఫ్రెండ్స్ ఇచ్చిన ఓ దార్ని తానెందుకు ఇవ్వలేకపోయాడో ఆలోచించుకుంటూ భారమైన మనసుతో వెనుదిరిగాడు- దూరం నుండి వాళ్ళనే గమనిస్తున్న శ్రీరామ్.

* * *

మూడురోజుల అనంతరం...

జానకి ప్రమాద పరిస్థితిని దాటి ప్రశాంత పడింది. చటర్జీ మరో నాలుగు రోజులు ఆమెను జనరల్ చెకప్ కోసం హాస్పటల్లో ఉంచాడు. హృది స్నేహితులను ఇంటికి తీసుకొచ్చి రిలాక్స్ అవుతుంటే చెప్పాడు ఆనంద్. "హృదీ... ఈ వేళ వెళ్ళిపోతాను. నేను మూడు రోజుల శెలవు మీద వచ్చాను అంతే. అమ్మా, నాన్న కంగారు పడుతుంటారు. అక్కడ వాళ్ళకి కబురు చేసేవాళ్లు కూడా లేరు. మీ అమ్మ కోలుకున్నాక మిగతా విషయాలు చూసుకొందాం" కాఫీ కప్పు టేబుల్ పైన పెడుతూ అన్నాడు. "ఆనంద్, హైదరాబాద్‌దాకా ఇద్దరం ఫ్లైట్‌లో వెళ్లిపోదాం. ఈవినింగ్ మీరు అక్కడి నుండి రాయవరం వెళ్లిపోవచ్చు" మనోజ్ కూడా జత కలిశాడు.

హృది... మౌనంగా ఇద్దరికి చేతులెత్తి నమస్కరించింది కృతజ్ఞతగా. తరువాత అందరూ పిచ్చాపాటి కబుర్లలో పడ్డారు.

"హృదీ, అపాత్రదానం కూడా నేరమేనని పెద్దవాళ్లంటారు. మీ తాతగారు నీ పేర పెట్టిన ఆస్తిని రిటర్న్ చేస్తే చేసేయ్. అంతే కానీ ఆంటీ ఇన్నాళ్లు సర్వస్వం ధారపోసి పెంచిన ఆస్తిని కూడా ఆయన పేరనే పెట్టేయడం మంచి ఆలోచన కాదు" మాటల మధ్యలో మనస్వి అంది.

"మనూతో నేనూ ఏకీభవిస్తున్నాను. నువ్వు

ఆనంద్‌ని పెళ్లి చేసుకొని వెళ్లిపోతావు. కానీ, అంటీ పరిస్థితి ఏమిటి? ఆలోచించావా?" సుమన కూడా మనస్విని సపోర్టు చేసింది.

హృది మీరేం చెబుతారు అన్నట్లు ఆనంద్, మనోజ్‌లకేసి చూసింది. మనోజ్ పేపర్ చూస్తున్నాడు. ఆనంద్ హృదికేసి చూశాడు కానీ ఏం మాట్లాడలేదు.

"ఆరోజు మమ్మీ నాకు దక్కనపుడు ఆస్తి మాత్రం ఎందుకనే డిప్రెషన్‌లో అంతా శ్రీరామ్‌కి రాసిచ్చేస్తానన్నాను. ఇప్పుడు నాకు మమ్మీ దక్కింది. ఆవిడ సంపాదనే కాదు, తాతగారిచ్చింది కూడా శ్రీరామ్‌కి వదులుకో కూడదని నేను నిర్ణయించుకొన్నాను"

"రియల్లీ ఎందుకని?" ఆశ్చర్యగా అడిగింది సుమన.

"సుమా! శ్రీరామ్ ఇప్పటికే డాక్టర్‌గా చాలా సంపాదించాడు. నా ఆస్తి లేకపోయినా బత కగలడు. కానీ మమ్మీ లెటర్ చదివాక డబ్బు ఉండగానే సరికాదు. దానిని సరిగా వినియో గించాలనే ఆలోచన నాకు కలిగింది. అందుకే నా ఆస్తితో నేనో ట్రస్ట్ పెడతాను. దానికి చటర్జీ అంకుల్ని కన్వీనర్‌గా, శరత్‌ని లీగల్ ఎడ్వయిజర్‌గా నియమించి అమ్మ అండర్ కంట్రోల్‌లో ఉంచుతాను. మనమైదుగురం ఏక్టివ్ మెంబర్స్ కింద ఉంటాం. మమ్మీలా వ్యసనాలతో స్ట్రగుల్ అయ్యే వాళ్లని మార్చడం, చిన్న చిన్న వృత్తుల్లో బతికే వీధి పిల్లల్ని ఆదుకోవడం వగైరా, వగైరా మన సంస్థ ప్రొటోకాల్" తన ఆలోచన వివరించింది.

అందరూ అభినందనగా చప్పట్లు చరి చారు. "హృదీ, యూ ఆర్ గ్రేట్" మనస్వి సంతోషంగా ముద్దు పెట్టుకుంది.

"అది సరేకానీ నాకు, మనూకి లైఫ్ పార్ట నర్స్ దొరికారు. మరి నీ సంగతేంటి." హృది సుమనకేసి చూస్తూ అడిగింది.

"నిజమే హృదీ. ఇది ఖాళీగా ఉంటే ముందు మనూ బ్రెయిన్ తినేస్తుంది. దీనికి ఎవడో ఒకడిని కట్టబెట్టేస్తే అన్నగా నా బాధ్యత తీరిపోతుంది." మనోజ్ అన్నాడు.

అన్నగారిని మింగేసేలా చూసి, "మీరెవరూ నా గురించి టెన్షన్ పడనక్కరలేదు. నేను చేసుకొనేవాడిని నేనే చూసుకొన్నాను" వ్యంగ్యంగా చెప్పింది.

"వ్వాట్?" మనూ, హృదీ, మనోజ్ ఒక్క సారే అన్నారు.

"మాక్కూడా తెలియకుండా ఎవర్ని చూసు కొన్నావు?" మను ఆశ్చర్యంగా అడిగింది. ఒక సారి ఆమె మొహంలోకి చూసి తలొంచుకొని గోళ్ళు చూసుకొంటూ చెప్పింది.

"శశికాంత్"

గభాలున లేచి సుమ పక్కకి వచ్చి అడి గింది మనస్వి. "ఆర్ యూ సీరియస్?"

"హండ్రెడ్ పర్సంట్" నవ్వింది సుమన.

"శశికాంత్ ఎవరూ?" హృది ప్రశ్నకు జరి గింది వివరించింది మనస్వి.

"సుమా! అతను నిన్నేమైనా ఫోర్స్ చేశాడా?" మనోజ్ అనుమానంగా అడిగాడు.

తల అడ్డంగా ఊపింది. "లేదు. ఒక రకంగా చెప్పాలంటే నేనే అతన్ని ఫోర్స్ చేశాను"

"ఎందుకు? మా కోసమా?" మను వేద నగా అడిగింది.

"నా కోసం కూడా!" స్నేహంగా అంది సుమన.

"సుమా! శశికాంత్ ఎంత సెల్ఫిష్, ఎంత మనీ మైండెడ్ అనేది తెలిసి కూడా నువ్వు అతన్ని ఎలా ఓ. కే. చేశావు?" నమ్మలేనట్లు అడిగింది.

"మనూ, నీకు ఆరోజు చెప్పాను. ఆ మాత్రం మనీ మైండెడ్‌నెస్, స్వార్థం తప్పేం కాదు. ఏ మనిషిలోనూ లేని విపరీత లక్ష ణాలేం కావు అవి. అందుకే నాకవేం పెద్ద లోపాలనిపించడం లేదు. ఇకపోతే అమ్మా నాన్నలని వదిలుండలేని పసితనం నాకు లేదు. నీలా నేను లేకపోతే వాళ్ళు ఒంటరి వాళ్ళు అయిపోతారనే భయమూ లేదు. నువ్వు మనోజ్ వాళ్లతోనే ఉంటారు కనుక. శశికాంత్ కోరే డౌరీ నేను ఇస్తున్నాను. నేను ఇష్టపడే నా క్రాఫ్టని బిజినెస్‌గా మార్చుకొనే అవకాశం అతను నాకిస్తున్నాడు. నాకు నచ్చిన జీవితం నాకు దొరికినపుడు అది అమె

## వారు వీరవుతారట!

ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారని ఓ సామెత ఉంది. ఈ సామెత నిజమని మానసిక శాస్త్రవేత్త రాబర్ట్ జాజోన్క్ తన పరిశోధనలతో నిరూపిస్తున్నాడు. పెళ్లయి, ఓ ఇరవై అయిదేళ్ళు కలసి గడిపిన భార్యాభర్తలు ఒకేలా మారి పోతారని బల్లగుద్ది మరీ నిరూపిస్తున్నాడీయన. పెళ్లయిన వెంటనే తీసిన భార్యభర్తల ఫొటోలు, వారిద్దరివీ ఇరవై అయిదేళ్ల సహజీవనం తరువాత తీసిన ఫొటోలతో పోల్చి పోలికలు చూపిస్తున్నారు. ఇద్దరూ ఒకేలా మారటం అంటే కవలల్లా కనబడటం కాదు. వారి ముఖకవళికలు, ముఖంపై ముడతలు, మానసిక స్పందనలు, సంవేదనలు అన్నీ ఒకేరకంగా ఉంటా యన్నమాట. అంటే ఒకరితో ఒకరు కలసి జీవితానుభవా లను పంచుకోవటం వల్ల భార్యా భర్తలు తమకు తెలియకుండానే ఒకరినొకరు అనుకరిస్తారన్నమాట. ఒకరితో ఒకరు స్పందిస్తారన్నమాట. ఒకరి బాధ మరొకరి బాధ అవుతుందన్నమాట.



అయితే ఇన్‌స్టంట్ ప్రేమలు, ఇన్‌స్టంట్ ఆనందాలు కావాలనుకునే ఈ తరంవారు ఇరవై అయిదేళ్ల వరకూ కలసి ఉండగలుగుతారా? అనడిగితే, ఆ మానసిక శాస్త్రవేత్త బుర్ర గోక్కుని, చిరునవ్వు నవ్వేస్తాడు. ఎందుకంటే ఆయనకు రెండు విడాకులయ్యాయి.

రికా అయితేనేం ఇండియా అయితేనేం" భుజాలు ఎగరేసి తేలిగ్గా అంది.

"కానీ నీ ప్రపోజల్‌కి శశికాంత్ ఒప్పుకోవాలిగా" హృది అనుమానంగా అడిగింది. సమాధానం మనోజ్ నుండి వచ్చింది. "ఇంత ధీమాగా చెబుతోందంటే, ఆల్ రెడీ అతన్ని ఒప్పించడం కూడా జరిగిపోయి ఉంటుంది. డాడీ మమ్మీ కూడా ఓ.కే. చేశారా సుమా? " చెల్లెలి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అడిగాడు.

ఒకసారి కళ్లెత్తి చూసి, చేశారన్నట్లు తలూపింది. "ముంబాయి వచ్చే ముందు శశికాంత్‌తో మాట్లాడి అతను ఓ.కే. చేశాక డాడీకి విషయం చెప్పాను. శశికాంత్ పేరంట్స్‌తో మాట్లాడతానని చెప్పారు"

"ఓ! పెళ్ళికి కూడా ఏర్పాట్లు జరిగిపోతున్నాయన్నమాట" వ్యంగ్యంగా అన్నాడు. అక్కడి వాతావరణంలో ఇదీ అని చెప్పలేని గాంభీర్యం అలుముకుంది.

సుమ నిర్ణయం వాళ్లెవరికీ నచ్చలేదు. అలాగని ఎవరూ వ్యతిరేకించనూ లేదు. ఏ నిర్ణయమైనా ఒకసారి తీసుకుంటే మార్చుకోని సుమ నైజాన్ని ఎరిగిన వాళ్ళు కావడం కావచ్చు. ఆత్మీయులైనా తమలో ఒక్కళ్లకీ చెప్పకుండా సొంత నిర్ణయం తీసుకుందనే కినుకతో కావచ్చు ఎవరికి వాళ్ళు మౌనంగా ఉండిపోయారు.

"మైగాడ్! చాలా సెల్ఫ్ కాన్ఫిడెన్స్ ఉన్న అమ్మాయి" ఆనంద్ విభ్రమంగా అనుకున్నాడు తనలో తాను.

మనోజ్ ఆ పరిస్థితి సహించలేక పెదాలు బిగించి విసురుగా లేచాడు. "ఆనంద్, మనం బయలు దేరుదామా! ఇంకో గంటలో ఫ్లైయిట్ ఉంది" అడిగాడు. ఇద్దరూ మనూ, హృదిలకు చెప్పి తమ రూమ్‌లోకి వెళ్ళిపోయారు. మనోజ్ వేదన గమనించి "సుమా! మనోజ్‌కి ఈ పెళ్ళి ఇష్టం లేదు. మరోసారి ఆలోచించు" రిక్వెస్ట్ చేసింది మనస్వి.

సుమ పెదాలపై నీరసహాసం కదిలింది.

"మనూ! ఇప్పుడెవరం ఏమీ చెయ్యలేం.

మనోజ్‌ని నువ్వే కన్విన్స్ చెయ్యాలి" తిరిగి మనస్వినే కోరింది సుమన.

ఏం బదులివ్వాలో తెలియనట్లు ఉండిపోయిన నేస్తాలు కేర్‌టేకర్ సీమ చేతిలో కార్డ్‌లెస్‌తో "మేడమ్ మీకు ఫోన్" అని రావడంతో తేరుకున్నారు. దానిని అందుకొని మాట్లాడుతున్న హృది కనుబొమలు ముడిపడ్డాయి. రెండు నిమిషాలు అవతల చెప్పేది విని, సరే, ఓ గంటలో వస్తాను అని చెప్పి ఆఫ్ చేసింది.

"ఎవరూ?" మనస్వి అడిగింది.

"డాక్టర్ శ్రీరామ్. ఏదో మాట్లాడాలట. అదీ అమ్మ ఎదురుగానే చెప్తాడట. హాస్పటల్‌కి రమ్మన్నాడు. మనోజ్‌ని, ఆనంద్‌ని ఎయిర్‌పోర్టులో దింపి వెళదాం"

"ఆంటీకి ఇంకా క్యూర్ అవ్వలేదు. ఆవిడ ఎదురుగా ఏం మాట్లాడతాడు" విసుక్కొంది మను.

"ఏముందీ? ఆస్తి గురించే అయ్యుంటుంది" సుమన అంది.

"చూద్దాం. వెళతాంగా!" భుజాలు ఎగరేసింది హృది. శ్రీరామ్ ఫోన్ తాత్కాలికంగా సుమన రేపిన టెన్షన్‌ని మరుపుకి తెచ్చింది.




జానకిని ఇంటెన్సివ్‌కేర్ నుండి స్పెషల్ వార్డ్‌కి మార్చేసి అబ్జర్వేషన్‌లో ఉంచారు. చటర్జీ పర్సనల్ కేర్‌లో ఉండడం వల్ల ఆమెకి సౌకర్యాలు ఏ లోటు లేకుండా జరుగుతున్నాయి. వారిస్తున్నా వినకుండా మనూ, సుమలను వెంట పెట్టుకొని తల్లి దగ్గరకి వచ్చి ఆప్యాయంగా పలకరించి నర్స్‌కి చెప్పి ఛైర్స్ వేయించింది హృది. కానీ, శ్రీరామ్ వస్తున్న సంగతి జానకికి చెప్పలేదు. కొంచెంసేపటి తర్వాత శ్రీరామ్ వచ్చాడు. కేస్ షీట్ చూసి "ఎలా ఉంది జానకీ"మామూలుగా అడిగాడు.

అతనెందుకు వచ్చి పరామర్శిస్తున్నాడో అర్థం కాక అయోమయంగా బాగానే ఉందన్నట్లు తలూపింది. ఆమెలో ఏ మూలో అతను హృదిని తీసుకుపోతాడేమోననే భయం లీలగా కదిలి జ్యూస్ త్రాగించడానికి వచ్చిన హృది చేతిని బిగించి పట్టుకుంది.

తల్లి భయాన్ని గమనించి పసిపిల్లని నిమిరినట్లు తల నిమిరి చెప్పింది. "డోంట్ వర్రీ మమ్మీ. నేనెప్పటికీ నీ కూతుర్నే. ఆ హక్కు వేరెవ్వరికీ నేను ఇవ్వలేదు" చెప్పింది.

సుమన శ్రీరామ్‌కి ఛైర్ చూపించి కూర్చోమంది.

"ఆనంద్ వెళ్ళిపోయాడామ్మా" సంభాషణ ఎలా మొదలుపెట్టాలో తెలియనట్లు అడిగాడు.

"మీరు చెప్పదలచుకొన్న విషయానికి రండి" అని ఎదురుగా కూర్చుంది హృది.

సుమా, మనూలకి అక్కడుండడం ఇబ్బందిగా ఉంది. కానీ హృది వెళ్ళడానికి ఒప్పుకోవడం లేదు. చేసేది లేక మనూ మేగజైన్ తిరగేస్తూ, సుమ తైల సంస్కారం లేక అట్టలు కట్టిన జానకి తల సున్నితంగా విప్పదీసి నూనె రాసి దువ్వుతూ కూర్చున్నారు. వాళ్ళిద్దరికేసి ఒకసారి చూసి గొంతు సర్దుకున్నాడు శ్రీరామ్.

"జానకి తన జీవితంలో పడిన కష్టాల గురించి ముఖ్యంగా నన్ను పెళ్ళాడడం వల్ల ఎదురైన సమస్యల గురించి నీకు వివరంగా లెటర్ రాసిందని విన్నాను. నా వెర్షన్ కూడా చెప్పాలని వచ్చాను. వింటావా?" హృది కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

"ఊఁ చెప్పండి. మాకేం పనీపాటా లేదు. కాసేపు టైమ్‌పాస్" నిర్లక్ష్యంగా అంది. శ్రీరామ్ నొచ్చుకోలేదు. చిన్నగా నిట్టూర్చాడు.

"పెద్దవాళ్ళు మా పుట్టుకతోనే జానకి, శ్రీరామ్‌లకు పెళ్ళి చెయ్యాలి అని నిర్ణయాలు తీసేసుకున్నారు. కానీ పసితనం నుండి మేము పెరిగిన వాతావరణంలోని అంతరాన్ని

గుర్తించలేదు. దాన్ని తొలగించడానికి ప్రయత్నించలేదు" అర్థం కానట్లు చూశారు ఆడవాళ్ళు అతనికేసి.

"మా డాడీ ఆర్కిటెక్చర్. పైగా టౌన్‌ప్లానింగ్ కమిషన్‌లో మెంబర్. నాకు ఊహ తెలిసిన దగ్గరనుండి పట్టణాల్లోనే పెరిగాను. కోరినంత డబ్బు, స్వేచ్ఛ కోఎడ్యుకేషన్ కాన్వెంట్స్ చదువు. నా ప్రపంచమే వేరుగా ఉండేది. మెడిసిన్‌లో చేరడంతో నా స్వేచ్ఛ పరిధి పెరిగింది. డాక్టర్‌గా నాదైన గుర్తింపు పొందాలనే తపన పెరిగింది. కానీ నా ప్రమేయం లేకుండానే పెళ్ళికి ముహూర్తాలు పెట్టి చేసుకుతీరాలని శాసించారు. అప్పుడే లండన్‌లో సీటు వచ్చే అవకాశాలు కనిపించాయి. నాన్నని ఎదిరిస్తే డబ్బు బిగించేస్తాడు. నా ఆశయం నాశనమైపోతుంది. తప్పించుకోలేని స్థితిలో తాళి కట్టాను" చెప్పడం ఆపాడు. రెండు క్షణాలు ఆగి "జానకిపై వాళ్ళ నాన్న కంట్రోల్ ఎక్కువ. పెళ్ళయ్యాక అత్తింట నేను పదహారు రోజుల పండగదాకా ఉన్నాను. నిజానికి ఏ భార్యాభర్తలకైనా ఒకరిపై ఒకరికి ప్రాథమిక అవగాహనకి ఆ టైము చాలు. కానీ మాకు ఆ ఛాన్స్ కూడా లేదు. పగలంతా పెద్దలు మమ్మల్ని ఒంటరిగా వదలకుండా అంటిపెట్టుకుని ఉండేవారు. రాత్రిళ్ళు జానకి నిద్రకి ఆగలేని పసితనం వీడని స్థితిలో ఉండేది. ఇంక నా అభిరుచులు, సమస్యలు, బలహీనతలు ఏవో పెద్దలు చెప్పినవి తప్ప మాకు మేము పంచుకొనే అనుభూతులేం మిగలలేదు" అని "ఏం జానకీ- నువ్వు చెప్పు మనం భార్యాభర్తలుగా ఒక్కసారైనా మాట్లాడుకొన్న సంఘటనలు నీకేమైనా గుర్తున్నాయా? " శ్రద్ధగా వింటున్న జానకిని అడిగాడు తలవంచుకుని. ఏమీ లేవనట్లు తల అడ్డంగా ఊపింది.

"చూశారుగా. మా దాంపత్యం తొలినాటి స్థితి. ఈ గోలలోనే నాకు లండన్‌లో ఎఫ్.ఆర్.సి.కి సీటు కన్‌ఫర్మ్ అయ్యింది. పెద్దాళ్ళు రెండేళ్ళ భాగ్యానికి జానకిని తీసికెళ్లడం ఎందుకు అన్నారు. నేను లండన్ వెళ్ళిపోయాను. అదో డిఫరెంట్ వాతావరణం. ఊపిరి పీల్చేందుకు కూడా వ్యవధి దొరకని వేగం. జానకికి నేను రాయకపోయినా తను రాసేది. కానీ వాటిల్లో కొత్త దంపతుల తాలూకు విరహాలు, మధుర ఊహాలు ఉండేవి కావు. అరవైఏళ్ళ ముసలమ్మలా నీతులు రాసేది. ఎవరో వెనక ఉండి రాయమంటే రాసినట్లు. నాకు చదివే ఇంట్రస్ట్ కూడా చచ్చిపోయేది. అసలు చదవకుండానే డస్ట్‌బిన్‌లో పారేసేవాడిని. వెనక ఉండి హెచ్చరించేవాళ్ళు లేని ఒంటరితనం నా వయసుని రెచ్చగొట్టేది. అప్పుడే పూనమ్ పరిచయం అయ్యింది. ముంబాయి ఫేషన్స్‌లో పుట్టి పెరిగిన ఆమె వయ్యారం, మాటతీరు, నాతో సమానమైన డాక్టర్ హోదా నన్ను ఆకర్షించాయి. అమ్మా, నాన్న, జానకి అంతా మరుపుకొచ్చారు. ఇండియా వచ్చి పూనమ్‌ని పెళ్ళి చేసుకొని నా జీవితాన్ని నాకు నచ్చినట్లు మొదలుపెట్టాను"

"నాన్నగారు జానకిని, నిన్నూ తీసుకొచ్చారు. పూనమ్‌కి నేను పెళ్ళికాలేదని అబద్ధం చెప్పి పెళ్ళాడాను. ఇప్పుడు జానకిని చూస్తే ఆమె నన్ను వదిలివేస్తుందని భయపడ్డాను. అప్పటికే నేను పూనమ్ ఫాదర్ అండగా డాక్టర్‌గా ఎదుగుతున్నాను. ఆ స్వార్థం నా కళ్ళని మూసేసి నిర్దాక్షిణ్యంగా జానకిని, నిన్నూ గెంటించేసింది. మిమ్మల్ని గెంటేసినా నాకు ప్రశాంతత దక్కలేదు. నా పోలికలు నిండిన నీ రూపం, జానకి కళ్ళలో బేలతనం నన్ను వెంటాడేవి. నేనే మీకోసం వచ్చేవాడినేమో. కానీ అప్పటికే జానకిని మోహన్ తన గ్రిప్‌లో ఇరుకించుకున్నాడు. ఎవర్నికైతే నిజం తెలియకూడదని తపించానో ఆ పూనమ్ ముందు నన్ను నీచుడిగా చిత్రించాడు. ఇండియన్ బ్లడ్ కావడంవల్ల విడాకులు ఇవ్వలేదు కానీ ఇప్పటికీ నాకూ, పూనమ్‌కి మధ్య ఆ అంతరం అలా వెంటాడుతూనే ఉంది. జానకే కావాలని నన్ను సాధించడానికి చేయిస్తున్నట్లు నాలో నమ్మకాన్ని రేపాడు. దానికితోడు జానకి నేను హృదిని కిడ్నాప్ చేశానంటూ కేసు పెట్టింది.

ఇంట్లో పూనమ్ టార్చర్‌కే విసిగిపోయిన నేను కోర్టులు, కేసులకి నలుగురు నన్ను కించప రుస్తూ గుసగుసలాడుకొనే అవమానాల్ని భరించలేక సెల్ఫ్ కంట్రోల్ కోల్పోయి జానకి కోరిన మొత్తాన్ని పరిహారంగా ఇచ్చి చేతులు దులుపుకున్నాను"

కొన్ని నిమిషాలు మళ్ళీ గతాన్ని గుర్తు చేసుకుంటున్నట్లు ఆగాడు. జానకి కళ్ళు జల పాతాల్లా అయిపోయాయి. సుమన ఆవిడ తలని భుజానికి ఆన్చుకొని కూర్చుంది. హృది నిజంగానే టైమ్‌పాస్ స్టోరీ విన్నట్లు తీరికగా వింటోంది. మనూ చేతిలో పుస్తకాన్ని ఎప్పుడో మూసేసింది. అందర్నీ ఒకసారి గమనించి మళ్ళీ మొదలుపెట్టాడు.

"మా జీవితంలో మరో తొందరపాటు విడాకుల దగ్గర జరిగింది. నీ బాధ్యత పూర్తిగా తనే కోరుకుంది జానకి.



తండ్రిగా నీ మీద హక్కు, బాధ్యత నాకక్క రలేదనుకున్నాను నేను. ఒకరకంగా చెప్పా లంటే ఆ తరువాత నుండి మీ ఇద్దరి గురించి నేను పట్టించుకోవటం మానేశాను. చిత్రం ఏమిటంటే పూనమ్ ఎప్పుడైనా పిల్లలు లేరని బాధపడితే నువ్వు గుర్తొచ్చేదానివి. నాకేం వె లితిగా అనిపించేది కాదు. అలాగని నిన్ను తెచ్చుకొని నా కూతురుగా పరిచయం చెయ్యా లనిపించేది కాదు. నా గురించి నేను కూడా ఆలోచించుకొనే తీరిక లేని బిజీలో కోరి మునిగిపోయాను. మళ్ళీ నిన్ను నా దగ్గరకి చేర్చుకోవలసిన, నాకో కూతురుందని గుర్తుచే సుకోవలసిన అవసరం ఇన్నేళ్ళకి నాన్నగారి విల్లు కల్పించింది" అంటూ ఆగి లేచి వచ్చి హృది పక్కన కూర్చున్నాడు. హృది ఏమీ రియాక్ట్ అవ్వలేదు. నిర్లిప్తంగా చూసింది.

"ఇరవై ఏళ్ల తర్వాత నేను తండ్రిని అన గానే పరిగెత్తుకు వచ్చి కౌగలించుకుంటావనే ఆశలు నాకేమీ లేవు. కానీ పూనమ్ తన చెల్లెలి కూతుర్ని పెంచుకొనే ఆలోచనలో ఉంది. ఆస్తి నీకు పోవడం ఆమెకిష్టం లేదు. ఏంచెయ్యాలో తెలియక శ్రీవాస్తవను కలిసి అతడిచ్చిన సలహాల మేరకు పరిస్థితిని ఎక్స్ ప్లాయిట్ చేయడానికి సిద్ధపడ్డాను. ఆ తరు వాత జరిగింది ఏమిటో నీకు తెలుసు" హృది తల నిమిరి పైకి లేచాడు.

"ఆరోజు నువ్వు నిలదీశాకే నాకర్థమ య్యింది. తండ్రిగా నీపట్ల ఏ ఒక్క బాధ్యతను నిర్వ



హించని నాకు కూతురుగా నువ్వు నన్ను తండ్రినని గౌరవించాలని కోరే హక్కు లేదని. అప్పుడే మీకు దూరంగా ఉండాలని నిర్ణయిం చుకున్నాను. కాకపోతే నా రక్తం పంచుకుపు ట్టిన బిడ్డకు నా సొంత డబ్బుతో ఒక చాక్లెట్ కూడా కొనిపెట్టలేదనే వెలితి నాలో ఎప్పుడూ ఉండిపోతుంది..."

శ్రీరామ్ ఆగి జానకిని, ఆ తర్వాత హృదిని రెప్ప వాల్చకుండా రెండు నిమిషాలు చూశాడు . జానకి వెనక్కి వాలి కళ్ళు మూసుకుని ఉం ది. హృది శ్రీరామ్‌ని అంచనా వేస్తున్నట్లు

చూస్తోంది.

శ్రీరామ్ మళ్లీ హృదిని సమీపించి మరోసారి ఆమె తల నిమిరి "మనం ఎంత బలంగా కోరుకున్నా కాలం వెనక్కి తిరగదు. నీ లోటు నేను తీర్చలేను. అందుకు నన్ను క్షమించమ్మా. ఇక ముందైనా నీకు తోడుగా, అండగా ఉండడానికి ప్రయత్నిస్తాను. కాకపోతే" అని ఆగాడు. ఒక క్షణంతర్వాత "ఎప్పుడైనా, ఏ ఒక్క క్షణంలోనైనా పైకి పిలవకపోయినా... మనసులోనైనా డాడీ అని ఒక్కసారైనా పిలుచుకోమ్మా. ఆ మౌన సంబోధనే ఎప్పుడో ఒక్కప్పుడు నా గిల్టీనెస్‌ని కడిగేస్తుంది" అని హృది నుదుట మృదువుగా చుంబించి వెనుదిరిగి పెద్దపెద్ద అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు. అందరూ అతణ్ణే చూస్తూండిపోయారు.

## 26

"మనిషిలో, ప్రకృతిలో మార్పు అనేది అత్యంత సహజమైన ప్రక్రియ. కానీ వ్యక్తి జీవితంలోని ఊహించని మార్పులకు మాత్రం మూలం ఏదో ఒక సంఘటన లేదా పరిస్థితిగా భావించడం మనిషి సహజ లక్షణం. ఐ థింక్ సో. మీరూ అలాగే అనుకుంటున్నారు కానీ, నిజానికి ఒక సైకాలజిస్ట్‌గా లేదా పర్సనల్‌గా నేను మీకు చేసిన హెల్ప్ ఏమీ లేదు. ఇటీజ్ ఫ్యాక్ట్" చాలా రోజుల తర్వాత తనని కలిసి తమ అనుభవాలు వివరిస్తున్న స్నేహితురాళ్ళని ఉద్దేశించి అంది సైకాలజిస్ట్ సుధ.

మనస్వి తల అడ్డంగా ఊపింది. "నో మేడమ్. మేము అలా అనుకోవడం లేదు. అలా అనుకుంటే మళ్ళీ మీ దగ్గరికి వచ్చి ఈ నెల్లాళ్ళలోనూ మా లైఫ్‌లో వచ్చిన అనూహ్యమైన మార్పుల గురించి మీకు చెప్పాలని అనుకొనేవాళ్లం కాదు. మా జీవితంలో వచ్చిన మార్పుకి, ఈ ఒక్క నెలలో మేము కూడా ఊహించని అద్భుత పరిణామాలకి మూలకారణం మీ కన్సల్‌టెన్సీ ఫలితమేనని మా ప్రగాఢ నమ్మకం"

సహృదయ మనూతో ఏకీభవించింది. "ఎస్ మేడమ్. మిమ్మల్ని కలిసేదాకా లైఫ్ మాకే అర్థంకాని కన్‌ఫ్యూజన్‌తో కాలం ఎటు లాక్కెళితే అటు కొట్టుకుపోయేది. కనీసం మాలో మా సమస్యను ఫ్రెండ్స్‌తోనైనా చర్చించాలనే ఆలోచనైనా ఉండేది కాదు. మిమ్మల్ని కలిశాకే నాతో పెద్దగా పరిచయం లేకపోయినా ఆనంద్‌తో కూడా నా ప్రాబ్లమ్ వివరించగలిగిన ధైర్యం, అమ్మని దక్కించుకోగలననే ధీమా కలిగాయి" అభిమానంగా అంది.

"మీరు అసలు ఏం జరిగిందో చెప్పకుండానే పొగిడేస్తున్నారు" సుధ వారించింది.

ముగ్గురూ అప్పటి వరకు జరిగిన అన్ని విషయాల్ని వివరించారు. అంతా విన్నాక "కంగ్రాచ్యులేషన్స్" అని మనస్వివైపు తిరిగి "నువ్వు మనోజ్‌ని చేసుకోవడంలో నా ప్రమేయం ఏముంది" అనడిగింది.

"మేడమ్ ఇరవై ఏళ్ళు అమ్మ అదుపు ఆజ్ఞల్లో పెరిగిన నేను ఏవో చిన్న చిన్న అబద్ధాలతో మేనేజ్ చేయడం తప్ప పెళ్ళిలాంటి మేజర్ డెసిషన్‌ని నాకు నేనై తీసుకునే దాన్ని కాదా! మిమ్మల్ని కలవకపోతే ఎప్పటికీ ఈ నిర్ణయం తీసుకోలేకపోయేదాన్ని.

అంతెందుకు మేడమ్. అమ్మ నాన్నల లైఫ్ స్టోరీ విన్నాక అయిన వాళ్ళచేత బాధలు పడి నా మీదే ప్రాణాలు పెట్టుకున్న వాళ్ళ మాటను తీసెయ్యలేక నా మనసు చంపుకోడానికి రడీ అయ్యాను. మనోజ్ కలయికతో మళ్ళీ ఆశ రేగింది. శశికాంత్ ధోరణి నా గురించి నేను ఎలాంటి డెషిషన్ తీసుకోవాలో తేల్చుకోమంది. ఫలితం అమ్మా, నాన్నలను డైరెక్టుగా ఫేస్ చేశాను. అదే ఇదంతా మిమ్మల్ని కలవక ముందైతే నా వల్ల అయ్యేది కాదు" సూటిగా చూస్తూ చెప్పింది మనస్వి.

"ఒ.కె... ఒ.కె. ఐ ఎగ్రీ విత్ యూ, అండ్ థేంక్యూ వెరీమచ్. యంగ్ జనరేషన్‌కి ప్రతినిధులుగా మీరు సైకాలజీ విశేషతను గుర్తించడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఇదో మంచి హేబిట్‌గా మీ లైఫ్ లాంగ్ సైకాలజిస్ట్ సలహాలతో లైఫ్‌లోని ఒత్తిళ్ళను అధిగమిస్తారని ఆశిస్తాను" సుధ అంది.

"మా వరకు బాగా నచ్చింది. కానీ, మీరు

చెప్పినట్లు మా పేరెంట్స్‌ను మీ దగ్గరకి కన్స లేటెన్సీకి కానీ, కౌన్సిలింగ్‌కి కానీ తీసుకురావడం సాధ్యం కావడం లేదు" మనస్వి విచారంగా అంది.

"అవును మేడమ్. అమ్మ కూడా చటర్జీ అంకుల్ ఉన్నారుగా! ఇంకా ఇక్కడే యాంటీ డ్రగ్స్ ట్రీట్‌మెంట్ తీసుకుంటాను. కానీ ఎక్కడికి రాను అంటోంది." హృది పెదవి విరిచింది.

సుమన మాత్రం భుజాలు ఎగరేసింది. "సారీ మేడమ్. నేను అసలు ఈ విషయం మా పేరెంట్స్ దగ్గరే ఎత్తలేదు. మను, హృదీ పేరెంట్స్ చెప్పిన స్టోరీలు విన్నాక అమ్మా, నాన్న కూడా వాళ్ళ ప్రవర్తనని సమర్థించుకోడానికి ఏదో కథ చెబుతారు. కానీ, ఈ జనరేషన్‌కు తగ్గట్లు మారడానికి ఒప్పుకోరు అనిపించింది. అందుకే కొంచెం రూడ్‌గా చెప్పాలంటే వాళ్ళ కర్మానికి వాళ్ళని వదిలేశాను" నిర్లిప్తంగా అంది.

"డోంట్ సే లైక్ దట్ సుమనా! నువ్వన్నట్లు ఎవరి వెర్షన్ వాళ్ళు సమర్థించుకుంటూ చెప్పినా అందులో వాస్తవం ఉంటుంది. అదే పరిస్థితి మీకు ఎదురైతే ఆ వాస్తవం హెచ్చరించే పాఠమవుతుంది. కాకపోతే తొంభై శాతం మిడిల్ క్లాస్ మెంటాలిటీ పోరాటం కన్నా రాజీవైపే మొగ్గుతుంది. కనుక మార్పుని ఇష్టపడకపోవచ్చు బట్ వన్ థింగ్. ఒక్కోసారి కౌన్సిలింగ్‌ల కన్నా చిన్న సంఘటనలే వ్యక్తుల్లో పెద్ద మార్పులకు కారణమౌతాయి. కనుక మీ పేరెంట్స్ నన్ను కలవడానికి ఇష్టపడడం లేదని మీరేమీ ఫీలవ్వనక్కరలేదు. నిన్నటి తరం కదా! కాలం మారినంత త్వరగా మారలేరు. హృదీ! నువ్వు మీ మమ్మీ గురించి వర్రీ కానక్కరలేదు. ఆవిడకి ముఖ్య లక్ష్యమైన నీ లైఫ్ సెటిల్ అయ్యింది. కనుక ఆమెలో జీవితంపట్ల ఇష్టం మొదలయ్యింది. మరోసారి ఆవిడ చెడు మార్గాలు పట్టరు. కాకపోతే పాత అలవాట్లు వదిలించుకోడానికి ఇక్కడకన్నా ముంబాయిలోనే ఎక్కువ సౌకర్యాలతో రిహాబిలిటేషన్ సెంటర్స్ ఉన్నాయి. బీ హేపీ" భరోసాగా అంది.

మనస్వి ఆవిడ విశ్లేషణతో సంతృప్తి పడలేదు. "కానీ మేడమ్. మా మమ్మీ ఫ్రస్టేషన్ నా మీద నుండి డాడీ మీదకి మళ్ళుతుందేమో, వాళ్ళ మధ్య గొడవలొస్తాయేమోనని నాకు భయంగా ఉంది" బేలగా అంది.

"ఎందుకని?" కనుబొమలు ముడేసింది సుధ.

"మీరే చూడండి. ఇన్నాళ్ళు అమ్మ లోకం, ప్రాణం, ఆలోచన, కలలు అన్నీ నేనే, నాపైనే. నేను మనోజ్‌తో కాపురానికి వెళ్ళిపోతే ఇప్పటికే మమ్మీ "నేనేదో అందరి తల్లుల కన్నా నిన్ను ప్రత్యేకంగా పెంచానని భ్రమపడ్డాను. కానీ నువ్వు నన్ను వెర్రిబాగులదాన్ని చేసి మీ నాన్న ద్వారా నువ్వు అనుకొన్నది సాధించుకొన్నావు" అంటూ టైమ్ దొరికినప్పుడల్లా దెప్పుతోంది. ఆ కోపం డాడీపైకి మళ్ళితే నిత్యం నరకమే కదా మేడమ్" తన భయాన్ని వివరించింది.

సుధ ఆమెతో ఏకీభవించింది. "నువ్వన్నట్లు జరగడానికి కావలసిన తీరిక - తత్త్వం మీ మమ్మీకి ఉన్నాయి. ఇలాంటి టైమ్‌లో కౌన్సిలింగ్ ఆమెకు బాగా ఉపయోగిస్తుంది. కానీ నన్ను కలవడానికి ఇష్టపడడం లేదా?" అడిగింది.

"అదే మేడమ్ నా ప్రస్తుత సమస్య. నేను మీ గురించి చెప్పి కలవమంటే నన్ను పిచ్చి డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళి నాకు పిచ్చి అని రుజువు చేసి నువ్వు కూడా డాడీని, నన్ను దూరం చెయ్యాలని చూస్తున్నావు. నువ్వసలు నా కూతురువేనా అని తిడుతోంది."

"డోన్ట్‌వర్రీ మీ మమ్మీని ఆవిడకి ఇష్టమైన పనిలో ఎంగేజ్ చెయ్యడం ద్వారా మీ డాడీని సాధించే అవకాశాలను తగ్గించవచ్చు అంటే ఏదైనా లేడీస్ క్లబ్‌లో జాయిన్ చెయ్యడం కానీ, మీ కాలనీ కల్చరల్ క్లబ్ మెంబర్ని చెయ్యడం ద్వారా లేదా టైమ్ పాస్ స్మాల్ స్కేల్ హోమ్ బిజినెస్‌కి ప్రోత్సహించడం లాంటి వాటివల్ల ఒంటరితనాన్ని, ఫ్రస్టేషన్‌ని దూరం చేయొచ్చు" అంది సుధ.

సుమన కాస్త ముందుకు వంగి అంది. మేడమ్ నాకో భయం ఉంది. "పిల్లలు పుట్టి, బాధ్యతలు పెరిగి ఉద్యోగరీత్యానో, ఆర్థిక సమస్యల కారణంగానో భార్యాభర్తల్లో అంత రాలు, దూరం పెరిగే అవకాశం ఉంది కదా. మరి ఆ దూరం పెరగకుండా..." ఆమెమా టలు పూర్తిచేయకముందే సుధ నవ్వుతూ "ముందుచూపా" అంది.

మిత్రురాళ్ళు ముగ్గురూ నవ్వారు.

"అసలే మా తరానికి పేషన్స్ కన్నా ఎమో షన్స్ ఎక్కువ. ఇట్టే కొట్లాడుకుని విడిపోయేం దుకు తయారవుతాం. అందుకని..." అంది సుమన.

ఆమెతో ఏకీభవిస్తున్నట్లు తలూపింది సుధ.

"చిన్న చిన్న ఆనందాలను గుర్తుంచుకుని పంచుకోవడం, చిన్నవైన తప్పులను చిరున వ్వుతో క్షమించడం, చేసే పనిలో కుటుంబం వరకు ఇద్దరి జోక్యం ఉండేలా జాగ్రత్త పడడం, వాదించవలసిన స్థితిలో సైతం కాస్త ఓర్పుగా ఆవేశాన్ని అణచుకోవడం. ఇవన్నీ పెద్ద సమస్యల్ని సైతం సద్దుమణిగేలా చేసి భార్యాభర్తలను ఒకటి చేస్తాయి."

"తప్పుల్ని క్షమించడం అంటే వ్యక్తిగత లోపాలను భరించడమా?" హృది అడిగింది.

"లోపాలు లేని వ్యక్తి లోకం మొత్తం మీద ఉండడు. కాకపోతే నేటి సమాజం తప్పని సరిగా మగాళ్ళకు కల్చర్ పేరుతో కొన్ని వ్యస నాలు రుద్దుతోంది. ఏదీ వాళ్ళకి బలహీన తగా, వదులుకోలేనంతగా మారనంతవరకు జాగ్రత్త పడండి.. బయట సమయం ఎలా గడిపినా రోజులో కొంత మొత్తాన్ని కుటుంబా నికి కేటాయించేలా చూసుకోండి. మగాడితో భార్యకి ఎదురయ్యే మరో ముఖ్య సమస్య అత్తింటితో మెలిగే తీరు. భర్తకి సహజంగానే మగాడిని అనే ఈగో ఎక్కువ. అటువంట ప్పుడు తల్లా? పెళ్ళామా? అనే ప్రశ్న ఎదు రైతే భర్తగా తన ఆధిపత్య ప్రదర్శనకైనా భార్యని వ్యతిరేకిస్తాడు. పాతికేళ్ళు రక్తాన్ని పంచుకు పుట్టి కలిసి పెరిగిన తనవాళ్ళని ఎవరూ వదులుకోరు. కానీ, మీ అయిష్టంతో అతను తనవాళ్ళకి వంద ఖర్చు పెట్టడంకన్నా మీరు ప్రేమను ప్రదర్శిస్తూ అత్తారికి ఖర్చు పెట్టే పది రూపాయలు ఒక మంచి కోడలిగా, అత్తింట్లో మంచి భార్యగా భర్త గుండెల్లో మీ స్థానాన్ని పదిలం చేస్తాయి"

"ఈ రోజుల్లో ఉమ్మడికుటుంబ సమస్య లేదు కానీ, పెళ్ళయిన వెంటనే విడి కాపురం పెట్టడంవల్ల, ఇద్దరు ఉద్యోగస్తులవ్వడం వల్ల తొందరగా దూరం పెరిగిపోతోంది. ఎందు కంటే లేవడం, వండుకోవడం, ఉద్యోగం, రావడం, తినడం, పడుకోవడం రొటీన్ అయి పోతుంది. దీనికి తోడు పిల్లలు పుడితే సహ జంగా భార్య దృష్టి వాళ్ళమీదకి మళ్ళి భర్తలో తన మీద ప్రేమ తగ్గిపోయిందనే అనుమా నాన్ని బలపరుస్తుంది. ఫలితం ఫ్రస్ట్రేషన్. కమ్యూనికేషన్ గ్యాప్ పెరిగిపోయి ఒకే ఇంట్లో ఇద్దరు అపరిచితుల్లా, లేదా శత్రువుల్లా మసిలే పరిస్థితి వస్తుంది"

"ఎస్ మేడమ్. ప్రస్తుతం మా ఇళ్ళలో సమస్య అదే" సుమన బదులిచ్చింది.

"సో, దీనికి పరిష్కారం. ప్రెగ్నెన్సీ టైమ్‌లో మంత్లీ చెకప్‌కి మీ భర్తల్ని కూడా తీసుకెళ్ళడం మొదలు డెలివరీ అయ్యాకా డైపర్స్ మార్చడం, స్నానం చేయించడం, ఏడుస్తుంటే ఎత్తుకు తిప్పడం ఇలా చిన్నగా అలవాటు చెయ్యండి. దీనివల్ల రెండు లాభాలు. మీకు పనివత్తిడి తగ్గుతుంది. పిల్లలకి తండ్రితో కూడా అనుబంధం పెరు గుతుంది" అంటూ నవ్వింది సుధ.

"మేడమ్ ఇది మీ ఎక్స్‌పీరియన్స్ అవునా?" కొంటెగా అడిగింది మనస్వి.

"ఆఫ్‌కోర్స్. నాకు ఒక్కర్తే కూతురు. ఇప్పుడు నేను నైట్ లేటుగా వెళ్ళినా టెన్షన్ లేదు. వాళ్ళ డాడీ ఇంజనీర్. ఆయన ఫైవ్‌కే వచ్చేస్తారు. పాపకి హోమ్‌వర్క్ చేయించడం, అన్నం పెట్టడం, నిద్రపుచ్చడం కూడా ఆయనే చూసుకుంటారు" నవ్వింది సుధ కాస్త గర్వంగా!

అభినందనగా చప్పట్లు చరిచారు ముగ్గురూ.

"మిమ్మల్ని కలవడం వల్ల మాలో మా

మీద మాకు నమ్మకం పెరిగింది. మాలో ఎవరికి ఏ సమస్య వచ్చినా మిమ్మల్ని తప్పకుండా సంప్రదిస్తాం. మీ సలహాలు తప్పకుండా పాటిస్తాం మేడమ్" అన్నారు ముగ్గురూ.

"మీరు ఎప్పుడు కోరినా ఒక సైకాలజిస్టుగా నా సలహాలు, సేవలు మీకు అందిస్తాను. అలాగే మీ శ్రేయాభిలాషిగా మీకే సమస్యలు రాకూడదని, నన్ను కలిసే పరిస్థితి కలగకూడదని కోరుకుంటున్నాను. ఆల్ ది బెస్ట్" అభినందించింది సుధ.

సుధ నుండి వీడ్కోలు తీసుకుని రెక్కలు విప్పుకున్న పక్షుల్లా తమదైన వైవాహిక జీవితాన్ని ఆరంభించడానికి, అనుభవించడానికి బయలుదేరారు ముగ్గురు స్నేహితురాళ్ళు.




ఆ తర్వాత సుమన, శశికాంత్ అమెరికాలో, సహృదయ, ఆనంద్ రాయవరంలో, మనస్వి, మనోజ్ భాగ్యనగరంలో సుఖంగా, ఏ సమస్యలు లేకుండా బతుకుతున్నారు అనడం చాలా అసంబద్ధమైన విషయం. కారణం జీవనం నిరంతర ప్రయాణం. ఆటు పోటు ప్రవాహంతో సాగించే నిరంతర కడలి పయనం. ఒక చిన్న సమస్యలాంటి అల వెనక్కి తగ్గిందనే సంతోషం తీరక ముందే మరో పెను ఉప్పెన విరుచుకు పడి ఊపిరి సలపనీయనంతగా మనిషిని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అందుకే అలకి ఆదిని, సమస్యలకి మూలాన్ని వెతకడం అసాధ్యమనే కాబోలు పెద్దలు జీవన సమరాన్ని సాగర పోరాటంగా అభివర్ణించారు.

దాదాపు ఆరునెలల అనంతరం -

సుధ తన కన్సల్‌టెన్సీకి వచ్చి ఆరోజు వచ్చిన లెటర్స్ చెక్ చేసుకుంటుంటే 'ఫ్రం సహృదయ' అన్న అక్షరాలు ఆమెను ఆకర్షించాయి. చాలా రోజులకి రాసింది. ఏదైనా విశేషమేమో అనుకుంటూ కవర్ ఓపెన్ చేసింది.

"నమస్తే మేడమ్ నేను సహృదయను. ఇలా రాయడం నాకు చాలా బాధగా ఉంది. కానీ నేను ఆనంద్‌కి ఎన్నో రకాలుగా నచ్చ చెప్పి విసిగిపోయాను. నాకు మరోమార్గం తోచడం లేదు. ఇంత ముఖ్యమైన నిర్ణయాన్ని అమలు పరిచేముందు ఇన్నాళ్ళు మాకు గైడెన్స్ ఇస్తున్న మీకు చెప్పడం కనీస బాధ్యతగా భావించి ఈ లెటర్ రాస్తున్నాను. నేను... నేను ఆనంద్‌కి డైవోర్సు ఇవ్వాలని నిర్ణయించుకున్నాను" చదువుతున్న సుధ నిటారుగా అయ్యింది. అరే, ఏమయ్యింది ఈ పిల్లకి ఆశ్చర్యంగా అనుకుంటూ మళ్ళీ చదవడం కంటిన్యూ చేసింది.

మేడమ్ మొదట్లో ఆనంద్ బాగానే ఉన్నాడు. నన్ను ఎంతో ప్రేమగా చూసుకున్నాడు. హఠాత్తుగా ఈ మధ్యే దారుణంగా మారిపోయాడు. అతనికి పట్నం పిచ్చి పట్టింది. మాకు దగ్గరలో ఉన్న టౌనులో ఏదో స్పోర్ట్స్ క్లబ్ తెరిచారు. వాళ్ళు ఎక్కువ జీతంతో ఆనంద్‌కి పి.టి.గా పోస్ట్ ఆఫర్ చేశారు. ఇప్పుడు రాయవరంలో ఉద్యోగానికి రిజైన్ చేసి ఇల్లు, పొలం అమ్మేసి టౌన్‌కి వెళ్ళిపోదాం అంటాడు. పైగా టౌన్ అయితే పిల్లలకి మంచి ఎడ్యుకేషన్ వస్తుంది. అమ్మకి, నాన్నకి హెల్తుకేర్ సెంటర్‌లో మంచి ట్రీట్‌మెంట్ ఇప్పించవచ్చు అంటూ వంకలు చెబుతున్నాడు.

మీరే చెప్పండి మేడమ్. నేను ఆనంద్‌ని చేసుకొంది పట్నం హంగామా నుండి తప్పించుకోడానికేగా! అయిన వాళ్ళని, అభిమానుల్ని వదిలేసి పచ్చనోట్ల కోసం పరుగులు తీసే ఆనంద్ తత్వం నాకు నచ్చలేదు. మీ చిట్కాలు పాటించలేదు అనుకోకండి. అన్నీ ట్రయ్ చేశాను నో యూజ్. చెప్పి చెప్పి నాకే

విసుగొచ్చింది. నా ఇష్టం నాదే అనే మనిషి ధోరణితో విసిగిపోయి విడాకులిచ్చి నాకు నచ్చినట్లు నేను బతకడమే బెటర్ అనిపిస్తోంది. త్వరలో మీ దగ్గరకి వచ్చి కలుస్తాను ఉంటాను - సహృదయ

ఉత్తరాన్ని ముగించి గాఢంగా నిట్టూర్చింది సుధ. 'ఇదేం పిల్ల సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోవలసింది పోయి సాగదీసి విడాకుల దాకా తెచ్చుకుంటోంది' తనలోతాను అసహనంగా అనుకుంటూ పి.సి ఈ-మెయిల్ సిగ్నల్ ఇవ్వడంతో లెటర్స్ ట్రేలో పెట్టి పి.సిని దగ్గరకి లాక్కొని మెయిల్ బాక్స్ ఓపెన్ చేసి సుమన నుంచి వచ్చినట్లు గమనించి స్నేహితురాళ్ళు ఇద్దరూ కూడబలుక్కుని రాసినట్లున్నారు. ఈవిడేం బాంబు వేస్తుందో అనుకుంటూ చదవడం మొదలు పెట్టింది.

"గుడ్ ఈవినింగ్ మేడమ్. నేను సుమనను గుర్తున్నాను కదా! నేను అమెరికా వచ్చాక మిమ్మల్ని కాంటాక్ట్ చెయ్యావల్సిన అవసరం రాలేదు. ఇకపై రాదనే అనుకున్నాను. కానీ ప్చ్ అలా జరగలేదు. నాకు కొంత ఓవర్ కాన్ఫిడెన్స్ ఉండేది. నేను ఎక్కడైనా ఎలాంటి పరిస్థితుల్లోనైనా ఎలాంటి వ్యక్తులతోనైనా ఎడ్జస్ట్ కాగలనని, వాళ్ళని నాకు నచ్చినట్లు మార్చుకోవడమో, నేను వాళ్ళకి నచ్చినట్లు మారడమో చేసి సర్దుకుపోగలను అనుకునేదాన్ని. ఇప్పుడది అసాధ్యమని నాకర్థమయ్యింది. ఇంతకీ మీకు విషయం చెప్పలేదు కదా! అసలు విషయం ఏమిటంటే నేను శశికాంత్ నుండి చట్టబద్ధంగా విడిపోవాలని నిర్ణయించుకున్నాను" ఒక్కక్షణం పి.సిని పాజ్‌లో ఉంచి ఊపిరి బిగపెట్టింది సుధ. పక్కనే ఉన్న గ్లాసులోని నీళ్ళన్నీ ఖాళీ చేసి ఒక్కసారి గాలి గట్టిగా పీల్చి వదలి కాస్త సర్దుకొని పాజ్ రిలీజ్ చేసింది.

మొదట్లో శశికాంత్ బాగానే ఉన్నాడు. అనుకున్నట్లుగానే ఇంట్లోనే ఆర్టికల్స్ చేసి బిజినెస్ ప్రారంభించాం. దాన్ని డెవలప్ చేశాం. నా సంస్థ ఒక స్మాల్ స్కేల్ ఇండస్ట్రీగా ఎదుగుతున్న ఈ టైమ్‌లో శశికాంత్ మనం అమెరికాలో ఉండొద్దు. ఇండియా వెళ్ళిపోదాం అంటున్నాడు. ఇప్పుడిప్పుడే మా సంస్థను కంపెనీగా రిజిష్టర్ చేయించి లోగో పొందాలని, అమెరికా అంతా విస్తరించాలని నేను కలలుకంటుంటే "బిజినెస్ వద్దు, డబ్బు వద్దు. మనము, మన పిల్లలు బాగుంటే చాలు" అని శశికాంత్ ఇండియా వచ్చేయడానికి ప్లాన్ చేస్తున్నాడు.

అతనిలో హఠాత్తుగా ఇంత మార్పు రావడానికి కారణం నేను ప్రెగ్నెంట్ కావడం. అదే టైంలో నా ఖర్మకాలి మాకు తెలిసిన ఒక తెలుగు ఫేమిలీలో జరిగిన విషాదం శశికాంత్‌ని చాలా భయపెట్టింది. సురేందర్‌రెడ్డి అనే ఆయన ఇరవైఏళ్ళ క్రితం కాలిఫోర్నియాలో సెటిల్ అయ్యాడు. పిల్లలు ఇక్కడి వాతావరణంలోనే పెరిగారు. పదిహేడేళ్ళ ఆయన కొడుకు డ్రగ్స్‌కి బానిసై దానిని సప్లయి చేస్తూ పోలీసులకి దొరికిపోయాడు. ఇక్కడ డ్రగ్స్ స్మగ్లింగ్‌కి చాలా కఠిన శిక్షలు పడతాయి. వాళ్ళు కొడుకు దూరమైన బాధలో ఉండగానే కూతురు ఒక నీగ్రో కుర్రాడితో నా ఇష్టం నాదని వెళ్ళిపోయింది. అవమానం భరించలేని సురేందర్‌రెడ్డి దంపతులు సూసైడ్‌కి ప్రయత్నించి ఆఖరిక్షణాల్లో బయటపడి చావలేక బతుకుతున్నారు.

రెడ్డిగారి ఫేమిలీలోని విషాదం శశికాంత్‌పై తీవ్ర ప్రభావాన్ని చూపించింది. రెడ్డిగారి కుటుంబంలో తన ఫ్యూచర్ ఫేమిలీని ఊహించుకొని బెదిరిపోతున్నాడు. మేడమ్ ఎవరి జీవితాల్లోనో ఏదో విషాదం జరిగిందని దాన్ని తమ జీవితాలకి అన్వయంచేసుకొని బంగారం లాంటి ఉద్యోగాన్ని, ఇప్పుడే కుదురుకుంటున్న నా బిజినెస్‌ని మధ్యలో వదిలేసి ఇండియాకు వచ్చేయాలని అనుకోవడం ఫూలిష్‌నెస్ కదా! చెబితే వినడం లేదు. నా నిర్ణయానికి తిరుగులేదు అంటూ మొండిపట్టు పడుతున్నాడు. నెత్తిమీద ఏదో పడుతుందని ఇరవైనాలుగు గంటలు చేతుల్ని నెత్తిన పెట్టుకొని తిరిగే మూర్ఖుడితో జీవితాంతం కాపురం నావల్ల కాదు. అందుకే డై

వోర్స్ ఇచ్చేయాలని నిర్ణయించుకున్నాను. ఇంకా ఈ సంగతి శశికాంత్‌కి కూడా చెప్ప లేదు. ముందు మీకు ఇన్‌ఫాం చెయ్యడం నా బాధ్యత అనిపించి మీకు మెయిల్ చేస్తు న్నాను. మనూకి, హృదికి కూడా ఇంకా చెప్ప లేదు. వాళ్ళ అభిప్రాయాలు కూడా కనుక్కో వాలి. ఒ.కె. మేడమ్ మరి ఉంటాను. నా నిర్ణయాన్ని మీరు సమర్థిస్తారని ఆశిస్తాను - సుమన.'

ఒక్కసారి బలంగా ఊపిరి పీల్చి వదిలింది సుధ. 'ఇదేమిటి ఇలా ఆలోచిస్తోంది ఈ అమ్మాయి. ఇన్నేళ్ళు డబ్బే ధ్యేయంగా బతికిన మనిషి ఈనాడు తనకిత్తానై భార్య బిడ్డల విలువ తెలుసుకొని పద్ధతి మార్చుకోవాలను కుంటుంటే సంతోషించక పిరికి తనం, మూర్ఖత్వంతో విడాకులిస్తానంటూ మూర్ఖంగా ఆలోచిస్తోంది. సరైన గైడెన్స్ లేకపోతే తొంద రపాటుతో నిర్ణయాన్ని తీసుకొని జీవితాంతం బాధపడుతుంది. ఈ అమ్మాయికి తప్పనిస రిగా కౌన్సిలింగ్ అవసరం. వీలైతే మనస్విని నచ్చ చెప్పమని చెప్పాలి. ఆమె మాట తప్పక వింటుంది'తనలోతాను దృఢంగా అనుకుం టుండగా టెలిఫోన్ రింగయ్యింది. పి.సి. ఆఫ్ చేసి రిసీవర్ చెవికి ఆన్చుకొని "హలో సైకాల జిస్ట్ సుధా స్పీకింగ్" ఆన్సర్ చేసింది.

"నమస్తే మేడమ్. నేను మనస్విని"

సుధ కళ్ళు నమ్మలేనట్లు విచ్చుకున్నాయి. "మనస్వి, ఓ మై గాడ్, జస్ట్ నిన్ను ఇప్పుడే తలుచుకున్నాను తెలుసా? హృది లెటర్ రాసింది. సుమ మెయిల్ చేసింది. వెంటనే నువ్వు ఫోన్ చేశావు. హృది అన్నట్లు మీ ముగ్గురి ఆలోచనా ఒకటే అయ్యుంటుంది. అందుకే ముగ్గురూ ఒకేసారి నన్ను కాంటాక్టు చేశారు. నా లైఫ్‌లో మీ అంత ఈక్వల్ ఫ్రీక్వెన్సీ ఉన్న వేవ్‌లెన్త్‌గల వ్యక్తుల్ని చూడడం ఫస్టు టైమ్. ఒ.కె. ఎగ్జయిట్‌మెంట్‌లో అంతా నేనే మాట్లాడేస్తున్నాను. ఇంతకీ ఫోన్ చేసిన విషయం ఏమిటి? " ఛైర్‌లో రిలాక్స్‌గా వెనక్కి వాలి చిరునవ్వుతో అడిగింది.

కొన్ని క్షణాలు మనస్వి మౌనంగా ఉండిపో యింది. ఆపైన కొద్దిగా తడబడుతున్నట్లు ఆగి ఆగి చెప్పింది. "నేను మనోజ్ నుండి విడిపోదాం అనుకుంటున్నాను మేడమ్" వింటున్న సుధ పెదాలపై నవ్వు ఆరిపో యింది. 'ఓ మై గాడ్ మను కూడానా? ' గొణుగుతున్నట్లు అనుకుంది సుధ.

"మేడమ్ ఏమైనా చెప్పారా? " సరిగ్గా విన పడని మనస్వి రెట్టించింది.

"అబ్బే, ఏం లేదు. కొంచెం షాక్ తిన్నాను. అంతే. అయినా ప్రేమించి, మీ మమ్మీ డాడీ లని కూడా ఎదిరించి, కోరి చేసుకొని ఆరునె ల్లకే విడిపోవడం ఏమిటి? ఏదైనా ఫ్యామిలీ సమస్య అయితే నాకు చెప్పొచ్చుగా? " మృదు వుగా అడిగింది.

"లేదు మేడమ్. మనోజ్ మన మాటకాదు; అత్తయ్యా, మామయ్యా మాట కూడా వినిపిం చుకోనంత మొండిగా మారిపోయాడు" దిగు లుగా పలికింది మనస్వి గొంతు.

"అసలేం జరిగింది? "

"ఏం చెప్పను మేడమ్ మనోజ్ తిక్క ప్రవ ర్తన గురించి. మనోజ్ పనిచేస్తున్న గ్లోబల్ యానిమేషన్స్ వాళ్ళు హాలీవుడ్‌లోని వార్నర్ బ్రదర్స్ కోసం ఒక ఫుల్‌లెన్త్ యానిమోషన్ ఫీచర్ ఫిల్మ్‌లో పనిచెయ్యడానికి కాంటాక్టు కుదుర్చుకొని ముగ్గురిని డెప్యుటేషన్ మీద పంపుతున్నారు. నా ఖర్మకాలి ఆ ముగ్గురిలో మనోజ్ కూడా ఉన్నాడు"

"అయితే" అర్థం కాలేదు సుధకి.

"అయ్యో! మేడమ్ మీకర్థం కాలేదా? ఆ ఫిల్మ్ పూర్తి కావడానికి కనీసం రెండున్నర సంవత్సరాలు పడుతుంది. అన్నాళ్ళు మనోజ్ హాలివుడ్‌లోనే ఉండాలి. మనోజ్ దీనిని చాలా గొప్ప గౌరవంగా భావించి తప్పకుండా వెళ్తాను అంటున్నాడు. ఎంత చెప్పినా వినడం లేదు" వాపోయింది మనస్వి.

"హాలీవుడ్‌లో వార్నర్ బ్రదర్స్‌తో పనిచె య్యడం అంటే నిజంగానే చాలా గొప్ప విషయం. నువ్వెందుకు వద్దంటున్నావు? " కాస్త ఆశ్చర్యంగా అడిగింది సుధ.

"ఏం గొప్ప విషయం మేడమ్. లక్షల

డబ్బు, కీర్తి అంతేగా! దానికోసం అంత దూరం పోవాలా? అదేదో తనే ఓన్‌గా ఓ స్టూడియో పెట్టుకొని డెవలప్ చేస్తే రాదూ? అలా అంటే అమెరికాలో నేర్చుకునేందుకు చాలా అవకాశాలున్నాయి. వాటితోపాటు డబ్బూ వస్తుంది. ఇండియా వచ్చాకా నేను ఏ అప్పులు లేకుండానే సొంతంగా స్టూడియో పెట్టుకోవచ్చు అంటాడు"

"అతను చెప్పింది కూడా నిజమే కదా? " సుధ ప్రశ్నించింది.

"నాకు దానిమీద నమ్మకం లేదు మేడమ్. అమెరికా జీవితం, ఆ సంపాదనా ఒక నిషా లాంటిది. ఒకసారి దానికి అలవాటు పడితే ఇండియా రావడానికి ఇష్టపడరనే విషయం శశికాంత్ ప్రవర్తన వల్ల బాగా అర్థమయ్యింది. అసలు నేను శశికాంత్‌ని కాదనుకున్న కారణమే అది. - అతనికి నాకన్నా విలాస జీవితం మీద, డాలర్ల సంపాదన మీద మోజు ఎక్కువని గ్రహించడం. ఇప్పుడు మనోజ్ కూడా అదేదారిలో వెళ్తానంటున్నాడు. అమ్మా, నాన్న, అత్తయ్య, మామయ్య, హృదీ వీళ్ళందరిని వదిలేసి నేను మనోజ్‌తో వెళ్ళలేను. అలాగని మనోజ్‌ని నువ్వూ అమెరికా వెళ్ళొద్దూ అంటే తన బంగారు భవిష్యత్తుని నేను పాడు చేస్తూన్నానంటూ నిత్యం నిందలతో, నిష్టూరాలతో నాకు దూరం అవుతున్నాడు. నాకు మరో మార్గం తోచడం లేదు. అందుకే విడాకులు తీసుకోవాలని నిశ్చయించుకున్నాను"

ఆమె చెబుతున్న అన్నింటికీ "ఊ" కొడుతూ వింటున్న సుధ "వద్దు, వద్దు. తొందరపడకు. ఆవేశంతో తీసుకునే నిర్ణయం చాలా అనర్థాలకి దారితీస్తుంది. నువ్వుండేది ఈ ఊర్లోనే కదా! ఒకసారి మనోజ్‌తో సహా వచ్చి నన్ను కలువు. మనం సమస్యను వివరంగా చర్చించాకా ఏం చెయ్యాలో నిర్ణయిద్దాం" కంగారుగా సూచించింది.

"ఏం చర్చించినా మనోజ్ మనసు మార్చలేం మేడమ్. ఏదో వంకన ఆపినా అతనిలో జీవితాంతం తన ఎదుగుదలకి నేను అడ్డుపడ్డాననే అశాంతి, ఆక్రోశం నేను భరించలేను. ఎంత ఆలోచించినా విడాకులే దీనికి పరిష్కారం అనిపిస్తోంది" అని "మీ మాట ఎందుకు కాదనాలి. ఎలాగైనా మనోజ్‌ని మీ దగ్గరకి లాక్కొస్తాను. మీరూ ఒకసారి ప్రయత్నించండి. అత్తయ్య పిలుస్తోంది. ఉంటాను మేడమ్" సుధ చెప్పింది.

రిసీవర్ పెట్టేస్తుంటే భరించలేనంత నిస్సృహగా అనిపించింది సుధకి. మనస్వి మాటలు, పేపర్ వెయిట్ కింద రెపరెపలాడుతున్న సహృదయ ఉత్తరం, పి.సి. లోని సుమన ఈ-మెయిల్ అన్నీ ఒక సైకాలజిస్టుగా తన వైఫల్యాన్ని ఎత్తిచూపిస్తున్నట్లు అనిపిస్తుంటే కుర్చీలో నీరసంగా వాలిపోయింది.

ఇదేమిటి ఈ ముగ్గురు అమ్మాయిలు ఇలా చేస్తున్నారు. జీవితంలో ఎదురయ్యే సమస్యల్ని, వైవాహిక జీవితాన్ని విజయవంతంగా మలచుకోడానికి అవసరమైన కౌన్సిలింగ్ అంతా తీసుకుని చిన్న చిన్న కారణాలకు అతిగా స్పందిస్తూ తొందరపాటు నిర్ణయాలతో చేజేతులార జీవితాన్ని సమస్యల్లోకి నెడుతున్నారు. సుధకి ముగ్గురి వ్యవహారం అసహనంగా అనిపించింది. కూర్చోలేనట్లు చాలాసేపు, అటు ఇటూ పచార్లు చేస్తూ ఆలోచించింది.

మళ్లీ వచ్చి కూర్చుని చేతులు రెండూ గడ్డం క్రిందమడిచి పెట్టుకొని లోపం ఎవరిదైనా, ఎక్కడున్నా కానీ, మానసికపరమైన ఉద్వేగాలను అదుపు చేసుకోలేకపోవడం, నేటి యువత బలహీనత. మనస్వి, సహృదయ, సుమన నా క్లయింట్స్. వాళ్లు తప్పుడు మార్గాన పోకుండా చూడడం నా బాధ్యత. ముగ్గురిని వారి భర్తలతో సహా వచ్చి నన్ను స్వయంగా కలవమని చెప్పాలి. సమస్యల్ని విశ్లేషణాత్మకంగా చర్చిస్తే కానీ తుది నిర్ణయానికి రావొద్దని హెచ్చరించాలి. అనుకుంటూ ముందుగా సహృదయను కాంటాక్టు చెయ్యడానికి లెటర్‌ప్యాడ్ అందుకొని ఉత్తరం రాయడం మొదలుపెట్టింది. ✦

ప్రేమగానం



# ప్రేమ... అంటే అంగీకరించడం

ఇందిర కాలమ్

మాలతి, శ్రీరామ్ మంచి యువజంట. ఆధునిక భావాలు గల ఆ జంట, సాంప్రదాయికంగా పెళ్ళి చేసుకోకుండానే కలిసి కాపురం చేస్తున్నారు. ఇద్దరినీ చూడగానే ఒకరి కోసం మరొకరు పుట్టారనిపిస్తుంది. అంత ఆపేక్ష వారికి. అయితే శ్రీరామ్‌కు పర స్త్రీ వ్యామోహం ఉందని, పలు స్త్రీలతో అనుబంధం కూడా ఉందని తెలిస్తే ఎవరయినా ఆశ్చర్యపోతారు. అయినా ఏ గొడవలు లేని ఆ అన్యోన్యమైన జంటను చూస్తే నిజంగా ముచ్చటేస్తుంది.

అదే విషయాన్ని మాలతితో ప్రస్తావించినప్పుడు "అలా అతను ఉండకపోతే బాగుంటుందని అనిపిస్తుంది. కానీ వాస్తవం అది కాదు కదా! అదతని తత్వం. దాన్ని వ్యతిరేకించి అతన్ని నొప్పించాలనిపించదు. నొప్పిస్తే నాకేమొస్తుంది. అతన్ని బాధపెడితే, నేనూ బాధపడాల్సి వస్తుంది కదా! అతనికి నేనంటే ఎంతో ప్రేమ. ఎప్పుడో ఒకసారి జరిగే ఇలాంటి విషయాలను పెద్దవి చేసి, జీవితాన్ని దుర్భరం చేసుకోవడం ఎందుకు" అంది.

ఆమె మాటలు విన్నాక నిజమే ననిపించింది. కొంతకాలం తరువాత మళ్లీ మాలతిని కలిసినప్పుడు ఆమే నిజమని రుజువయింది. శ్రీరామ్‌లోని పరస్త్రీ వ్యామోహం పూర్తిగా మాయమయిందట. ఇప్పుడు శ్రీరామ్ నిజంగానే శ్రీరాముడు అని చెప్పింది. మాలతి ఒక బిడ్డను కూడ కన్నది.

❖ ❖ ❖

ప్రేమ పునాదిగా ఉన్న అనుబంధాలలో ఇలాగే జరుగుతుంది. ఇది చర్చించాల్సిన గొప్ప మనోవైజ్ఞానిక వ్యవహారం. ప్రేమ క్షమిస్తుంది. అంగీకరిస్తుంది. సానుభూతితో అర్థం చేసుకుంటుంది. ఎప్పుడయితే నీవు క్షమించబడ్డావో అంగీకరించబడ్డావో, అప్పుడిక నిన్ను నీవు దాచుకోవాల్సిన అవసరం లేదు. స్వచ్ఛమైన, అమాయకమైన, ప్రేమ నిండిన హృదయం రూపుదిద్దుకుంటుంది.

అవును, ఇలాగే జరుగుతుంది. ప్రేమలో తప్పు ఒప్పులు జాబితా పని చేయదు. అది వ్యాపారంలో ఉంటుంది. ప్రేమ గుడ్డిదని వ్యాపారం చేసేవారంటారు. నిజానికి ప్రేమ గుడ్డిది కాదు. ప్రేమ చూపు స్వచ్ఛమైంది. లోతైనది. ప్రేమ మనిషిలో అసలు చూడాల్సిన దాన్ని చూస్తుంది. సమాజం, మర్యాద, వ్యాపారం, అధికారం, డబ్బు, ప్రతిష్ఠ - మనిషిలో చూసేదాన్ని, ప్రేమ చూడదు. అవన్నీ మనిషిని కృత్రిమంగా ఉంచుతాయి. అవి నిరంతరం మారిపోతూ ఉంటాయి. మారే

వాటికి అనుగుణంగా మనిషి మారాలని కోరుకుంటాయి. మనిషిని మరబొమ్మలా తయారు చేస్తాయవన్నీ.

ప్రేమ మనిషిని మనిషిగా అంగీకరిస్తుంది. ఆ అంగీకారమే మనిషికి తృప్తి నిస్తుంది. విశ్రాంతి నిస్తుంది. నీవెలా ఉన్నావో అలా ఉండొచ్చు. నీలోని మంచి చెడు అన్నీ నాకు అంగీకారమే. నిజానికి నీలో చెడే లేదు. నీవలా ఉన్నావంతే. నీవు విలువలు, అవసరాలు అనుకునేవాటితో సహా ఇతరత్రమైన వన్నీ మారిపోయేవి. అందుకే అవన్నీ ఉపరితల అంశాలు. సామాజిక న్యాయం, డబ్బు, అధికారం, ప్రతిష్ఠ అన్నీ ఉపరితలాంశాలు.

ప్రేమ దృష్టి లోతైనది. అది మనిషి హృదయాన్ని ఆత్మను చూస్తుంది. మనిషిలోని ఆర్తిని, ఆనందాన్ని, సహవాసాన్ని చూస్తుంది. ప్రేమ దృష్టి స్పష్టమైంది. అది మానవత్వపు అత్యున్నత విలువలను చూస్తుంది. ప్రేరేపిస్తుంది. ప్రేమ మనిషికి ఏం కావాలో దాన్ని సమకూరుస్తుంది.



చాలా మంది ప్రేమికులను చూస్తుంటాం. తొలి రోజుల్లో ఉన్న తీవ్రత తరువాత ఉండదు. మొదట్లో ఇద్దరిలో ఇద్దరికీ అన్నీ సవ్యంగానే కనిపిస్తాయి. తరువాత కొన్నాళ్ళకు ఒకరిలో మరొకరికి అనేక తప్పులు, దోషాలు కనిపించడం మొదలవుతుంది. అప్పుడు వారే ప్రేమ గుడ్డిదని ప్రచారం చేస్తారు. ప్రేమలో ఉన్నప్పుడు కనిపించిన మంచి అంతా అబద్ధం. అదసలు లేదు. అసలున్నవన్నీ తప్పులు, దోషాలు, లోపాలే అని నమ్మడం మొదలు పెడతారు. వారే తమ పిల్లలకు ప్రేమ వ్యతిరేక పాఠాలను బోధిస్తారు.

ఇక్కడే తప్పులో కాలేస్తారు. మనిషి అంతరంగం పెద్ద మిస్టరీ. ఆ మిస్టరీని అర్థం చేసుకోకపోతే మనం సత్యానికి వ్యతిరేకంగా వెళ్తాం. మనిషిలోని మంచిని చూడగలిగేది ప్రేమ. అందుకే ప్రేమికులు ప్రేమలో మరొకరి మంచిని, వారి సుగుణాలను వారి ఉదాత్తతను చూడగలుగుతారు. ఇతరులు గుర్తించలేని ఆమె ఔన్నత్యాన్ని ప్రియుడు గుర్తిస్తాడు. ఆరాధిస్తాడు. అయితే తరువాత, కొంత కాలానికి ఆ ప్రేమ, ఆరాధన ఏమయింది? అందుకే ప్రేమ అబద్ధం అంటారు. అసలు విషయం ఏమంటే - కొంతకాలం తరువాత నీవు ప్రేమ కేంద్రం నుండి వేరే కేంద్రంలోకి మారిపోయావన్నమాట. అందుకే ప్రేమలో కనిపించని తప్పులు, లోపాలు అన్నీ పెద్దవిగా కనిపిస్తాయి. లోపాలు అబద్ధమా? అంటే అవీ నిజమే. మనిషిలో తప్పు ఒప్పు రెండూ ఉన్నాయి. అవి అందరిలో ఉంటాయి. ప్రేమ కేంద్రంలో తప్ప మరే కేంద్రంలో నీవు ఉన్నా తప్పుల్ని మాత్రమే చూడగలవు. కేవలం ప్రేమ మాత్రమే మంచిని చూడగలదు. అందుకే ప్రేమను అత్యున్నత విలువగా కొనియాడారు. ఎప్పుడయితే ప్రియమైన వారిలో తప్పులు పెద్దవిగా కనబడుతున్నాయో, అవి నిన్ను ఇబ్బంది పెడుతున్నాయో అప్పుడు నీవు ప్రేమలో లేవని గుర్తించు.

ప్రేమలో ఎదగడం అనేది అత్యున్నతమైన జీవించే కళ. అది నేర్చుకోవాల్సిన కళ. ప్రేమించిన వారందరూ, తాము గొప్పగా, నిజంగా ప్రేమించామనుకుంటారు. అంతకు మించిన ప్రేమ అసాధ్యం అనుకుంటారు. అయితే వారు ప్రేమించిన మాట ఎంత సత్యమో, అదే అంతిమ ప్రేమ కాదన్నది కూడ అంతే సత్యం. మనలో ప్రేమ ఉంది. ఆ ప్రేమను పరిపూర్ణం చేసుకునే లక్ష్యం కూడ మన ముందు నిరంతరం సవాలుగా వుంటుంది.

ప్రేమలో ఉన్నవారికి ఎదుటివారి లోపాలు, తప్పులు తెలియవనుకుంటే పొరపాటే. ప్రియురాలికి ప్రియుడు పేదవాడనీ తెలుసు. అతడు అందగాడు కాదనీ తెలుసు. అయితే ప్రేమలో ఇవేవీ పెద్ద విషయాలుగా కనిపించవు. ప్రేమ లోపాలను చిన్నవి చేస్తుంది. సద్గుణాలను పెంపొందిస్తుంది.

ప్రతి మనిషీ అంతరంగ శాస్త్రాన్ని అధ్యయనం చేయాలి. అంతరంగంలోని మార్మికతను తెలుసుకుంటే మనిషి ప్రేమలో ఎదగగలడు. ప్రేమ కేంద్రంలోనే నిరంతరం ఉండగలిగితే కళలో ప్రవీణుడు కావాలి. అప్పుడు ఆనందం అతని సొంతమవుతుంది. ఆ ఆనందంలో, ప్రేమలో అతడు ప్రియమైన వారితో సత్‌సంబంధాన్ని నిరంతరం కొనసాగించగలడు. ప్రేమికులు పరస్పర తప్పొప్పుల్ని, బలహీనతల్ని సమానంగా సంతోషంగా స్వీకరించగలరు. అప్పుడు జీవితం ఆనందమయమవుతుంది.



సునీత, ఒక సైక్రియాట్రిస్ట్‌ను కలిసి, భర్తతో తనకు గల సమస్యను చెప్పింది.

"డాక్టర్ నేను నా భర్త డైరీ చదివాను. అందులో అతనికి, చాలామంది ఇతర స్త్రీలతో లైంగిక సంబంధాలున్నట్టు రాశాడు. అతన్ని అడిగాను. అతను ఒప్పుకున్నాడు కూడ. ఈ లోపాన్ని ఎలా సరిచేయాలి? "అనడిగింది. అందుకు డాక్టర్ "అదో మానసిక రుగ్మత. నా దగ్గరికి తీసుకురా దాన్ని సరి చేస్తాను." అన్నాడు.

కొంతకాలం తరువాత సునీత మళ్ళీ డాక్టర్ దగ్గరికి వెళ్ళింది. "హల్లో సునీత. మళ్ళీ ఏమయినా సమస్యా? నీ భర్త ఎలా వున్నాడు" అడిగాడు డాక్టర్.

'అతను డైరీ రాయడం మానేశాడు డాక్టర్' అంది సునీత విచారంగా.

ఇలాగే జరుగుతుంది. నీవు అంగీకరించని విషయాలను, ఎవరయినా దాచాలని ప్రయత్నిస్తారు తప్ప వారి తత్వాన్ని మార్చుకోరు. తప్పుఒప్పుల ప్రసక్తి లేదు. ఇది తప్పు అన్నినీవంటే, దాన్ని నీకు తెలీకుండా చేయాలని ప్రయత్నిస్తారు తప్ప అది తప్పని నీవు చెప్పినంత మాత్రాన దాన్ని మానుకోరు. ఇలాంటి రహస్య జీవితం క్రమక్రమంగా పెరిగి ఇద్దరిమధ్య దూరం పెరుగుతుంది. ఇద్దరూ ఒకరినొకరు పంచుకోలేరు. భరించలేరు. అప్పుడు ప్రేమికులిద్దరూ రెండు ద్వీపాల్లా ఒకే ఇంట్లో ఉన్నట్లు వుంటారు.

అయితే తప్పుచేసినా ఏమనకూడదా? ఇవతలి మనిషికి అన్యాయం జరుగుతున్నా చూస్తూ ఊరుకోవాలా? అతనేం చేసినా భరించాలా? వంటి ప్రశ్నలు వేస్తారు.

నీకు ప్రేమ కావాలంటే, ప్రేమను పంచాలి. మనిషిని మనిషిగా అంగీకరించాలి. అది నియమం. ప్రేమ వద్దనుకుంటే నీవు న్యాయస్థానంలో న్యాయమూర్తివై శిక్ష వేయచ్చు శిక్షవల్ల వ్యక్తి మారతాడని గ్యారంటీ లేదు అయితే ప్రేమే మనిషిని మారుస్తుందన్నది సత్యం. ✦

## రచయితలకు సూచనలు

చతురలో ఇతర శీర్షికలు, టిట్‌బిట్స్, ఫొటో వ్యాఖ్యలు వంటివి కాక నవల మాత్రమే అచ్చులో 90 పేజీలు ఉంటుంది. నవలను బట్టి పేజీల సంఖ్య పెంచడం, లేదా తగ్గించడం ఉండదు. కనుక రచయితలు ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 90 పేజీలకు మించకుండా చూసుకొని పంపించాలి. అంతకుమించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించటం సాధ్యం కాదు. ఎన్నిక కాని నవలలను తిప్పి పంపగోరు వారు తగు పోస్టేజి వున్న కవరును జతపరచాలి. వ్రాతపతులు, పోస్టులో గాని, ఇతరత్రాగానీ పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# విముక్తి

## శీలంశెట్టి రమాదేవి

అక్టోబర్ 1978: సంపుటి: 1 సంచిక: 1

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా; ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను ఇకనుంచి అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. చతుర ప్రచురణ ప్రారంభమైన 1978వ సంవత్సరం అక్టోబరు నెలలో ప్రచురించిన **'విముక్తి'** నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

**ఆ**ప్యాయతానురాగాలు అందుబాటులో ఉన్నా అందని సుఖాలకోసం అర్రులు చాచి జీవితాన్ని నరకప్రాయం చేసుకోవడమంత మూర్ఖత్వం మరొకటుండదు. ప్రయత్నించి ఆ నందాలను అందుకున్నా, కళ్ళు తెరచి పోగొట్టుకున్నదేమిటో తెలిసివచ్చిన రోజున కన్నీటితో, పశ్చాత్తాపంతో కుమిలిపోక తప్పదు. లేమితో పెరిగి భావిజీవితం గురించి రంగుల కలలు కన్న ఓ యువతి యధార్థ జీవితంలో అది సాకారం కాకపోయేసరికి ఖిన్ను రాలవడం సహజమే. కానీ, కంటికి రెప్పలా చూసుకుంటూ అమితంగా ప్రేమించే భర్త, నవ్వులతో సాగే చక్కని సంసారం, ఇల్లు, ఓ పాప, తిండి, బట్ట అన్నీ ఉన్నా అత్యాశకు పోయి దిగజారితే...?! అలాంటి యువతి గాథే 'విముక్తి'. అధునాతన సౌకర్యాలకోసం మోజుపడే అమాయకురాళ్ళైన అతివలకు ప్రలోభాలు చూపించి తమ మోజు తీర్చుకునే స్వార్థపరుల వైఖరిని రచయిత్రి శీలంశెట్టి రమాదేవి చక్కగా ఆవిష్కరించారీ నవలలో.

**ఇతివృత్తం:** గుడివాడలో చదువుకున్న పేదింటి అమ్మాయి సీతను కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటాడు మాధవరావు. సీతకే కాదు మాధవరావుకూ తల్లిదండ్రులుండరు. అతడు మేనమామ దగ్గర పెరుగుతాడు. మాధవరావు హైద్రాబాద్‌లో ఉద్యోగం చేస్తాడని విని సంతోషపడుతుంది సీత. పెళ్ళినాటికే రెండు, మూడు కథలు రాస్తుంది.

సీత మాధవరావులు సామాన్లతో సహా హైద్రాబాద్‌కు చేరుకుంటారు. నాలుగైదు పోర్షన్ల మధ్య ఉన్న ఓ పెంకుటిల్లు అద్దెకు తీసుకున్న మాధవరావు సీతను అక్కడికి తీసుకువెళ్ళేసరికి ఆమె నిరాశ పడుతుంది. ఖరీదైన బంగళాలో ఉండబోతానని ఊహించుకున్న సీత ఆ పేద వాతావరణాన్ని జీర్ణించుకోలేకపోతుంది. భర్తతో చెప్పి మంచి ఇంట్లోకి మారాలనుకుంటుంది.

సీత మాధవరావు మిత్రుడు రెడ్డి ఇంటికి

వెళ్తారు. వాళ్ళింట్లోని ఫ్రిజ్, ఖరీదైన సామాన్లు రెడ్డి భార్యకున్న నగలు, చీరలు చూసి విస్తుబోతుంది సీత. మాధవరావు జీతం తెచ్చివ్వగానే వాయిదాల పద్ధతిలో డ్రెస్సింగ్ టేబుల్ కొంటుంది.

రెడ్డి, అతడి భార్య సుభాషిణిలను మాధవ రావు భోజనానికి ఆహ్వానిస్తాడు. వాళ్ళొస్తా రని ఇంటిని అలంకరిస్తున్న సీతను చూసి నవ్వుకుంటాడు మాధవరావు. తామున్న స్థితి కంటే ఓ మెట్టు పైనున్నట్లు కనిపించాలని మనుషులు ప్రవర్తిస్తారనుకుంటాడు. రెడ్డి భార్య డ్రెస్సింగ్ టేబుల్ బాగుందంటే సీత సంతోషిస్తుంది. సుభాషిణిలాంటి చీర తను కొనుక్కోవాలనుకుంటుంది. రెడ్డి దంపతులు స్కూటర్‌పై వెళ్ళాక స్కూటర్ ఖరీదెంత అని భర్తను అడుగుతుంది. మనం జన్మలో కొనలేం అంటాడతడు.

ఈ బీదరికం భరించేకంటే తనూ ఉద్యోగం చేసి డబ్బు సంపాదించాలనుకుం టుంది సీత. మాధవరావు సరేనని ఆమెను టైపు నేర్చుకోమని ఓ టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరుస్తాడు. అక్కడ ఆమెకు అరుణ పరిచయ మవుతుంది. తను కథలు రాస్తానని అరుణ చెప్పగానే ఆమెతో ఆమె ఇంటికి వెళ్తుంది. ఆమె తన గదిలోని సామాను అంతా కథలు రాయగా వచ్చిన పారితోషికంతో కొన్నానని చెప్పగానే తను కూడా కథలు రాసి డబ్బు సంపాదించాలనుకుంటుంది సీత. ఇంటికి వస్తూ కాగితాలు తెచ్చుకుని కథలు రాయటం ప్రారంభిస్తుంది. వాటిని వివిధ పత్రికలకు పంపిస్తుంది. అవన్నీ అచ్చవగా అందిన పారి తోషికంతో మంచి చీర కొనుక్కుంటుంది. మాధవరావు ప్రోత్సాహంతో నవల రాస్తుంది. ఓ వారపత్రికలో అది సీరియల్‌గా వస్తుంది. ఓ పబ్లిషర్ దాని హక్కులు తీసు కుని 500 రూపాయలు ఇస్తాడు. సీత ఆనందం వర్ణనాతీతం.

మరో పత్రికలో కూడా సీత నవల సీరియ ల్‌గా వస్తుంటుంది. మూడు వారాలకే అది విపరీతమైన ప్రచారం పొందుతుంది. రెడ్డి భార్య సుభాషిణి కంటే తనేం తీసిపోననుకుం టుంది సీత. తాము కూడా ఆర్థిక సమస్యల నుండి త్వరలోనే బయట పడతామనుకుం టుంది. అలా ఆమె పారితోషికం కొంత సమ కూరగానే మాధవరావు మేనమామను ఆస్ప త్రిలో చేర్చాల్సివస్తుంది. ఆస్పత్రి ఖర్చులకు ఆ డబ్బు వాళ్లకిస్తానంటాడు మాధవరావు. సీతకు ఇష్టం లేకున్నా కోపంగానే ఇస్తుంది.

మాధవరావు ఉద్యోగం చేసే కంపెనీ వాకౌట్ ప్రకటించటంతో స్వంత స్కూలు నడపటం మొదలు పెడతారు. దానిపై కూడా ఆదాయం తక్కువే కావటంతో భర్తను మరో ఉద్యోగం వెదుక్కోమంటుంది సీత.

ఓ పబ్లిషర్‌కు 1500 రూపాయలకు బేర మాడి నవల హక్కులిస్తుంది. మరో మాసప త్రిక ఎడిటర్ బ్లాంక్ చెక్ ఇచ్చి ఇష్టం వచ్చి నంత రాసుకోమంటాడు. తను ఆమె అభిమా




నిననీ, సీరియల్ రాసిస్తే తన కొత్త పత్రికలో వేసుకుంటాననీ చెబుతాడు. సీత ఇంట్లో అమరిన ఫర్నిచర్‌ను చూసి రెడ్డి, సుభాషిణి ఆశ్చర్యపోతారు. స్కూలు కోసం రెడ్డి అప్పుగా ఇచ్చిన రెండు వేలూ తీర్చేయాలనుకుని 1500కు స్కూలు అమ్మేసి మూసేస్తారు.

పాత ఆఫీసు తెరవడంతో మాధవరావు మళ్లీ వెళ్లి చేరతాడు. ఓ రోజు కారులో ఓ సినిమా ప్రొడ్యూసర్ వర్ధనరావు వచ్చి సీత నవల 'జీవిత సోపానాలు' 20 వేలకు కొను క్కుంటాడు. సెలవు పెట్టి మంచి ఇల్లు వెద కమంటుంది భర్తతో సీత.

వర్ధనరావు మళ్ళీ వచ్చి ఐదువేలు అడ్వాన్సు

ఇస్తాడు. సీత నవలా రచయిత్రి గనుక తమ సినిమాకు, సంభాషణలనూ రాయమంటాడు మంచి ఇల్లు కావాలంటే తమ ఇంటి దగ్గర ఉందనీ వాళ్ల ఇంటి అద్దె తనే భరిస్తానం టాడు. పురుష రచయితలకైతే హోటల్‌లో రోజుకు 50, 60 రూపాయలు కడతాడు గనుక అద్దె తనే చెల్లిస్తానంటాడు. మర్నాడు కారు పంపిస్తాడు. సీత, మాధవరావులు కొత్త ఇంటికి మారతారు. రోజూ మధ్యాహ్నం రెండు గంటలపాటు వర్ధనరావుతో స్టోరీ డిస్కషన్‌కు సీత అంగీకరిస్తుంది.

వర్ధనరావుతో క్రమంగా చనువు పెరుగు తుంది. ఓ సాయంత్రం ప్రెస్ మీట్‌కి రమ్మని ఆమెను అహ్వానిస్తాడు. ఆ పార్టీకి మాధవరావు కూడా వెళ్తాడు. రచయిత్రిగా ఆమెకు ఎనలేని గౌరవం ఇస్తారు. అతడిని ఎవరూ పట్టించుకోరు. వర్ధనరావు ఆహ్వానిం చగా ఆమె సినిమాకు వెళ్తుంది. అక్కడ అతడు చేతులు తాకించినా అది నాగరికతగా భావించి అభ్యంతరం చెప్పదు.

సినిమా సంభాషణలలో సగం పూర్తవు తాయి. వర్ధనరావు తన పుట్టినరోజు ఫంక్ష న్‌కు ఆహ్వానిస్తాడు. సీత రాసిన మరో నవ లను మరో సినిమాకు ఎన్నుకున్నామనీ, దానికి కూడా ఆమే సంభాషణలు రాయాలనీ కోరతాడు. ప్రతిఫలంగా కారును కొనిస్తానన టంతో సీతకు విపరీతమైన ఆనందం కలుగు తుంది. సీతను హోటల్ గదికి తీసుకువెళ్ళి ఆమెపై తనకు ఎప్పటినుంచో కోరికగా ఉందని చెబుతాడు. ఆమె లొంగిపోతుంది.

అర్ధరాత్రి ఆమెను ఇంటి దగ్గర వదిలి వర్ధ నరావు వెళ్లిపోతాడు. మాధవరావు సీతను అనుమానించడు. ఇకపైన తను అలాంటి దౌర్భాగ్యస్థితికి దిగజారవద్దనుకుంటుంది సీత. తన నీతిని వర్ధనరావు డబ్బు కొనుక్కుందని బాధ పడుతుంది. కానీ మర్నాడు మధ్యాహ్నం వర్ధనరావు వచ్చాక అభ్యంతరం చెప్పకుండానే మళ్లీ లొంగిపోతుంది. అతనికి తను కావాలి. తనకు డబ్బు, అవకాశాలు కావాలి. సినిమా విడుదలై మంచి పేరొస్తుంది. అద్భుతంగా ఉన్నాయంటూ అందరూ సంభాషణల్ని మె చ్చుకుంటారు. మాధవరావును ఆఫీసులో సహోద్యోగులు వెటకారం చేయగా రాజీ నామా చేస్తాడు. వర్ధనరావు ప్రవర్తన నచ్చక పోయినా సీత బాధ పడుతుందని అభ్యం తరం చెప్పడు.

వర్ధనరావు మాధవరావుకూ ఉద్యోగమి స్తాడు. తనంటే భర్తకు ఎంత ప్రేమ, నమ్మకం, అభిమానం ఉన్నాయో సీతకు తెలుసు. తను ఐహిక సుఖాలమీద ఆశ లతో ఇలా అవినీతిపరురాలు కావటం, దిగ జారటం చూసి తనపైన తనకే అసహ్యం కలుగుతుంది. వర్ధనరావు దగ్గరికి సిని మాల్లో నటించే అవకాశం కోసం కళ అనే అమ్మాయి రావటంతో అతడు ఆమె చుట్టూ తిరగడం మొదలు పెట్టడం సీతకు నచ్చదు. మాధవరావును వర్ధనరావు తరచుగా అవమా నించటం చూసి బాధపడుతుంది.

శతదినోత్సవ సభకు వర్ధనరావుతో వెళ్తుంది సీత. అతని పక్కనే కూర్చుం టుంది. అంతలో డ్రైవరు వచ్చి వర్ధనరావు భార్య వచ్చిందని చెబితే వర్ధనరావు లేచి వెళ్లిపోతాడు. వర్ధనరావు, అతని భార్య ఇక్కడ కూర్చుంటారు గనుక వెనక సీట్లోకి వెళ్లమని సీతకు చెబుతాడు డ్రైవరు. తన స్థానమేమిటో సీతకు బోధపడుతుంది. ఆమెలో పశ్చాత్తాపం మొదలై కన్నీటి రూపంలో బయట పడుతుంది. తను పోగొ ట్టుకున్నదేమిటో తెలిసివస్తుంది. "నాకీ సిని మాలు, మేడలు, కార్లు వద్దు. ఆనాటి ప్రేమా నురాగాలే కావాలి" అంటూ భర్తతో కలిసి తాము బస చేసిన హోటల్ గది ఖాళీ చేసి హైద్రాబాద్‌కు బయల్దేరుతుంది.

చేజారి పోయాయనుకున్న ఆనందానురా గాలు మళ్ళీ తన జీవితంలో చొరబడినందుకు మాధవరావు సంతోషించి ఆమెతో కలిసి నడ వడంతో నవల ముగుస్తుంది. నాగరికత పేరుతో ఎన్ని వేషాలేసినా, ఎన్ని మార్గాలను సరించినా చివరికి కుటుంబంవైపు, దానిలోని ఆప్యాయతానురాగాల వైపే సగటు మనిషి మొగ్గు చూపిస్తాడన్న వాస్తవాంశాన్ని రచయి త్రి చిత్రించడం అభినందనీయం. ✦




ఆగస్టు 2005 'చతుర'లో ప్రచురితమైన గంటి వెంకట రమణ నవల

# అందిన స్వర్గం పై సమీక్షలు

## మధ్యతరగతి బాధలేవీ?

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

గంటి వెంకటరమణగారి నవల 'అందిన స్వర్గం'లో సమకాలీన సమస్య వృద్ధాశ్రమాలను గురించి చాలా చక్కగా చర్చించారు. వీటిని ఆశ్రమాలనాలా లేక 'వృద్ధాప్యశిబిరా'లనాలో అర్థంకాకుండా ఉంది. బాలసుబ్రహ్మణ్యం, పార్థసారథిగార్ల కుటుంబాల చిత్రణ ద్వారా నేటి యువతీయువకులలో మన సంస్కృతీ, సంప్రదాయాల పట్ల అవగాహన, ఉమ్మడి కుటుంబాలలో పొందే ఆప్యాయతానురాగాలూ విపులీకరించారు. అమెరికా వెళ్ళాలనీ, నవతరాన్నారాధించే భార్య భువనేశ్వరిని ఒప్పించలేక, సకలసౌకర్యాలున్నా రక్త సంబంధీకుల కొరకు మొహం వాచి ఎదురుచూచే నానమ్మ తాతయ్యలను ఇంటికి తీసుకొనిరాలేని తన అశక్తతకు మధ్య నలిగి, కుమిలిపోయే మహేంద్ర అంతర్మధనాన్ని చక్కగా వ్యక్తీకరించారు. స్వర్గంలా అనిపించే ప్రశాంతి నిలయం అనే జైలులో ఉండలేక స్వేచ్ఛ కోసం పరితపించి పోయిన డెబ్భై ఏళ్ళ వృద్ధుడు అవధానిగారి సాహసం, వృద్ధులైన తల్లిదండ్రులను ఆశ్రమాల్లో ఉంచే పిల్లలకు కనువిప్పు కావాలి. మిత్రవింద లాంటి యువ తరం వృద్ధులకూ, వారి సంతానానికీ మధ్య వారధిగా వుండి, 'అసలు ఈ వృద్ధాశ్రమాల అవసరం ఉందా?' అని నిర్వాహకులు తమను తామే ప్రశ్నించుకొనేరీతిలో చిత్రీకరించిన వైనం బాగుంది. మొత్తం మీద ఆలోచింపచేసి, ఏకబిగిన చదివించిందీ నవల. వృద్ధులందరూ తమతమ కుటుంబాలతో గడపాలని ఆశిస్తూ, వృద్ధాశ్రమానికి ఒక కొత్తరూపు ఇచ్చి రిక్రియేషన్ క్లబ్, ధ్యానమందిరంగా మార్చడం సందేశాత్మకంగా ఉంది. కొసమెరుపుగా మిత్రవిందని కోడలుగా చేసుకొని మహేంద్ర సుఖాంతం చేశారు.

కాని ఇతివృత్తాన్ని కేవలం సంపన్న వర్గాలకే పరిమితం చేసి, మధ్య తరగతి వారి గాధలను రచయిత్రి స్పృశించను కూడా లేదు.

—ఎన్. రమాదేవి, కావలి.

---

## ఆశ్రమాలే నయం

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

గంటి వెంకటరమణగారి నవల "అందిన స్వర్గం" చదవటం పూర్తి అయ్యేసరికి స్వర్గం అందినట్లుగానే అనిపించింది. కానీ ఎక్కడుందమ్మా ఆ దుఃఖ స్పర్శలేని సుఖం మాత్రమే వున్న స్వర్గం! ఈవేళ వృద్ధులంతా కూడా త్రిశంకు స్వర్గంలో వేళ్ళాడుతున్నారు. మగవాళ్ళయితే కూరలు తేవటం పిల్లల్ని స్కూలుకి దింపటం, తీసుకురావటం, చదివించటం, ఆడించటం. టెలిఫోన్, ఎలక్ట్రిసిటీ, వాటర్ బిల్లులు కట్టడం ఇంక అవసరాల్ని బట్టి అన్ని పనులూను. ఆడవాళ్ళయితే అడగక్కరలేదు. అన్ని పనులూ వాళ్ళవే. అవమానాలూ వాళ్ళవే. తప్పు లెన్నుతూ ప్రతిపనిలో వంకపెడుతూ అధికారం చలాయించే కోడళ్ళూ, భార్యకు వంతపాడే కొడుకులూ వీళ్ళనించి ఎప్పుడయినా తప్పుకుంటామా! ఎక్కడయినా

దిక్కుందా! జీవితపు బాటలో నడిచీ నడిచీ అలసిపోయిన మాకు మరణమయినా విశ్రాంతి నివ్వ కూడదా! అని కుమిలిపోతు న్నారు ఇళ్ళలో వృద్ధులు.

వృద్ధాశ్రమాలు జైళ్ళలా మారకూడదన్నారు రచయిత్రి. నిజంగా గొప్పమాట కానీ కఠిన శిక్షలు విధిస్తున్న ఈ ఇళ్ళు ఎలా మారాయో ఆలోచించండి. ఈ ఇళ్ళకంటే ఆ ఆశ్రమాలు నయం అనుకునే వృద్ధుల శాతమే ఈనాడు ఎక్కువగా వుంది. మిత్రలాంటి యువత ఎక్కడుంది? పిలిచినా పలకరు - 'మను మలు' అని మనం గొప్పగా చెప్పుకునే యువ తరం. అంతా అలా ఉన్నారా అంటే నూటికి 99 మంది అలానే వున్నారు. రచయిత్రి అందంగా ఊహించారు. ఆద్యంతం గబగబా చదివేశాను. మనిషిని మనిషి ఆదుకునే మనసు కలిగివుండాలి. నిజమే.

– **లక్ష్మీ గోపాలం,** హైద్రాబాద్.

# తత్వదర్శిని

(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

ప్రతి వృద్ధ దంపతుల జంటనీ "జన్మ దుఃఖం జరాదుఃఖం జరాదుఃఖం పునఃపునః సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త" అని హెచ్చరించే నవల!

తమ తరువాత తరం వాళ్ల సుఖజీవనం కోసం తరగని సంపద సృష్టించి అప్పగించి, తాము తమ వారితో కలిసి జీవితంలో చివరి దశని సుఖసంతోషాలతో గడపాలని వృద్ధులు మనసారా కోరుకుంటారు. అదే వారికి స్వర్గం!

ఆకాశానికి నిచ్చెన వేస్తూ ఆశలు పెంచు కుంటూ కలలు కంటూ వున్న ఈనాటి నవ తరం నాగరిక యువత మమతకీ మానవతకీ దూరమవుతున్న పరిణామం తమ ఆశలకు, సుఖ సంతోషాలకి, అనుభూతులకి దూరం చేస్తుంటే అనుభవించే వ్యథల కథ "అందిన స్వర్గం" నవల. తన భవిష్యత్తు గురించి ప్రతి పాఠకుణ్ణీ చదువుతున్నంతసేపూ ఆలోచింప జేసే తత్వదర్శిని. ఇది తాత్విక నవల! అడు గడుగునా తర్కం వితర్కంతో సాగింది. వృద్ధ దంపతులు భానుమతి, భవాని శంకరం, తమ మనవడు మహేంద్రతో, కలిసి ఆనం దంగా గడపాలనుకుంటే, భువనేశ్వరి ఆ దంపతుల్ని ఆనందానికి దూరంగా వృద్ధాశ్ర మంలో చేర్పటాన్ని, అక్కడ వారి మనోవ్య ధని, రచయిత్రి కళ్లకు కట్టినట్లు చిత్రించారు.

అవధాని ఆర్తరక్షణలో, ఆత్మరక్షణలో, చూపిన సమయస్ఫూర్తి, సాహసం ప్రశంస నీయం. ఇరవైయేళ్ల యువతి మిత్రవింద ఈ నవలలో ప్రధాన పాత్ర! ఏం చదువుతున్నావ మ్మాయ్? అన్న ప్రశ్నకు "అందరినీ!" అన్న సమాధానం సందర్భోచితంగా ఉంది. సమా జాన్ని చదవటమే అసలైన చదువు! ఈ సమా జాన్నే విశ్వవిద్యాలయంగా చేసుకొని చదివే వాళ్ళే అసలైన ఉత్తమ విద్యార్థులు! ప్రకృతి ఛాత్రులు? సామాజిక తత్వవేత్తలు!

–**నిమ్మగడ్డ నారాయణరావు,** హైద్రాబాద్.

# అభాగ్యుల్ని చేస్తున్న కాలం

(నాలుగవ బహుమతి రూ 50/– పొందిన సమీక్ష)

జీవితంలో గొప్పగొప్ప పదవులు నిర్వ హించి కొడుకులను, మనవలను పెంచి, విద్యావంతులుగా, ప్రయోజకులుగా తీర్చిది ద్దినా- రిటైరయిన తర్వాత వృద్ధాప్యంలో వారి ప్రేమాభిమానాలకు నోచుకోకపోగా, కనీసం నోరారా పలకరించే దిక్కులేని అభాగ్యులను చేస్తున్న కాలం ఇది. అన్నీ ఉండి, అందరూ ఉండి పరిత్యజింపబడిన వృద్ధుల కోసం ప్రశాంతి నిలయాన్ని స్థాపించి, నిర్వహించటా నికి ఒక ట్రస్టీని ఏర్పరచి, వారిని సొంత

బిడ్డల్లా చూసుకునే స్టాఫ్‌ని నియమించిన పప్పు బాలసుబ్రహ్మణ్యం ఆశయం గొప్పది. ఆ ప్రాంగణంలో నివసిస్తున్న వృద్ధులను నిత్యం స్వయంగా వచ్చి ఆప్యాయంగా పలకరించి, యోగక్షేమాలు విచారిస్తూ, వారు స్వంత ఇంట్లో ఉన్న భావన కలిగించాలని చూసే ఆదర్శమూర్తి.

అటువంటి ఆశ్రమవాసుల జీవితాలను, వారు 'తమ' వారికోసం పడే తపనను పరిశీలించిన మిత్రవింద, అమెరికా వెళ్ళిపోదామని భార్య ఎంత ఒత్తిడి చేసినా లొంగక, తాత నాయనమ్మల కోసం తపనపడే మహేంద్ర, పార్థసారథి, వారిజీవితాలకో పరిష్కారం చూపాలనుకున్నారు. అందుకు మనస్ఫూర్తిగా సహకరించిన బాలసుబ్రహ్మణ్యం మీటింగ్ ఏర్పాటు చేసి, ఆ వృద్ధులను వారి కుటుంబ సభ్యులు తిరిగి తీసుకెళ్ళేట్లు చేసిన ప్రయత్నం చాలా బాగుంది.

– జొన్నలగడ్డ సదాశివరావు,
సికింద్రాబాద్.

# నేటి యువతీ యువకులే రేపటి వృద్ధులు

(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

నేటి సమాజాన్ని పట్టిపీడిస్తున్న జాడ్యానికి మూలాలను వెదికి దానికో పరిష్కారం చూపాలని ప్రయత్నించిన గంటి వెంకటరమణగారి ప్రయత్నం ముదావహం. నేడు పుట్టగొడుగుల్లా ఎన్నో వృద్ధాశ్రమాలు - అందులో చేరే వృద్ధుల సంఖ్య దినదిన ప్రవర్ధమానమవడం జరుగుతోంది. దీనికి కారణం నేటి తరంలో వృద్ధులపట్ల వారి భావాలు,ప్రవర్తనల పట్ల ఒక రకమైన విసుగు,వైమనస్యం-ప్లస్ జీవితాన్ని ఎంజాయ్ చెయ్యాలనే వారి తపన ప్రధాన కారణాలు అవుతున్నాయి.

పగలంతా ఎక్కడెక్కడో తిరిగి రాత్రి గూటికి చేరే పక్షుల్లా జీవితాలలోని వివిధ దశలు ఎలా గడిపినా జీవిత చరమాంకాన్ని తనవారి మధ్య గడపాలనీ,ఆ స్పర్శ అందించే మానసిక బలంతో తృప్తిగా ఈ దశని దాటి తిరిగిరాని లోకాలకు సాగిపోవాలనీ ఆశించే ప్రతి వృద్ధునికి ఈ ఆశ్రమ ప్రస్థానం ఓ శాపంలా పరిణమిస్తోంది. తమదైన పద్ధతిలో ఓ జీవన శైలికి అలవాటు పడిన వృద్ధులకు చివరి దశలో ఓ రకమైన కట్టుబాట్లు, పద్ధతికి లొంగి ఉండాలంటే స్వేచ్ఛని కోల్పోయినట్టుగా ప్రాణాంతకంగా అన్పించి విలవిల్లాడిపోతారు. అక్కడ ఉండలేక తప్పించుకోలేక భవానీ శంకరంలా బాధపడే వాళ్లు కొందరైతే తెగింపు, ధైర్యం ఉన్న అవధాని లాంటివాళ్ళు పారిపోతారు. తమ సర్వస్వం ఒడ్డి పెంచి పెద్దచేసే వృద్ధులకు ఈ దశ కల్పించడం అమానుషం. నేటి యువతే రేపటి వృద్ధులనే సత్యాన్ని నేటి తరం గ్రహించాలి. పెద్దలపట్ల ప్రేమ, మానవత్వం చూపి చివరి దశని తృప్తిగా దాటేందుకు తోడ్పడాలి. ఈ సత్యాన్ని బోధించిన ఈ నవల బహుధా ప్రశంసనీయం. ఆశ్రమాలను నిషేధించాలని ప్రభుత్వాన్ని కోరాల్సిందిగా రచయిత్రి సూచించడం ఓ అద్భుతమైన ఆలోచన. సంస్కారం ఉన్న ప్రతి వ్యక్తి అభిలషించదగ్గ ఆలోచన.

–పి.లక్ష్మి, హైద్రాబాద్. ✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 2 57 50 528, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 2 5 518181, 2 5 598787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 27 5444; Karimnagar: 22 5216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2 5 587 54; Srikakulam: 220901; Kurnool: 25281 5; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276 576; Ongole: 256777; New Delhi: 2 575 5440; Mumbai: 22819557; Chennai: 282 52 590; Bangalore: 2558 5804.

# సూపర్ డోమ్



తిరగేసిన సూప్‌బౌల్‌లాంటి ఈ బృహత్తర కట్టడం నిజానికి ఒక మల్టీపర్పస్ స్టేడియం. అమెరికాలోని న్యూ ఓర్లీన్స్‌లో యాభైరెండు ఎకరాల విస్తీర్ణంలో ఉన్న ఈ స్టేడియం నిర్మాణానికి నాలుగేళ్లు పట్టింది. 18కోట్ల డాలర్లు ఖర్చయ్యాయి. 27అంతస్తుల ఎత్తు కలిగిన ఈ స్టేడియం పైభాగం 9ఎకరాలకు పైగా ఉంటుంది. ఆ పై భాగంలోని డోమ్ విస్తీర్ణం 208 మీటర్లు . ఈ స్టేడియంలో ఎక్కువగా ఫుట్‌బాల్ మ్యాచ్‌లు నిర్వహిస్తారు. వాటితో పాటు బాస్కెట్‌బాల్, బాక్సింగ్ మ్యాచ్‌లు కూడా జరుగుతుంటాయి. వ్యాపార ప్రదర్శనలు, సంగీత కచేరీలు కూడ ఇక్కడ నిర్వహిస్తారు. ఫుట్‌బాల్ మ్యాచ్‌లకు కేటాయించిన ప్రాంతంలో 70 వేల మంది ప్రేక్షకులు ఆ క్రీడను తిలకించవచ్చు. ఈ స్టేడియం కాంప్లెక్స్‌లో 5 వేల కార్లు, 250 బస్సులను ఏకకాలంలో పార్కింగ్ చేయవచ్చు.

